# తెలుగు గోష్ఠి ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. | తెలుగు మెఱుగులు | - 1986 | చీమకుర్తి శేషగిరిరావు |
| | సంశోధిత ప్రచురణ | - 1996 | |
| | (తెలుగు గోష్ఠి వ్యాససంహిత-1) | | |
| 2. | Forgotten Aspects of | | Ch. Seshagiri Rao |
| | Telugu | - 1987 | |
| 3. | తెలుగులో పాళీ పదాలు | | చీమకుర్తి శేషగిరిరావు |
| | | - 1990, 1996 | |
| 4. | ప్రాకృత భాషోత్పత్తి | - 1991 | మేడేపల్లి వేంకటరమణాచార్యులు |
| 5. | Satavahana Epoch | | P.V. Parabrahma Sastry |
| | A New Light : | - 1994 | |
| | Revised Edition | - 1996 | |
| 6. | ఉత్తర హరివంశము | - 1994 | వ్యాఖ్యాత, విద్వాన్ చదలువాడ |
| | (ప్రథమాశ్వాసము) | | జయరామశాస్త్రి |
| 7. | ఉత్తర హరివంశము | - 1995 | వ్యాఖ్యాత, విద్వాన్ చదలువాడ |
| | (ద్వితీయాశ్వాసము) | | జయరామశాస్త్రి |
| 8. | శ్రీ ఉత్పత్తి పిడుగు, | | చీమకుర్తి శేషగిరి రావు, |
| | ఇతర వ్యాసములు | - 1995 | సహాయకులు : |
| | | | డా॥ వి. విజయకుమారబాబు |
| 9. | కతిపయ శబ్దార్థశబ్దస్వరూప | | వేదం వేంకటాచలం |
| | విచారము | - 1995 | |
| 10. | సాహితీ నీరాజనము | - 1995 | శ్రీ 'చీమకుర్తి' సంస్మరణ సమితి |
| 11. | ఉత్తర హరివంశము | - 1996 | వ్యాఖ్యాతలు |
| | | | చదలువాడ జయరామశాస్త్రి |
| | | | (చతుర్థాశ్వాసము) |
| | | | వి. వి. సుబ్రహ్మణ్యశర్మ |
| | | | (తృతీయాశ్వాసము) |

# ఉత్తర హరివంశము

(పంచమ షష్ఠాశ్వాసములు)

## నాచన సోమనాథ ప్రణీతము


వ్యాఖ్యాతలు

చదలువాడ జయరామశాస్త్రి

(పంచమాశ్వాసము, షష్ఠాశ్వాసము 163 నుండి 275 వఱకు)

వజ్ఝల వేంకట సుబ్రహ్మణ్య శర్మ

(షష్ఠాశ్వాసము 1 నుండి 162 పద్యములు)

పరిష్కర్త

డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు ఎమ్.ఏ. పి.హెచ్.డి.,






తెలుగు గోష్ఠి

రామనగర్, హైదరాబాదు - 500 048

# UTTARA HARIVAMSAMU

(Fifth and Sixth Cantos with the commentary of the Late Sri Chadaluvada Jayarama Sastri, and Sri V.V. Subramanya Sarma (VI Canto 1 to 162 Stanzas)

First Edition: September, 1997

Copies: 1000

Price: Rs. **100/-**



**For Copies:**

1. V.V.Subramanya Sarma M.A.B.T., 8-3-75/2 Raghavendra Nagar, Sivarampalli, Hyderabad-500 052. Ph. : 4016104.
2. Visalandhra Publishing House, Vignana Bhavan 4-1-435 Bank Street, Hyderabad -500 001.

**This book is published with the Financial Assistance of Sri Tirumala Tirupati Devasthanams under their scheme 'Aid to Publish Religious Books.'**

**Composed at :**

Fontline graphics & DTP Services,
Hyderabad - 44,
Ph: 7660000

**Printed at:**

Anupama Printers,
Santinagar, Hyderabad -28,
Ph : 3391364

'ఓమ్ నమో భగవతే వాసు దేవాయ'

# తొలి పలుకు

కీర్తి శేషులు, చదలువాడ జయరామ శాస్త్రిగారు 'ముక్తాఫలము' అనెడి పేరుతో ఉత్తర హరివంశానికి వ్యాఖ్యానమును 1974 సం, ఎనిమిది నోటు పుస్తకాలలో రచించి ముగించినారు. వానిలో ఆఱు పుస్తకాలే లభించినవి. తృతీయాశ్వాసము, చతుర్థాశ్వాసములో కొంత భాగము, షష్ఠాశ్వాసములో కొంత భాగము పూరింపఁబడినవి. ప్రథమ (1994), ద్వితీయ (1995), తృతీయ చతుర్థాశ్వాసాలు (1996) ప్రకటింపఁబడినవి. ఇప్పుడు 1997 సం.లో అంతిమాశ్వాసాలకు వ్యాఖ్యానం వెల్వడినది. 'ముక్తాఫలము' సర్వంకషవంటి సమగ్రమైన వ్యాఖ్యకాదు. పరిమితమైన ప్రకటార్థ వివరణమే.

ఈ ఉత్తర హరివంశ ప్రకటనోద్యమమునకు నన్ను ప్రోత్సహించిన కీ.శే. పాటూరి రాఘవ రామ శాస్త్రి (మద్రాసు) కీ.శే.చీమకుర్తి శేషగిరిరావు (హైదరాబాదు) శ్రీ వేదం వేంకటరామన్ (నెల్లూరు) అనే త్రిమూర్తులకు నమస్సులు.

డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు (రాజమహేంద్రవరము) తమ ప్రవీణ హస్తముతో పంచమ షష్ఠాశ్వాసాల ముక్తాఫల శుద్ధ ప్రతిని పటిష్ఠముగా పరిపక్వముగా అవసరములైన, ఛందోవ్యాకరణాది విశేషాలను జోడించి సిద్ధముచేసి తీర్చి యిచ్చినారు. వారి కృషికి కృతజ్ఞతాభివందనాలు.

ఈ గ్రంథ ప్రచురణకు సహకరించిన మిత్ర బృందమైన తెలుగు గోష్ఠి కార్యనిర్వాహక వర్గమునకు, శ్రీ ఇందుకూరి సూర్యనారాయణ రాజు (సుందరయ్య విజ్ఞాన కేంద్రము, హైదరాబాదు), శ్రీయుతులు హరిశంకర్, యార్లగడ్డ నిర్మల, సునీత (ఫాంట్‌లైన్ గ్రాఫిక్సు, బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు), శ్రీయుతులు రమణమూర్తి, సుబ్బయ్య (అనుపమ ప్రింటర్సు, శాంతినగర్, హైదరాబాదు), శ్రీ పి. రాజేశ్వరరావు (విశాలాంధ్ర, హైదరాబాదు) అను వారలకు ధన్యవాదాలు.

8-13-75/2, రాఘవేంద్రనగర్
శివరాంపల్లి, హైదరాబాదు
ఫోను : 4016104

వి.వి. సుబ్రహ్మణ్యశర్మ
ఆంధ్ర ప్రదేశ్ ఎడ్యుకేషనల్ సర్వీస్ (రిటైర్డ్)

# 'సమాహారము'

ఉ. నన్నయగారి త్రోవఁగొని నవ్యగుణములు కొంతచేర్చి తి
క్కన్న మహాకవి ప్రవరుఁ డాంధ్ర కవిత్వము వృద్ధి చేసె నె
ఱ్ఱన్నయు వీరి త్రోవఁగొని యర్హత యింకొక కొంత యిచ్చె స
**ర్వోన్నతి తెచ్చె సోముఁడు మహోదధి నాఁజను నాంధ్ర భాషకున్.**

**వేంకట పార్వతీశ్వర కవులు**
(శ్రీ బాలాంత్రపు వేంకటరావు, శ్రీ ఓలేటి పార్వతీశము)

మ. ప్రగుణంబైన కవిత్వపాటవము, సర్వజ్ఞత్వముంజెప్ప సో
యగమై యొప్పెడి వింత పోకడలఁ గావ్య శ్రీని బోషించి యె
న్నఁగ **నొక్కొక్కెడ నాకవిత్రయము కన్నన్ మిన్నయౌ నాఁగఁ బె**
**ద్దగ వర్తించిన సోమనాథ కవి చంద్రా!** నీకు సాష్టాంగముల్.

**వేంకట రామ కృష్ణ కవులు**
(ఓలేటి వేంకటరామ శాస్త్రి, శ్రీవేదుల రామకృష్ణకవి)

ఉత్తర హరివంశమందు, పంచమ, షష్ఠాశ్వాసాలలో, బాణాసురుని కథ ప్రబంధింపఁబడినది. ఈ కథ సంస్కృత హరివంశమందు, భవిష్యపర్వమున 91 వ, అధ్యాయమునుండి, 128వ, అధ్యాయము వఱకు విస్తరించినది. చదలువాడ ఎఱ్ఱన ఈ కథను హరివంశోత్తర భాగమున, ఏడవ ఎనిమిదవ ఆశ్వాసాలలో నిబంధించెను.

**ఉత్తర హరివంశము** (పంచమాశ్వాసము)

బాణాసురుఁడు, శివుని సేవించి, వరములను పొంది రాజుల నెల్లను జయించి ముల్లోకములను పాలించుచుండెను. అతని రాజధాని శోణితపురము, అతనికి సాయముగా, శివుఁడు, పార్వతి, కుమారస్వామియు నుండిరి. బాణుఁడు వేయి చేతులు కలవాఁడు. ఆ చేతులతో యుద్ధము చేయవలె ననెడి తలంపు కలిగి, పురారిని, అవకాశమునకై అర్థించెను. శివుఁడు సమ్మతించెను.

ఒకనాఁడు భవాని, ఇందుధరుఁడు, రాక్షస కన్యలు, బాణుని క్రీడోద్యానమున విహరించి, అనంతరము, జలక్రీడలలో పాల్గొనిరి. ఆ సమయమున, జగదంబ, కామాసక్తయైన ఉష మనస్సెఱిఁగి, ఆమెకు కలలో కన్పట్టువాఁడే మగఁడగు నని ఆశీర్వదించెను. అట్లే కొంత కాలమునకు, ఉష స్వప్నములో సుందరుఁడొకఁడు కన్పట్టి ఆమెను కలిసెను. అతఁడు అనిరుద్ధుఁడు. అతనిని ఉష చెలికత్తె చిత్రరేఖ, తన యోగశక్తిచే, శోణిత పురమందలి, ఉష అంతఃపురమునకు తెచ్చెను. అచ్చట ఉషా, అనిరుద్ధులు కలిసి రహస్యముగా మెలఁగు చుండిరి.

తరువాత, వారి వర్తనము నెఱిఁగిన, బాణుఁడు కినుక చెంది. అనిరుద్ధునితో యుద్ధము చేసి అతనిని ఓడింపఁ జాలక, మాయచే అతనిని నాగాస్త్రములచే బంధించి చెఱలో పెట్టించెను. ద్వారకలో అనిరుద్ధుఁడు కానరాక పోవుటచే, యాదవులు ఎల్లరు తల్లడిల్లిరి.

**ఉత్తర హరివంశము** (షష్ఠాశ్వాసము)

దేవఋషి నారదుఁడు ద్వారకకు ఏ తెంచి, వెత చెంది యున్న యాదవులకు, అనిరుద్ధుని భంగపాటును తెల్పెను. వెంటనే శ్రీ కృష్ణ, బలరామ, ప్రద్యుమ్నులు, వైనతేయుని అధిరోహించి శోణిత నగరమును సమీపించి నగర రక్షకులైన అగ్నులను రాక్షసగణమును ఓడించిరి. అనంతరము, వారిని శివజ్వర మెదిరించినది. దానిని విష్ణు జ్వరము అణఁచివేసినది. శ్రీ కృష్ణుఁడే దానిని సంహరించుటకు ప్రయత్నింపఁగా అయ్యది (శివజ్వరుఁడు) హరికి ప్రణమిల్లి హరి నరసింహాకృతిని రాఘవత్వమును స్తుతించి రక్షణ పొంది వెడలిపోయెను. వరుసగా, శివుఁడు, కుమారస్వామి బాణుఁడు ఓటమి పాలైరి. శివుని కరుణచే బాణుఁడు తన ప్రాణములను రక్షించుకొనెను. ఆ దయామయుఁడు తన భక్తుఁడైన బాణుని పంచవర ప్రదానముచే సంతృప్తిని చేసి, ప్రమథనాథ సైన్యాధ్యక్ష పదవి నొసగి మహాకాళ నామ ధేయముతో, జగత్తులో సన్నుతుల పొందుచుండు మని దీవించి నిర్గమించెను. .

శ్రీ కృష్ణుఁడు అనిరుద్ధుని విడిపించుకొని వరుణుని పురమును చేరి అతనిని వశము చేసికొని బాణుని ఆల మందలను అతనికే ఇచ్చి జయ జయ గానములతో ద్వారకకు మరలివచ్చెను. అపుడు ఆతనితో వచ్చిన విబుధగణము, యాదవులతో, "ఈతఁ డసాధ్యుండైన బాణాసురుని కరద్వయ సమేతుని కావించి ముహూర్త మాత్రంబున ద్వారకానగరంబునకు వచ్చెను. అనన్య సామాన్యంబైన దైవంబు ఈతఁడు కాఁడే! మీ భాగ్య వంశంబున ఇతఁడు యాదవ వంశంబున పుట్టె" నని బహువిధంబుల **నారాయణుని** నుతించి అమరావతికి అరిగిరి.

## ఉషా అనిరుద్ధుల పాత్రపోషణము

పురాణ పద్ధతిలో ఎట్టిన, సంస్కృత హరివంశమును, మూల విధేయముగా అనువదించుచు, ఉష పాత్రను పోషించెను. సోమన ప్రాబంధిక శృంగారవర్ణనలకు ప్రారంభకుఁడై ఉష పాత్రను మెఱుఁగు పఱచెను.

క్రీడోద్యానమున భవాని, ఉష, రాక్షస కన్యలు, ఇందుధరుఁడు యథేచ్ఛగా విహరించి వినోదించిరి. సర్వము శృంగార మయము. ఒక వగలాడి గున్న మామిడి మొక్కకు శివుని రూపము నొసఁగి అర్ధభాగ మిమ్మని అర్థించెను. చిత్రరేఖ, నడక తీరుతో, మాటల పొందికతో కడగంటి కాంతుల వికాసముతో పై ముసుగు ధరించి, ముద్దారు మొగమును ఇంచుక వంచుకొని, గిరి కన్యను అనుకరించెను. కామ హరుఁడు ఆ పడతిని పార్వతి అని భ్రమించి మోహించి, ఆమెపై పడుటకు ఉత్సాహమును చూపెను. శైల కన్య కనుసైగచే గద్దింపుగా శివుని మందలించెను.

వనవిహారమైన వెంటనే జలకేళికై అందఱు ఒక ఏటిని చేరి క్రీడించిరి. ఆ ఏటిలోని తరఁగలు, చెదరినవై అతివల అవయములను క్రమక్రమముగా ఆక్రమింపఁజొచ్చెను. వారి కరచరణాదులు, అరవిందాదుల అందముతో అతిశయించినవి. భవానియే, పరవశించి, తామర తీఁగకు, జోడు జక్కవలను అమర్చెను. అలలతుంపురులు, తరుణుల మన్మథాంకములను మఱుఁగు పఱచినవి. ఇట్లు పలు తెఱఁగులుగా తెఱవలు కొందఱు, కఱ కంఠుని అనుకరించి మృడానికి మోదమును సమకూర్చిరి. ఆ క్రీడలో ఉష కామావేశమును పొందినది. జగదంబ, ప్రసన్నురాలై, కరుణతో, 'నిన్ను కలలో కలియువాఁడు నీకు పతి అగును' అని వరమిచ్చెను. ఈ విధముగా సోమన మూలములో లేని, వన జలకేళి వర్ణనమును సహజ సుందరముగా చిత్రించి, ఉష పాత్రను తీర్చెను.

అనిరుద్ధుఁడు సుఖ లాలసుఁడు. హాలా మదా లంకృతుఁడు. మద్యపు మత్తులో నిద్రించు సుఖమును అభిలషించు వాఁడు. లేఁతమావి గున్న వలె, బాల చందురుని వలె,

తేఁటి రా చూలివలె, మింద మేఘము వలె, యువతులకు తన జవ్వనంపు ఇంపు చవి చూపు కామ శాస్త్రప్రవీణుఁడు. అట్టి యాదవకుమారుని చిత్రరేఖ నిద్రించువానిని, మాయాబలముచే ఉష అంతఃపురమందలి ఆమె శయ్యపై చేర్చెను. కామించిన కాంతుని కన్న ఉష ఉద్రేకము చెంది. తనలో ఆలింగనాసక్తి, సంభ్రమము, చుంబనాభిలాష, రతి పారవశ్యము అధికము కాఁగా నేరిమిలేని తమకముతో పొదలెడి ఊర్పులతో పోఁత పోసిన బొమ్మయో అన్నట్లు ఉపరతికి ఉపక్రమించెను. మత్తుఁడైన యాదవ కుమారుఁడు, తెలివిని పొంది. ఆ మానినీ తిలకమునకు, చవుల గనులైన రతులకు చనవు లిచ్చి పెక్కు రతి భంగిమలతో అలరించి, తుది కంటె మొదటిది, మొదటి దానికంటె తుదిది ఇంపగు నట్లు ఉషను, పూవిలుతు చేతి జంత్రపు బొమ్మ చేసెను.

ఇట్లు, సోమన నిపుణముగా నాతి విస్తరముగా సముచితముగా, ఉషా అనిరుద్ధుల శృంగారమును ఆస్వాదనీయము కావించి ఇతరులకు మార్గ దర్శకుఁ డయ్యెను.

**యుద్ధ వర్ణనలు :**

యుద్ధ వర్ణనలలో సోమన నిపుణత, షష్ఠాశ్వాసమందు పరాకాష్ఠ నందినది. వైవిధ్యము, వైపుల్యము, సంవిధాన కౌశలము, సంభాషణ చాతుర్యము, శబ్దార్థాలంకారముల వైచిత్రి మేల్తరమై 'శబ్దార్థాలంకార సర్వేశ్వరుఁడు' అను బిరుదమునకు యోగ్యుఁ డయ్యెను.

కథా నాయకుఁడు శ్రీ కృష్ణుఁడు మహావీరుఁడు. "కలన పదాఱు మొగంబుల మలయుదువు నీవు విజయ లక్ష్మిని కైకొనుట అరుదే?" అనెడి సంస్తుతులు చెలంగినవి. దిశలందు జయ జయ గానములు చెవుల పండువు లైనవి. శ్రీ కృష్ణ బలరామ ప్రద్యుమ్నులు, మొదట అగ్నులను జయించిరి. పిమ్మట ఘోర నటనా ఝాట స్ఫుటాటోపులై వర్తించు రక్షోగణమును మర్దించిరి. శివజ్వరము పీడింపఁగా దానిని విష్ణుజ్వర మణఁచినది. శివజ్వరుని విష్ణుస్తవము మూలములో లేదు. ఆ స్తుతిని పఠించినను, తలఁచినను, నరుఁడు జ్వర విముక్తుఁ డగునని శ్రీ కృష్ణుఁడు వరము నిచ్చెను. పిమ్మట జరిగిన ఘోర యుద్ధములో అసురసేన చిడి ముడిపడి చిక్కి వాలిపోయినది. ఆ పట్టున బాణుఁడు సేనలను ప్రోత్సహించిన పలుకులు ఎంతో హృద్యయములై ఆర్ద్రములై ఉన్నవి. తర్వాత శివ కేశవుల పాశుపతాస్త్ర ప్రయోగము, మురారి జృంభణాస్త్ర ప్రయోగము, శివుఁడు భీతుఁడై నల్దిక్కు తిరిగి నిలుచుట, కుమారస్వామి అహంకార ప్రదర్శనము, గరుడ మయూరుల ప్రచండ సంఘర్షణము, బాణుని సమధిక సమర సన్నాహము బాణుని యుద్ధము, ఆతని సహస్ర బాహు ఖండనము మొదలైనవి, వివిధాలంకార సమన్వితములై, సంస్కృతపదభూయిష్ఠములై

తెలుఁగు నుడుల జడితో, కవితా ప్రాగల్భ్యముతో, భావగాంభీర్యముతో పఠితలను పరవశింపఁ జేయుచున్నవి. ఆ యా వర్ణనలలో సోమన సర్వజ్ఞత్వము సందీప్తమై సాక్షాత్కరించుచున్నది.

## వాసు దేవతత్త్వము

శ్లో : సర్వ భూతాది వాసంచ యద్భూతేషు వసత్యపి
సర్వానుగ్రాహకత్వేన త దస్మ్యహం వాసుదేవః॥

'అమృత బిందూపనిషత్తు'.

**భావము :** సకల భూతములకు ఆధారముగను, సకల భూతముల యందు వసించుచును, సకల ప్రాణులను సంరక్షించుచు నుండు వాసుదేవుఁ డెవఁడో ఆ వాసుదేవుఁడే నేను.

వైష్ణవాగమ శాస్త్రము పరమాత్మ పరవాసుదేవుఁడని, ఆ దైవమే, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ ఆకృతులతో విలసిల్లు చున్నదని ప్రతిపాదించు చున్నది. భక్తులు, 'నమో భగవతే వాసుదేవాయ' అనెడి మంత్రమును ఉపాసింతురు. శ్రీ చదలువాడ జయరామ శాస్త్రి ఆ మంత్ర ప్రభావమును ఎఱిఁగిన వారు, తమ ముక్తాఫల వ్యాఖ్యానారంభములో ఆ మంత్రమును అను సంధించిరి.

ఆ వాసుదేవ తత్త్వమే **అనిరుద్ధుని కథలో**, గుప్తమైన పరమార్థము. అతఁడు విష్ణువు యొక్క అంశ. దాని వెలుఁగే ఉష. ఈ రెంటి సంయోగము శుభ ప్రదము. అనిరుద్ధ నామమునకు విశేషార్థము లున్న వని శ్రీ యామిజాల పద్మనాభస్వామి 'సరసోపాయనము' అనెడి, కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధ చరిత్ర పీఠికలో విశ్లేషించిరి. అనిరుద్ధ నామమును ఉపాసించువారు బ్రహ్మజ్ఞాన సంపన్నులగుదురు. వారికి బ్రహ్మానందమును సిద్ధించును.

డా॥ దిగుమూర్తి మునిరత్నం నాయుడు (తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాదు) 'ఉషా అనిరుద్ధుల చరిత్ర' అనెడి సిద్ధాంత వ్యాసములో (1992) వాసుదేవ తత్త్వమును సమర్థముగ సంపూర్ణముగ, పరిశీలించిరి, విశేషములు కోరువారు ఆ వ్యాసమును పఠింతురుగాఁక!

**సోమ నాథుఁడు నవీన గుణ సనాథుఁడు.**

ఉత్తరహరివంశమందు గల అయిదు కథలలో ప్రధానాశయము, హరిహరాద్వైత ప్రబోధమే. కథానాయకుఁడు కృష్ణుఁడు. అనన్య సామాన్యంబైన దైవము. కావ్యాంతమున అతఁడు నారాయణుని అవతారమని దేవతలు నుతించిరి.

"సోమనాథ" అనెడి నామధేయములో పరమార్థమున్నది. స+ఉమ>· సోమ అనఁగా

ఉమతో కూడినవాఁడు శివుఁడు. నాథ అనఁగా జగదేకనాయకుఁడు కేశవుఁడు. ఇరువురిని తన హృదయమందు ఁగల మహోపాసకుఁడు సోమన.

అట్లగుటచే సోమన పంచమాశ్వాసాది పద్యములో 'చేతోనిధ్యాన తనుద్యుతి నవీన హరిహరనాథా!' అని తన సపర్యలచే, సంతోషించి తన హృదయములో నిత్యము నవీన కాంతులతో దర్శన మొసఁగు ఆ హరిహరనాథుని పారవశ్యముతో పిలిచెను. సోమన ఎదలో నిత్య నవీన గుణముతో ఆ హరిహరుఁడు నివసించునని భావము. కనుకనే సోమన నవీన గుణ సనాథుఁడు.

## 'హరిహరనాథుఁడు' : వేంకటనాథుడు డా॥ ఓగేటి అచ్యుత రామశాస్త్రి

తిక్కన 'హరిహరనాథుఁడు' తిరుమల (తిరుపతి) వేంకటనాథుఁడని డా. ఓగేటి అచ్యుత రామ శాస్త్రి తమ 'వ్యాసపీఠి' అనెడి గ్రంథములో అందలి వేర్వేఱు వ్యాసములలో (62వ పుట నుండి, 167 వ పుట వఱకు) సమర్థముగా చర్చించిరి. ఆ వ్యాసములలో నున్న ఈ క్రింది వాక్యములు వారి వాద సరణికి ఉదాహరణములు.

*తిరుపతి వేంకటేశ్వరుఁడే హరిహరనాథుఁడు* — పుట. *62,*

*శంకరుల నాటికి వేంకటేశ్వరుఁడు హరిహర స్వరూపుఁడనుట నిష్కర్ష* — పుట. *66.*

*ఏ దృష్టితో చూచినను తిరుపతి హరిహర క్షేత్ర మనియే తేలు చున్నది.* — పుట. *71.*

*తిక్కన స్వీకరించిన ఈ నాథ శబ్దము 'వేంకటనాథా' లోనిదే యగుటచేత, వేంకట శబ్దమునకు పర్యాయముగా హరిహర శబ్దమును స్వీకరించినట్లు నిష్కర్షగా చెప్పవచ్చును.* — పుట. *76.*

*తిరుపతి వేంకటేశ్వరుఁడే తిక్కన హరిహరనాథుఁ డని కనిపెట్టి తాను కూడ ఆ మార్గమున నడచిన వాఁడు (బైచరాజు) వేంకటనాథుఁడు (ఆంధ్ర పంచతంత్రకర్త)* — పుట. *77*

*తిక్కనది నెల్లూరేగాని అతని హరిహరనాథుఁడు నెల్లూరివాఁడు కాఁడు. తిరుపతి వేంకటేశ్వరుఁడే అతని హరిహరనాథుఁడు - వేంకటేశ్వర తత్త్వమే హరిహరనాథ తత్త్వము.* — పుట. *100*

*నన్నయ ప్రయోగించిన హరిహర ద్వంద్వమే తిక్కన హరిహర నాథ తత్త్వమునకు మూలకారణము.* — పుట. *112*

*ఆంధ్ర భాషకు ఆది భిక్ష పెట్టిన నన్నయ భట్టారకులే ఆంధ్ర దేశమున హరిహరనాథ దర్శనమునకు కూడ మార్గదర్శకు లైనా రనుట నిక్కము.* — పుట *114.*

ఇట్లు డా. ఓగేటి వారు తిరుమల మందిర సుందరుఁడు నిత్య సత్య హరిహరస్వరూపుఁ డని యథాశక్తి నిరూపించి తెలుఁగు సాహితీ జగత్తును మేల్కొల్పి. 'హరిహరనాథ! సర్వభువనా ర్చిత! నన్ దయఁజూడు మెప్పుడున్' అని భక్తితో ప్రణమిల్లిరి.

## 'జగద్గురు కృప' ప్రత్యేక సంచిక కర్నూలు

1983 సం. బ్రాహ్మణ సంఘము, కర్నూలు చాతుర్మాస్య దీక్షావ్రతమును నిర్వహించినది. అప్పుడు 'జగద్గురు కృప' ప్రత్యేక సంచిక వెల్వడినది. అందు, 'ఆది శంకరుల దివ్య చరిత్ర ఆధ్యాత్మిక సందేశము' అనెడి వ్యాసమందు, ఈ పీఠికా కర్త (పుట, 36) ఇట్లు వచించిరి.

*"శంకర భగవత్పాదుల దృష్టిలో బ్రహ్మము హరి హర స్వరూపమే! మాతృమూర్తి మరణ శయ్యపై నున్నపుడు ఆమెకు పరతత్త్వమును బోధించిరట. ప్రశ్నోత్తర రత్నమాలికలో (శ్లోకము, 65), "కశ్చభగవాన్" అను ఆమె ప్రశ్నకు 'మహేశః శంకరనారాయణాత్మైకః' అని సమాధాన మిచ్చిరట. దీనిని బట్టి మహేశ్వరుఁడు (పరమాత్మ) శివ కేశవ రూపమగు పరతత్త్వమని స్పష్టము. శివకేశవుల అభేదమును చూచిన వారికి ఆయుస్సు, శ్రేయస్సు కలుగునని పెద్దలు వక్కాణించిరి."*

**ముగింపు :**

సోముని 'ఉత్తర హరివంశము', నన్నయ రమ్యత, తిక్కన ఆధ్యాత్మికత, ఎఱ్ఱయ మధురిమ సమ్మిళితమైన సాహితీ సమాహారము.

**సత్యభామా కృష్ణ సంవాదము :** (సోమన సంస్కృతకవి)

కాకర్ల పర్తి తిరుపతి పాత్రులు పందొమ్మిదవ శతాబ్దికి చెందిన ఉత్తరాంధ్ర కవి. వారు తమ 'సత్యభామా కృష్ణ సంవాదము'లో సోముని సంస్కృత కవులతో చేర్చి, ఈ క్రింది పద్యమున అభినుతించెను. ఈ గ్రంథము శ్రీరాజా గోడే నారాయణ గజపతి రాయనిం గారి అనుజ్ఞతో చెన్నపట్టణమున శ్రీ చదలువాడ సుందరామ శాస్త్రుల వారిచే (1840-1925), వారి శారదాంబా ముద్రాక్షర శాలయందు రెండవ పర్యాయము అచ్చు వేయఁబడినది.

సీ. వివిధ శబ్దార్థానుభవ భవభూతి
చండ దుష్కవి జన దండి దండి
భూరితరైక ప్రభారవి భారవి
యాగమ విరచనా వ్యాసు వ్యాసు
కవితా ప్రపంచ రక్షణ మురారి మురారి
భక్తి తోషిత చక్రి బాణు బాణు
యప శబ్ద నిచయ జిహ్మాగ మయూరు మయూరు
**సుప్రసాద స్ఫూర్తి సోము సోము**

గీ. నపగ తాశేష చటుల తమాఘు మాఘు
శారదానుగ్రహ ద్రవ్య చోరు చోరు
నమితతర సద్యశోరాశి నమరు నమరు
నభినుతించెద సంతతాహ్లాద మమర

ఈ పద్యమును నా దృష్టికి తెచ్చినవారు చిరంజీవి ఉన్నంజ్యోతి వాసు వేములపాడు, ప్రకాశం జిల్లా - 523 273

**హరివంశ వచన ప్రచురణలు**

1. హరివంశము (మూలానుసరణము) శ్రీమతి ఏలూరిపాటి లక్ష్మీ సరస్వతి రాజమహేంద్రవరము 1961
2. ఉత్తర హరివంశము (స్వేచ్ఛానువాదము) శ్రీ రెంటాల గోపాలకృష్ణ, విజయవాడ - 1987.

## 'జగద్గురు కృప' ప్రత్యేక సంచిక కర్నూలు

1983 సం. బ్రాహ్మణ సంఘము, కర్నూలు చాతుర్మాస్య దీక్షావ్రతమును నిర్వహించినది. అప్పుడు 'జగద్గురు కృప' ప్రత్యేక సంచిక వెల్వడినది. అందు, 'ఆది శంకరుల దివ్య చరిత్ర ఆధ్యాత్మిక సందేశము' అనెడి వ్యాసమందు, ఈ పీఠికా కర్త (పుట, 36) ఇట్లు వచించిరి.

*"శంకర భగవత్పాదుల దృష్టిలో బ్రహ్మము హరి హర స్వరూపమే! మాతృమూర్తి మరణ శయ్యపై నున్నపుడు ఆమెకు పరతత్త్వమును బోధించిరట. ప్రశ్నోత్తర రత్నమాలికలో (శ్లోకము, 65), "కశ్చభగవాన్" అను ఆమె ప్రశ్నకు 'మహేశః శంకరనారాయణాత్మైకః' అని సమాధాన మిచ్చిరట. దీనిని బట్టి మహేశ్వరుఁడు (పరమాత్మ) శివ కేశవ రూపమగు పరతత్త్వమని స్పష్టము. శివకేశవుల అభేదమును చూచిన వారికి ఆయుస్సు, శ్రేయస్సు కలుగునని పెద్దలు వక్కాణించిరి."*

**ముగింపు :**

సోముని 'ఉత్తర హరివంశము', నన్నయ రమ్యత, తిక్కన ఆధ్యాత్మికత, ఎఱ్ఱయ మధురిమ సమ్మిళితమైన సాహితీ సమాహారము.

**సత్యభామా కృష్ణ సంవాదము** : (సోమన సంస్కృతకవి)

కాకర్ల పర్తి తిరుపతి పాత్రులు పందొమ్మిదవ శతాబ్దికి చెందిన ఉత్తరాంధ్ర కవి. వారు తమ 'సత్యభామా కృష్ణ సంవాదములో సోముని సంస్కృత కవులతో చేర్చి, ఈ క్రింది పద్యమున అభినుతించెను. ఈ గ్రంథము శ్రీరాజా గోడే నారాయణ గజపతి రాయనిం గారి అనుజ్ఞతో చెన్నపట్టణమున శ్రీ చదలువాడ సుందరామ శాస్త్రుల వారిచే (1840-1925), వారి శారదాంబా ముద్రాక్షర శాలయందు రెండవ పర్యాయము అచ్చు వేయఁబడినది.

సీ. వివిధ శబ్దార్థానుభవ భవభూతి
  చండ దుష్కవి జన దండి దండి
భూరితరైక ప్రభారవి భారవి
  యాగమ విరచనా వ్యాసు వ్యాసు
కవితా ప్రపంచ రక్షణ మురారి మురారి
  భక్తి తోషిత చక్రి బాణు బాణు
యప శబ్ద నిచయ జిహ్మాగ మయూరు మయూరు
  **సుప్రసాద స్ఫూర్తి సోము సోము**

గీ. నపగ తాశేష చటుల తమాఘు మాఘు
శారదానుగ్రహ ద్రవ్య చోరు చోరు
నమితతర సద్యశోరాశి నమరు నమరు
నభినుతించెద సంతతాహ్లాద మమర

ఈ పద్యమును నా దృష్టికి తెచ్చినవారు చిరంజీవి ఉన్నంజ్యోతి వాసు వేములపాడు, ప్రకాశం జిల్లా - 523 273

**హరివంశ వచన ప్రచురణలు**

1. హరివంశము (మూలానుసరణము) శ్రీమతి ఏలూరిపాటి లక్ష్మీ సరస్వతి రాజమహేంద్రవరము 1961
2. ఉత్తర హరివంశము (స్వేచ్ఛానువాదము) శ్రీ రెంటాల గోపాలకృష్ణ, విజయవాడ - 1987.

20. ఉత్తరహరివంశము (ముక్తాఫలవ్యాఖ్యానము) 1994

# కృతి సమర్పణము

స్థిత ప్రజ్ఞులు, ఉదారులు, న్యాయవాది శ్రీ అల్లాడి కృష్ణస్వామి గారి ద్వితీయ జామాత, సాహితీ రసజ్ఞులు, విద్వజ్జన విధేయులు

## శ్రీ పాటూరి రాఘవరామశాస్త్రి
## శ్రీమతి కల్పకాంబ

## పుణ్య దంపతులకు సమర్పితము.



## ని వా ళి

గీ. శాశ్వతం బగు తత్త్వంబు విశ్వసించి
వేద జ్ఞానము నెఱిగిన విజ్ఞుఁడతఁడు
కల్పవృక్షము నింటనే కల్గినాఁడు
మమ్ము విడువక యున్నాఁడు మనసులందు.

**మామిడిపూడి గోపాలకృష్ణన్**
ఐ.ఏ.ఎస్. (రిటైర్డు)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు.



శ్రీమతి పాటూరి కల్పకాంబ, రాఘవ రామశాస్త్రి
దంపతులు

# కీర్తిశేషులు చీమకుర్తి శేషగిరిరావు

## (14.6.1913 - 16.9.1994)

తెలుగు గోష్ఠి వ్యవస్థాపకాధ్యక్షులు, ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన ఖని, సంచార విజ్ఞాన సర్వస్వము అయిన శ్రీ చీమకుర్తి శేషగిరిరావు గారు హఠాత్తుగా 16.9.1994 దివంగతులైనారు. వారు 14.6.1913 తేదీన పొన్నూరు తాలూకా వెల్లటూరులో చిల్లర వారి వంశంలో జన్మించి, తర్వాత చీమకుర్తి వారి వంశానికి దత్తత వెళ్లారు. గుంటూరులో బి.ఏ. రెండవ సంవత్సరం చదువుతూ, స్వాతంత్ర్యోద్యమంలో దూకడం వల్ల, 1942 నుండి 1946 వరకు సాహస గాథాభరితమైన అజ్ఞాతవాసం గడిపారు. జయప్రకాశ్‌నారాయణ్ శిష్యులై కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో పని చేస్తూ 1951వ సం. రాజకీయాల నుండి వైదొలగారు. సహకారోద్యమ నిర్మాతగా ప్రసిద్ధి పొందారు. చీమకుర్తిలో హైస్కూలుకు గాను, మూడెకరాల భూమిని దానమిచ్చారు.

తెలుగు భాషా సమితి - మద్రాసులో తెలుగు విజ్ఞాన సర్వస్వం సహాయ సంగ్రాహకులుగా మొదట చేరారు. తర్వాత విజ్ఞాన సర్వస్వం పదునాలుగు సంపుటాలకు సంకలన కర్తగాను, సంపాదకులుగాను పని చేశారు.

వారు నిత్యపరిశోధకులు. చిన్న వయసు నుండి వారి అభిమాన శాస్త్రం గణితం. వివిధ శాస్త్ర శాఖలలో విస్తృత పరిజ్ఞానం గల మేధావి. 80 ఏళ్ళ వయసులో కూడ, అనేక బౌద్ధక్షేత్రాలను దర్శించారు. వారి కార్యాచరణ పథకాలలో మిగిలి పోయిన పరిశోధనాంశాలు ఇంకా చాలా ఉన్నాయి. గాంధేయ వాది. తన్ను ఆశ్రయించిన వారందఱిని ఆదరించారు. వారి సహాయ సహకారం అందుకున్న వారు ఎందరో వారి కీర్తి పతాకాలుగా నిలిచి ఉన్నారు. వారు ఈ క్రింది గ్రంథాలను తెలుగు గోష్ఠి ద్వారా వెలువరించారు:

1. తెలుగు మఱుగులు 1986, 2. Forgotten Aspects of Telugu 1987. 3. తెలుగులో పాళీ పదాలు 1990, 4. తెలుగు మఱుగులు (Revised) 1990, 5. ప్రాకృత భాషోత్పత్తి 1991, 6. Satavahana Eepoch, A New light 1994, 7. ఉత్తర హరివంశము (ప్రథమాశ్వాసము, ముక్తాఫల వ్యాఖ్యాసహితము, 1994.)

హైదరాబాద్ — ఎం. రాఘవరావు



తెలుగు గోష్ఠి వ్యవస్థాపకాధ్యక్షులు

కీ.శే. చీమకుర్తి శేషగిరిరావు గారు

(1913 - 1994)

ఓమ్ నమో భగవతే వాసుదేవాయ

# ఉత్తర హరివంశము

## నాచన సోమనాథ ప్రణీతము

## పంచమాశ్వాసము

శ్రీనిశ్శ్రేయసకాంక్షా
నూనవ్రతభార దక్షిణోదార సప
ర్యానందిత చేతో *ని
ధ్యాన తనుద్యుతి నవీన హరిహరనాథా. 1

ప్రతి : శ్రీ = సంపద; ని శ్రేయస = మోక్షమనెడి; కాంక్ష= కోరికచే; అనూన = తక్కువ కాని, అధికమైన; వ్రతభార = నియమము కలవారి భారము వహించువాఁడా! దక్షిణ+ఉదార = సర్వసముఁడవై; పరకార్యమును త్వరగా చేయు వాఁడా! 'దక్షిణే సరళోదారౌ' అమరం; సపర్య+ఆనందిత = (భక్తుల) సేవలచే సంతోషమును పొందిన; చేతస్ = మనస్సులందు; ని ధ్యాన = దర్శన మొసగువాఁడా! తనుద్యుతి నవీన = శరీరకాంతిచే క్రొంగ్రొత్త శోభ కలవాఁడా! హరిహరనాథా!

నియమ వ్రతులైన నిన్నాశ్రయించి సంపదను కోరువారికి సంపదను మోక్షమును కోరువారికి మోక్షమును ప్రసాదించు వాఁడా! సర్వ సముఁడవై దయావంతుఁడవై శీఘ్రముగా పర కార్యమును చేయు వాఁడా! నీకు సేవలు చేసి సంతోషమును పొందిన భక్తుల చిత్తములందు దర్శనమొసగు వాఁడా! శరీర కాంతిచే మిక్కిలి క్రొత్తదైన వెలుఁగు కలవాఁడా! హరిహరనాథా!

**చదలువాడ జయరామ శాస్త్రి.**

2

ఉత్కృష్టమగు మోక్షమును కోరి యధికమైన నియమమును బాటించువారి భారమును వహించువాఁడా! సమర్థుడు నుదారుఁడు నైనవాఁడా! భక్తుల సేవచే సంతోషించిన (నిధ్యాన) మనోదృష్టి గలవాఁడా! నిత్యనూతనముగాఁ గను పట్టు వాఁడా!

---

* విద్యానంత ధ్యానరూప

విశే. అంత్యప్రాసనియ మనుసరించి విశేషణములు విడఁగొట్టఁబడినవి. శ్రీ..భార, దక్షిణోదార, సపర్యా.. నిధ్యాన తనుద్యుతి నవీన, విశేషణము లన్నియు హరిహరోభయ సాధారణములు.

**డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు.**

3

(హరి) లక్ష్మీదేవి యొక్క మేలునందు కోరికచే తక్కువ కాని నియమము యొక్క బరువు కలవాఁడా!

(హర) మంగళ ప్రదమైన మోక్షము నందలి కోరికచే తక్కువ కాని నియమము యొక్క బరువు కలవాఁడా!

**ఉభయపక్షములకు సమానము:**

ఎల్లనాయికల యందు సమానమైన ఆదరము కలవాఁడా! ఉదారస్వభావము కలవాఁడా! శుశ్రూషలచే సంతోష పెట్టఁబడిన మనస్సు యొక్క (నిధ్యాన) ఎక్కువ ఏకాగ్రత గలవాఁడా! శరీరము యొక్క కాంతి చేత నూతనముగాఁ దోఁచువాఁడా! హరి హరస్వరూపుఁడవగు నో భగవంతుఁడా!

**వివరణము** : శ్రీ నిశ్రేయస మొదలుకొని వ్రతభార వఱకు నొక సమాసము. అంత్యానుప్రాసనియమము పాటించుటచే దక్షిణోదార యనునది రెండవ సంబుద్ధి. ముద్రితప్రతులందు, ఏకసమాసముగానే ముద్రితమై యున్నది. రెండు సంబుద్ధులుగా వానిని గ్రహించుట లగ్గు. పూర్వపద్యములందలి శిల్పము వలెఁగాక యిందు భిన్నమయిన శిల్పమవలంబింపఁబడినది. పూర్వ పద్యముల యందొకే సమాసమున రెండు పక్షములకు క్రమముగా నర్థము చెప్పుకొనఁగా నిందొకే సమాసమునకు క్రమాలంకార ప్రమేయము లేకయే యుభయ పక్షములకును నర్థము కుదురు చున్నది.

విష్ణుదేవుఁడు లక్ష్మీదేవికి మేలు కలుఁగ వలయునని యనూన వ్రతభారము పూనినవాఁడు. దక్షిణ నాయకుఁడు. ఉదారుఁడు. ఊడిగము చేయువారి సపర్యల చేత సంతోషించివ హృదయము గలవాఁడు. శరీరకాంతిచే నెప్పటి కప్పుడు క్రొత్తగాఁ దోఁచువాఁడు.

పరమేశ్వరుఁడు మోక్షమును గోరి యనూన వ్రత భారము పూనినవాఁడు. దక్షిణ

నాయకుఁడు. ఉదారుఁడు. మునీశ్వరుల సపర్యల చేత సంతోషించిన హృదయము కలవాఁడు. తన శరీరకాంతి చేత నెప్పటికప్పుడు క్రొత్తగాఁ దోఁచువాఁడు నని భావము.

**డా. తిమ్మావజ్ఝల కోదండ రామయ్య.**
పరిశోధన పత్రిక ఏప్రిల్ మే నెల - 1955.

గమనిక : విష్ణుదేవుఁడు లక్ష్మీదేవికి మేలు చేయుటకై తానే వ్రత భారమును పూనెను. మహాదేవుఁడు తానే మోక్షమును గోరి వ్రత భారమును పూనెను.

కం. జనమేజయుఁ డి ట్లను న
మ్మునితో హరివర్ణనంబు మును పలుమాఱున్
విని తనియదు మది గ్రమ్మఱ
వినఁ గోరెద ననుడు నతఁడు వేడుకతోడన్. 2

తా: జనమేజయుఁడు ఆ వైశంపాయన మహర్షితో ఇట్లు పలికెను. 'విష్ణు ప్రశంసను మున్ను పెక్కు మాఱులు వినినను, నా మనస్సు తృప్తి చెందలేదు. మరల వినఁదలచినాను.' అనినంతనే ఆ ముని సంతోషముతో (పైగద్యముతో అన్వయము).

వ. మున్ను మురాంతకుండు చేసినలావు లెన్ని యెన్ని. 3

తా: పూర్వము, విష్ణువు చేసిన సాహస కార్యములు ఎన్నియో కలవు.

కం. ఏణాంకధరుఁడు దోడుగ
బాణుఁడు మొగరింప బాహుపంక్తి *శతంబున్
క్షీణముగ నఱకి వానిం
బ్రాణముతోఁ బట్టివిడిచె బలిమథనుఁ డనిన్. 4

ప్రతి: బాణుఁడు; ఏణాంకధరుఁడు = చంద్రుని (శిరసున) ధరించినవాఁడు, శివుఁడు; తోడుగన్; మొగరింపన్ = ఎదిరింపఁగా; బలిమథనుఁడు = బలిని అడఁచిన వాఁడు, విష్ణువు; అనిన్ = యుద్ధమునందు; బాహుపంక్తి శతంబున్ = చేతుల వరుస యొక్క పదినూఱుల చేతులను; క్షీణముగ = తగ్గునట్లు; నఱికి; వానిన్; ప్రాణముతోన్; పట్టి = పట్టుకొని నిర్బంధము చేసి (గ్రహించి); విడిచెన్.

* శతంబక్షీణ గతి

తా: బాణుడు, ఈశ్వరుఁడు, తనకు సహాయుఁడై ఉండఁగా, విష్ణువును ఎదిరించెను. ఆ యుద్ధములో అతని చేతులను నఱికివేసి, (దయతో) రెండుచేతులు మాత్రము మిగులునట్లు ప్రాణముతో విడిచి వేసెను.

వ. అని మఱియుం గుమారుండు సహాయుం డగుటయుం బరమేశ్వరుండు
నిత్యసాన్నిధ్యంబు చేయుటయుం గాత్యాయని జననీత్వంబు
నొందుటయును నతనికి గాణాపత్యంబు గలుగుటయు నెఱింగించి
యితవట్టునుం గలుగునతండు హరిచేత హతుం డయ్యె ననుటయు
జనమేజయుండు తత్కథాశ్రవణకుతూహలి యైన నా వైశంపాయనుం
డిట్లనియె. 5

ప్రతి: అని; మఱియును; కుమారుండు = కుమారస్వామి; సహాయుండు; అగుటయున్; పరమేశ్వరుండు; నిత్య సాన్నిధ్యంబు = ఎల్లప్పుడును తన కడనుండునట్లు చేయుటయున్; కాత్యాయని = పార్వతి; జననీత్వంబున్ + ఒందుటయునున్ = తల్లి అగుటయును; అతనికిన్; గాణాపత్యంబు = ప్రమథులకు అధిపతి అగుట; కలుగుటయున్; ఎఱింగించి; ఇంత వట్టునున్ = ఇంత గొప్పతనము, కలుగు+అతండు = కలిగిన ఆ బాణుఁడు; హరి చేతన్; హతుండు+అయ్యెన్ = చంపఁబడెను; అనుటయున్; జనమేజయుండు; తద్+ కథాశ్రవణ కుతూహలి = ఆ వృత్తాంతమును వినుటయందు వేడుక కలవాఁడు; ఐనన్; ఆ వైశంపాయనుండు + ఇట్లు + అనియెన్.

తా: అని పలికి ఇంకను కుమారస్వామి సహాయుఁడగుటయు, శివుఁడు ఎల్లప్పుడు సమీపమున ఉండుటయును, పార్వతి తల్లి అగుటయును, అతనికి ప్రమథులపై ఆధిపత్యము లభించుటయును, తెలిపి, ఇంతటి వాఁడైనను బాణుఁడు విష్ణువుచే మరణమును పొందెననఁగా జనమేజయుఁడు ఆ వృత్తాంతమును వినఁ దలఁచెను. తర్వాత ఆ వైశంపాయనుఁడు రాజుతో ఇట్లనెను.

సీ. బలితనూజుం డైన బాణాసురుఁడు దొల్లి
కార్తికేయుని శూలి గారవించి
ముద్దాడునెడ సూచి మోదంబు ఖేదంబుఁ
బొడమ నెమ్మనములోఁ 'గొడుకు నిట్లు
పాటింపఁడేఁ దండ్రి పని యేమి'కటకటా
నాతండ్రి యుండిన నన్ను నిట్లు

పాటించు నిటమీఁదఁ బరమేశ్వరుఁడు తండ్రి
గాకున్న జన్మంబు కసటు వోదు.

గీ. [1]తపము మెచ్చ కద్దేవుండు తండ్రి గాఁడు
గాన మెచ్చింతుఁ దపముచేఁ గాన లోన
నతనిఁ బంచేంద్రియంబుల కప్పగింతు
మానసంబున [2]కట తెత్తు మదనహరుని.' 6

ప్రతి: బలి తనూజుండు + ఐన = బలిచక్రవర్తి కొడుకైన; బాణ+అసురుఁడు = బాణుఁడను రాక్షసుఁడు; తొల్లి; కార్తికేయునిన్ = కుమార స్వామిని; శూలి = శివుఁడు, గారవించి = ఆదరించి (వాత్సల్యముతో); ముద్దు+ఆడు+ఎడన్=ముద్దాడు సమయమును; చూచి; నెఱ+మనములోన్ = నిండు మనస్సుతో; మోదంబున్ = సంతోషమును; ఖేదంబున్ = విచారమును; పొడమన్ = కలుగఁగా; ఇట్లు; కొడుకున్; పాటింపఁడు+ఏన్ = ఆదరింపనిచో; తండ్రి; కర్తవ్యము + ఏమి = కర్తవ్యమేమి? కటకటా = అయ్యో! నా తండ్రి ఉండినన్; నన్నున్ = నన్ను కూడ; ఇట్లు పాటించున్ = ఆదరించును; ఇటమీఁదన్ = ఇటుపైని; పరమేశ్వరుఁడు; తండ్రి కాక ఉన్నన్ = తండ్రి కాకపోయినచో; జన్మంబు = (నా) పుట్టుక; కసటు = దోషము; పోదు; ఆ+దేవుండు; తపము మెచ్చక = (నా) తపస్సును మెచ్చుకొనక; తండ్రి; కాఁడు; కానన్ = ఆకారణముచే; కానలోన్ = అడవిలో; తపముచేన్; అతనిన్ = ఆ శివుని; మెచ్చింతున్ = మెప్పింతున్; పంచ+ ఇంద్రియములకున్ = అయిదు ఇంద్రియములకును; అప్పగింతున్; మదన హరునిన్ = మన్మథనాశకుఁడైన శివుని; అట మానసంబునకున్ = అట మనస్సునకు; తెత్తును = (ధ్యానము చేసెదను) రప్పింతును. ఏకాగ్రతతో తపము చేసెద ననుట.

తా: బలచక్రవర్తి కొడుకు బాణాసురుఁడు, పూర్వము శివుఁడు, కుమార స్వామిని వాత్సల్యముతో ప్రీతితో ముద్దాడు చుండఁగా చూచి సంతోషమును విచారమును పొందెను. అపుడు ఇట్లు తలఁచెను. "ఈ రీతిగా కొడుకును తండ్రి ప్రీతితో బుజ్జగింపనిచో, పని యేమి? అయ్యో! నా తండ్రియే యున్నచో నన్ను కూడ ఇట్లు లాలించెడి వాఁడు కదా! ఇంక నాకు ఆ పరమేశ్వరుడు తండ్రి కాకపోయినచో నా పుట్టువు యొక్క దోషము నశింపదు. అతని గుఱించి తపస్సు చేసిననే అతఁడు తండ్రి అగును. కావున అడవిలో తపము చేసి శివుని మెప్పింతును. నా పంచేంద్రియములను వశపఱచుకొని ఆ మదన హరుని నా మనస్సునకు తెచ్చుకొందును.

1. తగవు 2. కడఁజేర్తు

పంచేంద్రియములు : 1. నేత్రములు 2. జిహ్వ,(నాలుక), 3. ఘ్రాణము (ముక్కు) 4. త్వక్కు (చర్మము) 5. శ్రోత్రములు (చెవులు), ఇవి జ్ఞానేంద్రియములు. కర్మేంద్రియములు అయిదు. 1. వాక్కు 2. పాణులు (చేతులు) 3. పాదములు, 4. పాయువు (గుదము), 5. ఉపస్థ (స్త్రీ పురుషుల గుహ్యే).

వ్యు. కార్తికేయుఁడు : "కృత్తికానా మపత్యం కార్తికేయః" షట్కృత్తికల కొడుకు కుమారస్వామి (అమరము).

రూ. మెచ్చింతున్, మెప్పింతున్.

వ్యా. 1. ముద్దాడు+ఎడ > ముద్దాడునెడ. సూ. ఉదంత తద్ధర్మార్థ విశేషణమునకు అచ్చు పరంబగునపుడు నుగాగమంబుగు, సంధి, బాల -33, ద్రుతకార్యములు. సంధి, బాల 16,17.

2. నెఱ+మనము = నెమ్మనము. ప్రాతాది సమాస సంధి.

సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబు కానంబడియెడిని. సంధి, బాల - 39

3. ఆ+దేవుండు = అద్దేవుండు. త్రిక సమాససంధి.

సూ. 'ఆ , ఈ, ఏ' అను సర్వనామంబులు, త్రికంబునాఁబడు.

సూ. కర్మధారయంబు త్రిక స్త్రీసమ, ముగంత ధాతుజ విశేషణ పూర్వ పదంబయి యుండు.

సూ. ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.

సూ. త్రికంబు మీఁది అసంయుక్తహలునకు ద్విత్వంబు, బహుళంబుగానగు. సమాస, బాల - 4,5,13,14.

మ. అని బాణాసురుఁ డీసు రోసము మమత్వాహంకృతు ల్మానసం
బునకున్ దవ్వులవైచినిశ్చలగతిన్ ముగ్ధేందు చూడామణిన్
మునిసంఘాతశిరోభినీతచరణాంభోజాత సంభూత నూ
తనరాగద్యుతి భాసురుం బురహరుం దత్త్వస్థితిం జూచుచున్. 7

ప్రతి: అని, బాణాసురుఁడు; ఈసు; రోసము = కోపము; మమత్వ+అహంకృతుల్ = అజ్ఞానము; గర్వము (నాదిమాది అని, నేను కర్తను అని); మానసంబునకున్ = మనస్సునకు; దవ్వులన్ = దూరమున, వైచి; నిశ్చలగతిన్ = సంకల్ప వికల్పములేక, చలనములేని విధమున;

ముగ్ధ+ఇందు చూడామణిన్ = బాల చంద్రుని తలమానికముగా కలవాఁడును; ముని సంఘాత = మునుల మొత్తము యొక్క; శిరస్+ అభినీత = తలలచే ఎదురుగా తేఁబడిన (పొందఁబడిన); చరణ+అంభోజాత = పాదపద్మముల వలన; సంభూత = పుట్టిన; నూతన = క్రొత్త; రాగ = ఎఱుపు యొక్క; ద్యుతి = కాంతిచే; భాసురున్ = ప్రకాశించు వాఁడును (అగు); పురహరున్ = త్రిపుర నాశకుని, శివుని; తత్త్వస్థితిన్ = యదార్థ స్థితితో (సర్వాతిశయత్వమును); చూచుచున్; (అష్టమూర్తియైన శివుని మనస్సున ప్రతిష్ఠించుకొని - పంచభూతములు, సూర్యచంద్రులు, పురుషుఁడు అనువాని సమ్మిళిత మూర్తిని).

తా: అని పలికి బాణాసురుఁడు వైరము, కోపము, అజ్ఞానము, గర్వము మొదలగువానిని పూర్తిగా త్యజించి నిశ్చలుఁడై, మునుల సమూహము, తమ శిరస్సులను వంచి భక్తితో పాదపద్మములకు నమస్కరింపఁగా ప్రకాశించు క్రొత్తదైన ఎఱ్ఱఁదనముతో (అనురాగముతో అనుగ్రహముతో) ప్రకాశించు వాఁడును అయిన బాల చంద్రుని శిరస్సునఁ గల పరమేశ్వరుని, త్రిపురాసుర సంహారకుని అష్టమూర్తి సంయుతుని సహజస్థితిని మనస్సులో ప్రతిష్ఠించుకొని, భక్తి భావముతో పరవశించుచు చూచుచు.

ఈసు (వి). ఈర్ష్య (ప్ర)

వ. ఇట్లని స్తుతియించు. 8

తా : సులభము.

## - : బాణాసురుఁడు శివుని సేవించి వరములఁ బడయుట : -

ఉ. 'కొలువఁగ నేర నిన్ను శతకోటివిభాకర తేజు డగ్గఱం
బిలువఁగ నేర నిన్ను మునిబృంద వివేకవిమర్శదూరునిన్
విలువఁగ నేర నిన్నుఁ బృథివీ వియదంతర భిన్న నేమిటన్
నిలువఁ గదయ్య నా హృదయ నీరజకర్ణికపై మహేశ్వరా. 9

ప్రతి : మహేశ్వరా! శతకోటి విభాకర తేజున్ = నూఱుకోటుల సూర్యుల తేజస్సు కలవాఁడైన; నినున్; కొలువఁగన్+నేరన్ = సేవింపఁజాలను; మునిబృంద = మునుల సమూహము యొక్క; వివేక = తెలివికి (సూక్ష్మబుద్ధికి); విమర్శ = పరిశీలనమునకును; దూరునిన్ = అందరాని వానిని (దవ్వైన వానిని); నిన్నున్; దగ్గఱన్ = సమీపమునకు; పిలువఁగన్+నేరన్ = పిలువఁజాలను; పృథివీ = భూమికి; వియత్+అంతర = ఆకాశమునకు,

భూమ్యాకాశముల నడిమి భాగమునకు; భిన్నున్ = వేఱైన వానిని; ఏమిటన్ = ఏ ధనముతోను (దేనితోను); విలువఁగన్+నేరన్ = కొనఁజాలను; నా హృదయ నీరజ కర్ణికపైన్ = నా ఎద అనెడి తామర పువ్వు యొక్క దుద్దుపై; నిలువఁగదయ్య.

తా: ఓ పరమేశ్వరా! నూఱుకోట్ల సూర్యతేజముకల నిన్ను నేను సేవింపఁజాలను. ముని సమూహముల సూక్ష్మ బుద్ధికి, పరిశీలనకు ద వ్వైన నిన్ను దగ్గఱకు పిలువఁజాలను. భూమ్యాకాశములకును వాని నడిమి భాగమునకును, వేఱైన నిన్ను దేనితోను కొనఁజాలను. ( నీ విలువ కట్టలేను). నీవు నా హృదయకమలమందు నిల్చి నాకు కన్పట్టుమా!

భగవంతుని తేజస్సు సామాన్య చక్షువులచే దర్శించుటకు వీలుకాదు. అర్జునుడు దివ్య చక్షువులచే ఆ తేజస్సును చూడకలిగెను.

శ్లో : దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప ద్యుత్థితా
యది భాస్సదృశీ సాస్యాద్భాస స్తస్య మహాత్మనః
భగవద్గీత 11 అ - 12 శ్లో.

భావము : ఆకాశమున వేయి మంది సూర్యులు ఏకకాలమున ఉదయించినపుడు కలుగు ప్రకాశమునకు సరి వచ్చునది.

వ్యా. నిలువఁగదయ్య - సూ. తఱచుగం గ్రియల మీఁది కదకదవులకు అన్నాదులు పర్యాయంబున నను ప్రయుక్తంబు లగు. క్రియ, ప్రౌఢ - 29.

చం. 'కలఁగని వారునిన్ను మదిఁగౌఁగిట నెత్తెడు వారు ముక్తికిం
దొలఁగని వారుగాఁ దెలియుదుం దలపోయుదు లోన నాసలున్
నలఁగవు హృత్పయోజ సదనంబునకు న్నినుఁ దెచ్చు నంతకున్
మలఁగఁగదే త్రికోణమణిమంటపదీపికపై మహేశ్వరా. 10

ప్రతి: మహేశ్వరా! కలఁగని వారున్ = మనస్సు కలఁత చెందని వారును, నిర్మల చిత్తులును; నిన్ను; మదిన్; కౌగిటన్+ఎత్తెడు వారున్ = కౌగిలించువారును; ముక్తికిన్ = మోక్షమునకు; తొలఁగని వారు+కాన్ = పాయని వారని; తెలియుదున్ = ఎఱుఁగుదును; తలపోయుదున్; హృద్+పయోజ సదనంబునకున్ = హృదయపద్మమనెడి భవనమునకు; నినున్; తెచ్చున్ + అంతకున్ = కొని తెచ్చు నంతవఱకు; లోనన్ = నామనస్సులో; ఆసలున్ = కోరికలును;

నలఁగవు = నశింపవు; త్రికోణ మణిమంటప దీపిక పైన్ = ముక్కోణపు రత్న మండపమునందలి దీపమునందు; మలఁగఁ గదే! = వెలుఁగరాదా!

తా: ఓ పరమేశ్వరా! నిర్మలచిత్తులును నిన్ను గుఱించి నిశ్చలధ్యానము చేయు వారును మోక్షమునకు అర్హులని నేను తలంతును. నీవు నా హృదయ పద్మమనెడి భవనమును చేరునంత వఱకు నా ఆశలు నశింపవు (అంత వఱకు నా కోరికలన్నియు నీ పైనే ఉండుననుట). కనుక నా హృదయమందలి మూడు కోణములు గల రతనాల మండపములోని దీపమందు జ్యోతిఃస్వరూపుఁడవై వెలుంగుమా!

ఇందు శివశక్తుల స్థానమైన శ్రీ చక్రసూచన గర్భితమై ఉన్నది.

చం. 'ఒరసిరి నిన్నుఁ దర్కనికషోపలధా [1]రల వన్నెఁ గాన రె
త్తరసిరి విశ్వముం గపిల యైనను నీదెస ముల్లు సూపఁగా
బెరసిరి బ్రహ్మముఖ్యు లగు పెద్దలు [2]బచ్చులు వోలె నెల్లచో
నెరసిరి గాని నిన్నెఱుఁగ నేరరు నావశమే మహేశ్వరా.' 11

ప్రతి: మహేశ్వరా! బ్రహ్మముఖ్యులు+అగు పెద్దలున్ = బ్రహ్మాదులగు గొప్పవారు సైతము; బచ్చులు పోలెన్ = కోమట్ల వలె; నిన్ను; తర్కనికష+ఉపలధారలన్ = తర్కశాస్త్రమనెడి గీటు ఱాతి అంచులచే; ఒరసిరి = తర్కించి (ఒరపిడిచేసి); వన్నెన్ + కానరు = నీ శోభను తెలిసికొన లేకపోయిరి; ఎత్తు = నీ బరువును, గొప్ప తనము; అరసిరి = విచారించిరి; విశ్వమున్ = జగత్తుకూడ; కపిల+ఐనను = కపిలగోవు (గోవులలో శ్రేష్ఠమైనది. గోరోజనవర్ణముకలది); కూడ; నీ దెసన్ = నీవైపు; ముల్లు+చూపఁగా = (నీవే అధికుఁడవని) మొగ్గు చూపఁగా; బెరసిరి = అతిశయించిరి; ఎల్లచోన్; నెరసిరి = వ్యాపించిరి; కాని నిన్నున్ + ఎఱుఁగనేరరు; నావశమే = నాకు తరమా?

తా: పరమేశ్వరా! బ్రహ్మాదులు, కోమట్ల వలె తర్కమనెడి ఒరపిడి ఱాతిచే నిన్ను గుఱించి తెలిసికొనుటకు ప్రయత్నించిరి. కాని నీ శోభను తెలిసికొనలేకపోయిరి. నీ గొప్ప తనమునుతూఁచి చూచిరి. నీవు, విశ్వము, కపిలగోవు అనువాని కంటె అధికుఁడవని గుర్తించిరి. నిన్ను కనుగొనుటకు అతిశయించి, అంతటను వ్యాపించిరి. (దర్శనముల చేతను ప్రయత్నించి నప్పటికిని,) నీ ఘనతను తెలిసికొన లేకపోయిరి. అట్టి వారే ఎఱుఁగలేక పోవుటచే, నిన్నెఱుఁగుటకు నాకు శక్యమా?

అలం : 1. ఉపమ. బచ్చులు వోలె.

1. రులు 2. పిచ్చులు

2. అర్థాపత్తి, ఒక అర్థము సిద్ధించుటచే అట్టి మఱొక అర్థమును తేలికగా సిద్ధింపఁజేయుట. అనఁగా ఒక అర్థముచే మఱొక అర్థమును సాధించుట. ఈన్యాయమునకు కైముత్యము అనియు పేరు. కావ్యశబ్దము పూర్వపదముగా గల అలంకారమును ఇదియే. కావ్యార్థాపత్తి.
బ్రహ్మాదులును నిన్ను కనుఁగొనలేకపోయిరి అనుటచే తనకును సాధ్యము కాదను అర్థము సిద్ధించుచున్నది.

గీ. అనుచు వినుతించుచున్న బాణాసురునకు
నంత కంతకు సంతోష మావహిల్ల
నంధకారాతి పొడసూపి యతనితోడ
'నడుగు మిచ్చెద వర' మన్న నతఁడు పొంగి. 12

తా: అనుచు స్తుతించుచున్న బాణునకు క్రమక్రమముగా సంతసము కలుగఁగా, అంధకారాతి (అంధకుఁడను రాక్షసుని శత్రువు) శివుడు ప్రత్యక్షమై 'వరము కోరుము' అనఁగా అతఁడు బాగుగా సంతోషించినవాఁడై (మీఁది పద్యముతో).

కం. 'కడు వేడ్క తోడ నీకుం
గొడు కయ్యెడు నంతకంటెఁ గోర్కియుఁ గలదే
జడుఁ డనక నన్నుఁ గయికొని
గెడగూర్పుము నన్నుఁ గార్తికేయునితోడన్.' 13

అర్థ : జడుఁడు = మందబుద్ధి; కార్తికేయుఁడు = కుమార స్వామి; కెడగూర్పుము = జతచేయుము.

తా: మిక్కిలి ఉత్సాహముతో, ఓ పరమేశ్వరా! నీకు కొడుకు అగుట కంటె నాకు వేఱొక కోర్కె కలదా? నన్ను బుద్ధి హీనుఁడని తలంపక చేరదీసి నీ సుతుఁడగు కుమారస్వామితో జతగూర్పుము.

ఉ. నావుడుఁ జంద్ర శేఖరుఁడు నవ్వుచుఁ బార్వతిఁ జూచి 'వీఁడు నీ
కోవనితా కుమారుఁడు గుహుం డితనిం దనతమ్ముఁ డంచు సం
భావన చేయుఁగాక యొకపట్టణ మిమ్ము విశాఖుఁ గన్న య
ప్పావకుఁ డేలు తద్రుధిర పట్టణ పార్శ్వమునం దలోదరీ.' 14

అర్థ : గుహుండు = కుమారస్వామి; సంభావన = గౌరవము; తలోదరీ = సన్నని నడుము కలదానా? విశాఖున్ = కుమారస్వామిని; పావకుఁడు = అగ్ని; పార్శ్వము = ప్రక్కన.

తా: అని పలికినంతనే శివుఁడు పార్వతిని చూచి, 'ఓ వనితా! ఇతఁడు నీ కొడుకు,మన కుమారుఁడు ఇతనిని తమ్ముడుగా గౌరవించుగాక! కుమారస్వామి జన్మకు కారకుడైన అగ్ని దేవుడు పాలించు శోణిత నగరమునకు ప్రక్క ఒక పట్టణము ఇమ్ము'.

వ్యు: 1. గుహుఁడు, తన సైన్యమును రక్షించుకొనువాఁడు.

2. విశాఖుఁడు : పక్షియైన నెమిలిచే తిరుగువాఁడు, కుమారస్వామి.

కుమార స్వామి : విశాఖా నక్షత్రమున పుట్టిన వాఁడు 'విశాఖుని కన్న అగ్ని' అనుటచే కుమారస్వామి జననమునకు అగ్నియు సహాయుఁడని అర్థము. శివపార్వతులు, ఏకాంతమున నుండగా, రాకూడదని ఎఱిఁగియు అగ్ని, వారు క్రీడించు చోటునకు వచ్చెను. అపుడు, శివుని వీర్యమును అతఁడు పొంది భరింపలేక గంగకు సమర్పించెను. ఆమెయును అద్దానిని ఱెల్లు పై విడుచుటచే సూర్య రశ్మి వలన కుమార స్వామి ఉదయించెను. కనుక శరజన్ముఁడని పేరు కలిగినది. కృత్తికలు ఆర్వురు, పాలిచ్చుటచే అతఁడు ఆఱుముఖములతో పాలు త్రాగెను. ఆ కారణముచే షణ్ముఖుఁడని పేరు కలిగినది. వారు పెంచుటచే కార్తికేయుఁడని ప్రసిద్ధుఁడయ్యెను. దేవతల సైన్యమునకు అధిపతి అగుటచే మహాసేనుఁడని, 'శక్తి' అనెడి ఆయుధము కలవాఁడగుటచే శక్తి ధరుఁడని, క్రౌంచ పర్వతమును ఖండించుటచే క్రౌంచ దారణుఁడనియు,రేతస్కందముచే జన్మించిన వాఁడగుటచే స్కందుఁడనియు పేర్లు కలిగినవి.

వ్యా. అ+పావకుఁడు = అప్పావకుఁడు. చూడు, పద్య - 6.

స్కందుఁడు (ప్ర) కందుఁడు (వి).

చం. పడగయు వాహనంబు నయి బర్హిణవల్లభుఁ డిక్కుమారు నే
ర్పడఁ గదియుం గుమారుఁడును బాయని నెచ్చెలియై చరించు' నా
వుడు నచలేంద్రకన్య యభవుం గొనియాడె వరంబు చేత న
క్కొడుకు మదాంధుఁడై దివిజకోటికిఁ గీడొనరించె నెండియున్. 15

అర్థ : బర్హిణవల్లభుఁడు = నెమిలి ఱేఁడు; పడగయున్ = కేతనమును; కదియున్ = సమీపించును, కూడును; అచల+ఇంద్ర కన్య = పర్వతరాజు కూతురు, పార్వతి; అభవున్ =

శివుని; ఆ కుమారుఁడు (బాణుఁడు); మద+అంధుఁడై = మదముచే కన్నులు కానని వాఁడై; దివిజకోటికిన్ = దేవతల సమూహమునకు.

తా: 'నెమిలి రాజు టెక్కమును వాహనమును అయి ఈ కొడుకును (బాణుని) చేరును. మన కుమారస్వామియును అతనికి విడువని చెలికాఁడై వర్తించును.' ఇట్లు అని నంతనే గిరిజ శివుని స్తుతించెను. బాణుఁడు శివుఁడిచ్చిన వరముచే గర్వించి మైమఱచి, దేవతల కెల్ల కీడు చేసెను. మఱియును.

వ్యు : 1. బర్హిణము, బర్హము (పింఛము) కలది, నెమిలి.

2. అభవుఁడు, భవము (పుట్టుక) లేని వాఁడు శివుఁడు!

మ. గెలిచెం బూర్వన రేంద్రులం బఱపె నాగ్నేయావనీనాథులన్
నలఁచెన్ దక్షిణ రాజపంక్తిఁ జెఱిచెన్ నైర్పత్యరాట్కోటి నా
వల వైచెన్ జరమాధిపాళి నడఁచె న్వాయవ్యభూపాలురన్
దొలఁగం బెట్టె నుదీచ్యపార్థివులఁ బోఁదోలెన్ హరాశేశులన్. 16

ప్రతి: (ఆ కొడుకు కర్త); పూర్వనరేంద్రులన్ = తూర్పు దిక్కునందలి రాజులను; గెలిచెన్; ఆగ్నేయ అవనీనాథులన్ = ఆగ్నేయ దిగ్రాజులను; పఱపెన్ = పాఱఁదోలెన్; దక్షిణ రాజపంక్తిన్ = దక్షిణ దిక్కునందలి రాజులవరుసను; నలఁచెన్ = బాధించెను; నైర్పత్యరాజ కోటిన్ = నిర్పతి దిక్కునగల రాజుల మొత్తమును చెఱిచెన్; చరమ+అధిప+ఆళిన్ = పడమటి దిక్కు నందలి రాజుల నెల్లను; ఆవల వైచెన్ = ఆజ్ఞలకు వశులను చేసెను; వాయవ్య భూపాలురన్; అడఁచెన్; ఉదీచ్య = ఉత్తర దిక్కునందలి; పార్థివులన్ = రాజులను; తొలఁగన్ పెట్టెన్ = తొలఁగించెను; హర+ఆశా+ఈశులన్ = (ఈశుని దిక్కైన) ఈశాన్య దిక్కున కల రాజులను; పోఁదోలెన్.

తా: బాణుఁడు తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైర్పతి, పడమర వాయవ్యము, ఉత్తరము ఈశాన్యము అను ఎనిమిది దిక్కులందలి రాజులను జయించెను.

విశే. కవి దిక్కుల క్రమమును పాటించెను. "రాజు" "గెలుచు" అను వానికి సమానార్థకములను ఎనిమిదింటిని సమర్థముగా పద్యములో ఇముడ్చుట గమనింపఁదగియున్నది. సూక్తివైచిత్రి.

వ్యా. నలఁచు, నలఁగు ధాతు, ప్రేరణార్థక రూపము నలఁచు.

కం. గాణాపత్యము వడసెను
బాణుం డిలఁ గార్తికేయపర్వతకన్యా

స్థాణులు పొత్తున మనఁగా
శోణితనగరమున దనుజశోభనకరుఁడై. 17

తా: బాణుఁడు భూమియందు తనతో కుమారస్వామియును పార్వతియును స్థాణుఁడు (ఈశ్వరుఁడు) చెలిమితోనుండఁగా శోణితనగరమును రాజధానిగా రాక్షసులకు మేలు చేయువాఁడై, ప్రమథులకు నాయకుఁ డయ్యెను.

వ. ఇట్లు త్రిభువనభవన భారభరణ పారీణభుజాస్తంభ విజృంభణంబున
సరి లేక కసిమిరిగొను కరతలంబులతో నొక్కనాఁడు కాలకంధరుం
జేరి యద్దేవునకుం బ్రణామం బాచరించి యిట్లనియె. 18

అర్థ : త్రిభువన భవన భరణపారీణ = మూఁడు లోకములనెడి సౌధముల బరువును, మోయుటయందు, తుద ముట్టిన (పూర్ణప్రావీణ్యము కల) సమర్థములైన, భుజాస్తంభ= స్తంభముల వంటి బాహువుల యొక్క; విజృంభణమునన్ = చెల రేఁగుటయందు; కసిమిరిగొను = తీఁట పొందిన; కరతలంబులతోన్ = అఱచేతులతో; కాలకంధరున్ = నల్లని కంఠము కలవానిని (శివుని).

తా: ఇట్లు ముల్లోకము లనెడి భవన భారమును వహించుట యందు, ప్రావీణ్యము గల బలిష్ఠములైన భుజములు, చెలరేఁగఁగా, తనతో సరి ఎవ్వరును లేక యుద్ధము చేయవలయుననెడి అఱచేతులతో, ఒకనాఁడు (నల్లని కంఠము కల) శివుని చేరి నమస్కరించి ఇట్లనెను.

అలం: 1. రూపకము, త్రిభువన భవన, భుజాస్తంభ .

2. వృత్త్యనుప్రాసము, 'భ' కార 'ణ' కారములు ఆవృత్తమైనవి. మఱియును
'క' వర్ణ మాది హల్లు, కసిమిరిగొను క రతలంబుతో... కాలకంధరుం'
భావపోషకముగా నున్నది.

కాలకంధర : ఈ శబ్ద ప్రయోగము, ఆలోచనాత్మకమై సాభిప్రాయ సూచకముగా నున్నది. ముల్లోకములను భరించు భుజస్కంధములు గల బాణుని కరతలములు కసిమిరి కొని యున్నవి. అట్టి వాఁడు బాణుఁడు కాలకంధరుని చేరి నమస్కరించె ననుటచే, లోకోపకారమునకై హాలాహల విషమును మ్రింగిన పరమేశ్వరుఁడు, అతనికి తగిన గుణపాఠమును బోధింపఁగలఁడను ధ్వని యున్నది. పుత్రుఁడైన దుష్టుఁడగు

బాణుని, భక్తుడైనప్పటికిని దయావంతుఁడై శిక్షార్హుఁడనియే భావించి, తగిన శిక్షకు గుఱి చేసి అంతమున వరము లిచ్చి ఆదరించెను.

సీ. ఖురఖలీ నాఘాత కోలాహలంబుతో
నేమి నిర్ఘోషంబు నెఱప లేదు
నఖపుంఖరోచులు నారితో సంధించి
కర్ణావతంసంబు గడప లేదు
మణికిరీటకరోటి మంజీరములు రాయ
వీరమధ్యంబులు వ్రేయ లేదు
దంతిదంతావళదంతంబు లొరయ డా
కినుల వాచవులఁ జొక్కింప లేదు

గీ. లేదు ప్రతిభటబాహావలేప మహిమ
లేదు సంగ్రామభీమకేలీ రవంబు
లేదు విక్రమక్రీడయు లేశమైన
లేదు రాజ్యంబు గలిగియు లేదు ఫలము. 19

ప్రతి : ఖుర = (గుఱ్ఱముల) గిట్టల యొక్కయు; ఖలీన = కళ్లెముల యొక్కయు; కోలాహలంబుతోన్ = పెద్ద రొదతో; నేమి నిర్ఘోషంబున్ = బండిచక్రముల చుట్టు కమ్ముల యొక్క ధ్వనిని; నెఱపన్ + లేదు = వ్యాపింపఁజేయలేదు; నఖ పుంఖ రోచులు = గోరులయు, పింజలయు (బాణము క్రింది చివరి భాగము) కాంతులు; నారితోన్ = అల్లెత్రాటితో; సంధించి = కూర్చి; కర్ణ+అవతంసంబు = చెవి అలంకారమును; కడపలేదు = జరపలేదు; మణికిరీట కరోటి మంజీరములు = రత్నమయములైన కిరీటములును, కపాలములును (తలపుఱ్ఱెలు), కాలిఅందెలును; రాయన్ = ఒరసికొనునట్లు; వీరమధ్యంబులు = శత్రువీరుల పేర్లు, (రూపులు) నడుమ చెక్కి శూరులు కాలి పెద్ద వ్రేలిని ధరించెడి ముద్రికలు (ఉంగరములు); వ్రేయలేదు = పగులఁగొట్టలేదు; దంతి = కోఱవంటి దంతములు కల; దంతావళ = ఏనుఁగుల; దంతంబులు; ఒరయన్ = రాసికొనునట్లు; డాకినులన్ = పిశాచములను; చొక్కింపన్ లేదు = పరవశింపఁ జేయలేదు; ప్రతిభటబాహ+అవలేప మహిమ = శత్రువీరుల భుజగర్వము యొక్క గొప్పతనము (కనునట్టి అవకాశము); లేదు; సంగ్రామ భీమ+కేలీ రవంబు = యుద్ధమనెడి భయంకరమైన క్రీడ యొక్క ధ్వని; లేశమైనన్ = కొంచెమైనను; లేదు; రాజ్యంబు కలిగియున్; ఫలము = ప్రయోజనము; లేదు.

తా: దేవా! గుఱ్ఱముల గిట్టల యొక్క, కళ్ళెముల యొక్క పెనురొదతో బండి చక్రపు కమ్ముల ధ్వనిని వ్యాపింపఁజేయలేదు. గోరుల బాణముల చివఱల కాంతులను అల్లెత్రాటితో కూర్చి చెవికి అలంకారముగా చేయలేదు. రత్నకిరీటములును, కపాలములును కాలి అందెలు ఒరసి కొనునట్లు కాలి వ్రేలిలో గల బిరుదు ముద్రికలను పగులగొట్టలేదు. (శత్రువుల శిరోగర్వమును నేల పాలు చేయ లేదనుట). కోఱవంటి దంతములు కలిగియున్న (మదించి నిడుపై వాఁడియైన కొనగల) ఏనుఁగుల దంతములు ఒకదాని కొకటి రాచుకొనఁగా, వాని మాంస ఖండములను నోటిలో వేసికొని రుచు చూచుచు తృప్తి పడునట్లు డాకినులు అనెడి పిశాచములను పరవశింపఁజేయలేదు. శత్రువీరుల భుజగర్వోన్నతి గాని, భయంకర మైన యుద్ధ క్రీడాధ్వని గాని లేదు. పరాక్రమ కేళిని చూపుటకు లేశమైనను అవకాశము లేదు. రాజ్యముండియు ప్రయోజనము లేనే లేదు.

బాణుఁడు కరతలంబులందు కల కసిమిరిచే తన యుద్ధాసక్తిని శివునికి నివేదించెను. యుద్ధమెంత హింసాత్మకమో ఎఱిఁగియు అందులో వేడుక చూపుట అవివేకము. మదోన్మత్తుల కిది యొక విలాసక్రియ.

అలం: అతిశయోక్తి.

సీ. నిండారు తెగఁగొని నిగిడించు తూపుల
వైరిమర్మంబులు వ్రచ్చి వ్రచ్చి
బిగితంపు ముష్టి కంపిత మైన యసిధార
విమత కంఠాస్థులు విఱిచి విఱిచి
అనువొంద నల్లార్చి యందంద పెనుగద
శత్రుదేహంబులు చదిపి చదిపి
చదల వమ్మొగఁ బర్వ శక్తిశూలాదులఁ
బగఱ పీనుఁగు లుర్విఁ బఱపి పఱపి

గీ. ఏదినంబును వృథవోవనీని కడిమి
యొదవఁ బోరాడునాట చెన్నొందె నేని
కూడు చవి యగుఁగాక నిష్ప్రౌఢ మైన
దర్పమూరక యూరింపఁ దరమె దేవ. 20

ప్రతి: దేవ= ఓ పరమేశ్వరా! నిండారు = పూర్తిగా; తెగఁగొని = (చెవి వఱకు) అల్లె త్రాటియందు కూర్చి; నిగిడించు = ప్రయోగించు; తూపులన్ = బాణములతో; వైరి మర్మంబులు = పగవారి జీవ స్థానములు (ఆయువు పట్టులు); వ్రచ్చి వ్రచ్చి = మిక్కిలి చీల్చి; బిగితము+ముష్టి = గట్టిదైన పిడికిటిచే; కంపిత మైన = చలించు (త్రిప్పఁబడిన); అసి ధారన్ = కత్తి వాదరలచే; విమత కంఠ+అస్థులు = శత్రువుల మెడలలో గల ఎముకలు; విఱిచి విఱిచి = బాగుగా విఱిచి; అనువొందన్ = అనుకూలముగా; అల్లార్చి = త్రిప్పి; అందంద = మఱిమఱి (తఱచుగా); పెనుగదన్ = పెద్దగదతో; శత్రుదేహంబులు; చదిపి చదిపి = మిక్కిలి నలఁగఁగొట్టి; చదలన్ = ఆకసమునందు; వమ్మగన్ = నష్టమగుచు; పర్వు = వ్యాపించు; శక్తి శూల+ఆదులన్ = చిల్లకోల శూలము మొదలగు ఆయుధములతో; పగఱ పీనుఁగులు = శత్రువుల శవములు; ఊర్విన్ = నేలపై; పఱపిపఱపి = బాగుగా పడవైచి; ఏదినంబును; వృథ పోవన్ +ఈని = వ్యర్థముకానట్టి (ఉపయోగపడు నట్టి); కడిమి = పరాక్రమము; ఒదవన్ = కలుగగా; పోరాడు + ఆట = యుద్ధక్రీడ; చెన్ను+ఒందెన్ + ఏని = ఒప్పు నెడల; కూడు = తిండి; చవి అగున్+కాక = రుచించును కదా; నిష్క్రోధమైన దర్పము = కోపము లేని గర్వము; ఊరక; ఊరింపన్+తరమె = నిల్పుకొన శక్యమా?

తా: ఓ పరమేశ్వరా! అల్లె త్రాటియందు కూర్చి బాగుగా దానిని చెవి వఱకు లాగి విడిచిన బాణములతో శత్రువుల ఆయువు పట్టులను బాగుగా చీల్చియు, గట్టిదైన పిడికిటిచే త్రిప్పుచున్న కత్తుల అంచులచే పగవారి మెడల ఎముకలు బాగుగా విఱిచియు; విలాసముగా త్రిప్పి పెద్ద గదతో శత్రువుల మేనులను బాగుగా నలఁగఁగొట్టియు ఆకసమునందు, నష్టమై పోవుకాంతులు గల వివిధములగు ఆయుధములతో శత్రువుల పీనుఁగులను నేలపై బాగుగా పడవైచియు, ప్రతి దినమును, ఉపయోగపడునట్టి పరాక్రమము ప్రదర్శించునట్టి సమర కేళి చక్కగా అమరినచో, తిండి తృప్తిగా నుండును. మఱియు కోపమును ప్రదర్శింపఁజాలని గర్వమును భరించుటకు వీలగునా?

విశే. "వచ్చి, వచ్చి" మున్నగు వాని ద్విరుక్తి (భృశార్థము), బాణుని యుద్ధక్రీడాసక్తిని అభివ్యక్తము చేయును.

వ్యా. 1. బిగితము+ముష్టి = బిగితంపు ముష్టి - పుంప్వాదేశసంధి.

సూ. కర్మధారయంబులందు మువర్ణంబునకు పుంపులగు. సంధి, బాల - 32.

2. బిగితంపు ముష్టి కంపితము. ముష్టికంపితము సిద్ధసమాసము. "బిగితంపు' అను విశేషణము తెలుగు పదము. ఇది "ముష్టికంపితము" అను సిద్ధ సమాసమందలి "ముష్టి" (ఏకదేశముతో) అన్వయమును కలిగి యున్నది.

సూ. కొన్ని యెడల సిద్ధసమాస మధ్య గత పదంబుతో తద్భిన్న పదంబులకు అన్వయము చూపట్టెడి సమాస, ప్రౌఢ - 35.

3. పోరాడు + ఆట = పోరాడునాట. (చూడు, పద్య - 6)

4. ఆర్చి. 'ఆడు' అను ధాతువు యొక్క ప్రేరణార్థక రూపము, ఆర్చు. దీని క్త్వార్థకము ఆర్చి.

శా. దేవా కయ్యముతోడి వేడుక మదిం *దీండ్రింప మర్త్యుండు నే
త్రోవం జేతులతీఁట వుత్తు నని కోరున్ దానవుం డైన నా
కీ వే చేతులు చేసి తీ కసిమి రిం కెట్లోర్తు నోర్తున్ రిపు
గ్రీవాఖండనమండన స్ఫురదసి క్రేంకారముల్ గల్గినన్. 21

అర్థ : తీండ్రింపన్ = (తీఁడిరించు రూపా) = మిక్కుటముకాఁగా; నాకున్ + ఈవే చేతులు చేసితి = నాకు ఈ వేయి చేతులు కలిగించితివి (ఇచ్చితివి); కసిమిరి = దురద; గ్రీవాఖండన మండన = తలల యొక్క (ను) ముక్కలుగా చేయుట అనెడి అలంకారముచే; స్ఫురత్ = వెలుఁగు చున్న; అసి = కత్తి యొక్క; క్రేంకారముల్ = క్రేమ్ క్రేమ్ అనెడి ధ్వనులు;

తా: ఓ పరమేశ్వరా! మరణధర్మములుగల మానవుఁడు సైతము యుద్ధోత్సాహము మనస్సులో అతిశయింపఁగా చేతుల తీఁటను ఎట్లు పోగొట్టు కొందునని కోరును. నేను రాక్షసుఁడను (ఆకాశగమనుఁడు). మఱి నీవు వేయి చేతులు కలిగించితివి. ఈ చేతుల దురదను నే నెట్లు సహింపఁగలను. శత్రువుల కంఠముల కత్తిరించుట అనెడి అలంకారముతో శోభించు కత్తి యొక్క క్రేమ్ క్రేమ్ అనెడి ధ్వనులు కలిగినప్పుడే ఆ తీఁటను సహింపఁగలను.

అర్థాంతరము : నాకు; ఈవే = నీవే (రూపాం) చేతులు; చేసితివి = ఇచ్చితివి;

అలం: కావ్యార్థాపత్తి. సామాన్య మానవుఁడే రెండు చేతుల తీఁటను ఓర్వలేఁడు. వేయి చేతులు గల నేను ఎట్లు ఆ చేతుల తీఁటను ఓర్వఁగలను? ఓర్వఁజాలను అని భావము. నీవే పోఁగొట్టుటకు యుద్ధమును కల్గింపుము అని, మఱొక అర్థము సిద్ధించుచున్నది. దీనికి 'అర్థాపత్తి' అనియు పేరు. (చూడు, పద్యము 11).

వ్యా. 1. చేసితివి+ఇ సూ. లిడ్లొట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు. క్రియ, బాల-24 = చేసితి+ఇ (వకారలోపమైనది). సూ. మధ్యమ పురుషక్రియల

---

* దిట్టాడు

యందు ఇత్తునకు సంధి యగు. సంధి, బాల - 7. చేసితి+ఇ = చేసితి.

2. ఓర్చుదున్, ఇందు 'చుద్' నకు తకారంబు. ఓర్తున్.

సూ. చువర్ణంబుతోడ దుగ్ధ కారంబు తకారంబగు. బాల, క్రియ - 108.

3. దానవుండను+ఐన = దానవుండనైన అనురూపమేర్పడవలెను. కాని దానవుండు + ఐన దానవుండైన అని రూపమున్నది. ప్రథమాంతమైన నుగాగమము ప్రాప్తి లేదు.

సూ. ప్రథమాంతంబులగు యుష్మ దస్మద్విశేషణంబుల కేకత్వంబున వు ను లును బహుత్వంబున 'రు' ము 'లు' ను అంతాగమంబులు ప్రాయికముగ నగు. కారక, బాల - 33 అస్మత్ అనెడి విశేషణమునకు నుగాగమము రాకపోవుట 'ప్రాయిక' శబ్దముచే నని ఎఱుఁగునది.

కం. చేతుల కసి వోఁ గయ్యము
చే తవిలిన యట్టివిధము చింతించి ననున్
బ్రీతుంగాఁ గరుణింపుమ
యీతఱి నెన వోల్ప రామి యీఁగి మహేశా. 22

అర్థ: చే తవిలిన+అట్టి విధము = చేతికి కలుగు విధము (యుద్ధము జరుగునట్లు); తఱిన్ = సమయమందు; ఎన+పోల్పన్ + రామి = సరిపోలువాఁడు లేకపోవుటచే; ఈఁగి = (అట్టి స్థితిని) నివర్తించుటయే (నీ కర్తవ్యము). ఈఁగు నీఁగు రూపాంతరములు, ఈగి, ఈవి రూపాంతరములు. ఇవి అర్థబిందువులు లేనివి. 'త్యాగము' అని అర్థము. పద్యమందు, అర్ధబిందుయుతమైన 'ఈఁగి' శబ్దముండుటచే దానికి సరియైన అర్థము గ్రహింపఁబడినది. కనుక 'ఈఁగి'కి 'ఈవి' అనుట సరికాదు. అరసున్న లేనిచో "ఈవి" అని అర్థమును గ్రహించుట యుక్తమే. (నీవు సాటి చెప్పరాకుండుటయే ఔదార్యము).

తా: ఓ పరమేశ్వరా! నా చేతుల తీఁట పోవుటకై చేతులకు యుద్ధము చేయు అవకాశమును అలోచించి, నన్ను ప్రీతితో ఆదరింపుమా! ఈ సమయమందు నాతో సమానమైన వాఁడు లేకపోవుటచే అట్టి స్థితిని నివర్తించుటయే (నీకర్తవ్యము). "నాతో సాటి యైన వానితో యుద్ధము చేయుటకు ఒక విధమును ఆలోచింపుమని ప్రార్థన."

కయ్యము (వి), కలహము (ప్ర).

వ్యా. కరుణింపుము + అ. సూ. సంప్రార్థనంబుల ముజ్ఞానకు అదాదులు, విభాష నమప్రయుక్తంబులగు. క్రియ, బాల - 33.

ఉ. నావుడు దేవదేవుఁడు మనంబున నించుక నవ్వి వానితో
'నీవు మయూరకేతనము నేలఁ బడం బొడగన్న యప్పు డా
శీ విషరాజసారభుజ! సిద్ధము యుద్ధము కల్మి దాని కేఁ
గావలియున్న చోటన యకారణ భంగ'మనంగఁ బొంగుచున్. 23

అర్థ: మయూర కేతనము = నెమిలి టెక్కెము; ఆశీ విషరాజసారభుజ! = నాగరాజు యొక్క బలమును, బాహువులును కలవాఁడా; అర్థాంతరము. నాగరాజు యొక్క బలమును బాహువులును కలిగిన వారితో; యుద్ధము; కల్మి, కలిమి (రూ) = కలుగుట; సిద్ధము = నెఱవేఱును; కావలి+ఉన్న చోటన్ + అ = రక్ష ఉన్నచోటనే; అకారణ భంగము = కారణములేని అవమానము;

తా: అని బాణుఁడన్నంతనే శివుఁడు మనసులో (బాణుని యుద్ధోత్సాహమును అసహ్యించుకొని) ఇంచుక నవ్వి వానితో, "నాగరాజుయొక్క బలమును బాహువు గల ఓ బాణాసురా! నీ నెమిలి టెక్కెము నేలపై పడుటను నీవు కన్నప్పుడు, యుద్ధము కలుగుట సిద్ధించును. నేను కావలి ఉన్న చోటనే కారణము లేని అవమానము కలుగును" అనఁగా అతఁడు సంతోషించుచు (మీఁది గద్యముతో).

2. అని బాణుఁడన్నంతనే శివుఁడు అతని కయ్యముపై కల కోరికకు మనసులోనే రోఁతచెంది (హేళనతో కూడిన చిఱునవ్వు కలవాఁడై) వానితో, "ఓ బాణాసురా! నీవు నెమిలి టెక్కెము నేలపై పడుటను కన్నంతనే నాగరాజు యొక్క (ఆదిశేషుని) బలమును భుజమును కలవారితో యుద్ధము కలుగుట సంభవించును. నేను కావలి ఉన్న చోట, అవినీతి కారణమైన చెఱపు కలుగును" అనఁగా అతఁడు సంతోషించుచు (మీఁది గద్యముతో)

ఈ రెండవ తాత్పర్యము మేలైనదిగా నున్నది. బాణుఁడు బాలుఁడైన అనిరుద్ధునితో కయ్యము చేయఁజాలక మాయను చేపట్టి పాములతో బంధించెను. ఇది అధర్మ యుద్ధము. ఇట్లు అవినీతికి కారణమైన యుద్ధముచే, భంగపాటు కలుగునని ధ్వని. బాణునకు, అవినీతికి కారణమైన భంగము, తన శత్రువులకు కలుగునని స్ఫురించియుండును. కనుక సంతోషించుచు ఇంటికి మరలెను.

వ. నిజగృహంబునకు వచ్చి. 24

తా: తన ఇంటికి వచ్చి.

ఉ. పండిన సంతసంబు ముఖపద్మవికాసవిలాస మొంద బా
ణుండు సభాస్థలంబున మనోరథ సిద్ధి యెఱుంగఁ జేయఁ గుం
భాండుఁడు మంత్రివర్యుఁ డసురాధిపు నత్తఱిఁ జూచి 'నేఁడు నీ
వొండొక చందమై మిగుల నుబ్బెదు వచ్చిన మేలు చెప్పుమా.' 25

ప్రతి: పండిన సంతసంబు = సంపూర్ణమైన సంతోషము; ముఖపద్మవికాసము = కమలమువంటి ముఖమునకు శోభను కలుగఁజేయఁగా; బాణుండు; సభాస్థలంబునన్; మనోరథసిద్ధి = (తన) కోరికనెఱ వేఱుటను; ఎఱుంగన్+చేయన్; మంత్రి వర్యుఁడు = మంత్రులలో మిన్న; కుంభాండుఁడు; అసుర+అధిపున్ = రాక్షసరాజును; ఆ + తఱిన్ = ఆ సమయమందు; చూచి; నేఁడు; నీవు; ఒండొక చందమై = అపూర్వమైన రీతిలో (శోభతో); మిగులన్ = మిక్కిలి; ఉబ్బెదు (ఉబ్బెదవు) = ఉప్పొంగుచున్నావు; వచ్చిన మేలు; కలిగిన శుభము; చెప్పుమా!

తా: మిక్కుట మైన సంతోషముచే కమలము వంటి మోము చెన్నొందు చుండఁగా బాణుఁడు తన కోరిక నెఱవేఱుటను చెప్పుటకు సిద్ధమయ్యెను. అపుడు ఆతని ముఖ్యమంత్రి కుంభాండుఁడు, 'ఈ దినము నీవు అపూర్వమైన ముఖశోభతో వెలుఁగుచున్నావు. నీకు ఏదైన మేలు కలిగినదా చెప్పుము.'

వ్యా: ఉబ్బెదవు ఉబ్బెదు. వకారలోపము. (చూడు. పద్య -21)

సీ. సహజవిగ్రహుఁ డైన శార్ఙ్గిచే మెఱుఁ గెక్కు
చక్రంబు ముద్దగాఁ జఱచి తొక్కొ
పాతాళగత మైనబంధు దానవకోటిఁ
బాటించి తలచూపఁ బంచి తొక్కొ
నీయింటి వాకిట నీలలోహితుకంటె
గుహునికంటె* ఘనుండు గొలిచెనొక్కొ
మీతండ్రిచే గుజ్జుమెణకరి గొన్న భూ
గగనంబు లేలంగఁ గలిగె నొక్కొ

గీ. లవణ సాగరమధ్యంబు లావుతోడ
నేలునప్పుడు మన కెల్ల నింతబంటి

* ను ఘనుఁ గొలిచి తొక్కొ

న న్నెఱుఁగ నీక నీకు నేఁ డున్న యునికి
నబ్బె నెబ్బంగి నిబ్బర మయిన యుబ్బు. 26

ప్రతి: సహజ విగ్రహుఁడు = స్వభావ మూర్తియైన, అవతారమూర్తికాక శంఖ చక్ర గదాదులను ధరించిన (పుట్టుక నుండి విరోధియైన); శార్ఙ్గి = శార్ఙ్గము అను విల్లు గలవాఁడు, విష్ణువు యొక్క; చే = చేతియందు; మెఱుఁగు + ఎక్కు; చక్రంబున్ = సుదర్శనము అనెడి ఆయుధమును; ముద్దగాన్; చఱచితివి + ఒక్కొ = కొట్టితివా ఏమి?; పాతాళగతము = పాతాళలోక మందున్న; బంధుదానవకోటిన్ = చుట్టములైన రాక్షసుల సమూహమును పాటించి = ఆదరించి; తలచూపన్ = (భూలోకమునకు వచ్చి) కనఁబడవలసినదిగా; పంచితివి+ఒక్కొ = ఆజ్ఞాపించితివా? నీ యింటి వాకిటన్; నీల లోహితు కంటెన్ = (కంఠమున నలుపును కేశముల యందు ఎఱుపును కలవాఁడు) శివుని కంటెను; గుహుని కంటెను = కుమారస్వామి కంటెను; ఘనుండు = గొప్పవాఁడు; కొలిచెన్ + ఒక్కొ = నిన్ను సేవించెనా? మీ తండ్రిచేన్ (బలిచక్రవర్తి నుండి); గుజ్జు మెణకరి = పొట్టి బ్రహ్మచారి, వామనుఁడు; కొన్న; భూగగనంబులు = భూమియును, ఆకాశమును; ఏలంగన్ +కలిగెనొక్కొ; లవణసాగర మధ్యంబున్ = నాలుగు ఉప్పు సముద్రముల నడిమి భూభాగమును; లావుతోడన్ = బలము తోడ; ఏలు+అప్పుడు; మనకున్ +ఎల్లన్; ఇంతబంటి = ఇంత మాత్రము; నన్నున్ + ఎఱుఁగనీక = తెలియనీక; నీకున్; నేఁడు; ఉన్న ఉనికిన్ = ఉన్నటులుండి; నిబ్బరము+అయిన = గాఢమైన (అధికమైన); ఉబ్బు = సంతోషము; ఏ+భంగిన్ = ఏవిధముగా; అబ్బెన్ = లభించినదో!

తా: స్వస్వరూపముతో ప్రకాశించు (పుట్టుకతో విరోధియైన) విష్ణువుయొక్క సుదర్శన చక్రాయుధమును ముద్దగా ఫలఁగ కొట్టితివా ఏమి? పాతాళమందు దాఁగియున్న మన బంధువుల నెల్ల భూలోకమున రమ్మని కోరితివా ఏమి? నీ రాజభవన ద్వారమందు, శివ కుమారుల కంటె గొప్పవాఁడెవఁడైనా, కాపుండుటకు సమ్మతించెనా ఏమి? మీ జనకుఁడు బలిచక్రవర్తి నుండి వామనుఁడు దానముగా గ్రహించిన భూమ్యాకాశములు మరల వశమగుటచే, పాలింపఁగలిగితివా ఏమి? లవణ సముద్ర మధ్య భాగమందలి భూవలయము నంతటిని పరాక్రమముతో ఏలునప్పుడు, ఇంత మాత్రము సంతోషము, ఉత్సాహము నాకు తెలియక నీకు ఉన్నటులుండి ఏ విధముగా లభించెనో!

వామనుఁడు : విష్ణువు, వామన మూర్తియై, బలి చక్రవర్తి కడకు వచ్చి, ఒక అడుగు భూమిని, వేఱొక అడుగు ఆకాశమును ఆక్రమించి, మూడవ అడుగును ఆతని తలపై పెట్టి అతనిని పాతాళమునకు అణఁగఁద్రొక్కెను.

వ్యా. ఇంతబంటి - "బంటి" లోతును తెలియఁజేయు ప్రత్యయము.

సూ. దఘ్నార్థంబున బంటి, కొలఁదులగు, తద్ధిత, బాల - 27

అలం: వృత్త్యనుప్రాసము. అబ్బె నెబ్బంగి నిబ్బరమయిన యుబ్బు?

వ. అనుటయు నద్దనుజుం డమాత్త్యున కి ట్లనియె. 27

తా: అని మంత్రి కుంభాండుఁడు కోరఁగనే బాణుఁడు అతనితో నిట్లనెను.

చం. 'ఇనసమ తేజ! వింటివె యతీవ భుజక్రమవిక్రమక్రియా
ఘను లగుపోటుబంటులకు గాఢతరప్రతిపక్ష పక్ష భం
జనహృదయైకరంజన విశాల మహాహవమూల మైన య
య్యని మొనఁగాక కల్గునె సమంచిత కీర్తియు ధైర్యమూర్తియున్.28

ప్రతి: ఇనసమతేజ = సూర్యుని సమానమైన ప్రతాపము కలవాఁడా! వింటివె? అతీవ = మిక్కిలి; భుజక్రమ = బాహువుల ప్రసారముచే నైన; విక్రమ క్రియా = పరాక్రమ మనెడి పనియందు; ఘనులు+అగు; పోటు బంటులకున్ = శూరులకు; గాఢతర = మిక్కిలి దిట్టమైన; ప్రతిపక్ష = శత్రువుల; పక్ష = సేనయొక్క; భంజన = మర్దించు; హృదయ+ఏకరంజన = మనస్సునకు ముఖ్యముగా సంతసమును కల్గించు; విశాల మహా+ ఆహవమూలము+ఐన = గొప్పయుద్ధమునకు మొదలైన; ఆ+అని మొనన్+కాక = ఆ యుద్ధముఖమున (అగ్రభాగమున) కాక; సమంచిత కీర్తియున్ = మిక్కిలి గొప్పదైన పేరు; ధైర్య మూర్తియున్ = ధీరత్వము యొక్క స్వరూపమును; కల్గునె = కలుగునా?

తా: 'సూర్య సమాన తేజుఁడవైన ఓ మంత్రివరా! విన్నావా? అధికమైన బాహువుల ప్రసారముచే పరాక్రమ ప్రదర్శన క్రీడయందు యుద్ధవీరులకు శత్రువీరుల సేనను మర్దించుటయే మిక్కిలి సంతసమును ఇచ్చును. అట్టి యుద్ధము వలన కాక, వేఱొక దానిచే గొప్పకీర్తి, ధీరతయొక్క స్వరూపము సమకూరునా?'

అలం: 1. వృత్త్యను ప్రాసము. భుజక్రమ విక్రమ క్రియా, కకారరేఫ సంయోగము, ఆవృత్తమైనది 2. ప్రతిపక్ష, పక్ష, సమంచిత కీర్తి, ధైర్యమూర్తి, వీనిలోను, అక్షరావృత్తి యున్నది.

2. వ్యా. హృదయ + ఏక = హృదయైక, వృద్ధిసంధి.

3. ఛం. అతి+ఇవ = 'ఇ' తో యతి మైత్రి (11వ అక్షరము).

ఉ. 'లావున వైరిదర్పము వెల్వారక[1] యేఁకరి యున్న చేతులన్
భావభవారిపాదములు పట్టి పరాక్రమకేళిఁ గోరితిన్
[2]ఠావుననుండి యన్నమిలి టక్కెము గూలిన యప్డు సంగరం
బేవల నైనఁ గల్గు ననియెన్ హరుఁ డొండొక మోదమేటికిన్. 29

అర్థ : లావునన్ = బలముతో; దర్పము = పొగరు; గర్వము; వెలార్పన్ = అడఁపక, వెడలింపక; ఏకరియున్న = శత్రువులను ఎదుర్కొనవలయునని ఉవ్విళ్లూరు; భావభవ+అరి = మన్మథుని శత్రువైన శివుని; ఏవలను+ఐన = ఏ విధముగానైన;

తా: 'బలముచే పగతుని పొగరు అడఁపలేక పోరునకు ఎదురు చూచుచున్న చేతులతో శివుని పాదములు పట్టుకొని యుద్ధమును కోరితిని. నా మయూర ధ్వజము ఠావుననుండి (తన స్థానము నుండి) కూలి నేలపై పడినపుడు ఏదో విధముగా యుద్ధము సంభవించును అని శివుడు పలికెను. నాకు యుద్ధము చేయుట కలుగుట కంటె వేఱొక సంతోష మెందులకు?'

రూ. నమలి, నమిలి, నెమిలి, నెమలి

టక్కెము, టెక్కెము టక్కియము, టెక్కియము.

రూపాంతరము : ఠేవున మండి - మండుటయందు ధ్వన్యనుకరణమని -(శబ్ద రత్నాకరము).

వ. అని మఱియును. 30

తా : సులభము.

ఉ. నెయ్యము లేని సంగతియు నిక్కము లేని వచోవిలాసమున్
వియ్యము లేని వైభవము విందుల సందడి లేని ముంగిలిన్
దియ్యము లేని చాగమును ధీరత లేని యమాత్యకృత్యమున్
గయ్యము లేని శూరతయుఁ గైకొని యూరకమెచ్చ వచ్చునే.' 31

తా: కూరిమి లేని కూడిక (మైత్రి), నిజములేని మాటల (నేర్పు) చక్కన, చుట్టాలు (పెళ్ళివారు) లేని సంపద, బంధుమిత్ర పరివారముల రాక పోకలతో విందులు లేని ఇంటి

1. యాఁకలిగొన్న 2. డేవున మండి ... టెక్కెము

ముందు భాగము, మాటల తీపిలేని త్యాగము (దానము), ధైర్యము లేని మంత్రుల పాలన, సమరము లేని శౌర్యము, పొందియు, మెప్పునకు అది రానేర్చునా? తగదనుట.

అలం: వినోక్తి, ఒక ధర్మము లేకపోవుటచే ప్రకృతము, రమ్యము కాకపోవుట ఒక విధమైన వినోక్తి. అట్లే రమ్యమగుటయు ఒక విధమైన వినోక్తి. సమరము లేని శౌర్యము ప్రశంసకు తగదని బాణుని వాక్కు.

వ్యా. ముంగిలియున్ = ముంగిలిన్ (చూడు పద్య - 67)

(వి)చాగము (ప్ర) త్యాగము.

కం. అని మాట లాడు చుండఁగ
దనుజ కులాధీశు రాజ్యదర్పము వ్రేఁగై
తునిసినగతి హరు చెప్పిన
పని తప్పక నెమిలిపడగ బల్లున విఱిగెన్. 32

తా: అని పలుకు చుండఁగా దానవ కులమునకు ప్రభువైన బాణాసురుని రాజ్యగర్వము వ్రేఁగై (భారమై) ముక్కలైన విధమున, శివుఁడు చెప్పిన పని తప్పనట్లు నెమిలిపడగ బల్లను ధ్వనితో (నేలపై పడి) విఱిగెను.

అలం: ఉత్ప్రేక్ష, రాజ్యదర్పము వ్రేఁగైతునిసిన గతిన్.

'బల్లునన్' : ధ్వన్యనుకరణ పదము.

వ్యా. హరు చెప్పిన కారక, ప్రౌఢ 15, 16. (చూడు పద్యము - 104).

చం. విఱిగినఁ బొంగె నద్దనుజవీరవరుండు మనంబులోపలన్
వెఱపును ఖేదము న్వెఱఁగు విస్మయముం బొడమంగ మంత్రి 'యి
ట్లెఱిఁగి యెఱింగి మారిఁ దనయింటికి రమ్మను వాని కేమియుం
గఱపిన నొప్పునే విధివికారము దప్పునె యిట్లు ద్రిప్పునే. 33

అర్థ: వెఱపు = భయము; ఖేదము = శోకము; వెఱఁగున్ = నివ్వెఱపాటు, చేష్టలు తొలఁగుట; విస్మయము = అచ్చెరువు; మారిన్ = మరణశక్తిని (మృత్యువును); కఱపినన్ = తెలిపినను; విధి వికారము = దైవము వలన మార్పు (కలఁత); త్రిప్పునే = మరల్చునే!

తా: తన నెమలి టెక్కము విఱుఁగగా ఆ రాక్షస వీరుఁడు ఉప్పొంగిపోయెను. మంత్రి కుంభాండుఁడు భయము, శోకము, చేష్టలు తగ్గుట, అచ్చెరువు, కలుగఁగా "ఈ రీతిగా

తెలిసి తెలిసియే మరణ శక్తిని (మారిని) తన ఇంటికి రమ్మను వానికి ఏమి వివేకము తెలిపినను ప్రయోజన ముండునా? దైవము వలన కలుగు కలఁత (క్షోభ) తప్పిపోవునా? దైవము ఇట్లు (యుద్ధము వలన నాశమునకు పరిస్థితులను) మరల్చెనే!"

(తరువాతి గద్యముతో) .

అలం: అర్థాంతరన్యాసము. విశేషము సామాన్యముచే సమర్థింపఁబడినది. విధివికారము తప్పునె ఇట్లు త్రిప్పునే! (ఇది సామాన్యము)

వ. అనియె నట్టియెడ. 34

తా : సులభము

కం. బాణుండు సెలఁగ దనుజ
ప్రాణంబులు దల్లడిల్లఁ బ్రతిభయతర మై
శోణితపురమున నెల్లను
శోణితవర్షంబు గురిసె సురపతి యలరన్. 35

35. అర్థ : ప్రతిభయతరము = ప్రతి వ్యక్తికి మిక్కిలి భయంకరమై; శోణిత వర్షంబు = నెత్తుటి వాన.

తా: బాణుఁడు చెలరేఁగెను. దానవులు తత్తఱపాటు చెందిరి. అందఱును భయపడిరి. శోణిత పురమున దేవతల ప్రభువు సంతోషించునట్లు నెత్తుటి జడివాన కురిసెను.

## - : శోణిత పురమున దుర్నిమిత్తములు పొడసూపుట : -

కం. మార్జాలంబులు చెలఁగుచు
గర్జించెను గొబల నుండి కంపించె బహు
స్ఫూర్జితనినదముతో ధర
వర్జితపర్వుఁ డయి రాహు వడిఁ బట్టె రవిన్. 36

ప్రతి: మార్జాలంబులు = పిల్లులు; చెలఁగుచున్; గొబలనుండి = గొందుల నుండి (వాని చోట్లనుండి); గర్జించెను = (సింహములవలె) అఱచెను; ధర = భూమి; బహు స్ఫూర్జిత నినదముతోన్ = అధిక మైన (పిడుగు చప్పుడుతో) ఫెళఫెళ ధ్వనితో; కంపించెన్; రాహు =

రాహువు; వర్జిత పర్వు(డు+అయి = (అమావాస్య తిథి కాకపోయినను)సమయము కాకపోయినను; రవిన్ = సూర్యుని; వడిన్ = వేగముతో; పట్టెన్.

తా: పిల్లులు చెలరే(గుచు గొందులనుండి బిగ్గఱగా అఱచినవి. పిడుగుల ధ్వనితో ధర తీవ్రముగా చలించెను. పర్వదినమైన అమావాస్యను తప్పించి రాహుగ్రహము, సూర్యుని కబళించెను.

విశే. 'రాహుపర్వంబు గాకయ భాను(బట్టె భార. సభా. 2 ఆ - 299 పద్యము. అమావాస్య నా(డే - సూర్య గ్రహణము. రాహు = రాహువు, సూ. రాహు బాహు శబ్దంబుల కంతట వువర్ణక లోపంబు వైకల్పికంబు. శబ్ద, ప్రౌఢ - 26.

నానా : పర్వము - గణుపు, పండుగ, భారతభాగము, సమూహము, ప్రస్తావము మొ.
మార్జాలము. రూ. మార్జారము. మూషిక గ్రహణముచే ఇంటిని శుద్ధి చేయునది, పిల్లి.
స్ఫు+ఊర్జిత = స్ఫూర్జిత = స్పష్టమైన, దృఢమైన.

ఛం. రేఫ జకార సంయోగము దుష్కర ప్రాసము.
పూర్వవర్ణము గురుత్వమును పొందుటకై "ఊ" అను స్వరము సంయుక్తాక్షరముగా( జేయ(బడినది. 'స్ఫూర్జిత' శబ్దము ప్రౌఢప్రయోగము.

గీ. విడువ కెప్పుడు పెనుగాలి వీవ( దొడ(గె(
దో(చె దక్షిణదిక్కున ధూమకేతు
వసురకన్యలు పూజింప నరు(గుతోడ
నున్నతం బైన రచ్చమ్రా నొఱగి కెడసె. 37

తా: పెద్ద గాలి విడువక ఎల్లప్పుడును వీచెను. దక్షిణదిశయందు తోకచుక్క ఆకసమున కన్పట్టెను. రాక్షసకన్యలు పూజించు చుండగా ఎత్తైన ఊరిలో జనులు కూర్చుండు పెద్ద చెట్టు వేదికతోపాటు, వంగి విఱిగి పడెను.

గీ. కృత్తికలయందు వక్రించి కీడు *సూపె
మంగళుండు దివాకరమండలంబు
వ్రచ్చికొని చుక్క వడె నెల్లవారి( గల(చె(
గ్రూర నిర్ఘాతపాతంబు గుండె వగుల. 38

* సెదర

ప్రతి: మంగళుండు = కుజుఁడు (అంగారకుఁడు); కృత్తికలయందున్ = ఆపేరు గల ఆఱునక్షత్రములసమూహమందు;వక్రించి = ముందునకుపోవుచు వెనుకకు మరలి వచ్చి; కీడు చూపెన్; దివాకర మండలంబున్ = సూర్యబింబమును; వ్రచ్చికొని = చీల్చుకొని; చుక్క+ పడెన్ = నక్షత్రము రాలి పడెను; క్రూర నిర్ఘాతపాతంబు = ఘోరమైన పిడుగు పాటు; గుండె పగులన్ ఎల్లవారిన్ కలఁచెన్.

తా: అంగారకుఁడు కృత్తికానక్షత్రములందు వక్రగతియై అరిష్టమును సూచించెను. సూర్యబింబమును పగిల్చి తోక చుక్క పడెను. ఘోరమైన పిడుగు పడి గుండెలు చెదరఁగా అందఱు కలఁత చెందిరి.

గీ. రచ్చభ్రమాఁకుల నెల్లను రక్తధార
లుద్భవించెఁ బ్రభాకరుం డుక్కు మడుపఁ
గడఁగి బాణుని జన్మనక్షత్ర మైన
భరణి వీక్షించె నది దనపక్షమైన. 39

తా: వీధులలో నున్న జనులు గుమిగూడి కూర్చుండుటకై నాటిన పెద్ద చెట్లలో నెత్తుటి ధారలు తోఁచినవి. సూర్యుఁడు తన వేఁడిమిని తగ్గించుకొనుటకు ప్రయత్నించి బాణుని జన్మ నక్షత్రమైన భరణి తన యొద్దకు చేరఁగా దానిని చూచెను.

గీ. తెలుపుఁ గెంపును ప్రక్కల వెలయ నలుపు
మెడ బెడంగుగఁ గొంతంపు మెఱుఁగు వోలె
మూఁడు వన్నెలతో నొకమొండె మెగసి
సాంధ్య సమయంబునందు భాస్కరునిఁ గప్పె. 40

తా: ప్రక్కలయందు తెలుపు, ఎఱుపు కలిసి నల్లని మెడతో మాత్రమే మూడు రంగులతో, ఈఁటె యొక్క వన్నెతో, ఒక మొండెము సూర్యుని కప్పివేసెను.

వ. అయ్యవసరంబునం గుంభాండుం డిట్లని విచారించు. 41

తా : సులభము.

ఆ.వె. 'వేయి చేతు లిచ్చి వెట్టిఁ జేసినశూలి
బాణుఁ జెఱుపఁ దలఁచి భండనంబు

గలుగఁ జేసె నింక వెలుగు చే న్మేసినఁ
గాచువార లెందుఁ గలరె జగతి. 42

తా: వేయి చేతులను ఇచ్చి పిచ్చివానిగా చేసిన త్రిశూలధారి శివుఁడు, బాణుని చెఱచుటకై నిర్ణయించు కొని యుద్ధమును (భండనంబు) కల్గించెను. పైరునకు కాపుగా వెలుగును వేయఁగా, అదియే,పండిన పంటను మేసినచో లోకములో ఇంక దానిని ఎవరు రక్షింతురు? ఉండరనుట.

అలం : 1. దృష్టాంతము. శివుఁడు బాణునికి రక్షకుఁడు. అతఁడే అతని నాశమునకు కారకుఁడయ్యెను. రక్షణకై వేసినకంచె, తానే చేనులోని పంటను తిని మైచిన, ఇక దానికి రక్షణ ఉండదుకదా! లక్షణము : భిన్నధర్మములను బింబ ప్రతిబింబములుగ చెప్పుట.

వ్యా. చేను + మేసిన = చేన్మేసిన. సూ. పదాంతంబులయి అసంయుక్తంబులైన 'నులురు'ల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగానగు. ప్రకీర్ణ, బాల - 16.

చం. త్రిదశపతిన్ జయించి జగతీతల మంతయు నేలు బాణుఁడే
మదిమది నుండి దానవసమాజము చేటునకై త్రిలోచనుం
గదనము వేఁడె మున్ను బలి గట్టువడెన్ దనకంటెఁ దక్కువే
యిధి విధిపో నిమిత్తములు నేమియు నొప్పవు గీడుదప్పునే. 43

అర్థ : త్రిదశపతిన్ = దేవతలభర్త, ఇంద్రుని; మదిమదినుండి = నెమ్మదిగ, నిశ్చింతుడై ఉండి; త్రిలోచనున్ = ముక్కంటిని; కదనమున్ = యుద్ధమును; కట్టు వడెన్ = బంధింపఁబడెను; విధి, పో = దైవసంకల్పము, నిర్ణయము అనుట నిశ్చయము; నిమిత్తములున్ + ఏమియున్ = ఇప్పుడు కన్పట్టు శకునములు ఏ మాత్రమును; ఒప్పవు = బాగుగా లేవు.

తా: దేవేంద్రుని జయించి సర్వలోకమును పాలించు బాణుఁడే నిశ్చింతుఁడై ఉండియు రాక్షస సమూహనాశమునకు ముక్కంటిని ఇట్లు కయ్యమును కోరెను. పూర్వము ఇతని తండ్రి బలిచక్రవర్తి వామనునిచే బంధింపఁబడెను. ఆ బలికంటె బాణుఁడు తక్కువైన వాఁడే (తన కంటె తక్కువే!). ఇట్లు బాణుఁడు కయ్యమును కోరుట దైవ సంకల్ప మనుట నిశ్చయము. కన్పట్టు శకునములు ఏ మాత్రమును బాగుగా లేవు కీడు తప్పదు.

వ. అట్లుం గాక యద్దనుజేంద్రుం బొడగన్న యప్పుడు. 44

తా: అదియును గాక ఆ రాక్షస ప్రభువును చూచినప్పుడు (తరువాతి పద్యముతో).

చం. హరుఁడు గుమారుకంటెఁ గొనియాడుఁ గుమారుఁడు చాలఁ గూర్చు నా
హరుఁడుఁ గుమారుఁడున్ రణసహాయులుగా నడతేర వీనిపై
నొరులు పరాక్రమించుటకు నోపుదురే చెడుకాల మైన నె
వ్వరి దెస నేవికారములు వచ్చునొ! యింత విచార మేటికిన్. 45

అర్థ : చాల కూర్చున్ = మిక్కిలి ఇష్టపడును; ఎవ్వరి దెసన్ = ఏ శూరులందు; ఏ వికారములు = ఏ తలవని చెడు తలంపులు, మార్పులు; విచారము = ఆలోచన.

తా: పరమశివుఁడు, తన కుమారుడైన కుమారస్వామి కంటె బాణుని ఎక్కువగా పొగడును. మఱియు కుమారస్వామియు ఇతనిని మిక్కిలి ఇష్టపడును. శివుఁడు, కుమారస్వామి, యుద్ధములో సహాయులై ఉండఁగా బాణునివలె, ఇతరులు పరాక్రమమును చూపఁగలరా? చెడుకాలము సమీపించినపుడు మంచి వారికి సైతము చెడ్డ తలంపులు వచ్చును. కావున దీనిని గుఱించి ఆలోచింప వలసిన పనిలేదు. మంచివారైన శివుఁడు కుమారుఁడును, ప్రతికూలభావమును పొందుదు రనుట.

కం. తమ చేసిన దుష్కృతములు
తముఁ జెఱుచుం గాక వేఱ తడవం గలదే?
తమ చేసిన సుకృతంబులు
తముఁ గాచును రెండు నేల దైవంబునకున్?' 46

తా: తాము చేసిన పాపకర్మలు తమ్ము చెఱుచును, వేఱు విధముగా ఆలోచించుటకు ఏమున్నది? (పాపఫలము అనుభవింప వలసినదే కదా!) తాము చేసిన పుణ్యక్రియలు తమ్ము రక్షించును. (పుణ్య ఫలము వలన సుఖము కలుగును). సుఖ దుఃఖముల ప్రాప్తి విషయమున దైవమునకు ఏమియు పని లేదు. దైవము కారణము కాదనుట.

వ్యా. తమ చేసిన, తాము చేసిన కారక, ప్రౌఢ 15, 16 (చూడు పద్యము - 104)

గీ. అనుచుఁ గుంభాండుఁ ఢరిగె బాణాసురుండు
దనుజ సుందరీసహితుఁడై మనసులోనఁ
గెరలి యాడుచు మధుపానకేళిఁ దేలి
యాహవముఁ గోరుచుండె నయ్యవసరమున. 47

అర్థ: కెరలి+ఆడుచున్ = చెలరేఁగి విహరించుచు; ఆహవమును = యుద్ధమును.

తా: అని పలుకుచు కుంభాండుఁడు వెడలిపోయెను. అంత బాణాసురుఁడు, తనకు కూర్చు రక్కసి అందగత్తెలతో కూడి మనస్సులో ఉప్పొంగుచు, విహరించుచు, మధువును క్రోలి క్రీడించుచు తేలిపోవుచు, యుద్ధమునకు కుతూహలపడుచుండెను.

వ్యా. ఆ+అవసరంబున, సూ. సంధిలేని చోట యడాగము వచ్చును, సంధి, బాల - 3,

ఆ+యవసరంబున = అయ్యవసరంబున - త్రికసమాససంధి. (చూడు, పద్య -6)

## - : ఇందు ధరోపాఖ్యానము : -

మ. ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీ సరి
న్నికటానేక విహారదేశముల దైతేయేంద్రకన్యాప్సరో
నికురుంబంబులు పారిజాత కుసుమానీకంబు పైఁ జల్ల ద
ర్పకబాణంబుల కెల్ల నెల్ల యగు సౌభాగ్యంబుతో నాడఁగన్. 48

ప్రతి : ఒక నాఁడు; ఇందు ధరుండున్ = చంద్రుని ధరించిన వాఁడును, శివుఁడును; పార్వతియున్; లీలా+ఉద్యాన = విలాసము కొఱకైన పూఁదోటయందు; కేళీ పరిత్‌నికట = క్రీడించుటకైన నదికి సమీపమందు; అనేక విహారదేశములన్ = పెక్కు విహరించుటకు తగిన ప్రదేశములందు; దైతేయ+ఇంద్ర కన్యా+అప్సరస్+నికురుంబంబులు = రాక్షసరాజ కన్యలు, అచ్చరలయు సమూహములు; పారిజాత కుసుమ + అనీకంబు = పారిజాత పుష్పముల సమూహము; పైన్; చల్లన్ = చల్లఁగా; దర్పక = మన్మథు; బాణములకు+ఎల్లన్ = (అతని అయిదు)బాణములకు అన్నింటికిని; ఎల్ల+అగు = హద్దగు; సౌభాగ్యంబుతో = సౌందర్యాతిశయముతో ఆడఁగన్.

తా: ఒకనాఁడు శివపార్వతులు, క్రీడోద్యాన వవమునకు విహారమునకు వెడలిరి. అచ్చోట,క్రీడకై నదికి సమీపమందున్న పెక్కు విహార ప్రదేశములందు, రాక్షస కన్నియలు అచ్చరలు పారిజాతపుష్పముల మొత్తమును ఒకరిపై నొకరు చల్లుకొనుచు, మన్మథుని బాణములకు ఎల్లయైన సౌందర్య శృంగార సంపదతో ఆడుచుండఁగా (మీఁది గద్యముతో).

మన్మథుని బాణములు, వాని గుణములు :

1. అశోకము - ఉన్మాదనము, కూ డుడిగించును.

2. నవమల్లిక - తాపనము, వాడించును

3. చూతము (మామిడి) - శోషణము, వివర్ణతను చేయును.

4. అరవిందము (తమ్మి) - స్తంభనము, తలఁపుల్ జోడించును.

5. నీలోత్పలము (నల్లకలువ) - సమ్మోహనము, చంపఁజూచును.

ఛం. యతి మైత్రి - సరి న్ని కటానేక.... దై తే యేంద్ర.

మ. సరిత్+నికటలోని 'త' కారమునకును, 14వ, అక్షరమైన 'తే'కును యతి మైత్రి.

వ. అట్టియెడ. 49

తా : సులభము.

సీ. కిసలయంబులతోడఁ గెం గేలు దడఁ బెట్టి
విరులపై నఖకాంతి [1]విజ్జరాల్చి
లేఁదీగలకుఁ దనూలీలఁ గానుక యిచ్చి
గుత్తులుఁ బాలిండ్ల గొలిచి చూచి
చలిగాలి నిశ్వాససౌరభంబుల నాఁగి
యళిపఙ్క్తిఁ గురులతో నలుక దీర్చి
పుప్పొళ్ళు[2] నెలగందములు వియ్య మందించి
పూఁదేనెఁ జెమటల బుజ్జగించి
గీ. తొడలు నరఁటి కంబంబులు మెడలుఁ బోఁక
బోదెలు నెలుంగులును బరపుష్ట రుతులు
మాటలును గీరభాషలు మక్కళించి
చిగురుఁబోఁడులు వనకేళి చేయఁ జేయ. 50

ప్రతి: కిసలయంబులతోడన్ = లేఁత చిగుళ్ళతో; కెంపు+కేలు = కెంపు చాయగల అరచేయి; తడఁబెట్టి = అడ్డముగా (తాఋమాఋచేసి) పెట్టి; విరులపైన్ = పూవుల మీఁద; నఖకాంతి = గోరుల వెలుఁగును; విజ్జ రాల్చి = ప్రసరించునట్లు చల్లి (వ్యాపింపఁజేసి); లేఁత+తీఁగలకున్; తనూ లీలన్ = మేని విలాసమును; కానుక ఇచ్చి; గుత్తులున్ = పూల గుత్తులును; పాలిండ్లన్ = కొలిచి చూచి; చలిగాలిన్ = చల్లని గాలిని; నిశ్వాస సౌరభంబులన్

1. విజ్జు 2. నొసలిగంబురు

= నిట్టూర్పుల పరిమళముచే; ఆఁగి = ఆఁపి; అళిపంక్తిన్ = తుమ్మెదల వరుసను; కురులతోన్ = తలవెంట్రుకలతో అలుక తీర్చి = కోపమును పోఁగొట్టి; పుప్పొళ్లన్, ఎల గందములున్ = తేమ ఆరని పూసికొన్న (పచ్చి) గంధములును;(తడిలేని గంధమునకు వాసన చాల తక్కువగా నుండును); పూవు + తేనెన్ = పూవులలో కల తేనెను; చెమటలన్; బుజ్జగించి = ఓదార్చి, ఊరడించి; తొడలున్; అనఁటికంబంబులున్ = అరఁటి బోదెలును; మెడలున్; పోఁక బోదెలున్ = పోఁక చెట్ల లావైన మొదళ్ళను; ఎలుంగులును = గొంతునుండి వెలువడు ధ్వనులును; (కంఠస్వరములును); పరపుష్టరుతులున్ = కోకిలల కూఁతలును; మాటలున్; కీరభాషలున్ = చిలుకల పలుకులును; మక్కళించి = సరిచూచి; చిగురుఁ బోఁడులు = చివురులవంటి మేను కలవారు,(యువతులైన) అందగత్తెలు; వనకేళిన్ = ఆ పూఁదోటలో విహారమును; చేయన్ + చేయన్ = మఱిమఱి (ఎక్కువగా) చేయఁగా;

అలం : ఉపమ

| ఉపమేయములు | ఉపమానములు |
|---|---|
| (యువతుల అవయవములు) | (చెట్లభాగములు, పక్షులు) |
| 1 కెంపుచాయగల అరచేయి(కెంగేలు) | 1. లేఁత చిగుళ్లు |
| 2. గోరుల వెలుఁగు (నఖకాంతి) | 2. విరులు |
| 3. మేనివిలాసము(తనూలీల) | 3. లేఁత తీఁగలు |
| 4. పాలిండ్లు | 4. పూలగుత్తులు |
| 5. నిట్టూర్పుల పరిమళము(నిశ్శ్వాససౌరభము) | 5. చల్లని పిల్ల వాయువు |
| 6. తలవెంట్రుకలు (కురులు) | 6. తుమ్మెదల వరుసలు(అళిపంక్తి) |
| 7. చిఱుతడిగల గంధము(ఎలగందము) | 7. పుప్పొళ్లు |
| 8. చెమ్మట నీరు | 8. పూవు తేనె. |
| 9. తొడలు | 9. అరఁటి కంబములు |
| 10. మెడలు | 10. పోఁక బోదెలు |
| 11. కంఠస్వరములు(ఎలుంగులు) | 11. కోకిల కూఁతలు (పరపుష్టరుతులు) |
| 12. మాటలు | 12. చిలుకల పలుకులు (కీర భాషలు) |

వ్యా. .1. చిగురు బోఁడి : సూరిమతము. బహువ్రీహి సమాసము. పువ్వువంటి శరీరము గల స్త్రీ.

సూ. బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో ఉపమానంబు మీఁది మేనునకు 'బోఁడి' యగు సమాస, బాల - 23.

చిగురుఁబోఁడి : ప్రౌఢ వ్యాకర్తమతము, ఉపమానపూర్వపద కర్మధారయ సమాసము. పువ్వువలె మనోజ్ఞురాలైనది. సమాస, ప్రౌఢ - 19.

వివరణ : సూరి మతమున సమాసమున ఉత్తరభాగము 'బోఁడి' మేనునకు ఆదేశమైనది. ప్రౌఢ వ్యాకర్త మతమున ఉత్తరభాగము 'పోఁడి', నుగాగమముతో విధింపఁబడినది.

సూచన : బహువ్రీహిసమాసమందు, ఉత్తర భాగము, పోఁడి అనుట లెస్స.

2. కెంపు+కేలు > కెంగేలు, లేఁత+తీగ = లేఁదీఁగ, ప్రాతాది సమాస సంధి.

సూ. సమాసంబునం బ్రాతాదుల మీఁది తొలి యచ్చు మీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగానగు. లుప్తశేషంబునకు పరుషములు పరమగునపుడు నుగాగమంబగు. సంధి, బాల - 36, 37. ద్రుత కార్యములు సంధి, బాల - 16, 17.

3. పూవు+పొళ్లు > పుప్పొళ్లు. క్రొత్త శబ్దమునకు వలె ద్విత్వము. బహుళగ్రహణముచే అన్యకార్యము. తొలి దీర్ఘమునకు హ్రస్వము. సంధి, బాల, 36, 38 (చూడుపద్యము - 64)

పాఠాం : నొసటి గంబురు = నుదుటియందలి కర్పూరము

రూ. గంబురము, గంబురు, గంబుర, గంబూరా.

వ. వారిలో నొక్కర్తు. 51

తా : సులభము

మ. సహకారాధిపుఁ గౌఁగిలించుకొని వాసంతీలతాకాంత సా
రహరిద్రారసగౌర కేసరములన్ రంజిల్లు మాధ్వీక వా
ర్లహరీస్వేదము చూపఁ బట్టపగ లేలా *యింతటన్ సిగ్గులే
దహహా యంచుఁ దొలంగి నవ్వెఁ జెలిమాటై ముద్దరాలయ్యెడన్. 52

ప్రతి: పగలు+పగలు = పగటివేళయందే; వాసంతీ లతాకాంత = బండి గురివెంద, మాధవీలత అనెడి యువతి; సహకార+అధిపున్ = తీయ మామిడి చెట్టు+అను నాయకుని; కౌఁగిలించుకొని; సార = మేలైన; హరిద్రారస = పసుపుపచ్చ రసముచేతను; గౌర కేసరములన్ = ఎఱ్ఱని వర్ణములు కల, కింజల్కముల చేతను; రంజిల్లు = ప్రకాశించు; మాధ్వీక + వార్ లహరీ స్వేదమున్ = తేనె నీటి జల్లు అనెడి చెమటను; చూపన్; అహహా! ఇంతటన్ = ఇట్టి పనిచే;

* యింతలో

సిగ్గులేదు+ఏలా? = సిగ్గు పడుట లేదే ఎందులకో?; అంచున్ ఆ+ఎడన్ = అపుడు; ముద్ద +ఆలు = క్రొత్తదైన కన్య; తొలంగి; చెలిమాటు+ఐ = చెలికత్తె చాటున నుండి; నవ్వెన్.

తా: మాధవీలత అనెడి తీఁగ చెలువ,పగటి వేళయందే, తీయ మామిడి గున్న అనెడి ప్రియుని కౌగిలించుకొని, మేలైన పసుపు పచ్చని వర్ణము గల రసముచేతను, ఎఱ్ఱని వన్నెగల కింజల్కముల చేతను, ప్రకాశించు తేనె నీటి వెల్లువ అనెడి స్వేదమును, చూపఁగా ఆ సమయమున, ఒక క్రొత్త యౌవనవతి అల్పమైన తెలివి కలది, చక్కని ముగుద 'ఆహా ఇట్టి పని చేయుటకు సిగ్గు పడ దెందులకో' అని అప్పుడు దూరముగా తొలఁగి, ఒక చెలియలి మఱుగును చేరి, ముసిముసి నవ్వులను ప్రదర్శించెను.

విశే. మకరందమే (తేనె) స్వేదము. కేసరములే గగుర్పాటు. ప్రియుని స్పర్శచే మాధవీలతయందు గగుర్పాటు చెమట కలిగినవి. ఆ దృశ్యము చూచినవారికి లజ్జ పొడముట సహజము.

నానా : మాధ్వి = మకరందము, మద్యము.

అలం: రూపకము .

వ్యా. 1. పగలు+పగలు > పట్ట పగలు. "సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబుల కెల్ల అదంతంబైన ద్విరుక్త టకారంబగు. సంధి, బాల - 40.

2. ముద్ద+ఆలు = ముద్దరాలు. సూ. పేదాది శబ్దంబులకు ఆలు శబ్దము పరంబగునపుడు, కర్మధారయంబునందు 'రు'గాగమంబగు. సంధి, బాల - 30.

మ. ఒక రామాతిలకంబు రత్నరుచితో నొప్పారు మందార కో
రకముం గర్ణవతంసత న్నిలుపుచున్ రాఁగా లతాసక్త చూ
చుక చేలాంచలయై మలంగి విడుమంచుం గేలు [1]సాఁచెన్ ససా
యక మౌర్విం దెగగొన్న మన్మథుని ప్రత్యాలీఢ పాదంబు [2]నాన్. 53

ప్రతి: ఒక రామాతిలకంబు = ఒక ఇంతిమిన్న; రత్న రుచితోన్ = మణుల కాంతులతో; ఒప్పారు; మందార కోరకమున్ = మందారపు పూవు మొగ్గను; కర్ణవతంసతన్ = చెవిపూవుగా (అలంకారముగా); నిలుపుచున్ = పెట్టుకొనుచు; రాఁగాన్; లతాసక్త చూచుక చేల+అంచల+ఐ

1. సారించెసా 2. లన్; గాన్

= తీఁగకు తగుల్కొన్న చనుమొనల మీఁది = చీర కొంగు లేక అంచు కలదయి; మలంగి = మరలి; విడుము+అంచున్; ససాయక మౌర్విన్ = అమ్ముతో కూడిన అల్లెత్రాటితో; తెగ గొన్న = పూర్తిగా చెవి వఱకు లాగుచున్న; మన్మథుని యొక్క ప్రత్యాలీఢపాదంబునాన్ = ముందటికి చాఁచిన ఎడమ కాలో (కుడికాలు వెనుక భాగమున అమరి ఉండును); అనునట్లు; కేలు + చాఁచెన్ = చేతిని (ముందునకు) నిగిడ్చెను.

తా: ఒక ఇంతిమిన్న, రత్నకాంతి శోభతో వెలుఁగొందు ఎఱ్ఱని మందార పుష్పకలికను (మొగ్గను) చెవి పూవుగా ధరించి వచ్చు చుండఁగా ఆమె స్తనముల మీఁది కొంగుకొన తీఁగకు తగుల్కొన్నది. అప్పుడు ఆమె, వెనుతిరిగి 'విడిచి పెట్టుము' అని తన చేతిని ఒయ్యారముగా నిగిడ్చెను. ఆ చేయి, మదనుఁ డనెడి విలుకాఁడు ఎడమకాలు ముందుంచి కుడికాలు వెనుక అమర్చి నిలిచిన, వైఖరితో కన్పట్టెను.

అలం : ఉత్ప్రేక్ష. మందార కోరక మెఱ్ఱగా నుండును. కావున రత్న రుచితోనొప్పారు ననుట.

నానా: తిలకము = బొట్టు, శ్రేష్ఠము, బొట్టుగు చెట్టు.

రూ: వతంసము, అవతంసము.

(ఇట్లే అవధాన, వధాన)

చం. ఒక చపలాక్షి లేఁ జిగురుటూయెలఁ గోయిల రాచవారి ని
క్కకు నెలయింప వచ్చు కలకంఠికటాక్షము [1]తెక్క తారు స్రు
క్కక పలుమాఱుఁ జూపఁ జెలికత్తెలు [2]ముద్దన బావ పామ్మనన్
మొకము సగంబు వాంచె మణిముద్రికలం జెఱునవ్వు గప్పుచున్. 54

ప్రతి: లేఁత+చిగురు+ఊయెలన్ = లేఁత చిగుళ్ళ ఊయెల యందు (ఊఁగుచున్న చిగుళ్ల సముదాయమందు); కోయిల రాచవారిన్ = మగకోయిల రాజమును (ప్రభువును); ఇక్కకున్ = (తమ) గూఁటికి; ఎలయింపన్ = కొనిపోవుటకు; వచ్చు; కలకంఠి = ఆఁడు కోయిల యొక్క (స్పష్టముగాని తియ్యని స్వనము కలది); కటాక్షమున్ = కడగంటి చూపును; తెక్కతారు = తెక్కలను ఆడించు తీరు (శృంగారభావమును ప్రకటించు గమన విలాసము); స్రుక్కక = శ్రమపడక; ఒక చపలాక్షి = ఒక చలించు కన్నులు గల (రాక్షస) యువతి, పలుమాఱున్ = పెక్కు సార్లు; చూపన్; చెలికత్తెలు = (కూడనున్న) ఇతర చెలికత్తెలు; ముద్దుల బావ = (ఆ

1. తెక్కదారి 2. ముద్దుల పాప

మగకోయిల) నీకు "ముద్దులిచ్చు బావ; పొమ్ము = (నీవుకూడ) అచ్చటికి 'పో', (పాఠాం. ముద్దుల పాప = ఏమీ తెలియని చిన్న పసిదానివి); అనన్;(ఆ చపలాక్షి) మణి ముద్రికలన్ మణులతోనిండిన ఉంగరములతో (వాని కాంతిచే); చిఱునవ్వు కప్పుచున్; మొకము; సగంబు; వాంచెన్ = వంచెను.

తా: ఒక చలించు కనులు కలచెలి, (కర్త), లేఁత చివుళ్ల ఊయెల యందున్న మగ కోకిల రాజమును, తమ గూఁటికి తీసికొని పోవుటకు వచ్చునట్టి ఒక ఆడు కోయిల, (అవ్యక్త మధుర స్వనముతోను) కడగంటి చూపులతోను తెక్కలను ఆడించుచు శృంగార భావమును విలాసముగా కన్పట్ట చేయుచుండఁగా (చపలాక్షి - కర్త) ఆ దృశ్యమును శ్రమపడి, సందేహింపక తన సఖురాండ్రైన చెలికత్తెలకు పలుసార్లు చూపఁగా వారు "నీవు ముద్దు పెట్టు కొనఁదగిన బావ, పో" అని హేళన చేయఁగా, ఆ చపలాక్షి మణులు గల ఉంగరముల కాంతితో చిఱునవ్వును కప్పివేయుచు, తాను ఇంచుక సిగ్గు చెంది మొగము సగము వంచెను. ఆ చపలాక్షి తన మందహాసము కనబడకుండుటకై మణిముద్రికలతో కప్పుకొన్నది. కోయిలల శృంగార భావ విలసనమును, తన చెలులు చూడకుండునట్లును, తాను మాత్రమును ఆ పసందైన సరసతను చూచుటకై మొగమును సగము వంచి సంతసించినది.

అలం: స్వభావోక్తి. కోయిలల సరసత ఇంపుగా చిత్రితమైనది.

వ్యా. లేఁత + చిగురు లేఁజిగురు. ప్రాఁతాది సమాససంధి. (చూడు, పద్యము - 50)

2. చిగురు+ఊయెల, చిగురుటూయెల. సూ. కర్మధారయంబులందు ఉత్తునకు అచ్చు పరంబగు నపుడు టుగాగమంబగు. సంధి, బాల - 28.

రూపాం. కోయిల, కోవెల, కోకిల కోగెల.

చం. లలన లతావితానముల లత్తుక రేకుల చాయ చల్లు చే
తుల *సెలగొమ్మ లందికొనఁ దోరపునవ్వులు పిక్కటిల్ల నె
చ్చెలులు చెలంగి మావిరులు చెందొవలయ్యె ననం దడంబడం
దలిరులు గోయు రాచిలుకదాఁటులఁ దేఁటులు నాసచేయఁగన్. 55

ప్రతి: లలన (ఒక) యువతి; లతా వితానములన్ = తీఁగల సమూహములందు; లత్తుక రేకుల చాయ= లక్క వలె ఎఱ్ఱనైన పూవురేకుల కాంతిని; చల్లు చేతులన్; సెలగొమ్మలు = చిన్న

* నెలగొమ్మ

కొమ్మలను; రూపాం. ఎల గొమ్మలు = లేఁతకొమ్మలు; అందికొనన్; తోరము+నవ్వులు = పెద్ద నవ్వులు; పిక్కటిలన్ = అతిశయింపఁగా; నెఱ+చెలులు = చెలిమికత్తెలు; చెలంగి; మా విరులు = మామిడి పువ్వులు; చెన్ను +తొవలు = ఎఱ్ఱకలువలు;అయ్యెన్ + అనన్; రాచిలుక దాఁటులన్ = రాచ చిలుకల యొక్క దాఁటులచే (చివురులకొఱకు వచ్చిన చిలుకలు, మామిడి పువ్వులు, చెన్ను తొలఁగి ఎఱ్ఱ కలువలవలె నుండుటచే దుముకుచు పాఱి పోవుటచే;) తేఁటులున్ = తుమ్మెదలును; (భ్రమతో ఎఱ్ఱకలువలనియే) ఆస చేయఁగన్ = (అంతవఱకు దగ్గఱకు రాని తుమ్మెదలు వానినే) ఆశింపఁగా; తడంబడన్ = తొట్రుపాటు చెందుచు; తలిరులు కోయున్ = (పువ్వులనుకొని) చిగుళ్లనే కోసెను.

అర్థాంతరము : రాచిలుక దాఁటులన్ = రాచ చిలుకల సమూహముతో; తేఁటులున్ = తుమ్మెదలును; ఆసచేయఁగన్ = ఆశింపఁగా; చిలుకలు, లలన పెదవిని దొండపండని, తుమ్మెదలు ముఖమును కమలమని భ్రమించి ఆశించి చేరుచుండఁగా, ఆమె తొట్రుపాటుతో పూవు లనెడి భ్రమతో చిగుళ్ళనే కోసెను. (తొట్రుపాటునకు కారణము. చెలుల పలుకులు, చిలుకల తేఁటుల రాకయును)

తా: ఒక ఇంతి తీఁగెల మొత్తములందు లత్తుక వంటి ఎఱ్ఱని కాంతిని చల్లుచేతులతో చిన్న కొమ్మలను అందుకొనఁగా, ఆమె చెలిమి కత్తెలు పెద్దగా ధ్వని చేయుచు మామిడి పువ్వులు చెంగలువలు అయ్యెననిరి. అప్పుడు ఆమె చివురు లేవో, పూవులేవో తెలియక తడఁబాటుతో చివురులనే కోసెను. చివురుల కొఱకు వచ్చిన రాచ చిలుకలు పాఱి పోఁగా తుమ్మెదలు ఆ పూవులనే ఆశించెను.

అలం: భ్రాంతిమంతము. ఒక వస్తువును చూచి దానితో సమానమగు మఱియొక వస్తువని తలఁచుట. చివుళ్లు పూవులని తలఁచుట .

2. తద్గుణము. ఒక వస్తువు తన గుణమును వదలి వేఱొక దాని గుణమును పొందుట. లలన చేతి లత్తుక రంగుకాంతిచే తీఁగెల యందలి చివుర్లు ఎఱ్ఱవై కలువల రూపుగొన్నవి.

వ్యా. 1. నెఱ+చెలులు = నెచ్చెలులు. ప్రాఁతాది సమాసంధి. (చూడు, పద్య - 6)

2. చెన్ను+తొవలు = చెందొవలు, ప్రాఁతాది సమాససంధి,

సూ. సంధి, బాల - 36,37, 16, 17.

3. తోరము+నవ్వులు = తోరపునవ్వులు పుంప్వాదేశసంధి. (చూడు, పద్యము -20)

(ప్ర) ఛాయ (వి) చాయ.

సీ. సుడిగొన్న చిగురాకుజొంపంబు గెంపారు
తలమీఁద మల్లికాదామ మడఁచి
నిడుదతామరతూఁడు నెట్టెంబు సుట్టి పైఁ
బటికంపుఁ గడియంపు భాగ మదిమి
తోన యాక్రేవఁ జెందొవతేకు హత్తించి
మెడచక్కిఁ గస్తూరి [1]మెదిచి పూసి
పాయ గొమ్మల నల్లఁబట్టు దగిల్చి య
క్కొనయాకుపై వెండికోర వెట్టి

గీ. ధవళకేతకిధూళి గాత్రమునఁ [2]జెరివి
మోకమామిడి కొకకాంత మ్రొక్కినిలిచి
యొడలిలోఁ జక్కసగము నా కొసఁగు మనుడు
నద్రికన్యక తలవాంచె హరుఁడు నవ్వె. 56

ప్రతి : ఒక కాంత; సుడిగొన్న చిగురాకు జొంపంబు = పెనగొనిచుట్టుకొని ఉన్న చిగురుటాకుల గుబుర్లు అనెడి కెంపు+ఆరు = ఎఱ్ఱనైన; తలమీఁదన్ = (చెట్టు)పైభాగమందు; మల్లికాదామము = మల్లెపూల దండను అడఁచి = అలంకరించి (అమర్చి); నిడుద తామర తూఁడు = పొడవైన తామర కాడ;నెట్టెంబు = తలపాఁగగా; చుట్టి; పైన్ = మీఁద;పటికము + కడియము+భాగము = పటిక వన్నె కల (వలయమును) కడియమును; అదిమి = నొక్కి పట్టి; తోన్+అ (తోన) దానితో కూడ; ఆ క్రేవన్ = ఆప్రక్క; చెన్ను+తొవతేకున్ = ఎఱ్ఱకలువరేకును; హత్తించి = అమర్చి; మెడచక్కిన్ = మెడమీఁద; కస్తూరిన్; మెదిచి = మెత్తి; పూసి; పాయగొమ్మలన్ = విడివడిన (విశాలమైన)కొమ్మలయందు; నల్లఁబట్టు = నల్లని రంగుకల పట్టుబట్టను; తగిల్చి = తగిలించి; ఆ కొన ఆకుపైన్; వెండికోర = వెండి గిన్నెను; పెట్టి; ధవళ కేతకి ధూళిన్ = తెల్లని మొగలిపూల పుప్పొడిని; గాత్రమునన్ = శరీరమున; చెరివి = సవరించి (చల్లి) పొఠాం. చూచి; మోక మామిడికిన్ = గున్న మామిడికి; మ్రొక్కి; నిలిచి; ఒడలిలోన్; చక్కసగము =సరిగా సగభాగమును; నాకున్; ఒసఁగుము. అనుడున్ = అనినంతనే; అద్రి కన్యక = గిరి తనయ (పార్వతి); తలవాంచెన్ (సిగ్గుతో); హరుఁడు; నవ్వెన్.

తా: ఒక కాంత ఒక గున్న మామిడి చెట్టును శివుని రూప మొసఁగుటకు యత్నించి అలంకరించినది.శివుని జటాజూటము కెంపుచాయ కలిగి అందు గంగ తెల్లని చాలుండును.

1. మేది 2. జఱచి

కనుక ఎఱ్ఱనైన చిగుళ్ల గుబురుగల చెట్టు పై భాగమున తెల్లని మల్లెపూల దండను పెట్టెను.

శివుని జడయందు వాసుకి తలపాఁగా నుండును. పైన చంద్ర రేఖయుండును. కనుక తామర తూడును (పాఁగగాను) పటికపు కడియమును (చంద్రరేఖగాను) నొక్కి పెట్టెను. శివునకు నొసటి యందు అగ్ని నేత్రమునకై చెంగలువను, నల్లని మెడకై కస్తూరి పొడిని తీర్చెను.

శివుఁడు గజ చర్మధారి. కపాల ధారియును కాన, విశాలమైన కొమ్మలపై నల్లని పట్టు బట్టను, కొన ఆకులపై తెల్లని వెండి గిన్నెను అమర్చెను.

శివుఁడు బూడిదను ధరించును. కనుక చెట్టుపై మొగలిపూవుల పుప్పొడిని చల్లెను. ఇట్లు మామిడిగున్నకు శివుని ఆకారమును కల్గించి మ్రొక్కి తనకును శరీరములో అర్ధభాగమిమ్మని ఆ కాంత కోరెను. దీని నంతటను పార్వతీ పరమేశ్వరులు చూచిరి. పార్వతి సిగ్గుపడి తల వంచుకొనెను. శివునకు ఆమె చేష్ట నవ్వును తెప్పించినది.

విశే. శివుఁడు సులభుఁడు కాఁడు. కాన శివుని ప్రతిరూపమును మావిగున్నలో సృష్టించి ఆకాంత తన ఆకాంక్షను ప్రకటించినది.

ఇట్లు మామిడి చెట్టును శివుఁడుగా భావించుట నన్నె బోడుని కుమార సంభవమున కలదు.

ఆ.వె. శంభుమూర్తిఁదాల్చి సహకార భూరుహ
చక్రవర్తి నవ వసంతవేళ
నతిశయిల్లు చుండె నక్కడఁగని మది
నుదరిపడి మనోజుఁ డోసరింప (4 ఆ - 101 పద్య)

అలం: రూపకాతిశయోక్తి.

మామిడిగున్నకు శివునకు అభేదము. ఉపమానములకు ఉపమేయములకు తాద్రూప్యము. ఉపమానములు మాత్రమే చెప్పబడినవి. ఉపమేయములు (విషయము) దాఁచబడినవి. ఇట్లు ఉపమానములను (విషయి) ప్రయోగించుటచే ఉపమేయము ఉపమానమనియే దృఢనిశ్చయముతో వ్యవహరించుట అగుచున్నది. విషయ నిగరణముచే విషయి వాచక ప్రయోగమ్ము,అలంకారములో లోకస్థితిని అతిక్రమించిన వర్ణన ఉండుటచే రూపకాతిశయోక్తి అగును.

లక్షణము "రూపకాతిశయోక్తిః స్యాన్నిగీర్యాధ్యవసానతః" 'చన్ద్రా'.

వ. తదనంతరంబ. 57

తా : సులభము.

చం. నడపు తెఱంగు మాటజతనంబు నపాంగవిలాసమున్ ముసుం
గిడిన బెడంగు ముద్దుమొగ మించుక వంచిన సిగ్గుఁ బార్వతిం
దడఁబఱుపంగ నొప్పెసఁగె దర్పకవైరికి నాసపాటుగా
నడరుచుఁ జిత్రరేఖ యను నచ్చర నెచ్చెలు లిచ్చ మెచ్చఁగన్. 58

తా: చిత్రరేఖ అను పేరుగల అచ్చర లేమ, తన నడక తీరును, మాటల పొందికను కడకంటి చూపుల సొబగును. (అపాంగవిలాసమున్) పై ముసుఁగు వేసికొన్న అందమును, ముద్దారు మొగమును ఇంచుక వంచుకొని సిగ్గుతో పార్వతి తడఁబడునట్లు ఆమెను అనుకరించెను. మన్మథవైరి అగు శివుఁడే, పార్వతి అనియే, తలఁచి ఆశపడునట్లు చెలరేఁగుచు చెలికత్తెలు మనసార మెచ్చునట్లు మిక్కిలి ఒప్పెను.

అలం: 1. భ్రాంతి మంతము. శివుఁడు చిత్ర రేఖను ఆశించుటకు కారణము, ఆమె పార్వతి అనియే తలఁచుట.

2. కావ్యలింగము. చిత్రరేఖ గమనాదులు పార్వతి అను భ్రాంతికి హేతువులు, కావ్యలింగము.

లక్షణము 'సమర్థనీయ స్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్' 'చన్ద్రా'.

3. వృత్త్యనుప్రాసము 'అచ్చర నెచ్చెలు లిచ్చ మెచ్చఁగన్' - చకారద్వయము. ఆవృత్తమైనది.

వ్యా. అను+అచ్చర = అనునచ్చర. (చూ. పద్య - 6)

(వి) అచ్చర (ప్ర) అప్సరస.

కం. అద్దేవుండుం బైపడ
గద్దింపుగ శైలకన్య కను గీఁటంగా
బెద్దవడి నటించుచు న
మ్ముద్దియ చిఱునగవుతోడ మ్రొక్కుచు నిలిచెన్. 59

తా: చిత్రరేఖ సౌందర్య చేష్టకు మోహము చెంది ఆ దేవుఁడు (శివుఁడు) ఆవేశముతో కౌఁగిలించుకొనుటకు ఆమెపై పడఁగా "ఆ ఏమి ఈ చర్య" అని అదలించునట్లు, పర్వతపుత్రి (పార్వతి) కంటిసైగ చేయఁగా, ఆ ముద్దరాలు (చిత్రరేఖ) చాలసేపు పార్వతివలె నటించుచు (అభినయించుచు) చిఱునవ్వుతో ఇరువురకును మ్రొక్కుచు నిలిచెను.

చం. నిలిచిన చిత్రరేఖఁ గని నీలగళుండు మొగంబు వాంచినం
గలకల నవ్వె నంబిక వికాసముతోఁ జెలికత్తె లింక సి
గ్గులుదగ మాను మంచుఁ బయి కొంగెడలింప నపాంగరోచులం
గలఁపెఁ బురారి శైలసుతకన్నుల వెన్నెల గాయుమించులన్. 60

అర్థ : నీలగళుండు = నీలవర్ణముగల కంఠము కలవాఁడు, శివుఁడు; వికాసముతో = ప్రకాశముతో (శివుఁడు తన పొరబాటును తెలిసికొనెనని); నవ్వెన్ = నవ్వెను; సిగ్గులు = ప్రియుని ఎడ కనఁబడఁజేయు లజ్జతో కూడిన నటనలు; (సతీదేవి మరణింపఁగా, శివుఁడు తపశ్చర్యలో నుండెను. అపుడు పార్వతి శివుని కోరి అతని సేవించుచుండెను. అట్టి ముద్దరాలైన పార్వతిని చిత్రరేఖ అనుకరించుచు సిగ్గును ప్రకటించుచుండెను); అపాంగరోచులన్ = కడగంటి చూపుల కాంతులను; పురారి = త్రిపురములకు శత్రువు, శివుఁడు; శైలసుత = హిమవంతుని పుత్రి, పార్వతియొక్క; కన్నుల వెన్నెల కాయు మించులన్ = వెన్నెల ఇచ్చు వెలుఁగుతో; కలపెన్ = కలపెను.

"కలఁపెన్" ఇందు అర్ధానుస్వారముండుట దోషము. 'కలఁపు' ధాతువులేదు. కలుపు = కలియఁజేయు, ఈ పదములో అరసున్న కానరాదు. 'కలయు, కలియు అను రూపములున్నవి. "కలయు" - ప్రేరణార్థకము, 'కలపు' దీనికి చేర్చు, అని అర్థము.

తా: ఆ విధముగా తన ఎదుట నిలిచిన చిత్ర రేఖను చూచి, శివుఁడు తన భ్రాంతిని వీడి, సిగ్గుతో తలను వంచుకొనెను. పార్వతి శివుని పొరబాటు తొలఁగినదని ఎఱిఁగి ప్రసన్నురాలై నవ్వెను. "ఇంక నీ సిగ్గును చూపు నటనలు చాలింపుము" అని చెలికత్తెలు చిత్రరేఖ పై ముసుఁగును లాగి వేసిరి. శివుఁడు తన కడగంటి చూపు వెలుఁగును పార్వతి చల్లని కాంతులతో చేర్చెను.

వ. ఇవ్విధంబున. 61

తా : ఈ రీతిగా.

కం. సర్వర్తుక మగువనమున
సర్వజ్ఞుఁడు కేళి సలిపె సలిలక్రీడా
గర్వము మనమునఁ బొడమ న
పూర్వగతిం దఱిసె నేఱు పొలఁతులుఁ దానున్. 62

అర్థ : సర్వ +ఋతుకము = సర్వర్తుకము + అగు = వసంత ఋతువు మొదలుకొని ఆఱు ఋతుధర్మములను కలిగియున్న; సలిలక్రీడాగర్వము = జలక్రీడ యందుఁగల ఉత్సాహము; తఱిసెన్ = సమీపించెను.

తా: అన్ని ఋతుధర్మములును కన్పట్టు ఉద్యాన వన సీమలో సర్వమును ఎఱిఁగిన శంకరుఁడు విహరించెను. తర్వాత నీటిలో ఆటలాడ వలెనను కుతూహలము కలుగఁగా మునుపు ఎన్నడు లేని విధమున తాను (శివుఁడు) పార్వతియు, అచ్చర లేమలు అనువారితో కలిసి ఏటిని సమీపించెను.

వ్యా. 1. సర్వ+ఋతుకము, "అర్" ఏకాదేశము (గుణసంధి). సర్వర్తుకము.

2. 'తఱిసె' నేఱు పొలతులు దానున్.

తానును, పొలతులు - కర్త, క్రియ "తఱిసెన్" ఏకవచనములో నున్నది.

సూ. ఆత్మార్థం బభిహితంబగుచో తల్లింగసంఖ్యాభిధాయ వచనంబు, ధాతు విశేషణంబుల కగు. క్రియ, బాల - 120.

3. 'ఏఱు' అనుపదము ప్రథమాంతము. ద్వితీయార్థమునకు ఇచట ప్రథమ వచ్చినది. విభక్తి పరిణామము గ్రాహ్యము.

వ. అప్పుడు. 63

తా : సులభము.

చం. తరుణుల వీరమద్దియల తాఁకునఁ జిందఱవంద లైన క్రొ
న్నురుగులతోడ శైవలము నూలుకొనంగ నితంబపం క్తిపైఁ
బొరలుఁ దరంగ రాజి విరిపూవుల వీడినకుంతలంబులం
బరఁగు పదంబులం దెఱఁగి పైపడ నేర్పు విటాళికైవడిన్. 64

ప్రతి: తరుణుల = ఆయువతుల యొక్క; వీరమద్దియల తాకుఁనన్ = కాలిబొటన

వ్రేలియందు ధరించి యున్న శత్రువీరుల పేర్లు గల ఉంగరముల తాఁకుడుచే, చిందఱ వందఱ+ఐన = తునియలై, చెల్లాచెదరైన; క్రొత్త నురుగులతోన్; శైవలము = (నీటియందుఁగల) నాఁచు; నూలు కొనంగన్ = కూడు కొనఁగా; నితంబ పంక్తిపైన్ = కటి ప్రదేశముల వరుసపై; తరంగ రాజి = అలల వరుస; విరిపూవులన్ = వికసించిన పువ్వులను; వీడిన = విడిచిన; కుంతలంబులన్ = తల వెంట్రుకలతో; పరఁగు పదంబులందున్ + ఎఱఁగి = అందముగా ఒప్పు పాదములకు నమస్కరించి;పై పడన్ నేర్చు = ప్రార్థనకై కవియుటను అభ్యసించిన (నేర్పరులైన); విట+ఆళి =ప్రియుల వరుసలవలె; పొరలున్ = దొరలును.

తా: ఆ యువతుల కాలి బొటన వ్రేళ్లలో వారు అలంకరించుకొన్న వీరమద్దియ లున్నవి. (వారు వీరవనితలు) ఆ వీర మద్దియల తాఁకుడుచే వారి జల క్రీడాసమయమందు, తెల్లని నురుగులు ఏర్పడి చెల్లాచెదరై అవి నీటిపై గల నాఁచు మీఁద అచ్చుటచ్చుట గోచరించినవి. ఆ నురుగులు యువతుల కేశపాశములపై గల తెల్లని పూలవలెను, నాఁచు, యువతుల కేశపాశముల వలెను ఊహింపఁబడినవి. ఆ దృశ్యము పొల యలుకచే (ప్రణయ కలహముచే) యువతులు తల వెంట్రుకలను విడివడ చేసి, అందలి పూవులను విరజిమ్ముటకు ప్రయత్నించినట్లు కన్పట్టెను. ఆ తెల్లని నురుగతో కూడిన నల్లని నాఁచు, క్రీడించుచున్న యువతుల పాదముల వఱకు వ్యాపింపఁగా, అలల వరుసలు, వారి పిఱుదులపై పొరలు చుండెను. అవి ప్రియులు, తమ ప్రియురాండ్ర పాదములకు నమస్కరించి వారిని ఓదార్చుటకు నేర్పుతో కవియు విటజనము వలెనుండెను.

అలం: ఉత్ప్రేక్ష. క్రొన్నురుగులు విరిపూవులుగను, శైవలము కుంతలము గను, తరంగరాజి - విటాళిగను సంభావన.

వీరమద్దియలు ఎడమ కాలి బొటన వ్రేలికి ధరించు ఉంగరములు. ఓటమిపాలైన శత్రువీరుల పేర్లు అందు చెక్కఁబడియుండును. తమ వారి వీరత్వ చిహ్నముగా స్త్రీలు సైతము వానిని ధరింతురు.

రూ. వీర మద్దియలు, వీరమద్దెలు, వీరమధ్యములు, వీర ముద్దియలు, వీర ముద్దెలు, వీర ముద్రికలు.

ఉరము వఱకు వ్యాపించిన నీటిపై ఈఁదుచు పోవునపుడు కన్పట్టు దృశ్యముగా ఊహింపవచ్చును.

వ్యా. క్రొత్త+నురుగులు = క్రొన్నురుగులు. ప్రాఁతాది సమాస సంధి.

సూ. సమాసంబునం బ్రాతాదులతొలి యచ్చు మీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగానగు. సంధి, బాల - 36

సూ. క్రొత్త శబ్దమునకు ఆద్యక్షర శేషమునకు కొన్ని యెడల నుగాగమంబును కొన్ని యెడల మీఁదిహల్లునకు ద్విత్వంబునగు. సంధి, బాల - 38

చం. తలిరులఁ జోఁకెనో దొనలఁ దాఁకెనొ తొండపుఁ బిండుఁ బ్రాఁకెనో
పులినము లెక్కెనో కనకపుంగలశంబులు ద్రొక్కెనో మెఱుం
గులగమిఁ జిక్కెనో యనఁ దగుం దలఁపంగఁ దరంగ మాలికల్,
మెలఁతల యంగసంగతుల మీఁదికి మీఁదికి నాసచేయుచున్. 65

ప్రతి: తలంపఁగన్; తరంగ మాలికల్ = అలల వరుసలు; మెలఁతల = కాంతల యొక్క; అంగసంగతులన్ = ఆయా అవయవములను; కూడుటలో; మీఁదికిన్ మీఁదికిన్ = పైపైకి; ఆస చేయుచున్; తలిరులను = చివురులను అట్టి (పాదములను); చోఁకెనో = తాఁకెనో; దొనలన్ = అమ్ముల పొదులను (పిక్కలను);తాఁకెనొ; తొండము+పిండున్ = తొండముల సమూహమును (తొడలను); ప్రాఁకెనో = జరిగెనో; పులినములు = ఇసుక తిన్నెలు; (పిఱుదులను); కనకము+కలశంబులు (పాలిండ్లను); త్రొక్కెనో; మెఱుంగుల గమిన్ = కాంతుల మొత్తమునందు; (కన్నులకాంతులందు); చిక్కెనో = ఆసక్తి కొనెనో; అనన్+తగున్; అర్థాంతరము కన్నుల తళతళ మెఱుఁగులకు నిశ్చేష్టతను పొంది పైకి పోవలేక (చిక్కెన్) నిలిచిపోయెనో.

తా: ఆ ఏటి అలల వరుసలు, ఆయా అవయములను పొందుటకై పైపైకి పోవఁదొడగెను. చివురులను (పాదములను) అంపపొదులను (పిక్కలను) తొండముల మొత్తమును (తొడలను) ఇసుక తిన్నెలను (పిఱుఁదులను) బంగారు కుండలను (పాలిండ్లను); మెఱుఁగుల గమిని (కన్నుల కాంతులను) అలలు క్రమక్రమముగా చేరెను.

అలం: 1. రూపకాతిశయోక్తి : జడములు, సదృశావయవముల యెడ ఆసక్తిని ప్రదర్శించిన వనుటచే అతిశయోక్తి. వానికి అవయవములకు అభేదము చెప్పఁబడుటచే రూపకము. అలలకు విటులకు సామ్యము ధ్వనించుచున్నది. (చూడుము, పద్యము - 56)

2 ఫలోత్ప్రేక్ష : ఫలము కాని దానిని ఫలముగా ఊహించుటచే ఫలోత్ప్రేక్ష. అలలకు అంగముల స్పర్శ ఫలము గాదు.

3. సందేహము : క్రియా పదములు సందేహాత్మకముగా నుండుటచే సందేహాలంకారము.

వ్యా. 1. తొండము+పిండు = తొండపుఁబిండు,

2. కనకము+కలశంబులు = కనకపుం గలశంబులు, పుంప్వాదేశ నుగాగమ సంధులు.

ద్రుతకార్యములు (చూడు, పద్య - 20, 66).

జలక్రీడలో యువతులు నీటిలో దిగునట్టి క్రమము వర్ణింపఁబడినది. కన్నుల కాంతులను అతిక్రమింపలేక అలలు, చిక్కుకొన్నవనుటచే, కంఠము వఱకు నీటిలో మునిగిరనుట.

సీ. అరుణారవిందంబు లని మ్రొక్కెనో కాని
చిగురుటాకుల నింత సేర రావు
పులినంబు లని చాల బుజ్జగించెనొ కాని
మరుచక్రముల నింత మరిగి రావు
చక్రవాకము లని సవరించెనో కాని
కరికుంభముల నింత గదియ రావు
గండు మీ లని చాల గారవించెనొ కాని
పూవుఁ దూఁపుల నింత వొంది రావు

గీ. తరఁగ లాత్మీయ ధనముల దాయ లైన
చరణములు నితంబములును జన్నుఁగవలుఁ
గన్నుఁగవలుఁ దోతేర శృంగారజలధి
తరఁగ లింతులు పైకొన్నఁ దలఁకినట్లు. 66

ప్రతి: తరఁగలు = అలలు (గీతలో); ఆత్మీయధనముల = తమసొత్తులకు; దాయలైన = శత్రువులైన; చరణములు, నితంబములును, చన్నుఁగవలున్, కన్నుఁగవలున్; తోతేరన్ = తోడవచ్చుచుండఁగా; శృంగార జలధి తరఁగలు = శృంగార సముద్రమునకు అలలైన ఇంతులు; పైకొన్నన్ = తమపై పడుటచే; తలఁకినట్లు = భయపడినట్లు;

తరఁగలు (అలలు):ఆత్మీయధనములు (మిత్రములు)

1. అరవిందములు 2. పులినములు 3. చక్రవాకములు 4. గండుమీలు

| ఉపమేయములు | ఉపమానములు |
| --- | --- |
| 1. చరణములు | అరవిందములు (మిత్రములు) |
| | చిగురుటాకులు |
| 2. నితంబములు | పులినములు (మిత్రములు) |
| | మరుచక్రములు |
| 3. చన్నుఁగవలు | చక్రవాకములు (మిత్రములు) |
| | కరికుంభములు |
| 4. కన్నుఁగవలు | గండుమీలు (మిత్రములు) |
| | పూవుతూపులు |

**చరణములు:**

అరుణ+అరవిందములు+అని = ఎఱ్ఱతామర పూలని;మ్రొక్కెనో కాని = మ్రొక్కియుండును; చిగురు + ఆకులన్ +ఇంతన్ = చిగురాకులని (తలంచి ఉన్నచో) ఈ విధముగా (ఆసక్తితో); చేరన్‌రావు = దగ్గఱకు రావు.

యువతుల పాదములు ఎఱ్ఱదామరల వలెను. ఎఱ్ఱని లేఁత చిగుళ్ల వలె నుండును. అలలు (కర్త) ఆపాదములను లేఁత చిగుళ్లు అని తలంచినచో వానిని సమీపింపవు. అవి తమకు ఇష్టములైనవి కావు. మఱియును, పాదములని తలంచినను వాని కడకు పోవు. అవి, తమకు ఇష్టములైన కమలములకు శత్రువులు, కనుక, ఇంతులు తమపై పడినప్పుడు, భ్రాంతికి లోనై భయపడినను, అంతమున అవి మిత్రములని భావించి చేరెను. (ఇట్లే క్రమముగా నితంబములకును, చన్నుఁగవలకును, కన్నుఁగవలకును, అన్వయము).

**నితంబములు:**

పులినంబులు+అని = ఇసుక తిన్నెలు అని; చాలన్= మిక్కిలి; బుజ్జగించెనో కాని = లాలించి యుండును; మరుచక్రములన్ = మదనుని రథచక్రములు అని (తలంచినచో); ఇంత = ఇంతగా; మరిగిరావు = చనవుతో రావు.

**చన్నుఁగవలు**

చక్రవాకములు+అని = జక్కవ పక్షులని; సవరించెనో కాని = చేకొనియుండును (సేవించియుండును). కరికుంభములను = ఏనుఁగు పైఁదలలు (కపోలములు)అని (తలంచినచో); ఇంత; కదియన్‌రావు = సమీపింపవు.

**కన్నుఁగవలు:**

గండు మీలు +అని = పెద్ద చేఁపలు అని; చాలన్ = మిక్కిలి; గారవించెనొకాని = ఆదరించియుండును; పూవు + తూపులన్ = పూవులనెడి బాణములు; అని (తలంచినచో); ఇంత; పొంది రావు = చేరుటకు రావు.

తా: ఆ ఏటినీటిలోని అలలు తమవైన సొత్తులగు, అరవిందములు, పులినములు చక్రవాకములు గండుమీలకు క్రమమున శత్రువులగు (ఇంతుల) చరణములను, నితంబములను, చన్నుఁగవలను, కన్నుఁగవలను చేరవు. వానిని క్రమముగా చిగురుటాకులు, మరు చక్రములు కరికుంభములు, పూవు తూపులు అని తలంచినను, చేరుటకు పోవు.

అలం : 1. ఉపమ : చరణములకు అరుణారవిందబులతోను, చిగురుటాకులతోను నితంబములకు, పులినములతోను, మన్మథరథ చక్రములతోను స్తన ద్వయమునకు చక్రవాక ద్వయముతోను, ఏనుఁగు కపోలముతోను, కన్నుల జంటకు గండమీలతోను, పూవు తూఁపులతోను పోలిక.

2. యథా సంఖ్యము : ఎత్తుగీతిలోని ఉపమేయములకు, సీసపద్యపాదములోని ఉపమానములకు క్రమమైన అన్వయమున్నది.

3. భ్రాంతి మంతము : అలలు, ఆయా అవయములను అరవిందాదులుగా తలంచినవి.

4. హేతూత్ప్రేక్ష: నీటిలో దిగునపుడు నీరు శరీరావయములను అంటుట సహజము. దానికి కారణమేదియును లేదు. కాని కారణము లేకపోయినను, నీటి అలలు వానిని అంటుటకు కారణమును చెప్పుటచే, హేతూత్ప్రేక్ష అగును.

5. రూపకము : శృంగార జలధి.

వ్యా 1. చన్ను+కవ = చన్నుఁగవ

2.కన్ను +కవ = కన్నుఁగవ

సూ. సమాసంబులందు ఉదంత స్త్రీసమంబులకును, పుంపులకును, పరుష సరళంబులు పరంబులగునప్పుడు నుగాగమంబగు. సంధి, బాల - 25. ద్రుతకార్యములు, సంధి, బాల - 16, 17. షష్ఠీవిభక్తి ప్రత్యయలోపము. సూ. సమాస, బాల - 25 చే కలిగినది. 'చన్నుకన్ను' పదములలో నకార ద్విత్వ లోపము, సూ. ప్రకీర్ణ, బాల - 7 చే అగును. అగుచో చనుఁగవ, కనుఁగవ అను రూపములును సిద్ధించును.

3. చిగురు +ఆకు = చిగురుటాకు (చూడు. పద్య - 54)

చం. అలఁతి తరంగలుం దటులు, నంబురుహంబు మొగంబు, షట్పదం
బులు నలకంబులున్, సుడియుఁ బొక్కిలి, నెక్కుడు వేడ్క సే యఁగా

నెల(తుక సంగడి *గమలి నింగిని జుట్టెడు మిన్ను నీరిపైఁ
గొలిచి భవాని చేర్చెఁ జనుగుబ్బల జోడుగ జోడు జక్కవల్. 67

ప్రతి: అల(తి తరంగలున్ = చిన్న అలలును; తఱులున్ = పొట్ట మీ(ది ముడుతలును (వళులును); అంబురుహంబున్ = పద్మమును; మొగంబున్; షట్పదంబులున్ = తుమ్మెదలును; అలకంబులున్ = ముంగురులును; సుడియున్ (నీటిలోనిది); పొక్కిలిన్ = (పొక్కిలియును) బొడ్డును; ఎక్కుడువేడ్క+చేయ(గాన్ = (అలలు వళులవలె, కమలము ముఖమువలె, తుమ్మెదలు ముంగురులవలె నీటిసుడి బొడ్డువలె సమానములై, మిక్కిలి కుతూహలమును పుట్టింప(గా; నెలతుక సంగడిన్ = స్త్రీయొక్క స్నేహముచే; కమలిన్+కని = తామర తీ(గను చూచి; చుట్టెడు = చుట్టుచున్న; మిన్ను నీరుపైన్ = పైనుండు నీటి మీ(ద; కొలిచి; భవాని = పార్వతి; జోడు జక్కవల్ = జక్కవల జంటను; చనుగుబ్బల జోడుగన్ = కుంభముల వంటి స్తనములకు సాటిగా; చేర్చెన్.

తా: అలలు, కమలము, తుమ్మెదలు సుడియు, ఆయా అవయవములకు సాటియై మిక్కిలి కుతూహలమును కలిగింప(గా నలి(గిన తామర తీ(గను చూచి, చుట్టుచున్న పై నీటిని కొలిచి **పార్వతి** తన స్తనములకు సాటిగ రెండు జక్కవలను తన ఱొమ్మున చేర్చెను.

**చదలువాడ జయరామశాస్త్రి**

2. చిన్న అలలు, కడుపు మీ(ది ముడుతల వలెను, పద్మము ముఖమువలెను, తుమ్మెదలు ముంగురుల వలెను నీటి సుడి నాభివలెను ఉండి మిక్కిలి కుతూహలమును పుట్టింపగా **పార్వతి**, చెలి సమీపమున తామర తీ(గను చూచి నీటిపై కొలిచి తన చను(గొండలపై జక్కవల జంటను చేర్చెను.

**డాక్టరు జొన్నలగడ్డ మృత్యుంజయరావు.**

3. నెలతుక సంగడిన్ = ఆ తామర తీ(గ యందున్న స్త్రీత్వమందలి స్నేహముచే; కమలినిన్ = తామర తీ(గను; కని, చుట్టెడు నీరు మిన్నుపైన = చుట్టును (బాగుగా చలించుచున్న) పైనుండు నీటి మీ(ద; భవాని (తామర తీ(గ అనెడి యువతికి సరిపడు విధమున అమర్చు స్థానమును) కొలిచి; చను గుబ్బల జోడుగన్ = కుండలవంటి పాలిండ్ల జతగా; జోడు జక్కవల్ = చక్రవాకముల జంటను (కమలిని అనెడి యువతికి స్తనములు లేని లోపమును తొల(గించి కమలినిలో స్త్రీత్వమూర్తి నిండునట్లు); చేర్చెన్ = అమర్చెను.

---

* గమలినింగని చుట్టెడు నీరు మిన్నుపై.

భవాని, తామర తీఁగ అనెడి యువతికి జక్కవల జంటను, చేర్చెను.

వి.వి. సుబ్రహ్మణ్య శర్మ

వ్యా. పొక్కిలిన్ = పొక్కిలియున్, సూ. నామ సర్వనామంబులకును,కళలగు అవ్యయంబులకును కడపల సముచ్చ యార్థ విశేష పాదపూరణంబుల యందు 'ను' శబ్దంబు తఱచుఁగనగు. కళలగు అనుదంత శబ్దంబుల మీఁద అయ్యది యు వర్ణపూర్వకంబుగ విభాషనగు. మఱియు అది శేషషష్ఠియందు, 'యొక్క' లోపించునపుడు లాగమాంత బహువచనంబు మీఁదను సముచ్చయమునన్ చూపట్టెడిని. శబ్ద, ప్రౌఢ - 116. నామపదమునకు సముచ్చయార్థములో 'ను' వచ్చినది. వైకల్పికముగ "యు" పూర్వమందుండును. ఇచ్చట "యు" లోపించి, పొక్కిలిన్ సిద్ధించినది. ఇట్లే ముంగిలిన్ (పద్య -31)

చం. కరఁగిన పూఁతచేఁ గనకకందుక కాంతి వెలుంగుచన్నులం
*బిరిగొను దొడ్డముత్తియపుఁ బేరులు వాయఁగ మన్మథాంకముల్
దరుణుల నంబికావిభుఁడు దార్కొనుచోఁ గనుచాటు మాటుగాఁ
దరఁగలు చల్లు శీకరవితానము మానము గావ కుండునే? 68

ప్రతి: కరగిఁన పూఁతచేన్ = నిప్పులో కరఁగించి (బంగారు ద్రవమును) పూయుటచే నిగనిగలాడు; కనక కందుక కాంతిన్ = బంగారు బంతుల ప్రకాశముతో; వెలుంగు చన్నులన్; పిరిగొను = ఒక దానితో మఱొక వరుస, కలియుటచే పెనగొని; దొడ్డ ముత్తియము+పేరులు = పెద్ద ముత్యాల హారములు; పాయఁగన్ = తొలఁగి పోఁగా; మన్మథ+అంకముల్ = పాలిండ్ల పై గల గోటి నొక్కులు (శృంగార క్రీడలో కలిగిన గుర్తులు); అంబికాధవుఁడు శివుఁడు; తరుణుల న్ = యువతులను తార్కొనుచోన్ = సమీపించునపుడు; కనుచాటు మాటు గాన్ = కనఁబడకుండునట్లు; తరఁగలు = అలలు; చల్లు; శీకర వితానము = నీటి తుంపురుల మొత్తము; మానము కావక + ఉండునే = మర్యాదను (సిగ్గును) కాపాడకుండునా?

తా: కరఁగించిన బంగారు పూఁత గల బంగారు బంతుల కాంతులతో సమానముగా ప్రకాశించు స్తనములపై గల పెద్ద ముత్యాల హారములు పెనగొని జలక్రీడలోని వేగిరపాటుచే తొలఁగినవి. అపుడు, వానిపైగల గోటి నొక్కులు (కామక్రీడలో కలిగినవి) యువతులను సమీపించు పరపురుషుఁడగు పార్వతీ పతి శివునికి కనఁబడకుండుటకై

* బెరిఁగిన; బిగిగొను

అలలు చల్లెడు నీటి బిందువుల సమూహము వారి మానమును (లజ్జను లేదా మర్యాదను) తప్పక రక్షించును.

అర్థాంతరము : కరఁగిన పూఁతచేన్ = కరఁగిపోయిన పూఁతచేత (స్తనములపై పూసికొన్న పరిమళ ద్రవ్యపు పూఁతచే.

అలం : ఉపమ,

వ్యా. ముత్తియము+పేరులు = ముత్తియపుఁబేరులు. పుంప్వాదేశ నుగాగమ సమాససంధి.

సంధి, బాల - 32, 25. ద్రుతకార్యములు సంధి, బాల - 16, 17 (చూడుము, పద్యము - 20, 65)

చం. తరళతరంగ మాలికల తాఁకున కొగ్గికొనంగఁ గామినీ
కరములు దాఁకి శీకర నికాయము దత్కుచకుంభరాజిపైఁ
బరఁగినఁ దోఁచె భావభవుఁ బట్టము గట్టునెడం బ్రవాళ భా
సురముఖపూర్ణకుంభ శుభసూచక నిర్మలమౌక్తికాక్షతల్. 69

ప్రతి: తరళ తరంగ మాలికల తాఁకునకున్ = చలించు అలల వరుసల తాఁకిడిని; ఒగ్గికొనంగన్ = అడ్డగించుటకు; కామినీ కరములు = ఆ కాంతల చేతులను; తాఁకి; శీకర నికాయము = నీటి తుంపురుల మొత్తము; తద్+కుచకుంభ రాజిపైన్ = వారి కడవల వంటి (గుండ్రని)స్తనముల వరుస మీఁద; పరఁ గినన్ = పడఁగా; భావభవున్ = మనసులో జనించినవాడు, మన్మథుని, (మన్మథునకు) పట్టము కట్టు+ఎడన్ = పట్టాభిషేకము చేయునపుడు; ప్రవాళ = చివురులతో; భాసుర = ప్రకాశించు ముఖ = ముఖములతో (పై భాగములలో); పూర్ణకుంభ = నీటితో నిండిన కడవల యొక్క; శుభ సూచక = మేలు సూచించునట్టి; నిర్మల = స్వచ్ఛములైన; మౌక్తిక + అక్షతల్ = ముత్తియములు అనెడి అక్షతలయి; తోఁచెన్ = కన్పట్టెను.

తా: జలక్రీడా సమయమున, చలించు అలలు లలనల మేనులను గట్టిగా తాఁకుచుండెను. వానిని అడ్డగించుటకు ఆ కామినులు తమ కరములను అడ్డుపెట్టుకొనుచుండిరి. అపుడు చేతులను తాఁకిన అలలు నీటి తుంపురుల మొత్తమై యువతుల కడవల వంటి కుచములపై నెలకొన్నవి. ఆ నీటిబిందువులు కామ భోగసామ్రాజ్యమునకు చక్రవర్తిగా మన్మథునకు పట్టాభిషేకము చేయు శుభ ముహూర్తమందు, చివురులతో అలంకరింపఁబడి ప్రకాశించు ముఖములు గల నీటితో

నిండిన కడవలపై ఉంచిన మంగళ సూచకములైన, తెల్లని ముత్తెములనెడి అక్షతలవలె కన్పట్టెను.

అలం : 1.రూపకము కుచములు - కుంభములతోను, కరములు - ప్రవాళములతోను, శీకరనికాయము - నిర్మల మౌక్తికాక్షతలతోను, పోలిక అభేదముగా చెప్పఁబడినది.

2. ఉత్ప్రేక్ష. మన్మథుని పట్టాభిషేక సమయమందు జలపూర్ణ కుంభముల గుండ్రని ముఖములపై చుట్టును చివురులను ఉంచుటయు, వానిపై ముత్యాలను అక్షతలుగా ఇముడ్చుటయు ఆచారము.

కం. కరసరసిరుహంబున నొక
సరసిరుహం బమర వదన సరసీరుహమున్
బరిమళవశమున మోపుచు
ధరణీధరతనయ దొంతితామరఁ జూపెన్. 70

అర్థ : ధరణీధరతనయ = పర్వత రాజపుత్రి, పార్వతి; కర సరసి రుహంబునన్ = చేయి అనెడి కమలమందు; పరిమళవశమునన్ = వాసన చూచుటకు; వదన సరసీ రుహమున్ = ముఖమనెడి కమలమును; దొంతి తామరన్ = ఒక దానిపై నొక తామర గల వరుసను.

తా: పార్వతి జలక్రీడా సమయమున ఒక పద్మమును కోసి ముఖము దగ్గఱ పెట్టుకొని దానిని వాసన చూచెను. అపుడు మూడు పద్మములు వరుసగా నొకదానిపై నొకటిఉన్నట్లు (దొంతి తామరను) పార్వతి చూపెను. చేయి, పద్మము, ముఖము, మూడు పద్మములు వరుసగా కన్పట్టుటచే పార్వతియే మూడు పద్మములను చూపెనని ఊహ.

అలం : ఉపమాలంకార ధ్వని.

వ్యా. సరసి రుహము (అలుక్సమాసము). రూపాం.సరసీరుహము

వ్యు. సరసిరుహము. సరస్సునందు మొలిచినది, పద్మము.

ఉ. చెందొవరేకు ఫాలమునఁ జేర్చి ప్రఫుల్లపయోరుహంబుచే
నందముగా బిసావళి భుజాంతరముం గదియించి యుత్పలా
మంద మరీచి మేచకచమత్కృతి చారుగళోపచార యై
సుందరియోర్తు వచ్చి హరుచూపులకున్ హరుఁ డయ్యె నయ్యెడన్. 71

ప్రతి: చెన్ను+తొవ = చెందొవ = ఎఱ్ఱకలువ; రేకు; ఫాలమునన్ = నుదుట; చేర్చి; ప్రఫుల్ల పయస్ + రుహంబుచేన్ = వికసించిన తెల్లదామరచే; అందముగాన్; బిస+ఆవలి = తామరకాఁడల మొత్తమును; భుజ(భుజా) + అంతరమునన్ = బాహువుల మధ్య (జొమ్మన మాలగా); కదియించి = అమర్చి (చేర్చి); ఉత్పల + అమంద = నల్ల కలువ యొక్క ఎక్కువైన; మరీచి = కాంతుల; మేచక చమత్కృతి = నల్లని మెఱుపులచే; చారు = సుందరమైన; గళ+ఉపచారయై = మెడకు అలంకారముగా కలదై (సత్కారమును పొందినదై); ఓర్తు = ఒకతె; వచ్చి హరు చూపులకున్; ఆ+ఎడన్; హరుఁడు + అయ్యెన్.

తా: ఒక సుందరి తన నొసట ఎఱ్ఱకలువ రేకును తెల్ల దామర కాఁడలను జొమ్మన, మెడచుట్టు నల్ల కలువ పూలను (దండను), ధరించి శివుని చూపులకు శివుఁడుగా కన్పట్టెను.

అలం: 1. భ్రాంతిమంతము. శివుఁడు ఫాలమున అగ్నినేత్రము కలవాడు. ఉరమున సర్పహారములు కలవాఁడు. కంఠమున గరళము కలవాఁడు. వానితో సాటియైన చెంగలువ రేకు, తెల్ల దామరకాఁడలు, కలువ పూలదండ, ధరించుటచే, ఒక సుందరి హరుఁడయ్యెను.

2. రూపకము, శివునితో అభేదమును చెప్పుట.

వ్యా. చెందొవ. చూడుము పద్య - 55.

వ. మఱియునుం గొందఱు దెఱవలు పలుదెఱంగులం గఱకంఠుకైవడి విడంబించు నెడ మృడాని ముఖవికాసంబు విలాసంబునకు విలాసం బొసంగ నెసంగిన యాసపాటుచే నాసన్న స మాసీన యై బాణాసురకన్య యగు నుషాకాంత యిట్లని వితర్కించు. 72

అర్థ: తెఱవలు = యువతులు; కఱకంఠుకైవడిన్ = శివుని వలె; మృడాని = మృడుని భార్య, పార్వతి; ముఖ వికాసంబు విలాసంబునకు; విలాసంబు+ఒసఁగన్ = ముఖముయొక్క ప్రసన్నతకు గల శోభకు, ప్రకాశము (కాంతి) చేకూర్పఁగా; ఎసంగిన ఆసపాటుచేన్ = అతిశయించిన కోరికతో; ఆసన్న సమాసీన+ఐ = దగ్గఱ కూర్చున్నదై; బాణాసుర కన్య బాణుని కూతురు, ఉష; ఇట్లు+ అని = ఈ రీతిగా; వితర్కించున్ = ఆలోచించును.

తా: ఇంకను కొందఱు యువతులు శివుని అనుకరించిరి. పార్వతి వారిని చూచి ప్రసన్నురాలైన ముఖ శోభతో సంతసించెను. అపుడు బాణుని తనయ ఉష, సమీపమున కూర్చుండి తనలో కోరిక అతిశయింపగా ఇట్లు ఆలోచించెను.

వ్యా. కఱకంఠుఁడు. అనింద్య గ్రామ్యమని చిన్నయసూరి. బహువ్రీహి సమాసములో రెండును స్త్రీసమములుండవలెను. "కంఠ" ఆచ్ఛిక శబ్దముకాదు. కనుక లక్షణ విరుద్ధమైన ప్రయోగము. సంజ్ఞ, బాల - 23.

ఇది గరకంఠ శబ్దము నుండి పుట్టినదని ప్రౌఢవ్యాకర్త. సమాస, ప్రౌఢ - 27. తద్భవములో 'ఠ' వర్ణముండదు. అయినను తద్భవమనిరి.

సీ. సల్లాప నవసుధాసారంబు చెవిఁ గ్రోల్వఁ
జెలికత్తెఁ బుచ్చి మెచ్చించు వారు
నానందమకరంద [1]మందంద పైఁ జిందఁ
గడకంటి చూపులఁ గప్పువారు
ఘర్మాంబు బిందుముక్తా [2]విభూషణము లు
ప్పతిలంగఁ జేసేతఁ బట్టు వారు
మఱపు మున్నీటిలో[3] మానంబు లూటాడ
బిగియారు కౌఁగిట బెరయు వారుఁ

గీ. బొలయలుకఁ బాసి తెలచినఁ బొందు వారుఁ
జతురతర విహారంబులు సలుపు వారుఁ
బ్రథమజన్మంబునం దెంతభాగ్యవతులొ
మగలు మన్నింపఁ బెంపారు మానవతులు.' 73

అర్థ: సల్లాప నవ సుధాసారంబు = సరసపు మాటలనెడి క్రొత్త అమృత ధారను; చెలిన్ = చెలిచే క్రోల్వన్ = త్రావించుటకు; పుచ్చి = పంపి; ఆనందమకరందము = మనసులోని సుఖపారవశ్యమను పూఁదేనె, అందంద = మఱి మఱి మిక్కిలి; పైన్ ఒందన్ = మీఁద ప్రసరింపఁగా; కప్పువారు = దాఁచువారు; ఘర్మ + అంబు బిందు = చెమట నీటి బొట్టులు అనెడి; ముక్తావిభూషణములు = ముత్తెముల నగలు; ఉప్పతిలంగన్ = కలుగఁగా: చేతన్+చేతన్ = చేసేతన్, వెంటనే; పట్టువారు = దానిని పట్టి తుడుచుకొను వారును; మఱపుమున్నీటిలో = మై మఱపు అనెడి సముద్రములో; మానంబులు+ఊటాడన్ = ప్రియులకు లొంగక కోపములు చలింపగా (తొలఁగఁగా); పాఠాం. మానసంబులు తేలన్ = మనసులు ఊఱట చెందఁగా (తేలియాడఁగా); బెరయు వారున్ = కలియువారును; తెలచినన్ = ప్రియులు మ్రొక్కగా; పొందువారును = కూడువారు.

1. మడరిపైఁ జిమ్మంగ 2. భూషణము లుప్పతిలంగఁజేసేతఁ జల్లువారు 3. మానసంబులు దేల.

రూ. తెలచు, తెలుచు.

తా: తమ సరసమైన మాటలనెడి క్రొత్త అమృత సారమును ప్రియుల చెవులచే త్రావింపఁజేయుటకు చెలికత్తెలను పంపి, వారిని సంతోషింపఁజేయువారును, మనసులో సుఖముచే పరవశత్వము ఉప్పొంగగా, దానిని ఇతరులు చూడకుండుటకై కడగంటి చూపులతో దాఁచువారును, చెమ్మట నీటి బిందువులు (గగుర్పాటుచే) అనెడి నగలు మేనియందు కలుగఁగా దానిని సంతసముతో తుడుచుకొనుచు ప్రవర్తించువారును, మైమఱపు అనెడి సముద్రములో (అనుభూతిలో) మనస్సులలో ప్రణయకోపము తొలఁగి మెత్తఁబడి ప్రియుల బిగి కౌగిళ్లలో మసలు వారును, ప్రణయకలహములను విడిచి, తమకు మ్రొక్కిన ప్రియులను క్రీడలో కలియువారును, నేర్పుతో విహరించువారును, ఇష్టులైన మగలు, లాలించు చుండఁగా, వికాసముతో ప్రవర్తించు అభిమానవతులు, పూర్వజన్మంబులందు, ఎంత పుణ్యమును చేసికొన్నారో కదా!

అలం: 1. రూపకము. సల్లాప నవ సుధాసారంబు, ఆనంద మకరందము, ఘర్మాంబు బిందు ముక్తా భూషణములు, మఱపు మున్నీరు.

2. కావ్యలింగము. ప్రథమ జన్మంబునందెంత.................. మానవతులు, ఇంతటి ప్రియుల పొందిక కలుగుటకు తొలిపుట్టువునందు పుణ్యము చేయుట కారణమనుట.

వ. అని విచారించి చెలికత్తెలతోఁ దనతలంపు వెడల నాడుట యును. 74

తా: అని తలఁచి, సఖులతో తన తలఁపును ప్రకటింపఁగా (తరువాతి పద్యముతో).

చం. విని చలిగొండచూలు గడు వేడుక చూపుల గారవించి య
ద్దనుజ తనూజతో 'నభిమతం బొడగూడెడు నింత వంతకుం
బని గలదే మనోభవుని పట్టము గట్టికొనంగఁ జాలు జా
ణని మగనిం గవుంగిట ననారతముం గొనియాడెదో చెలీ'. 75

అర్థ : చలిగొండచూలి = హిమగిరిపుత్రి; అభిమతంబు = ఇష్టము, కోరిక; వంత = వగపు; మనో భవుని పట్టము కట్టి కొనంగన్=మన్మథ సామ్రాజ్యమునకు పట్టాభిషేకమును పొందుటకు; చాలు = తగిన; జాణనిన్ = రసికుడైన నేర్పరిని; అనారతమున్ = ఎల్లప్పుడు.

తా: ఉష మాటలను విని హిమవంతుని పుత్రి, మిక్కిలి ఉత్సాహముతోడి,

చూపులతో ప్రీతితో చూచి, ఆమెతో 'ఓ చెలీ! నీ కోరిక నెఱవేఱును. ఇంతగా వగవ పనిలేదు. మన్మథ సామ్రాజ్యమునకు పట్టము కట్టు కొనుటకు చాలిన రసికుఁడైన నేర్పరిని భర్తగా నీవు నీ కౌఁగిటిలో చేర్చుకొని సేవింతువు.'

వ్యా. కొని యాడెదవు > వకారలోప సంధి. కొనియాడెదు+ఉ = కొనియాడెదు.

అపదాది స్వర సంధి సంధి, బాల - 11 (చూడు, పద్య - 21)

నానా. కొనియాడు = నుతించు, ఆదరించు, కాపాడు, సేవించు.

ఉ. నావుడు నాసరోజముఖి నమ్మికతోడ భవాని కిట్లనున్
'దేవి మదీయవాంఛితము తెల్లముగా నొడఁగూడు నంటి నా
కావిధ మెన్నఁ డబ్బునొ దయామతి నానతి యి'మ్మనంగ 'నౌ
రా! వలరాచ వేగిరము రామకు' నంచుఁ జెలంగి నవ్వుచున్. 76

అర్థ: మదీయ వాంఛితము = నా కోరిక; అబ్బునొ = కలుగునొ; రామకున్ = చెలువకు; వలరాచ వేగిరము = కాముని వేగిరపాటు.

తా: అన్నంతనే పద్మముఖి ఉష నమ్మికతో భవానికి ఇట్లనెను "దేవీ! నా కోరిక తప్పక ఫలించు నంటివి. ఆవిధమెట్లో దయగల మనస్సుతో సెలవిమ్ము" అనఁగా "ఔరా! ఈ చెలువను ఇంతగా కాముఁడు త్వరపెట్టు చున్నాఁడే" అని నవ్వుచు (తరువాతి వచనముతో).

వ్యా. అంటివి > అంటి వకారలోప సంధి (క్రియ, బాల - 58, 59. పద్య - 21).

వ. అద్దేవి యిట్లనియె. 77

తా : సులభము

గీ. 'కడఁగి వైశాఖ శుక్లపక్షంబునందు
ద్వాదశి దినాంతవేళ సౌధంబు మీఁద
మదనకేళికిఁ గలలోనఁ గదియు నిన్ను
నెవ్వఁ డాతండ మగఁడు నీ కిందువదన.' 78

తా: 'చంద్రముఖీ! వైశాఖ శుద్ధ ద్వాదశి నాఁటి వేకువ జామున నీ మేడమీఁద ఏ పురుషుఁడు కామక్రీడకు నిన్ను సమీపించునో ఆతఁడే నీకు మగఁడు.'

కం. అన విని మనమునఁ బెనఁగొను
మనోరథము చేరినట్ల మానిని దొలఁగం
జని సంతసిల్లె దేవియుఁ
బినాకియును జెలులు నిష్టభృత్యులుఁ గొలువన్. 79

తా: అని హిమగిరిపుత్రి పలుకఁగా విని మనసున అతిశయించు అభిమతము సమకూరినట్లు తలంచి, మానవతి ఉష వెడలిపోయి సంతసముతో నుండెను. అనంతరము, పార్వతీ పరమేశ్వరులు ఇష్టులైన సేవక జనము సేవింపఁగా (మీఁది పద్యముతో).

కం. వనకేళిని జలకేళిని
వినోదములఁ దేలి తనిసి వీణా వేణు
ధ్వనులును గాయక పాఠక
నినాదములు వినుచుఁ దూర్య నిస్వనములతోన్. 80

తా: ఉద్యాన వన విహారమునందును జలక్రీడయందును, వినోదములలో పాల్గొని పరవశించి తృప్తిచెంది వీణెల పాటలు పిల్లనగ్రోవుల గానములు, సంగీత పాఠకుల గీతములు, స్తుతి పాఠకుల స్తుతులు, వివిధ వాద్యముల నినాదములతో, వినుచు (మీఁది వచనము).

వ. పురంబునకు మరల నానతి యిచ్చె నిత్తెఱంగున. 81

తా: పురమునకు మరలిపోవుటకు ఆనతిచ్చెను. ఈ విధమున.

కం. దివసావసానమున భవ
భవానులుం జెలులుఁ దురగ భద్రేభ రథా
ది వివిధయానము లమరం
దివిఁ గొందఱు నరుగ నరుగుదెంచిరి పురికిన్. 82

తా: సాయం సమయమున ఈశ్వరుఁడు ఈశ్వరియును తమ వెంటనున్న చెలువలును, గుఱ్ఱము, ఏనుఁగు (భద్ర+ఇభ) తేరు మొదలగు వేర్వేఱు తమ తమ యానములు అమరగా వానినెక్కి కొందఱు స్వర్గమునకు వెడలఁగా ఇతరులు శోణిత పురమునకు వచ్చిరి.

వ. వచ్చిన కతిపయదినాంతరంబున. 83

తా: నగరమును చేరిన కొన్ని దినముల పిమ్మట.

## - : ఉషా కన్య స్వప్నముం గని పరితపించుట : -

శా. ఆదైతేయతనూజ నింగి వ [1]డు నాహర్మ్యంబుపై నొక్కనాఁ
డేదిక్కుం జెలిపిండు మెండుకొనఁగా నేకాంత నిద్రారతిన్
మోదింపం గలలోఁ గుమారుఁ డొకఁడేమో చేసినం దాల్మి పెం
పేదన్ దిగ్గన మేలుకాంచి నయ నోదీ ర్ణాశ్రుసిక్తాస్యయై. 84

అర్థ : నింగిపడు = ఆకాశముపై పడు (అంటు); ఏ దిక్కున్ = అన్ని దిశలయందును; చెలిపిండు = చెలుల మొత్తము; మెండు కొనఁగాన్ = పెక్కంద్రు చేరి యుండఁగా; ఏకాంత నిద్రారతిన్ = తానొక్కతయే పాన్పుపై పవళించి యుండి నిద్రించిన సుఖముచే; మోదింపన్ = సంతోషించుచుండఁగా; ఏమో = ఇట్టి దని తెలియరాని కౌఁగిలింత ముద్దిడుట మొదలగు పనులు; తాల్మి పెంపు = ఎక్కువ ఓరిమి; ఏదన్ = తొలఁగఁగా; దిగ్గనన్ = వెంటనే; నయన+ఉదీర్ణ అశ్రుసిక్త + ఆస్య+ఐ =కన్నుల నుండి ఎక్కువగా వెల్వడిన కన్నీటిచే తడిసిన ముఖము కలదై.

తా: ఒకనాఁడు ఉష, చాల ఎత్తైన మేడపై చెలికత్తెలందఱు తన్ను చేరియుండఁగా ఒంటరిగా తన పాన్పుపై పరుండి యుండి నిద్రయందు సుఖమును పొంది యున్నపుడు కలలో నొక యువకుఁడు, తన్ను కదిసి చెప్పరాని పనులను చేసెను. ఆమెకు అందువలన ఓర్పు నశించుటచే వెంటనే మేల్కొని కన్నుల నీరు కాఱు చుండఁగా ముఖ మంతయు తడిసినది.

కం. ఎలుఁగెత్తి యేడ్చుఁ దనకుం
దొలు సమ [2]రత నిక్కమైన [3]దురపిల్లుఁ గటా
కుల మిటు దూషిత మగునే
చెలులు నగం దన గుణంబుచే నని వగచున్. 85

అర్థ : ఎలుఁగు+ఎత్తి = గొంతెత్తి; సమరత = మగవానితో కూటమి; దురపిల్లున్ = చింతించును. దూషితము = నిందింప బడినది.

---

1.డఁగా 2. రతి 3. దురుపిల్లు

తా: గొంతెత్తి ఏడ్చును. మగవానితో కూటమి నిజమే అయినదేమో అని, దానిచే తనకన్యాత్వము చెడినదై చెలులు హేళన చేయఁగా, కులమునకు (తల్లి దండ్రులకు ఎల్లరకు) చెడ్డ పేరు వచ్చునేమో అని వగచెను.

వ. అట్టియెడం జిత్రరేఖ యను చెలికత్తె పొడచూపి యుషా కన్యక చేతం
దద్భీతికారణం బెఱింగి యల్లన బుజ్జగించి యక్కాంతతో నిట్లనియె. 86

తా : ఆ సమయమందు, చిత్ర రేఖ అను చెలికత్తె వచ్చి, ఉష వలన ఆమెయొక్క భయమునకు కారణమును ఎఱిఁగి మెల్లగా ఓదార్చి ఆమెతో ఇట్లనెను.

చం. నలినదళాక్షి! నీవు బలినందనుకూఁతుర విట్టినిన్ను మొ
క్కలమున నొక్కరుండు దనకౌఁగిటఁ జేర్చునె యిట్లు కన్ను నీ
రొలుకఁగ వెట్టివే? వెఱవ *కోడక నొంపఁగ వానికెన్ దలల్
గలవు? విచారహీన వయి కంపము నొందకువే తలోదరీ. 87

అర్థ : నలిన దళ+అక్షి = తామర రేకుల వంటి కన్నులు గలదానా? మొక్కలమునన్ = ధైర్యముతో; ఒకఁడు = ఎవఁడైన ఒకఁడు, ఒలుకగన్ = ఉబుకఁగా; ఓడక = జంకక; ఎన్+తలలు = ఎన్ని తలలు; తల+ఉదరీ = సన్నని నడుము కలదానా? కంపము = చలించుట; ఒందకువే = వలదు (మానుము).

తా: ఓ కమలదళనేత్రా! నీవు బలికుమారుడైన బాణుని కూతురవు. ఇట్టి నిన్ను ధైర్యముతో ఎవఁడైనను ఒకఁడు (నీవు కోరక పోయినను) తనకౌఁగిట చేర్చునా? ఇట్లు కన్నీరు పెట్టుటకు నీవు వెఱ్ఱిదానవా? (చింతను మానుమనుట). భయపడక జంకక నిన్ను నొంచినవానికి ఎన్ని (తలలు) (గుండెలున్నవి)? తన్వీ! ఆలోచన చేయని దానవై ఒడలు వడంకఁగా బాధను పొందకుమా!

అలం: కావ్యలింగము. ఉషను ఎవఁడును కౌఁగిలింపరామికి హేతువు, బలినందను కూతురవని సమర్థించుట.

వ్యా. 1. 'నొచ్చు' ప్రేరణార్థకము > నొంచు. దాని తుమున్నంతము, 'నొంపన్', దానికి నుజ్ అంతమగు ధాతువు ప్రయుక్తమై 'నొంపఁగన్' అగును. క్రియ, బాల - 115.

2. ఎన్ని+తలలు> ఎని+తలలు > ఎన్+తలలు > ఎన్ దలలు.

---

* కోడకు నెవ్వగదేల యెవ్విధిం గలవు నొంపగ నేరికెన్ తలల్ గలవె

సూ. అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు. హల్లు పరమగుచో ఇత్వము వికల్పముగా లోపించును. సరళాదేశము ప్రకీర్ణ, బాల, 8, 16.

3. కౌగిఁలి కి సప్తమియందు, ఔపవిభక్తికటి వర్ణమునకు అత్వము వచ్చి కౌగిఁటన్ అగును. ఆచ్ఛిక, బాల - 38.

4. ఒందకుము+ఏ ఒందకు+వు+ఏ ఒందకువే. 'ఒందు' ధాతువునకు మధ్యమ పురుషైకవచనము, వ్యతిరేక ప్రార్థనము. ఎదాదులు అనుప్రయుక్తమగుటచే 'ము' వర్ణకమునకు 'వుజ్' వచ్చును. క్రియ, బాల - 33, 34.

వ. అట్లుం గాక. 88

తా : సులభము

చం. గెలిచినవాఁడు నేఁడు రణకేళిఁ బురందరుఁ, దద్గజేంద్రమున్
వెలిచినవాఁడు, దేవతల వెట్టికిఁ బట్టినవాఁడు, ధూర్జటిన్
విలిచినవాఁడు భక్తిమయ విత్తమునన్, ధర నేక వీరుఁడై
నిలిచినవాఁడు శౌర్యమున నీజనకుండు భయం బి దేటికిన్. 89

ప్రతి: నీ జనకుండు = నీ తండ్రి బాణుఁడు నేఁడు; రణకేళిన్ = యుద్ధక్రీడలో; పురందరున్ = ఇంద్రుని; గెలిచినవాఁడు; తద్ + గజేంద్రమున్ = వాని గొప్ప ఏనుఁగును ఐరావతమును; వెలిచిన వాఁడు = పాఱఁద్రోలిన వాఁడు; దేవతలన్; వెట్టికిన్ = వేతనములేకయే పనికి; పట్టిన వాఁడు = పెట్టుకొన్నవాఁడు; ధూర్జటిన్ = శివుని; భక్తి మయ విత్తమునన్ = భక్తి రూపమైన సొమ్ముతో; విలిచిన వాఁడు = కొన్నవాఁడు; శౌర్యమునన్ = పరాక్రమముచే; ధరన్; ఏకవీరుఁడై = ప్రధానమైన (ఎదురులేని) శౌర్యముగల యోధుఁడై; నిలిచినవాఁడు గట్టిగా (స్థిరముగా) ఉన్నవాఁడు; భయంబు+ఇది ఏటికిన్ = (నీకు) ఈ భయము ఎందులకు? నీవేల భయపడవలెను?

తా: నీ తండ్రి ఇంద్రుని గెలిచెను. వాని ఐరావతమును త్రోలెను. దేవతలను బంధించి చాకిరి చేయించెను. శివుని భక్తితో వశము చేసికొనెను పరాక్రమముచే భూమియందు మహావీరుఁడై స్థిరపడి ఉన్నాఁడు. ఇంక నీవు భయపడుటకు కారణమేమి?

అలం : 1. కావ్యలింగము. బాణుని పరాక్రమమును తెలిపి "భయం బిదేటికిన్" అను విషయము సమర్థింపఁబడినది.

2.రూపకము. భక్తి మయవిత్తము.

వ్యు. ధూర్జటి; భారమైన జటలు గలవాఁడు, శివుఁడు.

ఛం : (గి) లిచినవాఁడు (వె)లిచినవాఁడు (వి)లిచినవాఁడు (ని) లిచినవాఁడు అయిదక్షరములు సమముగా నాలుఁగు పాదములలో నున్నవి. ఇది పంచాక్షర ప్రాసమను శబ్దాలంకారము.

కం. 'ఏయెడ భయ మెఱుఁగరు దై
తేయాధిపరక్షితులు సతీ! జగతిజనుల్,
మీ యింట నీకు నవమతి
చేయుదురే యొరులు, నిప్పుఁ జెద లంటు నటే?' 90

తా: ఓ సాధ్వీ! జగతిలో నుండు జనులు ఎవరును, ఏ చోటను భయము ఎఱుఁగరు. వారందఱు, రాక్షసరాజగు (నీ తండ్రియైన) బాణునిచే రక్షింపఁబడువారు. మీ యింటిలో ఇతరులు ఎవరైనను అవమానము చేయుదురా? నిప్పును చెదలు అంటునా?

అలం: దృష్టాంతము (చూడుము, పద్యము - 42)

వ్యా : ఇంటన్. సప్తమ్యర్థమున అత్వము. ఆచ్ఛిక, బాల - 38

వ. అనుటయు నయ్యుషాకాంత యిట్లనియె. 91

తా : అని చిత్రరేఖ పలుకఁగనే ఉషాకాంత ఆమెతో ఇట్లనెను.

సీ. 'మా తండ్రి కొలువులో 'మానినీ తిలకంబ
ర' మ్మనునా పేరు వమ్ము వోయె
నాతోడి నీడ లైనను బిన్న పెద్దగా
నవరించు మీచూపు జాఱువాఱె
*బ్రతిదేవతలు నన్ను 'బయల నెత్తిన దివ్వె
యఱచేతి మానిక' మనుట దప్పె;
'నల్ల పా ల్లెఱుఁగని నాకులం' బను మంచి
మడుఁగు జీరకుఁ జాల మైల సోఁకె

* పతిదేవతలు; పరిజనంబులు

గీ. నింక మెచ్చని వారు మో మెత్తి చూడఁ
గూడు చవిగాఁగఁ గుడుచుట గూడు నమ్మ?
నమ్మ కిటమీఁద నేను బ్రాణానఁ గలిమి
చెలిమి మఱవక తలఁపుమీ చిగురుఁబోఁడి 92

అర్థ : చిగురుఁ బోఁడి = చిగురు వంటి మేను కలదానా! కొలువులో =సభలో; మానినీ తిలకంబ! రమ్మ = స్త్రీలలో ఉత్తమురాలా! రా (అనుపిలుపు); వమ్ము+పోయెన్ = చెడిపోయెను; సవరించు = ఆదరించు; జాఱు+పాఱెన్ = జాఱి పోయెను; ప్రతిదేవతలు = దేవతలకు విరోధులు, రాక్షసులు; వాదికి విరుద్ధము ప్రతివాది. అట్టి ప్రయోగమిది. అర్థాంతరము రక్షకజనులు దాదులు మొదలైనవారు; బయలన్+ఎత్తిన దివ్వె = ఆకసమున పెట్టిన దీపము; అఱచేతి మానికము = అఱచేతిలోనుండు మణి; (ఉత్తమురాలు పరిశుద్ధమైన శీలవతి అను పొగడ్తలు); తప్పెన్ = తప్పిపోయినవి; నల్ల పొల్లు = నల్లని (గింజ పట్టని ధాన్యము) ఉపయోగపడని గింజ. నల్లఁదనము అనఁగా కళంకము లేనిదనుట; మడుఁగు చీరకు = శుద్ధమైన తెల్లని వస్త్రమునకు; మైల = మసి; సోకెన్ = అంటుకొనెను; కూడు = అన్నము; చవి = రుచిగా; కలిమి = ఉండుట.

తా: చిగురువంటి మేనుగల చిత్రరేఖా! మా తండ్రి సభలో 'మానినీ రత్నమా! రమ్మ' అనెడి మర్యాదగల పిలుపు చెడిపోయెను గదా! నా తోడి నీడలయి నన్ను పిన్నగను పెద్దగను సమాదరించు మీ చూపు సడలిపోయినది గదా! రాక్షసులు నన్ను మింట వెలుఁగు దీపము, అఱచేతిలోని మణి అను పొగడ్తలు తప్పిపోయినవి-గదా! నల్లని పొల్లు గింజ లేని (ఎట్టి మచ్చలేని) మా వంశము అనెడి, మసిలేని గుడ్డకు, మఱక అంటుకొన్నది గదా! ఇంక మీఁద నన్ను ఇష్టపడని వారు, వ్రేలెత్తి నన్ను చూఁపగలరు గదా! అట్లగుటచే అన్నమును నేను రుచిగా తినఁగలనా? ఈ అవమానమును సహించుచు నేను జీవించుట అనునది నమ్మఁదగని మాట. మన చెలిమి మఱవక నన్ను గుర్తుంచుకొనుఁడు.

అలం : రూపకము. కులంబను మంచి మడుఁగు చీర.

వ్యా. 1. ప్రాణమున > ప్రాణాన. సూ. లులనలు పరంబులగునపుడు ఒకానొకచో ముగాగమంబునకు లోపంబును, తత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబు విభాషనగు. తత్సమ, బాల - 43.

2. నమ్మకుము+ఇట = నమ్మకిట, వ్యతిరేక మధ్యమ ముపర్ణలోపమ్ము సంధి, బాల - 48.

నానా. తిలకము = శ్రేష్ఠము, బొట్టు, ఒక చెట్టు, పుట్టుమచ్చ, నల్లగుఱ్ఱము, ఒకరోగము మొ.

3. చిగురుఁబోడి. (చూడుము, పద్యము - 50) మానికము (వి) మాణిక్యము (ప్ర)

కం. అని వెక్కి వెక్కి యేడ్వఁగ
వనజాననఁ జేరి సఖులు వల దుడుగవ కా
నిను నెవ్వతెఁగాఁ దలఁచితి
వనదయునుంబోలె నేల యలమట గుడువన్. 93

అర్థ : వనజ + ఆననన్ = కమలముఖిని; ఉడుగవు+అకా = (వగచుట) మానకున్నావు. అక్కా; అనదయునున్+పోలెన్ = దిక్కులేని దానివలె; అలమటన్ = శోకమును; ఏల కుడువన్ = ఎందులకు పొందవలెను? (వగవకుమనుట);

తా: అని వెక్కి వెక్కి ఏడ్వఁగా చెలికత్తెలు ఉషను సమీపించి 'అక్కా! శోకించుట మానకున్నావు. నీవు సామాన్యురాలివా? దిక్కులేనిదానివలె శోకింపనేల?'

వ్యా: 1 అక్కా, అక. సూ. ప్రకీర్ణ, బాల - 8చే, కకార ద్విత్వలోపము.
2. తలచితివి > తలచితి. వకారలోపము. క్రియ, బాల - 24.
3. అనదయునున్ +పోలెన్. సూ. కొన్ని యెడల ద్రుతంబు మీఁద నకారంబు గానంబడియెడి. సంధి, బాల - 21. ద్రుతకార్యములు సంధి, బాల, 16, 17. పూర్ణబిందువు వచ్చుటచే అనదయునుంబోలె అగును.

ఉ. 'ఇంతకు మున్న యిచ్చెలువ లెవ్వరుఁ జూడరు నిన్ను నేఁడకా
వింతగ వచ్చి తే కతలు వేయును నేటికి నన్యసక్తమై
చింతయు భాషణంబులును చేఁతలు నీత్రివిధంబ నీడు గా
కింత దలంక నేల? కల నెవ్వఁడు డగ్గఱె నేని సెగ్గమే. 94

అర్థ: చూడరు = చూడలేదా! నేఁడు+అ+కా = నేఁడేనా; అ = అవధారణార్థకము; 'కా' అనుపదమునకు 'కదా' అనునర్థమున్నది. కనుక అవధారణార్థకమునకు పోషకముగా "కా" ఉన్నట్లు గ్రహింపనగును; నేఁడ+అకా = నేఁడేనా, అక్కా; వింతగా = అచ్చెరువు కొల్పునట్లు, క్రొత్తగా; వచ్చితివి+ఏ = వచ్చితివాఏమి? కతలు = పిచ్చి పిచ్చి ఊహలు, వేయునున్=వేయియును (పెక్కు); ఏటికిన్ = ఎందులకు; అన్యసక్తము+ఐ = ఒకని యందు చేరినదై; చింతయున్ =

తలంపును (మనస్సు); భాషణంబులును = మాటలును (వాక్కులును);చేఁతలున్ = పనులును (కర్మలును); ఈ త్రివిధంబున్ = ఈ మూడు విధములైన కార్యములును; ఈడుగాక = పొందిక లేక పోవుటచే; క్త్వార్థకము హేత్వర్థకములోనున్నది; తలంకన్ +ఏల = భయమేల? సెగ్గము+ఏ = నింద్యమా? కీడగునా? (తప్పగునా?);

తా: ఇంతకు ముందు ఆయువతులు ఎప్పుడు నిన్ను చూడలేదా? నేఁడేనా (అక్కా) క్రొత్తగా వచ్చినావు? పెక్కు వెట్టిమాటలు ఏల? మనస్సు, మాట, చేఁత మూడును ఒకే విధముగా (పొందిక) లేకపోవుటచే భయమేల? కలలో ఒకఁడు సమీపించినంత మాత్రమున అది తప్పాఏమి? (కాదనుట).

వ్యా. వచ్చితివి+ఏ. వకార లోపసంధి (చూడు, పద్యము -23)

కం. 'మనమున నొరుఁ దలఁపవు మా
నిని! నియతమ బ్రహ్మచారిణివి నీచరితం
బునఁ గీడు గలుగఁ జేసెదు
కనుఁగొన నెవ్వరికి వశము కాలము గడవన్.' 95

తా: మానవతి! నీవు మనసున ఎవరిని తలఁపవు కదా! నియమముతో బ్రహ్మచర్యమును పాటించుదానవు. నీ నడవడికలో తప్పున్నట్లు నీవే తలంచుచున్నావు. (నీ నడవడికను నీవు తప్పుపట్టుట తగదనుట) చూడఁగా విధిని ఎవరును దాఁటలేరు గదా! (ఈ కలవలన మంచి కలుగునని సూచన).

అలం : అర్థాంతరన్యాసము. విశేషము సామాన్యముచే సమర్థింపఁబడినది.

కం. అని చెలులు పలుక నేమియు
నన నేరక యూర కున్న యసురేశ్వర నం
దనఁ గనుఁగొని కుంభాండుని
తనూజ యగు చిత్రరేఖ తా నిట్లనియెన్. 96

తా: అని చెలులు పలుకఁగా ఏమియును మాఱు పలుకుటకు ఇష్టపడక ఊరకున్న రాక్షసరాజ పుత్రియగు ఉషను, చూచి, కుంభాండుని కుమార్తె, చిత్రరేఖ ఇట్లనెను.

చం. 'ఎఱిఁగితి నీ తెఱంగు విను మిందుముఖీ! యొకనాఁడు ముగ్ధ లం
దఱమును గూడి యాడఁగ సుధాకర శేఖరుకాంత నీమదిన్

నెఱసినకోర్కి దీర్ప నొకనేర్పరి నీకల వచ్చు నంటకుం
దఱి యిదివో దినంబును సుధాభవనంబునుఁ బ్రొద్దుఁ జూడఁగన్. 97

అర్థ: తెఱంగు = ఈ విషయము; ముగ్ధలు = కన్నెలు; సుధాకరు శేఖరుకాంత = చంద్రుని శిరసున కలవాని (శివుని) కాంత, పార్వతి; వచ్చున్ + అంటకున్ = వచ్చునని అనుటకు; తఱి ఇది పో = సమయము ఇదియే.

తా: చంద్రముఖీ! ఈ కలను గుఱించి ఇప్పుడు నాకు అర్థమైనది. వినుము కన్యలగు మనము అందఱు, ఉద్యాన వనములో క్రీడించుచుండఁగా చల్లని చంద్రుని తలలో ధరించు శివుని ఇల్లాలు, భవాని, నీతో నీ కోరికను తీర్చుటకు ఒక చతురుఁడు నీకు స్వప్నములో కన్పట్టునని చెప్పెను గదా! పరిశీలన చేయఁగా సరిగా ఆమె చెప్పిన దినము వైశాఖ శుద్ధ ద్వాదశి నేఁడే! ఆ తెల్లని మేడ, వేకువ ప్రొద్దు, అంతయు అమరినవి.

నానా: తెఱఁగు = విధము, క్రమము, చక్కన, సంధి, విషయము.

వ్యా. అనుట = అంట. సూ. అన్వాదులు పరంబులగు నపుడు 'ను' స్థానంబున సున్నయు 'ఉండు''డు' లోపంబును విభాషనగు. క్రియ, బాల - 58

కం. 'మఱచితి గాక లతాంగీ!
కఱకంఠునితోడ నాఁడు కాత్యాయని నీ
*నెఱ నెఱిఁగి నాఁడు సెప్పిన
తెఱఁ గిది సమకూడె నింక దిగు లేమిటికిన్?' 98

తా: తీఁగెవంటి మేను గలదానా! నీవు మఱచినావు కదా! నాఁడు శివుని ఆనగా, కాత్యాయని నీ మర్మము (కలుగఁబోవు విషయము) ఎఱిఁగి చెప్పిన విషయము ఇది. అది నేఁడు కలిగినది. ఇంక ఏల దిగులు చెందవలెను?

విశే: కఱకంఠుని తోడ (డు). అర్థములు 1. శివునితో, 2. శివునితో కూడి ఉండి (శివసహితయై) 3. శివుని ఆనన్ (అనుమతితో, లేదా ఆజ్ఞగా) "తోడు" శబ్దమునకు ఆన అనునర్థమున్నది. కనుక సోమన విశేషార్థమున ప్రయోగించెనని తోఁచుచున్నది.

నానా: తోడు = ఆన, తోడఁబుట్టువు, చేమిరి, (విశే) సహాయము (ఆనకు; నీ తోడు నీ సమానులు భూతావళిలోన నెందుఁబుట్టరు. (హరివంశము)

---

* నెఱియె

2. నెఱను=మర్మము (గుట్టు) జీవస్థానము .

రూపాం. నెఱకు. ఇది బహువచనాంతమైనప్పుడే కుజంతముగా కానంబడుచున్నది. (శ.ర)ఆచ్చిక, బాల - 18,

వ. అనుటయు నబ్బోటి చిత్తంబున వాటం బయిన పరిభవాభి మానంబు విరిసినఁ గన్నీరు దుడిచికొని కొనలు సాగుకోర్కులు,గులుకుతలంపులఁ దమకంపు మొలకలు వొడమం గడమ వడిన లజ్జ కడకన్నులం బెరయ నుండె నప్పుడు. 99

ప్రతి: అనుటయున్; ఆ+బోటి = ఆ చెలువ ఉష; చిత్తంబునన్ = మనస్సునందు; వాటంబు+అయిన = తగుల్కొన్న, (లగ్నమైన); పరిభవ+అభిమానంబు = అవమానము వలని బాధ; విరిసినన్ = తొలఁగఁగా; కన్నీరు తుడిచికొని; కొనలుసాగు = అతిశయించు; కోర్కులు = కోరికలు; కులుకు తలంపులన్ = కాముని సంబంధమైన కదలికలుగల తలఁపులందు; తమకము + మొలకలు +పొడమన్ = ప్రేమ చిగుర్పఁగా; కడమ వడిన = మిగిలియున్న; లజ్జ = సిగ్గు; కడకన్నులన్, కంటి యొక్క చివఱ; బెరయన్ + ఉండెన్ = కూడి ఉండెను.

తా: అని చిత్రరేఖ పలుకఁగా ఉష, మనసున నిలచిన అవమానము వలన వంత తొలఁగినది. ఆమె, కన్నీటిని తుడిచికొన్నది. అతిశయించు కోరికలు శృంగార భావము లందు ప్రేమను చిగుర్చునట్లు చేసినవి. (కోరికలచే, శరీరములో కదలికలు, తలఁపులు మెండైనవి). అపుడు ఆమె కడకన్నులలో (ముందున్న లజ్జ చాలవఱకు తొలఁగి) ఒకింత సిగ్గు మాత్రము నిలిచినది.

వ్యా. తమకము +మొలకలు. పుంప్వాదేశసంధి. (చూడు. పద్య - 20)

మ. పరపయ్యెం బరిభోగవాంఛ, దడవం బాలయ్యె నిద్రారతుల్
పొరపయ్యెం బలుదాల్మి, వింతవగపుం బ్రోవయ్యె నాలాపముల్
నెరపయ్యె న్మదనానలంబు, వరుస న్నీ రయ్యె నాలేపముల్
*పొరపయ్యెం దనువల్లి బాణు సుత కున్ పోలింతలం దూలుటన్.100

ప్రతి: బాణు సుతకున్ = బాణుని కూతురగు ఉషకు; పోలింతలన్ = (కామ వాంఛ) మనసున నిండినందున పరవశత్వముచే తూలుటన్ = (మనసును వశపఱచుకొనుటకు వీలు

* పొరుపయ్యెన్

లేక) చలనము కలుగుటచే; పరిభోగవాంఛ = సంపూర్ణ సుఖమందు కోరిక; పరపు+అయ్యెన్ = విరివి అయ్యెను; నిద్రా+అరతుల్ = నిద్రయు, కామాసక్తి (మన్మథావస్థ); తడవన్ పాలయ్యెను = వెదక వలసివచ్చెను; బలు+తాల్మి = బలమైన ఓర్పు; పొరపు +అయ్యెన్ = తొలఁగెను (వికల మయ్యెను); ఆలాపముల్ = మాటలు; వింత వగపు + ప్రోవు+అయ్యెన్ = క్రొత్తదైన శోకము యొక్క మొత్తమునకు నిలయమయ్యెను; మదన+ఆనలంబు = కామాగ్ని (వేఁడిమి); నెరపు + అయ్యెన్ = ఎక్కువైనది; వరుసన్ = క్రమముగా; ఆలేపముల్ = మైపూఁతలు; నీరు + అయ్యెన్ = కరఁగిపోయెను; తనువల్లి = తీఁగ వంటి శరీరము (మెత్తని మేను); సొరపు+అయ్యెన్ = సన్నగిల్లెను.

తా: బాణుని కూతురు ఉష మదనావేశముచే తీవ్రముగా చలించినది. సంపూర్ణ దాంపత్య సుఖమందు మనసు విస్తరించెను. నిద్ర దూరమయ్యెను. కామక్రీడాను భావమందు ఆసక్తి కలుగుటచే ఆ ఆలోచనలతో ఇతర ములందు ఆసక్తిలేక విశ్రాంతి కఱవయ్యెను. ఓరిమి నశించెను. మాటలన్నియు (కాముని సుఖము లభింపమి) శోకమునకు నిలయమయ్యెను. కామ సంబంధమైన వేఁడిమి మిక్కుట మయ్యెను. మెల్లమెల్లగా మైపూఁతలన్నియు కరఁగిపోయెను. మెత్తని మేను సన్నమయ్యెను (కృశించెను).

విశే. స్వప్నమందు, ఉషకు అనిరుద్ధుని దర్శనము, సంగమమును సమకూరినవి.

1. వాంఛ (సంకల్పము) 2. జాగరము (నిద్రలేకపోవుట) 3. అరతి (మన్మథావస్థ - కామ క్రీడానుభూతిని మననము చేసికొనుచు విశ్రాంతిని దూరము చేసికొనుట) 4. అలజ్జ (తాల్మిత్యాగము) 5. ఉన్మాదము (వింతవగపు) 6. ప్రలాపము (ఆలాపములు) 7. కృశత (తనువల్లి సొరపగుట) 8. సంజ్వరము (మదనానలము) 9. మూర్ఛ (సోలింత) 10. మరణోద్యమము (తూలుట).

పై పదియు మన్మథావస్థలు సోమన అతి చతురతతో అన్నింటిని ఒక పద్యములలో ఇముడ్చుట ప్రశంసనీయముగా నున్నది.

వ్యా. వగపు+ప్రోవు > వగపుంబ్రోవు.పుంప్వాదేశ నుగాగమ సంధి. (చూడు పద్య - 66)

అలం: వృత్త్యనుప్రాసము. "య్యె" అనువర్ణసముదాయము - ఏడుసార్లు ఆవృత్తమైనది.

ఛం. (ప) రపయ్యె (పొ)రపయ్యె (నె)రపయ్యె (సొ)రపయ్యె - త్రిపాసాక్షరములు నాలుగు పాదములలోనున్నవి.

కం. లోఁగిటికి రాని రూపముఁ
గౌఁగిటికిన్ రానిపొందుఁ గారింపంగా
మూఁగిన కుసుమశరంబుల
చేఁ గఱకఱఁ గందె నతివచిత్తం బంతన్. 101

ప్రతి: లోఁగిటికిన్ = చిత్తమను ఇంటికి; రాని రూపమున్; కౌఁగిటికిన్ రాని పొందున్= కౌఁగిటిలోనికి రానట్టి కూటమి; లేదా (శారీరకముగా లేని కూడిక); కారింపంగాన్= బాధింపఁగా; మూఁగిన కుసుమ శరంబులచే = పైని క్రమ్ముకొన్న మదనుని పూవుటమ్ములచే; అంతన్ = పిమ్మట; అతివ చిత్తంబు = ఉష మనస్సు; కఱకఱన్ +కందెన్= మలమల మాఁడి నల్లఁదనము వహించెను.

తా: మనసులో నిలువని రూపము, కౌఁగిలిలేని కూడిక (కలలోనే కలిగినది), ఉషను పీడింపఁగా మదనుని పూవుటమ్ములచే ఆమె మనసు తీవ్రముగా పరితాపము చెందెను. (మనఃక్లేశము హెచ్చెను).

వ్యా. లోఁగిటికి. ఆచ్ఛిక, బాల - 31, తత్సమ, బాల - 26.

వ. ఇట్లు హృదయంబునం గదిరిన మదనానలంబచే నుదిలగొని
యా సుదతి చిత్ర రేఖ కి ట్లనియె. 102

అర్థ: కదిరిన = అతిశయించిన; ఉదిలగొని = తపించి; సుదతి = చక్కని దంతముగలది, ఇంతి = ఉష

తా: ఈ విధముగా హృదయమందు అతిశయించిన కామాగ్నిచే మనస్సునకు తాపము కలుగుటచే బాధతో ఆ ఉష చిత్రరేఖతో ఇట్లనెను.

చం. 'ఉడిగి మడింగి మైమఱచి యున్న తఱిం గలలోనఁ జేరె నె
క్కడి మగవాఁడొకో! యనుచుఁ గందఁగ మేల్కొనుచో నతండ యి
ప్పుడు మగఁ డంచుఁ గోరుటకుఁ బొందుగఁ జెప్పితి ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడిచిన చంద మయ్యెఁ గమలానన! యీ విరహానలంబునన్. 103

తా: ఎల్లపనులు, తలంపులు మాని (నిశ్చింతగా),కాలుచేతులు పదిల పఱచుకొని (అనుకూలముగా పెట్టుకొని) ఒడలు మఱచి యుండు వేళ (స్వప్నావస్థలో) కలలో ఎవఁడో ఒక మగవాఁడు చేరెను కదా అని తపించుచుండగా, ఇప్పుడు మేల్కొన్న పిమ్మట

(జాగ్రదవస్థలో) ఆ మగవాఁడే నీవు కోరుటకు తగిన మగఁడని పొందికగా చెప్పితివి. పద్మముఖీ చిత్ర రేఖా! ఈ ఎడబాటు వలన వేఁడిమిచే, ఉన్న ముల్లును తీసి అచ్చుట మేకును (దబ్బనమును) గ్రుచ్చినట్లయినది కదా! (కల అని సరిపెట్టుకొన్న బాధ అల్పము. వాస్తవముగా అతఁడే పతి అనుటచే బాధ అనల్పము).

అలం: 1 దృష్టాంతము 'ఒక చిన్న నొప్పిని తొలఁగించి అంతకంటె పెద్ద నొప్పిని కలిగించుట' అని భావము. కలలో కన్యాత్వము చెడెనని బాధ పడుచుండగా ఆతఁడే నీ మగఁడనుటచే బాధ అధిక తరమయ్యెననుట. ఈ రెంటికిని బింబ ప్రతిబింబ భావమున్నది.

2. రూపకము. విరహానలము.

కం. 'నీముడిచిన ముడి విడువఁగ
నే మెవ్వరు నేర మింక నీ సౌభాగ్య
శ్రీ మహితునిఁ బతిఁ గూర్పం
గామిని! నీకంటెఁ జెలులు గలరే చెపుమా.' 104

అర్థ: నీ ముడిచిన ముడి = నీవు వేసిన ముడి; సౌభాగ్యశ్రీ మహితున్ = సౌందర్య శోభచే గొప్పవాఁడైన వానిని;

తా: ఓ కామినీ! చిత్రరేఖా నీవు వేసినముడిని విప్పుటకు మేము ఎవ్వరము ఎఱుఁగము. ఆ సౌందర్యవంతుని నాకు పతిగా చేయుటకు నీకంటె నాకు చెలులు వేఱెవరున్నారు? నీవే చెప్పుము.

వ్యా. నీవు ముడిచిన ముడి అనుటకు మాఱుగా, అనఁగా ప్రథమకు, 'నీ (యొక్క) ముడిచినముడి' అని షష్ఠి వచ్చినది. సూ. ధాతుజ విశేషణ పూర్వావ్యవహిత కర్తృపదప్రథమకు షష్ఠి. "యొక్క"కు లోపంబు బహుళంబుగానగు. కారక, ప్రౌఢ 15, 16.

2. ఏము+ఎవ్వరము = ఏమెవ్వరు.

ప్రథమాంతమైన అస్మద్విశేషణ బహువచనరూపమునకు 'ము' అంతాగమము కావలెను. అట్లు కాకపోవుట ప్రాయిక శబ్దముచే సాధుప్రయోగమని తలంపవలెను. కారక. బాల - 33.

చం. అనుటయుఁ జిత్రరేఖ దనుజాధిప నందనతోడ ని ట్లనున్
'నినుఁ గలలోనఁ బైపడిన నేర్పరి ప్రుచ్చు నెఱుంగుదేని న
య్యనువరి రూపుఁ గైవడియు నన్వయముం జరితంబుఁ జెప్పుమా
విని ప్రియుఁ దార్చెదన్ మనము వేడుకఁ దీర్చెదఁ గామునోర్చెదన్'. 105

అర్థ : అనువరి = ఉపాయశాలి; కైవడి =తీరు; అన్వయము = వంశము; చరితము = ఊరు పేరు మొదలగునవి; తార్చెదన్ = కూర్చెదను; ఓర్చెదన్ = సహింపఁజేసెదను.

తా: అనఁగా, చిత్రరేఖ ఉషతో ఇట్లనెను. "నిన్ను కలలో, కలసిన నేర్పరియైన దొంగను, నీవు ఎఱిఁగినచో ఆ ఉపాయశాలి రూపు తీరు, వంశము, ఊరు పేరు చెప్పుమా! అంతయు విని, వానిని నీకు కూర్చెదను, నీకోరిక తీర్చెదను. నీచే కాముని సహింపఁజేసెదను.

అలం: వృత్త్యనుప్రాసము. తార్చెదన్, తీర్చెదన్, ఓర్చెదన్.

వ్యా. ఆ+అనువరి = అయ్యనువరి. యడాగమ త్రిక సమాస సంధి. (చూడు, పద్య 6, 47)

2. అనువు+అరి= అనువరి

సూ. 'అరి' వర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు. తద్ధిత. బాల - 17.

3. రూపుఁగైవడి. నుగాగమ ద్రుతకార్యములు. (చూడు, పద్య - 66)

వ. అనుటయు నక్కన్యకారత్నం బి ట్లనియె. 106

తా: అని చిత్రరేఖ పలుకగనే ఆ కన్యలలో ఉత్తమురాలు ఉష ఇట్లనెను.

కం. 'కలలోనఁ గన్న రూపముఁ
గలలోనన కౌఁగిలింపఁ గంటిఁ బిదప నో
లలనా! నీ పలుకుల నో
లల నాడితిఁ గాని పతిఁ దలంప నెఱుంగన్. 107

అర్థ: ఓలలన్+ఆడితిన్ = సంతసమను జలరాశిలో మునిగి తేలితిని; తలంపన్=ఎఱుంగన్ = (అతఁడు ఎవరో) తలంచుటకు ప్రయత్నింపలేదు.

తా: ఓ లలనా! కలలో కాంచిన రూపమును కలలోనే కౌఁగిలించి అనుభవించితిని. పిమ్మట నీ పలుకులచే సంతోషమనెడి జలరాశిలో మునిఁగి తేలితిని. అతఁడు పతి అని తలంపలేదు. (కనుక అతని గుఱించి తెలిసికొనుటకు ప్రయత్నింప లేదనుట).

కం. 'ఏ దంపతులకుఁ బొడమెనొ
యే దేశమునందుఁ గీర్తి కెక్కిన వాఁడో
యే దెసవాఁడొ యెఱుంగను
మేదిని నిత్తెఱఁగు కూరిమియుఁ గలదె చెలీ!' 108

తా: చెలీ! అతఁడు ఏ దంపతులకు పుట్టెనో (తల్లి దండ్రులెవరో), ఏ ప్రదేశమున పేరుపొందెనో ఏ దిక్కున నున్నాఁడో! ఆదేశము, ఏ దిక్కున నున్నదో! నాకు తెలియదు. లోకములో ఊరు పేరు తెలియని వానితో ఇట్టి చెలిమి (చేరిక) కలుగుట ఆశ్చర్యముగా నున్నదే!

వ. అనుటయుఁ జిత్రరేఖ విచారించి. 109

తా : సులభము

గీ. '[1]ఆలజాలంబు నీరిలో నాడుజాడ
గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ
నిదురలోపలఁ గలఁ దోఁచు నీడ [2]విధము
గాన వచ్చునె యప్పుడ కన్నఁ గాక.' 110

ప్రతి: ఆలజాలంబు = అలల మొత్తము (పాఠాం. అలల జాలంబు); నీరిపైన్ = నీటిమీఁద; ఆడుజాడ = కదలు తీరు; గాలిపడగ; ఆ కసమునన్ = ఆకాశమందు; క్రాలు త్రోవ = పోవుదారి; నిదురలోపలన్, కలన్ = నిదురించునపుడు కలలో; తోఁచు = కన్పట్టు; నీడవిధము = రూపము యొక్క తీరు, అదెట్లుండునో; అప్పుడు + అ = అప్పుడే; కన్నన్ + గాక = చూచిననే కాని; కాన వచ్చునె = (తర్వాత) కన్పట్టునా? (కనఁబడదనుట).

అర్థాంతరము : 1. ఆలము = సాలె పురుగువలె, నీటిపై తేలిపోవు క్రిమి.
2. ఆలజాలంబు = ఆకుల మొత్తము (తుది అక్షరలోపము).

తా: అలల (ఆకుల) మొత్తము, నీటి మీఁద కదలు తీరును. గాలిపడగ ఆకాశములో సంచరించు దారి, నిద్రపోవునపుడు కలలోకన్న రూపము యొక్క ఆకృతి (విధము); వెంటనే తెలియునుగాని, పిమ్మట అదెట్టిదో చూడలేము. (ఊహించి చెప్పుటకును సాధ్యముకాదు)

1. అలల జాలంబు నీరిపై 2. పిదప

వ్యా. "ఆకులు" > 'ఆలు'. సూ. బహువచనంబుపరంబగునపుడు 'ఆవు' ప్రభృతుల తుది అక్షరంబునకు లోపంబు విభాషనగు.

ఇట్లే ఆవులు ఆలు, చుట్టములు చుట్టలు, ఆచ్చిక, బాల - 22.

వ. అనుటయు. 111

తా : సులభము

చం. వెలిచిన కన్ను నీరుజడి వెచ్చని చన్నులమీఁది వేఁడియుం
దొలకరి ఘర్మతోయములతోఁ గలసె న్మెయి మ్రానుపాటుతో
నెలుఁగున రాలుపా టొదవె నెక్కు వివర్ణతతోన లోపలం
గలగొనె *నారటంపుఁ బులకంబులతో ( బొడతెంచెఁ గంపమున్. 112

అర్థ: వెలిచిన = కార్చిన, కన్ను నీరు జడి = కన్నీటిచార; తొలకరి = అప్పుడప్పుడే పుట్టుచున్న; ఘర్మతోయములతోన్ = చెమ్మట నీటితో; మెయిన్ = శరీమునందు; మ్రానుపాటుతోన్ = కదలికలు లేకపోవుటచే; ఎలుఁగునన్ = గొంతులో శబ్దమందు (స్వరమందు); రాలుపాటు = డగ్గుత్తిక (సన్నగిలుట); ఎక్కు = ఎక్కువగుచున్న; వివర్ణతతోన = శరీరమందు తెల్లఁదనముతోకూడ (వర్ణము తొలఁగుటచే): లోపలన్ = మనసులో; కలపు+కొనెన్ = (భయముచే) గుండె అదరు(దిగులు లేక కలఁత) వ్యాపించెను (చేష్టలు తొలఁగినవి); ఆరటము పులకంబులతోన్ = తాపము వలని గగుర్పాటుతో: (పాఠాం: ఆరటంబు, పులకంబులతోన్= కామతాపమును, గగుర్పాటును); కంపమును = వడఁకును; పొడతెంచెన్ = పుట్టెను.

తా: ఉష కార్చిన కన్నీటి ధార, వెచ్చనైన చన్నులమీఁది వేఁడిమియును, వెలికి వచ్చుచున్న చెమ్మట నీటితో కలిసెను. గొంతులో స్వరము సన్నగిల్లెను. ఎక్కువగా మేని వన్నె తెల్లనైనది.మనసున భయముచే క్షోభ (గుండె అదరు) కలిగినది. కనుక తెలివి తొలఁగినది. మదన తాపముచే పులకలు (గగుర్పాటు) వడఁకును, పుట్టినవి.

ఉషకు కలిగిన సాత్త్విక భావములు వర్ణింపఁబడినవి.

1. స్తంభము - మ్రాను పాటు.
2. ప్రళయము - (కలఁగొనుట) కలఁతచే తెలివి తప్పి చేష్టలు తొలఁగినవి.
3.రోమాంచము - పులకంబులు.
4. స్వేదము -ఘర్మతోయములు.

---

* నారటంబు,

5. వైవర్ణ్యము - వివర్ణత.
6. వేపధువు - కంపము.
7. అశ్రువు -కన్నునీరు జడి.
8. వైస్వర్యము - ఎలుఁగున రాలుపాటు.

వ. ఇవ్విధంబున మవ్వంబు గందిన పువ్వునుం బోలె నవ్వనిత నివ్వటిల్లిన యాయల్లకంబు మల్లడిఁ గొలుప నిలుపోప కున్న విన్న నగు నచ్చెలులు మెచ్చ నచ్చిత్రరేఖ చిత్రలేఖన నైపుణ్యంబు మెఱయ నిదియ తఱి యని విచారించి యచ్చపు నెయ్యంబున నచ్చపలలోచన కిట్లనియె. 113

ప్రతి: ఈ+విధంబునన్ = ఈ రీతిగా; మవ్వంబు = మృదుత్వము, కోమలత; కందిన = పోయినట్టి; పువ్వునున్+పోలెన్; ఆ+వనిత; నివ్వటిల్లిన = అతిశయించిన; ఆయల్లకంబు = విరహము; మల్లడిన్ + కొలుపన్ = తాపమును కలుగఁజేయఁగా; నిలుపున్+ఓపక+ఉన్నన్ = నిలువ లేక, తాళలేక పోవుటచే; విన్నన+అగు = చిన్నఁబోయిన, శోకము చెందిన; ఆ +చెలులు; మెచ్చన్; ఆ+చిత్రరేఖ; చిత్ర లేఖన నైపుణ్యంబు = చిత్తరువు వ్రాయు నేర్పు; మెఱయన్; ఇది+అ = ఇదియే; తఱి = సమయము; అని; విచారించి = ఆలోచించి; అచ్చము+నెయ్యంబునన్ = స్వచ్ఛమైన స్నేహముతో; ఆ+చపలలోచనకు = ఆ చంచలాక్షికి ఉషకు; ఇట్లు + అనియెన్.

తా: ఈ రీతిగా కోమలత తొలఁగిన పూవు వలె, ఆ ఉష ప్రియుని ఎడఁబాటు, పరితాపమును కలుగఁజేయఁగా సహింపఁజాలక పోయెను. ఆ విధముగానున్న చెలువను చూచి చెలిమికత్తెలు మెచ్చుకొను రీతిని చిత్రరేఖ తన చిత్తరువు రచించు నేర్పును తెలియఁజేయుటకు ఇదియే సరియైన కాలమని ఆలోచించి అచ్ఛమైన చెలిమితో ఇట్లు పలికెను.

అలం: వృత్త్యనుప్రాసము 1. వకారద్విత్వము 2. లకారద్విత్వము 3. చకారద్విత్వము.

మ. 'వనితా యెల్లజగంబులుం బటమునన్ వ్రాయంగ నేర్తున్ సుప
ర్వ నరాహి ప్రముఖ స్వరూపములు చిత్ర ప్రాప్తిమైఁ జూపెదం
గని నిన్నుం గలలోనఁ బై పడిన యాకళ్యాణ రత్నాకరున్
మనవాఁ డంచు నెఱింగి పట్టి మది నీ మన్నించినన్ మెచ్చవే. 114

అర్థ: సుపర్వ+నర+అహి+ప్రముఖ స్వరూపములు = దేవతలు మనుష్యులు, నాగులు

మొదలైన వారి ఆకారములు; చిత్రప్రాప్తి మైన్ = చిత్తరువున చేర్చి; కల్యాణ రత్నాకరున్ = శుభములకు సముద్రుఁడైనవానిని; మది నీ మన్నించి నన్ మెచ్చవే = మదిన్, నీ(వు), ఆదరించి నన్ను మెచ్చుకొనవా?

అర్థాంతరము : మదిన్ +ఈన్ = మనస్సునకు (నచ్చునట్లు) అర్పింపఁగా;

తా: ఓ వనితా! ఉషా! అన్నిలోకములలోనుండు దేవతలు నరులు నాగులు మొదలగు వారి ఆకారములను పటములందు చిత్తరువున పొందునట్లు చేసి చూపెదను. వానిని చూచి, నిన్ను కలలో కూడిన ఆ శుభగుణముల సముద్రుఁడైన సౌందర్య నిలయుని నీ ప్రియుఁడైన మనవాఁడని తెలిసికొని గుర్తించి మనసార నీవు ఆదరించి నన్ను మెచ్చుకొందువు.

వ్యా. నన్నున్ +మెచ్చవే. తుది నకారలోపము. ప్రకీర్ణ, బాల- 7. ననున్+మెచ్చవే. స్థిరము పరముకాగా ద్రుతలోపము. సంధి, బాల - 18. నను+మెచ్చవే. పదాంత నువర్ణములోని ఉత్వలోపము. ప్రకీర్ణ, బాల - 16.

కం. 'ఏడు దినంబులలో నీ
రేడు జగంబులును వ్రాసి యిత్తుఁ బటము, నీ
వేడుకకుఁ దగిన వానిం
జూడు మతనిఁ దెత్తు నన్నుఁ జూడు లతాంగీ!' 115

తా : ఓ తీవెబోఁడీ! ఏడు దినములలో ఈ (ఇరు+ఏడు) పదునాలుగు లోకములోఁగల వారలను చిత్రపటములలో వ్రాసి ఇచ్చెదను. (ఒక్కొరిని ఒక్కొక పటములో అనుట) నీ కుతూహలమునకు తగిన వానిని (నిన్ను సంతసింపఁజేసిన వానిని) చూడుము. అతనిని నేను తప్పక (చిత్తరువులో) తెచ్చెదను. నా నేర్పును చూడుము.

వ్యా. 1. ఇచ్చుదున్, తెచ్చుదున్ (చూడు. పద్య- 21), 'ఇత్తున్, తెత్తున్' అగును.
2. చూడుము > చూడు. సూ. మధ్యమపురుష మువర్ణకంబునకు హలవ సానంబులు పరంబులగు నపుడు లోపము విభాషనగు. సంధి, బాల - 47.

వ. అని బుజ్జగించి యజ్జోటి నొడంబఱిచి నిజమందిరంబునకు జనియె ననంతరంబ విరహానలంబు ముప్పిరిగొన్న నప్పువ్వుఁ బోఁడి తనలోన. 116

అర్థ : ఆ+జోటిన్ = ఆ ఇంతిని; ముప్పిరి కొన్నన్ = మూడు పిరులుగా అతిశయింపగా.

తా: అని చిత్రరేఖ ఉషాకన్యను ఓదార్చి "అట్లే వ్రాసి తెమ్మ్మ" అని, ఆమె సమ్మతిని పొంది, ఆమెను శాంత పఱచి తన మందిరమునకు వెడలిపోయెను. పిమ్మట కాముని తాపము ఎక్కువకాగా ఆ సుమాంగి తనలో (తరువాతి పద్యముతో).

వ్యా. మూడు+పిరులు 1. సూ.సమానాధికరణంబగు ఉత్తర పదంబు పరంబగునపుడు మూడు శబ్దము 'డు' వర్ణంబునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వమునగు. 2. ద్విరుక్తంబగుహల్లు పరంబగునపుడు ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. 3. ద్విగునకు ఏకవచనంబుప్రాయికంబుగానగు. మిశ్రంబునకు కాదు. సమాస, బాల - 17, 13, 18.

అలం: రూపకము. విరహమనెడి అనలము. అవధారణాపూర్వపదకర్మధారయ సమాసము.

సీ. చెలులు బొమ్మలపెండ్లి చేయుచో లజ్జింతు
మగనికై యే నేల మరులు కొంటిఁ
గలలోన నొకనిఁ జక్కని వానిఁ బొడగని
వెలిఁ జూడ కే నేల వెఱ్ఱి నైతిఁ
దగువరుం డని తార తడవి కూర్పక మున్న
బంధుల కే నేల పలుచ నైతి
గతి మాలి బిగియూరు కౌఁగిలి లేని యా
అడికూర్మి కే నేల ఉట్టు వడితిఁ

గీ. గదిసి పాసిన చవి చూడఁ గలిగెఁ గాని
పాసి కదిసిన చవి చూడ బాగు గాదు
తలఁపునకు జక్క నుండెడి తలఁపు లేదు
లజ్జఁ బోఁద్రోవ లజ్జకు లజ్జ లేదు. 117

అర్థ: మరులు కొంటిన్ = వలపుఁజెందితిని; వెలిన్=బయట; తారు+అ = తార = తామే; తడవి = వెదకిపలుచనైతిన్ = చులుకనైతిని; (తగని పని చేయుటచే మర్యాదను కోల్పోయితిని); గతిమాలి = సరియైన మార్గమును వీడి; గాఢ+ఆలింగనము లేని = గట్టి కౌఁగిలింత లేని (కలలోనిది అట్టిదికాదు);ఆఱడి కూర్మికిన్ = వెతపెట్టు ప్రేమకు; ఉట్టు = నిందకు; పడితిని

= లోనైతిని; కదిసి = చేరి; పాసిన చవి = తొలఁగిన రుచి (సుఖము); పాసి = తొలఁగి; కదిసిన చవి = చేరిన సుఖము; బాగుకాదు = మంచిది కాదు.

తా: చెలికత్తెలు, బొమ్మలకు పెండ్లి చేయు నప్పుడు సిగ్గుపడుచుంటిని. ఇప్పుడు నేను మగని వలపుకొఱకు ఆశించుచున్నాను. కలలో చూచి మేల్కొన్నప్పుడు చూడని సుందరునికై పిచ్చిదాననైతిని కదా! బంధువులు తగిన వాఁడని కూర్చుటకు ముందే నేనే ఒకనిని వలచి మర్యాదను తప్పి నా గౌరవమును పోగొట్టుకొంటిని. సరియైన కౌఁగిలింత పొందక వగపెట్టు ప్రేమను ఆశించి నేను ఏల నిందకు పాలైతిని? నన్ను సమీపించి దూరమైన సుఖపు వగపును అనుభవించితిని. వెడలిపోయి కూడిన విరహతాపముచే మనస్సు నిలుకడగా నుండుట లేదు. సిగ్గును పాఱద్రోలుటకు, సిగ్గునకు సిగ్గులేదు.

వివరణము : నన్ను చేరి తొలఁగిన సుఖమును అనుభవించితిని. అది ఇప్పుడు నా మనశ్శాంతిని పోగొట్టుచే శోకమునకు కారణమైనది. సిగ్గు పడవలసిన స్థితి ఇది. అయినను సిగ్గులేక నేను కలలో కన్న వాఁడు మగఁడని తలఁచుటచే సిగ్గునకు సిగ్గులేదు. (అనఁగా తన చర్య మిక్కిలి సిగ్గు పడవలసినదిగా ఉష క్షోభ చెందుచున్నది).

వ. కలఁ గన్న తెఱంగు విచారించి. 118

తా: ఉష తాను కలకన్న ప్రకారమును ఆలోచించి (మీఁది పద్యముతో).

చం. అకట కటా కటాక్షముల కందియు నందక పోయెఁ గాక వం
చకుఁ డయి వాఁడు నేఁడు దనచక్కఁదనంబు మనంబులోన నిం
కొకపరి చూపెనే నచట నుప్పరవీధి రథంబుఁ దోలుచున్
మకర పతాకుఁ డుగ్ర కుసుమ ప్రదరంబుల పాలు చేయఁడే!' 119

ప్రతి: అకటా+అకటా = అకటకటా = అయ్యో! అయ్యో! వంచకుఁడు+అయి = మోసగాఁడయి; కటాక్షములకున్ = కడగంటి చూపులకు; అందియున్+అందక పోయెన్ గాక; వాఁడు, నేఁడు తన చక్కఁ దనంబున్; మనంబులోనన్; ఇంకన్ + ఒకపరి = నిలుచునట్లు ఇంకొకసారి; చూపెనేని; అచటన్, ఉప్పర వీధిన్ = ఆకాశ మార్గములో; మకర కేతనుఁడు = మొసలి టెక్కెము గలవాఁడు, రథంబున్; తోలుచున్; ఉగ్రకుసుమ ప్రదరంబుల పాలు = వాఁడియైన పూలబాణములకు వశము; చేయఁడే = చేయఁడా!

తా: అయ్యో! ఆ మోసగాఁడు నాకడగంటి చూపులకు అందియు అందనట్లే కలలో

కనఁబడి పోయెను. మరల నేఁడు తన అందమును నా మనసులో నిలుచునట్లు నాకు దర్శన మొసగుచో మదనుఁడు ఆకాశమార్గములో పయనించుచు, నాపై తన వాఁడియైన పూలబాణములను వేసి వానికి వశము చేయును. (మరల కలలో కన్న రూపవంతుఁడు తన ఎదుట తోఁచినచో, తన మనస్సు తన వశము తప్పిపోవునని తన మనస్సు నిలుకడను కోల్పోవు నని, ఉష వగచుచున్నది.)

వ్యా. అకటా+అకటా సూ. అచ్చునకు ఆమ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు. సంధి, బాల - 10.

వ. అనుచు నచ్చపల లోచన వెచ్చ నూర్పుటయును. 120

తా: అనుచు, ఆ చంచలాక్షి వేఁడి నిట్టూర్పులు విడువఁగా (మీఁదిపద్యములో).

చం. కడలఁ దొలంగెఁ దుమ్మెదలు కట్టెదురం బొడసూపనోడి పు
ప్పొడిఁ బొగలుప్పతిల్లె మొగముఁ గమలంబును మోచియున్న య
య్యొడ లెటు లోర్చెనో చిగురు లోర్వవు కందెన దేల వెన్నెలన్
వడవడు మందమారుతము వామవిలోచన వేఁడి యూర్పులన్. 121

ప్రతి: వామ విలోచన = అందమైన కన్నులు గల ఉషయొక్క వేఁడి ఊర్పులన్ = వెచ్చని ఊర్పులచేత; తుమ్మెదలు కడు+ఎదురన్ = ఎట్టఎదుట, పొడసూపన్+ఓడి = కనఁబడుటకు జంకి; కడలన్ = చివరలకు; తొలంగెన్; పుప్పొడిన్ = పూలపొడియందు; పొగలు; ఉప్పతిల్లెను = పుట్టెను; మొగము+కమలమ్మును; మోచియున్న; ఆ+ఒడలు = ఆమేను; ఎటుల+ఓర్చెనో; చిగురులు+ఓర్వవు; కందెన్ = వాడిపోయెను; అది+ఏల? = ఆ సంగతి ఎందుకు? (దానిలో విశేషము లేదనుట) వెన్నెలన్; మందమారుతము = చల్లని మెల్లని గాలిసైతము; వడవడున్ = వేఁడెక్కును.

తా: వేఁడి నిట్టూర్పులచే, ఉష కనుగ్రుడ్ల అందము తొలఁగినది. వాని అందమును వలచి వచ్చిన తుమ్మెదలు నిరాశచెంది కన్నుల ఎదుట నుండఁజాలక వానిని పూర్తిగా వదలి వేయుటకు ఇష్టపడక సమీపముననే తారాడినవి. ఆమె మేని తాపముచే సెజ్జపై గల పుప్పొడియందు పొగలు పుట్టెను. ముఖమనెడి కమలమును భరించి యున్న ఆమె శరీరము ఆ తాపమును ఎట్లు సహించున్నదో కదా! చిగుళ్లు (చెవులకు అమరినవి) ఆవేఁడిమిని సహింపఁజాలక నల్లఁబడెను. (చూడు, పద్య. 134.) ఎదపై చెంగలువ, చెవిలో లేఁత చిగురు, ఇట్లగుటలో వింతలేదు. ఆ తాపమునకు పువ్వు, మేను, చివుర్లు

అనువాని కంటె మిక్కిలి మనోజ్ఞమైన (మంజులమైన) వెన్నెలయందు, చల్లని మెల్లని గాలియును వేఁడెక్కినది.

పద్మినీ జాతి స్త్రీ శరీరము వికసించిన పద్మ పరిమళమును ప్రసరింపఁజేయును. (రతిరహస్యము). దిరిసెన పువ్వు వంటి మృదువైన అంగములను కలిగియుండును. ఊర్పులు సువాసనను వెదఁజల్లును.

వ. మఱియు నమ్మెలంత మేనిసంతాపం బంత కంతకు మిగుల నప్పుడు. 122

తా: మఱియును ఆ ఉషాకన్య శరీరతాపము క్రమక్రమముగా మిక్కిలి కాఁగా; ఆ సమయమున (తరువాతి పద్యముతో).

ఉ. శూలివిలోక నానలముసోఁకు రతీశుఁ డెఱుంగుఁ గాన య
బ్బాలమనంబులో విరహ పావక దాహము నోర్చె నన్న న
ట్లేల పొసంగు దేహము దహించిన యంతటితో మనోజుఁడై
గాలియ చిక్కెఁ గాన చెడఁ గాలఁడు వో యెటువంటి మంటలన్.123

ప్రతి: రతి+ఈశుఁడు = రతిపతి, మదనుఁడు; శూలి = (శూలముగలవాఁడు) శివునియొక్క; విలోకన+అనలము = నొసటి కంటి చూపు మంట యొక్క; సోకున్ = తాఁకును; ఎఱుంగున్+కాన;ఆ+బాల (ఉష); మనంబులోన్; విరహపావక దాహమున్ =ఎడఁబాటు అనెడి నిప్పు యొక్క మంటను (వేఁడిమిని); ఓర్చెన్ = సహించెను; అన్నన్ = అని (ఆమె సహించుటకు కారణము చెప్పినచో); అట్లు+ఏల పొసంగున్ = అదెట్లు సరిపడును? (సందేహము); మనోజుఁడు +ఐ = మనసునందు పుట్టిన వాఁడై; గాలి+అ = గాలిరూపుతో (గాలియై); చిక్కెన్ = మిగిలెను; కాన; ఎటువంటి మంటలన్;చెడన్+కాలఁడు పో = ఇంక పూర్తిగా కాలిపోఁజాలఁడు అనుట నిశ్చయము.

తా: త్రిశూలధారి శివుని నొసటికంటి చిచ్చు తాఁకునకు రతిపతి, మదనుఁడు కాలిబూడిద అయ్యెను. అదెట్టిదో అతనికి తెలియును. కావున ఆ ఉష విరహాగ్ని జ్వాలను సహించెనన్నచో అది ఏల ఒప్పును? శరీరము కాలిపోయిన పిమ్మట మనస్సులో పుట్టి, ప్రాణ వాయువు శేషించినవాఁడు. ఆ కారణముచే మన్మథుఁడు ఎట్టి అగ్ని చేతను పూర్తిగా దగ్ధము కాఁడనుట నిశ్చయము.

వ. అత్తఱిం దత్తాపంబు సయిరింపక యత్తలోదరి యుల్లంబు డిల్లంబు
గాఁ దొడంగినం గీడ్పడం దలంచి తనలోన. 124

ప్రతి: ఆ+తఱిన్ = ఆ సమయమందు; తద్ + తాపంబు = ఆ విరహము వలని వేఁడిమిని; సయిరింపక = ఓర్వలేక; ఆ+తలోదరి సన్నని కడుపు గలది, ఇంతి ఉష; ఉల్లంబు = మనస్సు; డిల్లంబు+కాన్+తొడంగినన్ = ఉత్సాహము తొలఁగినదిగా అగుటకు మొదలిడఁగా (బలము లేనిదగు చుండఁగా మనస్సుపై పట్టు తప్పుచుండఁగా); కీడ్పడన్ + తలంచి = అట్లు అగుటను అడ్డు కొనుటకు ఆలోచించి; తనలోన.

తా: ఆ సమయమందు విరహతాపమును ఓర్వలేక, మనసును వశపఱచుకొనుటకు ఆలోచించెను.

చం. 'కిసలయపత్త్రికన్ మకరకేతన నూతన వార్త లన్నియుం
బొసఁగ లిఖించి యందుఁ దలపూవులుఁ దమ్మియు నాసచేయు నా
కొసరు తెఱం గెఱింగి కుచకుంభములం బతిఁదాల్చు నన్ను సం
తసమున వ్రాసియిచ్చినఁ గదా చెలికత్తెల కేను మ్రొక్కుదున్.' 125

అర్థ : కిసలయ పత్రికన్ = చిగురాకు అనెడి పత్రము నందు (జాబులో); మకరకేతన నూతనవార్తలు = మొసలి టెక్కెము గల మన్మథుని క్రొత్త వర్తనములు, రతి భంగిమలు, (వివిధములైన రతి బంధముల వివరములు); అన్నియును = పొసఁగన్ = చక్కఁగా తెలియునట్లు; లిఖించి=చిత్రించి; అందున్ =ఆ పత్రికలో; తలపూవులును; తమ్మియున్ = నమలిన తాంబూలమును; ఆసచేయు + ఆ కొసరు తెఱంగు = ఆశపడు ఆ కోరిక తీరు; కుచకుంభములన్ = కడవలవంటి స్తనములతో; పతిన్; తాల్చు = పిఱిపెట్టు (పెనవేసికొను, కలిసి మెలిసి మెలివేసికొను).

తా: చిగురాకు అనెడి పత్రమునందు, క్రొత్తక్రొత్త రతిబంధములు (వివిధ భంగిమలు) అన్నియు చక్కఁగా తెలియునట్లు (విడివిడిగా వేర్వేఱు పత్రములని భావింప వలెను) చిత్రించి, అందొక దానియందు, (నా) తలలోని పూవులను నేను నమలిన తాంబూలమును ఆశపడుచు పైకి ఎగయు పతి కోరిక తీరు తెలిసికొని అతనికి తృప్తి నిచ్చుటకై కడవలవంటి కుచములతో అతనిని మెలివేసికొను నన్ను, సంతోషముతో చిత్తరువులో చిత్రించి ఇచ్చినప్పుడు కదా, నేను, ఆ చెలికత్తెలకు నమస్కరించెదను.

విశే. వార్తలు = వర్తనములు (శ.ర) ఈ పద్యములో ఉపరతి వర్ణన మున్నది. ప్రియుఁడు క్రిందను ప్రియురాలు ఆతనిపై నుండును. అపుడు ప్రియుడు తలపూలను వాసన చూచును. మఱియు, ప్రియురాలు నమలిన తాంబూలమును అతఁడు ఆవేశముతో అధరపానము చేయుచు చొక్కును. ఆస్థితిలో ఉద్రేక మెక్కువైన ప్రియురాలు, ప్రియుని

తృప్తికై మెలి వేసికొనును. ఇట్లు ఒడలు తెలియని ఇరువురి భంగిమను చిత్రించినప్పుడే ఉష చెలికత్తెలకు నమస్కరించును. పురుషాయితమందు అభీష్టమెక్కువగుటచే దానిని వాంఛించుటయే గాక, చిత్రమందు ఆదృశ్యమును చూచి పరవశత్వము చెందవలయునని రాక్షస కాంత ఉష అపేక్షించుచున్నది. ఆమె కామోద్రేకము అవధులు అతిక్రమించుటలో అచ్చెరువు లేదు. చూడుము, పద్య-73, 75, 76.

వ. అనుచుఁ బరిభోగ వాంఛా నిరత యయ్యె నయ్యవసరంబున. 126

తా: అనుచు సంపూర్ణమైన భోగమందు (సంభోగమందు) కోరిక చాల ఎక్కువ కాఁగా, ఆ సమయమందు.

కం. నీహారము పేర సఖీ
వ్యాహారము విన్న నలుగు వారుఁ దనువుగా
నేహార మఱుతఁ బెట్టిన
నాహారము దొఱఁగుఁ దొరఁగు నాహారంబున్. 127

ప్రతి: నీహారము పేరన్ = మంచను పేరుతో; సఖీ వ్యాహారమున్ = చెలికత్తెల మాటను; విన్నన్; అలుగున్ = కోపించును; వారు = ఆ చెలులు; తనువుగాన్ = బరువులేనట్లు (తేలికగా) నేహారము = ముత్యాలహారమైనను (చల్లఁదనమును ఇచ్చుటకు); అఱుతన్ = మెడయందు; పెట్టినన్; ఆ హారము = ఆదండ; తొఱగున్ = తొలఁగును; ఆహారంబున్ = తిండిని కూడ, తొరుగున్ = విడిచిపెట్టును.

పాఠాం. తనువుగాన్ = చల్లఁదనమునకై.

తా: చెలుల నోట మంచు అనుమాట విన్నచో ఉష మండిపడును. వారు ఆమె కంఠమును తేలికయైన (చల్లఁదనమునకై) ముత్యాల హారమును పెట్టినను, అది జాఱి పోవును. ఆమె తిండిని కూడ విడిచిపెట్టును.

విశే. చల్లని వస్తువు వేఁడిమి కలిగియుండుట తాపసూచకము. హారము తొలఁగుటకు కారణము దుర్బలత్వము (కృశత). తిండిని వదలుట, అరుచి లక్షణము.

రూ. తొరుఁగు, తొరఁగు. నేహరము, నేవళము, నేవడము నేహారము.

వ. ఆ సమయంబునం బతిం దడవం దలంచి వెడవెడ మదవోన్మాదంబు
వొడమిన నప్పుడంతుక యిట్లనియె. 128

తా : ఆ సమయమున పతిని గురించి విచారింపఁ దలఁచి కొంచెము కొంచెముగా, కాముని వలన ఉన్మాదము (మన్మథావస్థ) కలుగఁగా, ఆ ఉష ఇట్లు పలికెను.

ఉన్మాదము = చేతనముల యెడ అచేతనముల యెడ ఒకే విధముగా ప్రవర్తించుట. (ప్రాణము లేని వస్తువులను ప్రాణులుగా భ్రమించి ప్రవర్తించుట),

ఉ. 'నాదెసఁ గాము నమ్ములకు నా టుట వైళమ సిగ్గుఁ జిత్తమున్
వాదులు వెట్టుకొన్న *యవి వాడిన నెవ్వరిఁకైన ముందు రా
రో దయితుం గనుంగొన సరోరుహలోచనలార! యింతకున్
జాదుల యిల్లు చొచ్చి సెకఁ జల్లెడి వెన్నెల వెట్టికొందునే?' 129

ప్రతి : నా దెసన్ = నా విషయమున; కాము+అమ్ములకున్ = మదనుని బాణములు; నాటుట వైళమ = గ్రుచ్చు కొనినవెంటనే; (వయిళము, వైళము = శీఘ్రముగ) సిగ్గున్; చిత్తమున్; వాదులు + పెట్టుకొన్న + అవి (కోరిక ముందునకు పోవలెననగా, సిగ్గు దానిని వెనుకకు లాగుచున్నది); వాడినన్ = (సిగ్గు, చిత్తము - పోరాటములో) దుర్బలములయినచో (మరణము సంభవించు స్థితి ఆసన్నమైనచో); ఎవ్వరు = (రక్షించుటకు) ఎవరు ఉన్నారు? ఇంకన్ + ఐనన్ = (తన స్థితి ప్రాణాపాయకరమగుచున్నదని ధ్వని) = ఇంక ఏ మాత్రము జాగుచేయక; సరోరుహ లోచనలార! = పద్మనయనలార! దయితున్= ప్రియుని, కనుంగొనన్ = ఎచ్చటనున్నాఁడో తెలిసికొనుటకు (వెంటనే నాతాపమును పోగొట్టుటకు); ముందురారో = నా ముందునకు రారా ఏమిటి? (అట్లు చేయనిచో), ఇంతకున్= ఇంతలోపలనే (ఆలస్యము చేసినచో); జాదులు + ఇల్లు = జాజిపూవుల పొదరిల్లు; చొచ్చి; సెకన్+చల్లెడి = వేఁడిమిని వెదఁజల్లు; వెన్నెల + పెట్టికొందునె = వెన్నెలలో పడి, (తాపమును) ఇంకను ఎక్కువగా చేసికొమ్మందురా?

తా. నా విషయములో, మదనుని బాణములు గ్రుచ్చుకొన్న వెంటనే, సిగ్గు మనస్సు, రెండు పోరు చేయుచున్నవి. సిగ్గు మనస్సును ముందునకు పోనీయదు. మనస్సు ముందుకు సాగవలయునని, వాదులాడు చున్నది. ఇట్లు వాని పోరాటముచే నేను కృశించినచో, నన్నెవరు రక్షింపఁగలరు? ఇంకనైనను మీరు నా పతి ఎవఁడో తెలిసికొని, ఆ ప్రియుని కూర్చుటకు ముందునకు రారా? మీరట్లు చేయక పోయినచో, నేను జాజిపూల పొదరిల్లు చొచ్చి, అది చల్లెడి సెగల వెన్నెల జల్లుల వాగులో పడి పోవలసినదేనా?

* నవి వాడిన నెవ్వరికీను

విశే : జాజి పూల పొదరిల్లు అగ్ని గృహమని, అందు ప్రసరించు వెన్నెల నిప్పురవ్వలని ఉష వేదన. శైత్యోపచారసాధనములు సంతాపపోషకము లగునని, ఉష వగచుచున్నది.

వ్యా. కాము+అమ్ములు. కాము నమ్ములు.

సూ. షష్ఠీ సమాసమునందు ఉకార ఋకారములకు అచ్చు పరమగునపుడు నుగాగమంబగు. సంధి, బాల - 34

వ. అను నెడఁ బిరిగొన్న యారటంబు పారింబొరిఁ గారింపఁ దొడంగిన. 130

ప్రతి: అను + ఎడన్ = అను నప్పుడు; పిరిగొన్న = పెనఁగొనిన, అతిశయించిన, ఆరటంబు = వేఁడిమి; పారిన్ + పొరిన్ = మాటిమాటికి; కారింపన్ + తొడంగినన్ = బాధించుటకు మొదలిడఁగా,

తా. అను చుండఁగా కాముని తాప మతిశయించి ఉషను మాటి మాటికి తీవ్రతరముగా వేధింపఁగా.

వ్యా. అను + ఎడ > అను నెడ, (చూడు, పద్య 6)

గీ. ఎసఁగు సంతాపభరమున నిట్టు నట్టుఁ
బొరలు శయ్యాతలంబునఁ బువ్వుఁబోఁడి
తివురు విరహానలంబున దివ్వె లెత్తఁ
జిత్తజాతుండు వత్తిఁ దాల్చిన విధమున. 131

ప్రతి: పువ్వుఁబోడి = (పువ్వువంటి మేనుగలది) ఉష; తివురు = తీవ్రమగుచున్న; విరహ + అనలంబునన్ = ఎడఁబాటువలన నిప్పుతో; చిత్తజాతుండు = కాముఁడు; దివ్వెలు + ఎత్తన్ = దీపములను పెట్టుటకు; వత్తిన్ = (దూదితో చేసిన) దీపపు వత్తిని, తాల్చిన విధమునన్ = తిరికలు చేసినట్లు(పేనినట్లు); శయ్యాతలంబునన్ = పాన్పు పై భాగమున; ఇట్టున్ + అట్టున్ = ఈ ప్రక్కకు, ఆ ప్రక్కకు; పొరలున్ = కదలు చుండెను.

తా. పువ్వువంటి మేనుగల ఉషాకాంతకు, ఎడఁబాటువలన అగ్నిచే, శరీరమందు వేఁడిమి ఎక్కువయ్యెను. కాముఁడు దీపములు పెట్టుటకుఅగ్ని జ్వాలకై, ఉష అనెడి దీపపువత్తిని పేనుచున్నాడేమో అనునట్లు ఆమె పాన్పుపై ఇరుప్రక్కలకు పొరలుచుండెను.

అలం : 1. రూపకము, విరహానలము. 2 ఉత్ప్రేక్ష : వత్తి తాల్చిన విధమున... పొరలున్,

వత్తి(వి), వర్తి(ప్ర)

వ. తదనంతరంబ యంతరంగంబు సంతాపంబు చేతఁ జేతనా రహితం
బగుచు వచ్చిన. 132

తా. తర్వాత, ఉష మనస్సు తీవ్రమైన వేఁడిమిచే, తెలివిని కోల్పోవు చుండఁగా (మీది పద్యముతో).

ఉ. డెందము మీఁదఁ జెందొవకు డెప్పరమేమియు లేదు; చన్నులం
జిందదు ఘర్మవారి; చెవిఁ జేర్చిన లేఁజిగు రించుకంతయుం
గందదు; నాసికాగ్రమునఁ కన్నుల బాష్పము లూర; వింక నీ
సుందరిఁ గావ నేరఁడు ప్రసూనశరుం డని యార్త మూర్తులై. 133

అర్థ : చెన్ను + తొవకు = ఎఱ్ఱకలువకు; డెప్పరము= (ఆపద) వాడుట, చిందదు = తొనకదు; కందదు = నలుపును పొందదు; నాసిక + అగ్రమున = ముక్కుచివర; బాష్పము = (కంటి) నీరు; కావన్ + నేరఁడు = కాపాడలేఁడు; ఆర్త మూర్తులు + ఐ = శోకమునే రూపములు కలవారై.

తా. ఎదపై నుంచిన, ఎఱ్ఱకలువ ఇంచు కైనను వడలదు. చన్నులపై చెమ్మటనీరు స్రవింపదు (పుట్టదు). చెవిలో అలంకారముగా ఉంచిన లేఁత చిగురు, కొంచెమైనను నల్లఁదనమును పొందదు, ముక్కు కొనపై కన్నీరు జాఱదు. ఇంక ఈ సుందరిని, (ప్రాణము పోవు స్థితిలో నున్న దానిని కుసుమశరుఁడు రక్షింపలేఁడు అని ఉష చెలులు శోకమూర్తులై(రి).

విశే, మరణము కలుగఁబోవునపుడు, సంభవించు స్థితి వర్ణింపబడినది. కాముని తాపము వలన తోఁచు లక్షణములన్నియు క్రమక్రమముగా అంతరించు చుండెను. ఉష అచేతన స్థితికి జాఱిపోవు చున్నదనుట, ఇది మన్మథావస్థలలో చివరి దశ.

వ్యా. చెందొవ. చూడు. పద్య - 50

వ. చెలికత్తె లున్నంత. 134

తా : అట్లు చెలులు శోకముతో నుండఁగా.

శా. ముల్లోకంబుల మూర్తులం బటమునన్ ముద్రించి నేర్పెల్ల రా
జిల్లన్ మెల్లన ఁజిత్రరేఖ చనుదెంచె న్నిండుప్రాణంబు సం

ధిల్లన్ 'బాణతనూజకుం జెలులకున్ దిక్కెవ్వరున్ లేరు నా
తల్లీ వచ్చితె' యంచు నెచ్చెలులు మోదం బంద డెందంబునన్.135

తా బాణుని కూతురగు ఉషాకన్యకకు, ఆమె చెలులకును, కొన ఊపిరితో నున్న ప్రాణములను పోనియ్యక నిలుపుటకై, మూడులోకములలో నున్న యువకుల చిత్తరువులను (స్వరూపములను) వేర్వేఱు పటములందు, తన చతురత మెఱయునట్లు చక్కగా స్పష్టముగా చిత్రించి, చిత్రరేఖ, మెల్లగా వారి కడకు వచ్చెను " మాకు నీవు తప్ప ఎవ్వరు సాయపడు వారు లేరు. నా తల్లీ! వచ్చితివా." అనుచున్న చెలుల హృదయములు అప్పుడు మోదముతో వికాసము నొందెను.

వ్యా. 1. మూడు + లోకములు. మిశ్రద్విగు సమాసము. ముల్లోకములు, సమాస, బాల - 17,13

సూ. ద్విగువునకు ఏకవచనంబుప్రాయకంబుగానగు మిశ్రంబునకు గాదు.సమాస, బాల - 18. కనుక 'ముల్లోకములు' అనియే ఉండును (చూడు, పద్యము - 116)

2. వచ్చితివి + ఎ... వచ్చితి. వకారలోపము. క్రియ, బాల 24.మధ్యమ పురుష క్రియలందు ఇత్తునకుసంధియగును. సంధి, బాల - 7.

వ. ఇట్లు వచ్చి యక్కాంత యంతకు మున్న యంతంత వింతగా సంతరించిన శశికాంత జలశీకర శిశిరతర శయనాంతరంబున నప్పటి కప్పటికి వెలయు పుప్పొడి తిప్పలును గప్పురంపుఁగుప్పలు నుప్పతిల్లిన శీతకరమణిశిలాతలంబుల నెడనెడ జాలకంబుల జడిగొన్నఁ బొడకట్టు వెన్నెలచేత నట్టువడి మణికుట్టిమంబులు దుడిచి తుడిచి కడ గానక చిడిముడి పడి యొండొండ బొండు మల్లెలు నిండ నత్తెఱపుల నొఱపుగాఁ బఱపు కొందఱు దెఱవల ముద్దరాలితనంబునకు మెఱుం గిడిన తెఱంగున మెఱయు చతురవనితాకీలిత వితత ధాతుపట యవనికా వితానంబులం గుఱుచ కుఱుచ కురువేరునం బరువం బగు మరువంబునం గసుగందని బిసంబుల నుప్పరిగలో శారికా శుకపికంబులు చడిచప్పుడు దెప్పరమ్ము చేయకుండం జలిచప్పరం

బిడి మలయానిలంబు మలయు పలుచని తావులకు వలయు చెరువులు చెరివి మివులం బొరువున నురిలిన కుసుమకిసలయ కేసరవిసరంబుల నందంద యరవింద కర్ణికా పీఠంబులఁ గందర్పపూజ చేసినం జెలువొందు నిందీవరంబులుఁ జెందొవలుఁ గందువల సందడించు నిందిందిరంబులకు విందులుగా సమంచి తాకుంచి తాలకంబు లగు నలికంబులు వంచి పంచబాణశరంబు లని ప్రమాణంబు విచారించు విరహపరితాప పరిహరణ నిపుణ పురంధ్రీగణంబులఁ గన్నకన్నచోటఁ జె న్నమరిన కన్నియలు విన్న నై యున్న యన్నాతి కన్నీరు దుడిచి తుడిచి పన్నీరునం జేఁ దడిపికొన వలసి రజత పేటికాపటలంబు వెడలం దిగిచి కులికి కులికి చుట్లం దొలంగ వైచిన చిందంబులతోడం బురుడించు చందన లిఖిత చంద్రమండల సమర్పనా సమయ సముచిత పరివార దేవతాయమాన తారకా నికరంబుల మఱియుం గదళీదళ వీజనంబులఁ గస్తూరికా కర్దమంబులఁ గనక క్షరండ భరిత మకరందంబుల మణికలశ పూర్ణమలయజ తోయంబులన్ విన్యస్త వివిధ కుసుమ స్తబక విశాల శాలాంగణంబుల విగతవీణా వినోదాది విహారదేశంబుల విచ్ఛిన్న విభ్రమ మోపహార విచార పిచ్ఛందకాది మందిరంబుల మూకీభూత శుకశారికా నికాయంబులం గల కన్యాంతఃపురంబు గలయం గనుంగొని. 136

ప్రతి: ఇట్లు వచ్చి; ఆ + కొంత; అంతకున్ మున్ను + అ = తాను వచ్చుటకు ముందే; అంతతన్ = అక్కడక్కడ, వింతగన్ = అచ్చెరువు కలుగునట్లు; సంతరించిన = సమకూర్చిన (చేర్చిన), శశికాంత = చంద్రకాంత మణుల యొక్క; జలశీకర = నీటి తుంపురుల చేత; శిశిరతర = మిక్కిలి చల్లనైన; శయన + అంతరంబునన్ = సెజ్జనడుమ; అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పుడప్పుడే, వెలయు = ఏర్పడినట్టి పుప్పొడి తిప్పలును = పూలపొడి కల పోగులును; కప్పురపు + కుప్పలున్ =కర్పూరపు రాశులును; ఉప్పతిల్లిన = పుట్టినట్టి, శీతకర మణి శిలా తలంబునన్ = చల్ల దనమును కలిగించు, తాపిన ప్రదేశములందు; ఎడనెడన్ = అచ్చటచ్చట; జాలకంబులన్ = వరుసలుగా కట్టిన పూమొగ్గల సమూహముతో, జడిగొన్నన్ = అతిశయింపగా; పొడగట్టు = కన్పట్టు; వెన్నెల చేతన్ నట్టువడి = అడ్డు పడుటచే; మణి

కుట్టిమంబులు = రత్నమయములైన (తాపిన) ప్రదేశములను; తుడిచి తుడిచి = బాగుగా తుడిచి; కడగానక = ఎంత తుడిచినను, ఆ పనికి ముగింపు లేక; చిడి ముడి పడి = కలఁత చెంది, ఒండు + ఒండు + అ = క్రమ క్రమముగా, బొండు మల్లెలు, నిండన్; ఆ + తెఱపులందు = ఆచోట్లలో, ఒఱపుగాన్ = అందముగా; పఱపు = పఱచునట్టి కొందఱు తెఱవల =కొందమంది యువతుల యొక్క ముద్దరాలి తనంబునకున్ = తెలివిలేమికి, మెఱుంగు + ఇడిన తెఱంగునన్ = వారి పనులలో గల సడలికలను గమనించి సవరించినట్లు; మెఱయు = బయలు పఱచు (తెలియఁజేయు), చతుర = నేర్పరులగు; వనితా = ఉత్తమురాండ్రైన అనురాగవతులచే; కీలిత = కూర్పఁబడిన; వితత = విరివియైన; ధాతుపట = గైరికాది మణులు కల వస్త్రముల యొక్క; యవనికా = తెరలతోను; వితానంబులున్ = చాందినులతోను;

కుఱుచ కుఱుచ కురువేరునన్ = కుఱుచయైన కురువేర్లచేతను, పరువంబు + అగు = చక్కగా ఎదిగి మిక్కిలి ముదురుగాని; మరువంబునన్ = మరువమనెడి వాసన గల ఆకుల చేతను; కసుగందని = మిక్కిలి వాడిపోని; బిసంబునన్ = తామర తూండ్ల చేతను; ఉప్పరిగలోన్ = మేడమిది కట్టడములలో, శారికా శుక పికంబులు = గోరు వంకలును, చిలుకలును, కోయిలలును, చడి చప్పుడు = ఎట్టి చటిల్లను ధ్వనిని గాని (ఎగురుటచే), కూఁతలు వేయుట గాని; దెప్పరము చేయక + ఉండన్ = వెతపెట్టి ఏవిధమైన బాధను కలిగింపక ఉండునట్లు; చలి చప్పరంబు + ఇడి = (అవి వినోదముతో విహరించుటకు) చల్లని పందిళ్ళు ఏర్పాటు చేసి; మలయ + అనిలంబు = గంధపు చెట్లు గల కొండల నుండి వచ్చుగాలి, వీచు; పలుచని రావులకున్ = వెలితి గల చోట్లలో, వలయు చెరువులు = (గాలి లోనికి రాకుండుటకై) తగినన్ని పూలు లేదా చిగుళ్ళగుత్తులు (గ్రుచ్చ బడినవానిని) చెరివి = సందులలో ఇమిడ్చి, మివులన్ పొరువునన్ = చాల దగ్గఱ; ఉరిలిన = రాలినట్టి, కుసుమ కిసలయ కేసర విసరంబులన్ = పువ్వులచిగుళ్ల, అకరువుల (కింజల్కముల) సమూహములందు, అందందన్ = అక్కడక్కడే, అరవింద కర్ణికాపీఠంబులన్ = తామర పువ్వుల దుద్దుల యొక్క పీఁటలపై (ఆసనములపై); కందర్ప పూజ = కాముని పూజించుట ; చేసినన్ ; చెలువు + ఒందు = అందముతో అతిశయించు, ఇందీవరంబులున్ = నల్ల కలువలును; చెన్ను + తొవను = ఎఱ్ఱకలువలును; కందువలన్ = ఆయా చోట్లలో; సందడించు = మూఁగి రొదచేయునట్టి; ఇందిందిరంబులకున్ = తుమ్మెదలకు, విందులు కొన్ = చుట్టములుగా (ఇష్టములైనవిగా), సమంచిత + ఆకుంచిత = అలకంబులు + అగు = చక్కగా వంకరలైన ముందుగల తలవెండ్రుకలు కలవి అగు, అలికంబులు = నొసళ్లు (ఫాలదేశములు); వంచి, పంచ బాణ శరంబులు = మదనుని అమ్ములు, అని; ప్రమాణంబు విచారించు = కొలఁతను గుఱించి ఆలోచించు, విరహ పరితాప పరిహరణ = ఎడఁ బాటు వలన కలుగు ఎక్కువైన వేఁడిమిని పోగొట్టుట యందు; నిపుణ పురంధ్రీ గణంబులన్ = నేర్పరులైన ఉత్తమ ఉవిదల మొత్తములను; కన్న కన్న చోటన్ =

చూచిన చోట్లలో; చెన్ను + అమరిన కన్నియలు = చక్కఁదనము నెలకొన్న కన్నెలు; విన్నన + ఐ + ఉన్న = మేని వన్నె లేక దిగులుతో ఉన్నట్టి, ఆ + నాతి = ఆ ఇంతి ఉష యొక్క; కన్నీరు; తుడిచి తుడిచి, పన్నీరునన్ = చల్లని (సువాసన ద్రవ్యము గల) నీటితో, చేన్ = చేతిని తడిపి కొనవలసి; రజత పేటికా (వీటికా) పటలంబు = వెండి పెట్టెల మొత్తమును; వెడలన్ + తిగిచి = వెలుపలికి లాగి; కులికి కులికి = బాగాకదలించి (అందున్న నీటిని) వెదఁజల్లి; చుట్లన్ = చుట్టును, తొలంగన్ వైచిన =పాఱ వైచిన, చిందంబులతోడన్ = శంఖములతో పురుడించు = పోలునట్టి, చందన = మంచి గంధముతో; లిఖిత = పూయఁబడిన, చంద్రమండల చంద్ర బింబము యొక్క; సమర్చనా సమయ = పూజించు వేళయందు, సముచిత =చక్కగా తగిన, పరివార దేవతాయమాన = సేవకులుగా దేవతలైన; తారకా = నక్షత్ర; నికరంబులన్ = సమూహములతోను, మఱియును; కదళీదళ వీజనంబులన్ = అరఁటి ఆకుల వీవనలతో; కస్తూరికా కర్దమంబులన్ = కస్తూరి యొక్క చిక్కని తడిగల ద్రవ్యములతోను (దాని బురదతోను) ; కనక కరండ భరిత మకరందబులన్ = బంగారు బరిణలలో నిండిన పూల తేనెతోను, మణి కలశ పూర్ణ మలయజ తోయంబులన్ = మణులతో తాపిన పాత్రములందు, నిండిన చల్లని పన్నీటితోను; విన్యస్త వివిధ కుసుమస్తబక =అమర్చిన, వేర్వేఱు పూలగుత్తులతోను; విశాల శాలా + అంగణంబులన్ = పెద్దవైన వెడల్పైన చోట్ల యొక్క ముందు భాగములతోను, విగత = (పోయిన) లేని, వీణా వినోద + ఆది = వీణెల నాదము కల వేడుకలు మొదలగు, విహార దేశంబులన్ = సంచరించుటకు తగిన చోట్లతోను, విచ్ఛిన్న విభ్రమ ఉపహార విచార = విరమింపఁబడిన (తొలఁగిన) విలాస క్రీడల చేతను, కానుకల ఆలోచనలతో నున్న, పిచ్ఛందక + ఆది = ఆ పేరుగల గృహరచనలు గల;

పాఠాం: విచ్ఛందక + ఆది =స్వేచ్ఛ మొదలైనవి లేని; మందిరంబులన్ = వేర్వేరు మేడల యొక్క లోపలి భాగములతో, మూకీ భూత = మూఁగవోయిన (శబ్దించుటను మాని వేసిన); శుక శారికా నికాయంబులన్ = చిలుకల, గోరువంకల సమూహములతోను; కలఃకూడియున్న; కన్యా+ అంతఃపురంబు, కలయన్ = అంతటను; కనుంగొని,

తా. ఈ విధముగా చిత్రరేఖ వచ్చెను. ముందే అచ్చటచ్చట అచ్చెరువు చెందునట్లు, పేర్చిన, ఇంద్రకాంతమణులపై గల నీటి తుంపురులచే, మిక్కిలి చల్లనైన పాన్పునడుమ, అప్పుడప్పుడు ఉష మేని వేడిఁమిచే, (వాడినట్టి వానిని పాఱవేయఁగా) ఏర్పడిన పుప్పొడి పోగులును.కర్పూరపు రాశులును (చల్లఁదనమును కలిగించుటకు ఉషమేని పై పుప్పొడిని, కర్పూరపు పొడిని విరివిగా నుపయోగించు చుండిరి. అది వేఁడెక్కగావానిని తొలగించు చుండిరి.)

చల్లఁదనమును కలిగించుటకు మణి శిలలు తాఁపిన గోడల పై అచ్చటచ్చట

అమర్చిన మొగ్గలతో అవి అతిశయించుచుండఁగా అవియును వేఁడిమిని బొంది, అడ్డు పడుటచే, వెన్నెల సాయమున అవి కన్పట్టఁగా ఆ యా కుట్టిమములపై గల వానిని (ఆ పూల మొగ్గలు వేఁడెక్కి గోడలకు అంటుకున్నది. వానిని తుడిచి వేయవలసి వచ్చినది) తొలఁగించుటకు పెక్కుసార్లు ప్రయత్నించినప్పటికిని ఫలము అల్పముగా నుండెను. ఎంత తుడిచినను ముగింపు అనునది లేకపోయినది. ఉష శరీరతాపముచే, ఆ గోడలు కూడ కలుషితము లగుచుండెను. కనుక చెలికత్తెలు చాల కలఁత చెందుచుండిరి. ఆ యా చోట్లలో బొండుమల్లెలను, కొందఱు అందముగా పరచుచుండిరి. ఆయువతుల పనితనమునకు (అమర్చుటలో వారి తెలివి తక్కువగా నుండుటచే) మెఱుంగులు దిద్దునట్టి నేర్పరులగు ఉత్తమురాంఢ్రైన అనురాగ వతులు, విరివిగా కొండల నుండి పొందిన మణులు కల, సన్నని వస్త్రముల పెద్ద తెరలను, మేలుకట్టులను ఏర్పాటు చేసిరి. మఱియును కుఱుచయైన కురువేర్లను, సువాసనను వెదఁజల్లు పక్వమైన మరువపు ఆకులను వాడని తామర కాఁడలను అమర్చిరి. మేడపై భాగములలో గోరువంకలు చిలుకలు కోయిలలు చప్పుడు చేసి ఉషకు ఎట్టివెతను కలుగ నీయకుండుటకు అవి వినోదించుటకు ప్రత్యేకముగా విడిగా చల్లని పందిళ్లు నిర్మించిరి.

చల్లని చెట్లనుండు వీచు గాలి లోనికి రాకుండుటకై సన్నని రంధ్రములలో పూలగుత్తులను, చిగుళ్ళను ఇమిడ్చిరి. మిక్కిలి సమీపములో రాలినట్టి పువ్వులు, చిగుళ్ళు, కింజల్కముల సమూహములో అక్కడక్కడ తామర పువ్వుల దుద్దులనెడి ఆసనములపై కాముని పూజించిరి.

అచ్చుటచ్చుట చక్కగా నుండు నల్ల కలువలను, ఎఱ్ఱకలువలను మూఁగి రొదచేయు తుమ్మెదలకు విందు చేయు ముచ్చటైన ముంగురులతో నొసళ్లు గలిగినట్టియు, పంచబాణుని శరంబులై, వాని కొలఁతను విచారించునట్టియు, ఎడఁబాటువలన కలుగు వేఁడిమిని పోగొట్టుటయందు, నేర్పరులైన ఉత్తములైన ఉవిదలు, ఉషకు తగిన సేవలు చేయుచుండిరి. అంతటను అందముతో అలరారు అన్నులమిన్నలు, మేని వన్నె తొలఁగి, వంతతో నున్నట్టి ఉష కన్నీటిని తుడుచుటకు చేతిని తడిచేసికొనుటకు చిన్న వెండి పెట్టియలను బాగుగా కదలించుచు, అందలి పన్నీటిని పొంది, తెల్లని శంఖములతో సాటియగు వానిని అక్కడ చుట్టును పాఱవేయు చుండిరి. ఆ రజతపేటికలు, మంచి గంధముచే వ్రాయఁబడిన చంద్రబింబమును పూజించు సమయమందు, కొలువునకు ఏతెంచు, సేవకు దేవతలగుచున్న నక్షత్రముల సమూహములు అనునట్లు కన్పట్టినవి. (ఉష ముఖము చంద్రబింబము వలె ప్రకాశించు చుండెనని ఊహింపనగును).

అరఁటి ఆకుల వీవనలన్ను,తడిసియైన కస్తూరియొక్క ముద్దలను, బంగారు పెట్టియలలో గలపూఁదేనెను, మణులలో తాపిన పాత్రలలో గల చల్లని నీటిని, అమర్చియున్న వేర్వేఱు పూలగుత్తులతో, నిండియున్న పెద్దవైన మండపముల ముంగిళ్లను, వీణానాదము యొక్క వేడుకలేని సంచరించు చోట్లను, ఆఁగిపోయిన విలాసములును, కానుకల ఆలోచనలును గల వేర్వేఱు మేడలోపలిభాగములను, (విచ్ఛందకాది = స్వేచ్ఛ మొదలైనవి లేనట్టి మందిరములను) శబ్దము చేయని చిలుకలతోను గోరువంకలతోను, కూడియున్న, ఉషాకాంతయొక్క అంతఃపురమును అంతటిని చిత్రరేఖ చూచెను.

విశే : చిత్రరేఖ ఉష అంతఃపురమున కాంచిన దృశ్యము స్వభావోక్తితో చిత్రితమైనది.

వ్యు : ఇందిందిరము, పద్మ సంపదతో కూడినది, తుమ్మెద.

నానా: వితానము = మేలుకట్టు, సమూహము, ఇల్లు, జన్నము, శూన్యము మొ.

నానా:తారకము = కన్ను, కంటిగ్రుడ్డు, ఓంకారము, ముత్యము, తెప్ప, తరింపఁజేయునది, నక్షత్రము.

కం. 'ఏ నొకటి చేయఁ దలఁచినఁ
దా నొకటి దలంచె విధి లతాతన్వికి నా
పూనినపని తుదిముట్టం
గానిక యీనైతి *నైతిఁ గపటంపుఁ జెలిన్.' 137

అర్థ: లతాతన్వి = తీఁగవంటి నడుము కలది ఉష; కానిక,రూ. కానుక;

తా: నేను ఒక పనిచేయఁదలచితిని. కాని దైవము ఇంకొకవిధముగా చేయఁదలచినది. నేను పూనిన పనిని పూర్తిగా చేయలేకపోయితిని గదా! నేను కపటము గల చెలి నయితిని. (నిజమైన స్నేహితురాలు కాకపోయితిని కదా అనుట).

వ్యా. నా పూనిన పని, నేను పూనిన పూని, కర్తృపద ప్రథమకు షష్ఠి. (చూడు, పద్య - 67)

వ. అనుచు వచ్చి యచ్చిత్రరేఖ యమ్మచ్చెకంటి పచ్చవిలుతు రచ్చప ట్టయిన పొన్నపనం బవడించి యున్న నచ్చోటికిం బోయి తప్పక కనుంగొని. 138

* ఁబటము

అర్థ: మచ్చెకంటి = చేపల వంటి కన్నుల గలది, ఇంతి. రచ్చపట్టు = సభ, కొలువుకూటము.

తా: అనుచు, ఆ చిత్రరేఖ ఉష, మదను నకు సభయైన శయ్యమీఁద శయనించి ఉండఁగా అచటికి వచ్చి ఆసక్తితో (ఏకాగ్రతతో) చూచి.

ఉ. 'నవ్వక నవ్వు నెమ్మొగమున న్నిగుడారెడు వింతకాంతియున్
మవ్వపుఁగ్రొమ్మెఱుంగులకు మాఱట లైన కటాక్షరోచులుం
జివ్వలు చేసి చేసి యిటు చిక్కనె వెన్నెల వెల్లి వేఁడికిం
బువ్వుల వాఁడికిం జిగురుఁబోఁడికి నే మన వచ్చు నీయెడన్.' 139

తా: లతాంగియైన ఉష నిండు ముఖమునందు, నవ్వకయే నవ్వునట్లున్న వింత కాంతియు, కడకన్నులలో మృదువైన మెఱుఁగులకు ప్రతిరూపములైన (సమానము లైన) వెలుంగులు కలహించుకొనుటచే వెన్నెల జల్లు యొక్క వేఁడిమికి, పువ్వుల వాఁడిమికి తగ్గినవి. అయ్యో! ఏమనవచ్చును?

విశే. వెన్నెల వేఁడిమికి, పువ్వుల వాఁడిమికి, మొగముకాంతి, కడకంటి వెలుఁగు, రెండును కృశించు స్థితిలోను, ఒక దానికంటె మఱొకటి, తానే ఎక్కుడనిపించుకొనుటకు ప్రయత్నించినవి. చివర రెండును బాగుగా కాంతి లేనివైనవి. చల్లఁదనమును కలిగించు, వెన్నెల, పువ్వులు రెండును ఉషకు కీడునే కలిగించినవి. ఇది చిత్రము, కారణము. ఆమె శరీరము, చిగురు వలె చాల మృదువైనది.

అలం: 1. ఉపమ, కటాక్షరోచులు, క్రొమ్మెఱుంగులకు మాఱటలు (సాటి) అయినవి.

2. కావ్యలింగము. కృశించుటకు కారణము చెప్పుట.

3. పర్యాయోక్తి : గమ్యార్థమును, మరొక విధముగా రమ్యముగా చెప్పుట. ఉష విరహముచే అధికముగా కృశించి కాంతినికోల్పోయినది. ముఖకాంతి, కటాక్షరోచులు కలహించుకొన్నట్లు చెప్పఁబడినది.

వ్యా. 1. నెఱ+మొగము = నెమ్మొగము, ప్రాతాది సమాస సంధి. చూడు, పద్య - 6

2. మవ్వము+క్రొవెమ్మెఱుంగు > మువ్వపు + క్రొమ్మెఱుంగు > మవ్వపుఁగ్రొమ్మెఱుంగు, పుంప్వాదేశ నుగాగమసంధి (చూడు, పద్య - 20)

3. క్రొత్త+మెఱుంగు = క్రొమ్మెఱుంగు (చూడు, పద్య - 64)

వ. అని పలుకుచు నప్పొలంతి కలికి కన్ను కొలుకులం గీలుకొన్న కజ్జల జలకణంబులు దనపై దుకూలాంచలంబుల మెత్త మెత్తన యొత్తి యత్తరళ లోచన కుచంబుపై ముత్తెపు సరంబులు నులి చక్కం ద్రోచి యా చంద్రముఖి యళిక దేశంబునం గలయఁ బడిన యలకంబులు నూలుకొలిపి తెప్పిఱిన చందం బెఱింగి చిత్రపటంబు దెచ్చితి నిదె చూడు మని యిట్లనియె. 140

అర్థ: కలికి = అందమైన; కొలుకులన్ = అంచులందు, కజ్జల జలకణంబులు = కాటుకతో కూడిన కన్నీటి బొట్టులు, తనపై =తాను కట్టుకొన్న; దుకూ ల+అంచలంబులన్ = పట్టుచీర చెఱఁగుతో; నులి = మెలికను; అళికదేశంబునన్= నొసటి మీఁద; అలకంబులు = ముందుగల తల వెండ్రుకలు; నూలు కొలిపి = (చిక్కు పడిన వానిని) చక్కఁజేసి; తెప్పిఱిన చందంబు = తేరుకొన్న తీరు.

తా: అని పలుకుచు, చిత్రరేఖ, ఉష కాటుక కన్నీటిబిందువులను తన పట్టుచీర అంచులతో మెల్ల మెల్లగా ఒత్తి తుడిచి, చలించు కన్నులు గల ఉష పాలిండ్లపై గల ముత్యాల దండల యొక్క మెలికలను సరిచేసి, మఱియు చంద్రుని కాంతులు గల ముఖమునందు, నొసట నున్న తలవెండ్రుకలను, సవరించి, ఆమె తేరుకొన్న దని తెలిసిన వెంటనే "ఇదిగో చిత్రపటంబులను తెచ్చితిని చూడుము" అనెను.

ఉష, అచేతనస్థితిలో నుండుటచే కన్నుల చివర, నల్లని కన్నీటి బిందువులు గడ్డకట్టి నిలిచినవి. చన్నులపై ముత్యాల సరాలు చిక్కు పడినవి. నొసటి ముంగురులు చెదరి ఉన్నవి. స్వయముగా ఉష వానిని చక్క చేసికొన లేకపోయినది.

వ్యా. ముత్తెము+సరంబులు పుంప్వాదేశసంధి. (చూడు, పద్య - 20)

సీ. సుదతి నీమదిలోని సొర దోఁకి మదనుండు
తన కొండు చో టింకఁ దడవుఁ గాక
కాంత నీపలుకులు గరజాణ చిలుకల
వెదకి నాలుక ముల్లు విఱుచుఁ గాక
పడఁతి నీచూపు లుప్పనఁబట్టె లాడించి
చెలుల వక్త్రములఁ బూజించు గాక

మెలుత నీయడుగులు మెలఁగ నేర్చుట చూచి
యందెలతో మాట లార్తుఁ గాక.

గీ. నాకతంబున వచ్చిన నవ్వుఁ బాటు
మాటు వడఁ జేసి నీ కూర్మి మగనిఁ దెత్తు
నిత్తు నీ చిత్రపటమునం దెవ్వఁ డైన
మెత్తు గాక నీ చెలికత్తె మేటి నేర్పు. 141

అర్థ: సొరదోకి = చెడ్డ నడవడిక కలవాఁడు; తడవుఁగాక = తప్పక వెదకు కొనవలెను కదా! కరజాణ = మిక్కిలి నేర్పుగల; నాలుకముల్లు = నాలుకపై ముల్లు; విఱుచుఁగాక = తప్పక విఱువవలెను కదా! ఓటమిని కలిగింపవలెను; ఉప్పనఁబట్టెలు= ఆపేరుగల ఆటను; చెలుల వక్త్రములతో = చెలికత్తెల ముఖముల యందు చూపులతో; (వానిని) పూజించునుఁగాక = తప్పక వికసించునట్లు చేయవలెను కదా! అర్థాంతరము: చెలుల ముఖములతో కలిసి, తప్పక దేవతార్చనలు చేయవలెను కదా! మెలుత = ఇంతి! ఆర్తుఁగాక = తప్పక మాటలాడింతువు కదా! నగుఁబాటు = హేళన; మాటువడన్ = మఱుఁగు పడునట్లు.

తా: ఓ సుదతి! నీ మనస్సులోని దుర్వర్తనుఁడైన మదనుఁడు ఇంక నిన్ను వదలిపెట్టి ఇంకొక చోటును తప్పక వెదకు కొనవలెను. నీ పలుకులు (మదనుని వాహనములైన) చిలుకలను పలుక కుండఁజేయుటకు, వాని నాలుకలపై ముండ్లను తప్పక విఱువ వలెను. వానికి ఓటమిని కలిగింపవలెను. అవి సిగ్గుపడి మాటలను మానుకొన వలెను. నీ అందమైన చూపులు, ఇంక చెలికత్తెల ముఖమునుండి వెలువడు చూపులతో ఆటలాడి, వానికివికాసము తప్పక కలిగింపవలెను. (నీ చూపులు చెలుల చూపులతో ఆటలాడి వానితో కలిసి తప్పక దేవతలకు సేవలు చేయవలెను). నీ పాదముల చక్కని కదలికలు నీ అందెలను తప్పక మాటలాడ చేయవలెను. నావలన నీకు కలిగిన హేళనను (అవమానము) పూర్తిగా తొలఁగించి, నీ ప్రియుఁడైన మగని తప్పక తెచ్చెదను. ఈ చిత్రపటములలోఎవ్వడైనను గాని తప్పక నీకు తెచ్చి ఇచ్చెదను. నీవు నీ చెలియైన నా నేర్పు తప్పక మెచ్చెదవు కదా!

విశే. ప్రియుని రూపదర్శనముచే, కాముఁడు ఇంక బాధింపఁడని భావము.

మ. అనుచుం జిత్రపటంబు దెచ్చి హృదయాహ్లాదంబుగాఁ జూపినం
గని యక్కాంత జగత్త్రయంబు సుమనో గంధర్వ యక్షాప్సరో

దనుజాదిత్యుల సిద్ధసాధ్య వసురుద్రవ్రాతమున్ మారుతా
శన సంకీర్ణ రసాత లాశ్రితుల నాశాశూన్యయై దాఁటుచున్. 142

తా: అని వచించుచు, హృదయము ఆహ్లాదముతో (సంతసముతో) ఉప్పొంగునట్లు చిత్రపటములను చూపఁగా, వానిని చూచుచు ఉష, మూడు లోకములకు చెందిన సామాన్య దేవతలను, గంధర్వులను, జక్కులను (అప్సరస్) జలదేవతలను, రాక్షసులను, పండ్రెండుగురు శ్రేష్ఠులైన దేవతలను (ద్వాదశాదిత్యులను), సిద్ధులను సాధ్యులను వసువులను (ఎనిమిదిమంది), రుద్రులను (పదకొండుమంది), మొదలగువారిని మఱియు నాగదేవతలతో నిండిన పాతాళలోకమును ఆశ్రయించియున్న వారినెల్లను ఆశ అడుగంటుచుచుండగా (ఒక దానిని తరువాత మరొక చిత్రపటమును) చూచెను.

వ. ఇత్తెఱంగునం ద్రిదివ పాతాళంబులయందు మహానుభావులుం గల
రని మునుముట్టం దడివి నిజమనోరథసిద్ధి వడయ నేరక భూమండలం
బవలోకించి భరతఖండంబున. 143

తా: ఈ విధముగా మొదట స్వర్గ మందు (త్రిదివము) పాతాళమందు గొప్పవారు ఉందురని, తన ప్రియుని కొఱకు వెదకి, తనకోరిక నెఱవేఱక పోవుటచే భూమండలములో భారత దేశమందు గల వారి చిత్తరువులను చూడ నారంభించెను.

సీ. పాంచాల పాండ్య బర్బర కిరా తాభీర
కురు విదేహ విదర్భ కుకుర గౌళ
గాంధార మగధ కొంకణ కళింద పుళింద
సింధు సౌవీ రాంధ్ర చేర చోళ
సాముద్ర సాల్వ కోసల కళింగ కుళింగ
వత్స సౌరా ష్ట్రాంగ వంగ మత్స్య
శూరసేన సుదేష్ణ సుహ్మ కాశ కరూశ
లాట కర్ణాట మాళవ వరాట

గీ. కుంత లావంతి *ఘూర్జర కుహ్మక త్రి
గర్త బహుధాన యవన టేంకణ దశార్ణ

* కానూపఘూర్జర త్రి

పుండ్ర బాహ్లీక ద్రవిడ కాంభోజ హూణ
కేకయ వసాతి కాశ్మీర కేరళములు. 144

తా : ఈ పద్యమందు కొన్ని ప్రాంతముల పేర్లున్నవి. చూడుము, అనుబంధము.

కం. మొద లగు ననేకములు జన
పదములు గనుఁ గొనెఁ దదీయపతులను మఱియున్
హృదయం బేమూర్తులఁ జే
రద రమణి మనంబులోని రమణుఁడు లేమిన్. 145

తా: పెక్కు దేశములను, వాని పాలకులను ఉష కాంచినను, ఆమె మనసుకెక్కిన ప్రియుడు ఆ చిత్తరువులలో కానరాఁడయ్యెను. కనుక ఆమె దృష్టి (హృదయము)ఎవరిని చేరలేదు.

కం. తదనంతరంబ చూపుల
కొదవె మహారాష్ట్ర పశ్చిమోత్తర భూమిన్
యదుకుల నాయకు నగరము
సుదతికి నచ్చిత్ర రేఖ చూపెడు చోటన్. 146

తా: కొంతసేపటికి చిత్రరేఖ మఱి కొన్ని చిత్తరువులను చూపుచుండఁగా ఉష చూపులు మహారాష్ట్ర మందు వాయవ్యదిశలో నున్న యాదవనాయకుఁడగు శ్రీ కృష్ణుని నగరమైన ద్వారక మీఁదికి ప్రసరించెను.

వ. అందుఁ గొందఱు యాదవులం గడచి చని. 147

తా: ఆ ద్వారకలో కొందఱు యాదవులను కన్న పిమ్మట (తరువాతి పద్యముతో).

గీ. కనియె నక్కాంత యంతటఁ గమలనాభు
సీరిఁ బ్రద్యుమ్ను సాత్యకిఁ జేరి వారి
సరస ననిరుద్ధుఁ జూడ మై జాదుకొన్న
పులకములతోడ జల్లనఁ బొడమెఁ జెమట. 148

అర్థ: జాదుకొను = తఱచగు, అధికమగు.

తా: ఉషాకాంత, ఆ నగరములో శ్రీకృష్ణుని, బలరాముని, ప్రద్యుమ్నుని, సాత్యకిని, వారి సమీపమున అనిరుద్ధుని చూచెను. వెంటనే ఆమె మేనిలో అధికమైన గగుర్పాటుతో చెమట జల్లుమని పుట్టెను.

గీ. మనసు ప్రుచ్చిలి చొచ్చిన మత్తికాఁడు
వీఁడు గొమ్మని చే సాఁచె వెలఁది యపుడు
కాముఁ డటమీఁద ననిరుద్ధు గాత్రమునకుఁ
జిగురుఁ బట్టెంబుఁ జేర్చుట చెప్పినట్లు. 149

అర్థ: ప్రుచ్చిలి = దొంగిలించి (ఆకర్షించి, వశపఱచుకొని) మత్తికాఁడు = కాముకుఁడు; గాత్రమునకు = అవయవమునకు (తలకు); చిగురు+పట్టెము = చిగురాకు అనెడి కిరీటము (తలకు అలంకారము);

అర్థాంతరము: చిగురాకు అనెడి పెద్దకత్తి.

తా: అప్పుడు ఉష "నా మనస్సును దోఁచుకొన్న కాముకుఁడు{చిత్రపటమునందు } వీఁడు" అని చేతిని చాఁచెను. అదెట్లుండె ననఁగా మన్మథుఁడు తానే ఆ పైని అనిరుద్ధుని తలకు, చిగురాకు కిరీటమును, కట్టుటను చెప్పుచున్నఁడా అనునట్లుండెను.

అలం: ఉత్ప్రేక్ష: ఉష చేయి మదనుని చిగురాకు పట్టముగా (కిరీటముగా), ఊహింపఁబడినది.

వ్యా. చిగురు+పట్టెంబు> చిగురు ఁబట్టెంబు (చూడు, పద్య - 66).

వ. ఇట్లు చిత్రరేఖా దర్శితం బయిన చిత్రపటంబునం దనమనో రమణుం గనుంగొని యుషా రమణి రమణీయం బైన తదాకారంబునం దవిలి తదన్వయ నామధేయంబు లెఱింగింపు మనుటయు నచ్చిత్రరేఖ యి ట్లనియె. 150

తా: ఈ విధముగా చిత్రరేఖచే చూపఁబడిన చిత్రపటమందు తన మనస్సును హరించిన వానిని కాంచి ఆ రమణి, రమింపఁజేయుచున్న (కామావేశమును కలిగించుచున్న) అతని ఆకారమందు ఆసక్తి కలదై అతఁడు ఏవంశము వాఁడో, అతని పేరేమో! తెలుపుమని చిత్రరేఖను కోరఁగా ఆమె ఇట్లనెను.

మ. వనితా! వాసవ వైరి మర్దనుఁ డనన్ వర్ణింప నొప్పున్ జనా
ర్దనుఁ డద్దేవుని మున్ను వింటిమి కదా తత్పుత్త్రుఁ బ్రద్యుమ్నుఁ గం
తుని కంటెం గొనియాడఁగాఁ బొసఁగు తత్సూనుండు నీ కోరువాఁ
డనిరుద్ధుం డిటు చిక్కునే సమత నీ యన్యోన్య యోగ్యాకృతుల్.151

అర్థ: వాసవవైరి మర్దనుఁడు = ఇంద్రుని శత్రువులను చంపువాఁడు; కంతునికంటెన్ = మన్మథుని కంటెను; తద్+సూనుండు = అతని సుతుఁడు; అన్యోన్య యోగ్య+ఆకృతుల్ = ఒకరొకరికి తగిన రూపములు; సమతన్ = సమానముగా; చిక్కునే = కలుగునా? (చిక్కినది, ఇది అరుదనుట).

తా: "ఓ కాంతా! ఉషా! జనార్దనుఁడు ఇంద్రాదులకు శత్రువులైన రాక్షసులను మర్దించువాఁడని వర్ణింపఁదగిన వాఁడై పేరును పొందియున్నాడు. ఆ దేవుని, ఆతని పుత్రుఁడగు ప్రద్యుమ్నుని గుఱించి ముందే విని యున్నాము. మన్మథుని కంటెను రూపవంతుఁడని, పొగడఁదగిన ఆ ప్రద్యుమ్నుని సుతుఁడే, నీవు కోరువాఁడు. అతని పేరు అనిరుద్ధుఁడు. ఇట్లు నీ అందమునకు అతని అందమునకు తగిన (మీ మీ రూపములకు) సమానత్వము కుదిరినది. ఇట్లు ఒకరికొకరు తగిన వారు లభించుట దుర్లభము. అది ఇపుడు కలిగినది."

వ్యా. నీ కోరువాఁడు. నీవు కోరువాఁడు. (చూడు, పద్య - 104)

కం. ఇక్కన్యకు మగఁడే యితఁ
డక్కట యీమగని కేటియా లిది యనుచుం
జిక్కొట్ట వలదు చెలులకుఁ
బె క్కేటికి నూ రు మెచ్చఁ బెండిలి గలిగెన్. 152

అర్థ: ఆలు=పెండ్లము; చిక్కొట్టన్ వలదు = గర్హింపఁదగదు, త్రోసి వేయఁదగినవాఁడు కాఁడు; పెక్కు+ఏటికిన్ = పలు మాటలు+ఎందులకు? ఊరు = పురజనులు.

తా: "ఈ పడుచునకు ఈతఁడు తగిన మగఁడా? అయ్యో! ఈ మగనికి ఈమెయా పెండ్లాము అని చెలులు చీచీ అనరాదు. పలు పలుకులు ఏల? ఊరివారు మెచ్చునట్లు (ఈడుజోడు) చక్కని సంబంధము (పెండ్లి) కుదిరినది."

నానా. ఆలు; వృత్తియందు ఆఁడుది (జవరాలు), ఆ(వు)లు.

రూ. పెండిలి, పెండ్లి, పెండ్లిండ్లు (బహువచనము)

కం. వెఱవకు కలలోఁ జేసిన
కొఱగామికి వగచు చోట గుణరత్నము చే
కుఱె నీకు నలిగి తన్నినఁ
బఱపు పయిం బడిన యట్లు పద్మదళాక్షీ. 153

అర్థ: కొఱ+కామికి = చెడ్డపనికి, తప్పునకు,

తా: "తామర రేకుల వంటి కన్నులు గల ఓ ఉషా! కలలో జరిగిన తప్పునకు నీవు భయపడుచున్నావు. ఆ భయము వలదు. కోపముతో తన్నఁగా పాన్పుపై పడిన విధమున నీకు గుణవంతుడు (రూపవంతుఁడు) పతిగా లభించెను."

అలం: దృష్టాంతము. కన్యాత్వము చెడెనే అని ఉష వగచుచుండగా ఆమెకు అపకారమునకు మాఱుగా ఉపకారమే జరిగినది.

వ. అనుటయు నవ్వనజానన యి ట్లనియె. 154

తా: ఆ చిత్రరేఖ అట్లు పలుకఁగా కమలానన ఆమెతో ఇట్లనెను.

శా. ఈరూపే కలలోపలం గలసె న, న్నే రూపునం జేరు నా
కీ రూ, పింతటి మేటి రూపసికిఁ దా నిల్లాలుగా నోము న
గ్గారా మేలలితాంగికిం గలుగు, నింకం జాలు నెవ్వారికిం
జేరన్ రాని మహానిధానమునకుం జే సాఁ చితిం దొయ్యలీ. 155

అర్థ: రూపు = రూపము, విధము, చక్కఁదనము; రూపసి = రూపవంతుఁడు; నిధానము = నిధి, ఉంచుట, గారాము = ప్రేమ , గొప్పతనము.

తా: "ఓ తొయ్యలీ (ఇంతీ) చిత్రరేఖా! ఈ ఆకృతి కలవాఁడే నన్ను కలలో కలిసెను. ఈ రూపవంతుఁడు నాకు ఏ విధముగా లభించును? ఇంతటి చక్కనయ్యకు, ఇల్లాలగుటకు నోచునట్టి ఆ గొప్పతనము ఏ తీవవంటి మేనుగల ఇంతికి కలుగును? ఇంక పెక్కుమాటలేల? ఈ అత్యాశ ఇంక చాలును. ఎవ్వరికిని పొందరాని గొప్ప నిక్షేపమునకై నేను చేతిని చాఁచినాను. (నిధిని కోరితిని కదా)."

అలం: లలితము.

వ. అట్లుం గాక. 156

తా : సులభము.

ఉ. 'ముద్దియ ముద్దరా ల్వెనుక ముందట నొండొక కీడు లే' దనం
బెద్దల కెల్లఁ బాటి నయి పెట్టిన పీఁటన యుండ నైతి నా
బుద్ధులు దప్పె నేమిటికిఁ బోయిన నీళ్ళకుఁ గట్ట వెట్ట నీ
యద్దము లోని నీడ కెటు లాస పడం బొసఁగుం దలోదరీ. 157

అర్థ: తలోదరీ! = సన్నని నడుము కలదానా!

ముద్దియ = (యౌవనము ఉదయించుచున్న)కన్య, ముద్దరాల్ = తెలియనిది, (క్రొత్తది) ముద్దువచ్చు చిన్నది; కీడు = తప్పు; పాటిన్+అయి = ఆదరింపఁదగిన దాననై.

తా: "ఓ తన్వంగీ! 'ఈ ఉష ఏమియు తెలియని ముద్దు వచ్చు చక్కని చిన్నది. ఎప్పుడును ఆమెలో ఎట్టి తప్పు లేదు. అని పెద్దలందఱకును ఆదరింపఁదగిన దాననై సామాన్యురాలుగా (కూర్చుండఁ బెట్టిన పీఁటపై) ఎట్టి కళంకమును లేక ఉండలేకపోయితిని. నా తెలివి తప్పినది. పోయిన నీటికై ఇప్పుడు అడ్డు పెట్టినందువల్ల ఉపయోగమేమి? (అంతయునైన పిమ్మట చింతింపనేల?). అద్దములో కానవచ్చు నీడకై (ప్రతిబింబమునకు) ఆసపడుచున్నాను. అదెట్లు సాధ్యము? ఈ పటములో కానవచ్చు ప్రతిరూపమును ఆశించుచున్నాను. అదెట్లు తగును? అద్దములోని నీడను పొందుట సాధ్యము కానట్లు అనిరుద్ధుని కొఱకై ఆశపడుట సుఖాంతము కాదు.

అలం: పర్యాయోక్తము : 1 పోయిన నీళ్ళకు కట్టవెట్టుట, 2 అద్దములోని నీడకు ఆశపడుట, ప్రకారార్థముచే గమ్యార్థ సిద్ధి.

నానా : కీడు = తప్పు, ఆపద, దోషము, అపకారము, పాపము, దుష్టము.

ఉ. ధీరుల నింద్రముఖ్యు లగు దిక్పతులం గుతి [1]లాలఁ బెట్టు న
వ్వీరుఁడు బాణుఁ డేమిటికి వియ్యపు [2]టిచ్చకుఁ దెచ్చు మర్త్యులన్
దూరపువారిఁ దన్విఁ గన నువ్వులఁ గండ్లను నోరఁ బోసి కొ
న్నారము కాఁ దలంపు లలనా! కెలనాడెడు ప్రాణ మేటికిన్. 158

అర్థ: కుతిలాలన్+పెట్టు = బాధించు; వియ్యము+ఇచ్చకున్ = పెండ్లి సంబంధము చేయు కోరికకు; మర్త్యునిన్ = మానవుని; తన్విన్ కనన్ = తృప్తిగా చూచుట, నువ్వులన్, కండ్లన్ నోరన్ = నువ్వులను కన్నులలోను, నోటిలోను, పోసికొన్నారము కాన్ = పోసికొన్నట్లుగా, కెలనాడెడున్ = వేదన చెందుచున్నది.

---

1. లంగలంచు 2. టంచుకు

తా: ఓ లలనా! ధైర్యవంతులైన ఇంద్రాది ముఖ్యులగు దిక్పాలురను పీడించి బాధించు ఆవీరుఁడైన బాణాసురుఁడు, మానవ మాత్రులైన వారితో పెళ్లి సంబంధము చేయుటకు ఇష్టపడునా? మనకు దూరమైనవారిని (తగనివారిని) నువ్వులను, కండ్లలోను, నోటిలోను పోసికొన్నట్లు నీవు తలంపుము. నా మనస్సు ఫలమును పొందలేని దానికై వేదన చెందుచున్నది. కారణము తెలియుటలేదు.

విశే. నువ్వులను, కండ్లలోను నోటిలోను పోసికొనుట అనఁగా కన్నులు చూడలేవు. నోరు మాటలాడఁజాలదు. ఇది తెలుగు జాతీయము.

(వ్యు) మర్త్యుడు. మృతినొందువాఁడు భూలోకమున పుట్టిన వాఁడు, మానవుఁడు.

నానా: ప్రాణము = ఇంద్రియము, మనస్సు, ప్రాణవాయువు, జీవితకాలము, బలము.

గీ. దనుజకులవైరి శౌరి నందనులు నట్ల
రక్కసులు మనవారు వారలకు మనకుఁ
బొసఁగునె? నడుమఁ బెట్టిన పూరి గాలు;
నేల చిత్రరేఖా తుది నింత సణుగు. 159

తా: ఓ చిత్రరేఖా! రాక్షస కులమునకు పగవాఁడు కృష్ణుఁడు (శౌరి). అతని కుమారులును అట్టి వారే. మనవారు రాక్షసులు. వారలకు మనకు (వియ్యము) కుదురునా? మన ఇరువురి మధ్య పెట్టిన పచ్చగడ్డి వెంటనే భగ్గున కాలిపోవును. కడపట ఫలమట్టిది అగును. (పని నెఱవేఱదు) కావున ఇంత తపన (వేదన) ఎందుకు? ఈ సంబంధము వలన విపత్తు కలుగునని భావము.

అలం: 1. పర్యాయోక్తి, : 'నడుమఁబెట్టిన పూరికాలును' అనుటచే మానవులకు రాక్షసులకు మనువు కుదురదని గమ్యార్థము సిద్ధించుచున్నది.

2. కావ్యలింగము : మనువు కుదురదు అను సమర్థనీయాంశము 'యాదవులు, దనుజకుల వైరులు' అని హేతువు చెప్పఁబడినది.

3. లోకోక్తి : నడుమఁ బెట్టిన పూరి కాలును.

వ. అట్లు గాక నా మీఁది నెయ్యంబున నీవు విచారించిన తెఱంగు.160

తా: వారికి మనకు పొసఁగకపోయినను, నా యెడఁగల స్నేహముచే నీవు ఆలోచించిన విధము (తరువాతి పద్యముతో).

మ. వనితా! నీపతితోడఁ గూడ వలతేన్ వా రేల వీ రేల నీ
కని నన్నా యనిరుద్ధుఁడున్న యెడ కెట్టైనన్ వెలార్తేనిఁ, బో
యిన నాతండు కులాభిమానఘనుఁడై యేయూరి కే(త్రోవ యం
చనుమానించినఁ ద్రోవ నన్ గొఱవిఁ జేయం జూచెదే క్రమ్మఱన్.161

అర్థ: వెలార్తువు +ఏనిన్ = (కూడునట్లు) చేర్చినచో; ఘనుఁడై = కఠినుఁడై (తాను మానవుఁడని క్షత్రియుఁడని) త్రోవన్ = నిరాకరింపఁగా; నన్ = నన్ను; క్రమ్మఱన్ = మరల కొఱవిన్ = మండు కొయ్యగా (ఉన్న బాధ మరియు ఎక్కువగునట్లు); చేయన్+ చూచెదవు+ఏ =చేయఁదలచు చున్నావా? అర్థాంతరము : త్రోవన్= మార్గమందు, (మఱింత బాధపెట్టెదవా?)

తా: "ఓ వనితా! నీవు నీ ప్రియునితో కూడుటకు,వారును వీరును శత్రువులైన నేమి, నన్ను ఎటులైనను నీవే ఆ అనిరుద్ధుని కడకు వెడలింతువేని మనము అచటికి పోయినచో అతఁడు తాను మానవుడని క్షత్రియుఁడని తన కులమందలి అభిమానముచే మనస్సును గట్టి చేసికొని, ఏ యూరికి ఏది మార్గమని మనకులములు వేఱని సందేహించి నన్ను నిరాకరింపఁగా, మరల నన్ను మండుకట్టెగా చేసెదవా? ఇంతకంటె ఎక్కువగా బాధపెట్టెదవా? శీలము చెడెనని బాధపడుచుండగా అనిరుద్ధుఁడు నన్ను నిరాకరించినచో, అది చాల బాధించునని భావము.

వ్యా.వెలార్తువు+ఏని = వెలార్చుదువు+ఏని (చూడు, పద్య-21)

వ. మఱియు నొక్క తెఱంగు విను మక్కుమారు నిక్కడకుం గొని వచ్చి
తన్నుం గలుపు సామర్థ్యంబు గల దేని. 162

తా: మఱియును, ఒక విధమును చెప్పెదను. వినుము. ఆ అనిరుద్ధుని ఇక్కడికి తీసికొనివచ్చి నాతో కూర్చుటకు నీకు నేర్పున్నచో (మీఁది పద్యముతో).

కం. కలసెదఁ బతి నతఁ డిచ్చట
మెలఁగుట మాతండ్రి విన్న మేలగునే ప్రే
వులలోన సురియఁ ద్రిప్పిన
కలపనఁ *బిం డైనఁ జెలిమి కత్తెలు నగరే. 163

* బిండైన

అర్థ : సురియ = చురకత్తి; కలపనపిండి+ఐన = త్రిప్పిన పిండి, తీవ్రమైన కలఁత కలిగినచో;
న+పిందె+ఐన = కలఁతకు కారణమైనచో;

తా: నేను పతిని కూడెదను. కాని అతఁడు ఇచ్చట ఉండుట నా తండ్రి విన్నచో అది
గునా? ప్రేగులలో చురకత్తిని త్రిప్పిన కలఁతకు మూలకారణమగును. అట్లయినచో,
మి కత్తెలు నన్ను హేళన చేయరా?

రూ. సురియ సురె. ఛురికాశబ్ద భవము.

పిండి = బియ్యములోనగు వాని పొడి. దానిని బాగుగా త్రిప్పి వంటకములు
చేయుదురు.

రూ. పిందె, పిందియ. పువ్వు కాయ అగుటకు ముందు పిందెగా నుండి పెద్దదగును.

నావుడుఁ జిత్రరేఖ వదనంబున బింకము మీఱఁ బల్కు నా
లావున నిష్డు దెత్తు నబలా! విభు నింపెసలారఁ గూడి సం
భావన చేయవే చెలులు ప్రాణమునం బరికించునట్లు ర
క్షావిధ మాచరింపు మనసౌధములందు నిగూఢ భంగులన్. 164

ప్రతి: నావుడున్, చిత్రరేఖ వదనంబునన్ =ముఖమునందు; బింకము మీఱన్ = గర్వ
శయింపఁగా; పల్కున్; అబలా = ఓ ఇంతీ! నా లావునన్ = నాబలముచే; (నేర్పుచే); ఇష్డు;
న్ = (నీ)పతిని; తెత్తున్ = తీసికొని వచ్చెదను; ఇంపు+ఎసలారన్ = నీ ఇష్టము వచ్చినట్లు;
డి; సంభావన+చేయవే = (సుఖము) అనుభవింపుము; ప్రాణమునన్ = (తమ)ప్రాణముతో;
కించు నట్లు = చూచునట్లు (కాపాడునట్లు); మనసౌధములందున్ = భవనములలో;
ూఢ భంగులన్ = రహస్య పద్ధతులతో ; రక్షావిధము = రక్షణకు అవసరమైన రీతులను;
రింపు = పాటింపుము (చేయుము).

తా: అని ఉష అన్నంతనే చిత్రరేఖ, ముఖమందు గర్వముతో కూడిన వికాసము
పఁగా ఇట్లనెను. 'ఓ ఇంతీ! నా (యోగ) శక్తిచే నీ పతిని ఇప్పుడు తీసికొని వచ్చెదను.
నీ ఇష్టము వచ్చినట్లు ప్రేమతో సుఖ మనుభవింపుము. నీ చెలిమికత్తెలు, తమ
ణములతో (సమానముగా) అంతఃపుర రహస్య వృత్తాంతమును కాపాడునట్లు
స్య పద్ధతులను పాటింపుము.

వ్యా. ఆచరింపుము = ఆచరింపు, సంధి, బాల - 47. (చూడు, పద్య - 115).

విశే. చిత్రరేఖ ప్రత్యేకముగా భవన సముదాయమందు జరుగు కామ వ్యవహారమును ఎవరికిని తెలియనట్లు కాపాడు రీతిని చేపట్టుమని ఉషను హెచ్చరించినది.

వ. అనుచుం దద్దనుజేంద్ర కన్యకం దనవచనచాతుర్యంబునం గార్యంబునకు నొడంబఱచి చిత్ర రేఖ యదువీరనగరంబునకుం బోయిన యనంతరంబ యాబింబాధర పరితాపంబు గొంత డిందుపడిన యనంతరంబు. 165

తా: అని వచించి ఆ రాక్షసరాజు కూతురైన ఉషను తన మాటల నేర్పుతో తాను చేయు పనికి సమ్మతింపఁజేసి, చిత్రరేఖ యదువీరుని నగరమైన ద్వారకకు వెడలిన పిమ్మట ఆ దొండపండువంటి క్రింది పెదవి గల, ఉష వగపు, కొంత తగ్గినది. తర్వాత (మీఁది పద్యముతో).

నానా. బింబము = దొండపండు, ప్రతిబింబము, ప్రతిమ, సమానము, మండలము (చంద్ర, సూర్య).

కం. *వెల్లి యగు వగల త్రొక్కున
నిల్లిగ్గులు గానవచ్చు హృదయములోనన్
మల్లామడి యగు మదనుఁడు
మెల్లనఁ గూర్చుండెఁ దాల్మి మినుమిను కనఁగన్. 166

ప్రతి: వెల్లి+అగు = ప్రవాహ మగుచున్న పొంగుచున్న; వగలు త్రొక్కునన్ = శోకము యొక్క ఒత్తిడిచే (పాఠాం: నగల త్రొక్కునన్); ఇగ్గులు + ఇగ్గులు > ఇల్లిగ్గులు = (అదిమి వేయఁబడి) వెనుఁదీయుటలు కానవచ్చు; హృదయములోనన్ = ఎదలో; మల్లామడి = పీడింపఁబడినవాఁడు; అగు మదనుఁడు; తాల్మి = ఓరిమి; మినుమినుకు + అనఁగన్ = ఇంచుక మాత్రమే నిలిచి ఉండఁగా; మెల్లనన్ = మెల్లఁగా; కూర్చుండెను.

తా: అతిశయించుచున్నట్టి చింతల (వగల) ఒత్తిడిచే మిక్కిలి వెనుదీయుచున్న (ఉత్సాహము నశించుచున్న) హృదయమందు, మన్మథుఁడు పీడింపఁబడిన వాఁడై అత్యల్పమైన ఓరిమితో మెల్లగా కదలనేరక ఊరక కూర్చుండెను.

---

* లొల్లి

విశే. ఉష, కామము అత్యధికమగు చుండగా ఆమెలో ఉత్సాహము తగ్గుచుండెను. కామావేశము తఱచైనదని భావము.

వ్యా. ఇల్లిగ్గులు : ఆమ్రేడిత సంధి. సంధి, బాల - 42.

పాఠాం. లొల్లి = తఱచు.

ఆ.వె. అట్లు చిత్రరేఖ యదు వీరనగరంబు
చేర నరిగి యక్కుమారవరునిఁ
బట్టి తెచ్చు తెఱఁగు భావించి మాయా బ
లంబు దప్ప నొండులాగు లేమి. 167

తా: ఆ విధముగా చిత్రరేఖ శ్రీకృష్ణుని నగరమైన ద్వారకను చేరి ఆ కుమార శ్రేష్ఠుఁడగు అనిరుద్ధుని తెచ్చు విధమును ఆలోచించి మాయాశక్తి తప్ప, మఱొక ఉపాయము లేకపోవుటచే (తరువాతి వచనముతో).

వ. చింతించి. 168

తా : సులభము

చం. ఒక కమలాకరంబునకు నొయ్యనఁ జేరిన నందు నారదుం
డకలుషయోగ నిశ్చలత నచ్యుతుఁ జిత్తమునం దలంప బా
లిక రచిత ప్రణామ ముకుళీకృత పాణిపయోరుహాళి మా
లిక కుటి లాలకాలిక వళీభవదాకృతి యయ్యె నయ్యెడన్. 169

అర్థ: కమల +ఆకరంబునకున్ = తామరల ఉనికి అగు ఒకకొలనికి; ఒయ్యనన్ = మెల్లఁగా; అకలుష యోగనిశ్చలతన్ = నిర్మలమైన ధ్యానమువలన ఏకాగ్రతతో; రచిత = చేయఁబడిన; ప్రణామ = నమస్కారముచే; ముకుళీకృత = మొగ్గగా చేయఁబడిన; పాణిపయోరుహ = పద్మము వంటి చేతులలో; అళిమాలిక = తుమ్మెదల వరుసలు అనెడి; కుటిల+అలక+అలిక = వంకరలైన తల వెంద్రుకలు గల నొసలు గలదియు అగు; వళీభవత్+ఆకృతి = కంపము నొందు రూపము

తా: ఆ చిత్రరేఖ ఒక తామర కొలనిని మెల్లఁగా చేరెను. దాని తీరమందు నారద మహర్షి పరిశుద్ధమైన నిష్ఠలోనుండి విష్ణువును ఏకాగ్రతతో ధ్యానించుచుండెను. ఆ

సమయమందు, చిత్రరేఖ తన పద్మమువంటి చేతులను (తామరమొగ్గవలె) ముడిచి, వంకరయైన ముంగురులు నొసటియందు చక్కఁగా అమరి యుండఁగా కంపము చెందు శరీరము కలదయ్యెను.

వ. ఇట్టు మ్రొక్కుచు వినమ్రవదన యయి యున్న యన్నలిన లోచనతో
నారదుండు. 170

తా: ఈరీతిగా నమస్కరించుచు, విశేషవినయ సంపత్తితో కూడిన ముఖము కల, ఆ పద్మమువంటి కన్నులు గల చిత్రరేఖతో నారదుఁడు (ఇట్లు అనెను).

కం. 'ఓ రమణి నీవు వచ్చిన
కారణ మెఱిఁగింపు మనుడుఁ గడు వేడుక నిం
డారిన మదితో ని ట్లను
నా రమణీతిలక మమ్మహాముని తోడన్. 171

తా: "ఓ రమణీ! నీ రాకకు కారణమును తెలియఁజెప్పుము" అని కోరినంతనే, ఆ యువతీమణి ఆ నారద మహర్షితో ఇట్లు పలికెను.

మ. 'బలిదైత్యేంద్రతనూజుఁ డొప్పు జగతిన్ బాణుండు తత్పుత్రియై
కులదీపం బనఁగా నుషారమణి మాకుం బ్రాణమై యుండు; నా
లలనారత్నముఁ బార్వతీ వరవచో లబ్ధాత్మకుండై యొకం
డలయించెం గలలోన మానస గృహై కాకారుఁడై వేడుకన్. 172

అర్థ : పార్వతీవర వచస్+లబ్ధ+ఆత్మకుండు+ఐ = పార్వతి(ఉషకు ఇచ్చిన) వరములోని మాట ప్రకారము పొందఁబడిన తెలిసికొనఁబడిన రూపము కలవాఁడై; మానస గృహ+ఏక + ఆకారుఁడై = మనస్సు అనెడి ఇంటియందే ముఖ్యమైన రూపుతో; అలయించెన్ = శ్రమపెట్టెను.

తా: "జగతిలో రాక్షస శ్రేష్ఠుఁడైన బలచక్రవర్తి సుతుఁడు బాణుఁడను పేరు కలవాఁడున్నాఁడు. అతని పుత్రిక కులంబునకు వన్నె తెచ్చునది (కులమునకు దివ్వె, ప్రకాశింపఁజేయునది) ఉషాకాంత, మాకు మిక్కిలి కూర్చు (ప్రాణమై ఉండు) చెలి. ఆ యువతీ రత్నమును పార్వతి ఇచ్చిన వరము ప్రకారము పొందఁబడిన రూపము కలవాఁడై ఒకఁడు కలలో ఆమె మనస్సు అనెడి ఇంటియందే తన రూపమును చూపి ఉత్సాహముతో ఆమెను, కామించి శ్రమపెట్టెను."

కం. ‘ వాఁ డెవ్వఁడో యెఱుంగదు
పోఁడిమి చెడ లజ్జ గోలు పుచ్చె ననుచుఁ బూఁ
బోఁడి వగచు నెడఁ జెప్పితి
వేఁడి [1]కొనన్ మగఁడు నీకు వీఁ డని పిదపన్. 173

అర్థ: పోఁడిమి = ఒప్పు, స్థితి (ఉనికి); వేఁడికొనన్ = కోరఁగా; వేఁడికొనన్ = (కాముని తాపము ఎక్కువకాఁగా) వేఁడిమి ఎక్కువ కాఁగా;

తా: “ఆ ఉషాకాంత ఆతఁడెవ్వఁడో ఎఱుఁగదు. తన గుణము చెడునట్లు తనసిగ్గును పోఁగొట్టె (అవమానించెనని)నని శోకించు ఆ పువ్వువంటి శరీరముగల ఆమె, నన్ను ‘వాఁడెవఁడో చెప్పు’మని కోరఁగా నేను పిమ్మట ‘నీకు వీఁడు మగఁడు’ అని చెప్పితిని.”

అర్థాంతరము. ఆ కాంత ఎడఁబాటుచే వేఁడిమిని పొందఁగా.

కం. ‘ వరుని పొడ [2]పొట్టెఱుంగక
విరహానలశిఖలచేత వేఁగెడు చెలికి
స్వైరవారఁ జిత్రపటమున
సుర నర పన్నగుల వ్రాసి చూపితి నంతన్. 174

తా: “వరుని రూపమెట్టిదో (పొడపొట్టు= రూపురీతి) తెలియక, విరహమువలని నిప్పు సెగలచే తపించు ఉషకు చిత్రపటములందు, నాకవాసులను నరులను, నాగులను తగినవిధమున వ్రాసి చూపితిని.”

వ. అందు లోన. 175

తా : సులభము.

కం. ‘ అనిరుద్ధునిఁ జేపట్టెను
మును గలలోఁ గన్న రూపమునకుం జోడై
యునికిఁ దెలిసి యాతనిపయి
మనోజరాగంబు మిగుల మరగించుటయున్. 176

1. కొనిన 2. మట్టె.

తా: "ఆ పటములలో తాను ముందు కలలో కాంచిన రూపమునకు సరియగు రూపు ఉండుట తెలిసికొని ఉష అనిరుద్ధుని పతిగా గ్రహించెను. ఆతనిపై కామము అధికమై తన్ను తపింపఁజేయఁగా" (మీఁది పద్యముతో).

మ. ' పరితాపంబునఁ బొందు నవ్వాలఁతికిం బంతంబు నే నిచ్చితిం
దరుణీ తెచ్చెద నీ మనోరమణుఁ జింతాభార మిం తేల యం
చు రహస్యంబుగ నిక్కు మారవరుఁ గొంచుం బోవ నాత్రోవఁగా
నరు తక్కెవ్వరు శౌరికిం బిదపఁ గానం జేయుమీ సంయమీ. 177

అర్థ: పొందు = వాలు (శ్రమపడు); చింతాభారము = అధికమైన విచారము; పంతంబున్ + ఇచ్చితిని = మాట ఇచ్చితిని; కానన్ + చేయుమా = తెలియఁజెప్పుము.

తా: "విరహము యొక్క వేఁడిమిచే వెత చెందు ఆ ఉషకు 'ఓ చెలీ నీ మనోహరుని, తీసికొని వచ్చెదను. ఎక్కువ చింత ఇంత ఏల?' అని మాట ఇచ్చితిని. నేను ఆ కుమారవరుని రహస్యముగా తెచ్చునపుడు ఆ మార్గమును ఎవ్వరును తెలిసికొనలేరు ఓ మునీంద్రా! తర్వాత ఆ వార్తను శ్రీకృష్ణునకు ఎఱిఁగింపుము."

వ. ' అత్తెఱం గేల యను తలంపు గలదేని నవధరింపుము. 178

తా: "అతనిని అంత రహస్యముగా ఏల కొనిపోవలయును అను తలంపు మీకు ఉన్నచో కారణము చెప్పెదను, వినుము."

ఉ. ' బాలుఁ డితండు మార్కొనిన బాణుఁడు గెల్చు మురారియైన నా
భీలభుజుండు దద్దనుజు భీమబలుం బరిమార్చు నంతలో నా
లలితాంగి నిర్భయ విహారములం జరియించు వాని హృ
చ్ఛూలముగాక యున్నె మనుజుండుఁ దనూజయుఁ గేలి సల్పఁగన్. 179

అర్థ: ఆభీలభుజుండు = భయంకరమైన బాహు పరాక్రమము కలవాఁడు; భీమబలున్ = వెఱపుగొలుపుబలము కలవానిని; హృద్+శూలము = మనస్సునకు బాధ; కాక+ఉన్నె = కాకపోవునా?

తా: అనిరుద్ధుఁడు లేఁతవయసువాఁడు. ఎదుర్కొన్నచో బాణుఁడు గెల్చును. శ్రీకృష్ణుఁడైనచో భయంకరమైన బాహుపరాక్రమము, బలము, గల బాణుని చంపఁగలఁడు.

మురారి ఆ రాక్షసుని వధించు లోపల ఆ కోమలాంగి ఉష భయము లేనిదై కామక్రియలలో విహరించును. మానవుఁడును, తన కూతురును కలిసి ఉండుట ఎఱిఁగిన బాణుఁడు తీవ్రవ్యధను చెందడా?

వ్యా. ఉండును+ఏ = ఉన్నే. సూ. ఒకానొకచో తద్ధర్మార్థకంబులగు 'ఉండు. చను, చేరు కొను'లు, ప్రశ్నార్థకైకార పరకంబులగునపుడు వాని కడ అచ్చులకు లోపంబు విభాషనగు. అగుచో ఉండు 'డ' కారంబునకు నకారంబగు. క్రియ, ప్రౌఢ - 2.

విశే. చిత్రరేఖ అనిరుద్ధుని రహస్యముగా శోణిత పురమునకు తీసికొని పోవుటకు కారణమును నారదునకు తెలిపెను. ముందే బాణునకు అనిరుద్ధుని శోణిత పుర ప్రవేశము తెలియ కుండుటకై తానట్లు చేయు చున్నానని విశద పఱచెను.

వ. కావున నవశ్యంబు యుద్ధంబు సిద్ధంబు. 180

తా: "తర్వాత బాణునకు తన కూతురు ఉష ప్రవర్తన తెలియఁగా తప్పక యుద్ధము కలుగును."

ఉ. నావుడు వామలోచనకు నారదుఁడి ట్లనుఁ 'గయ్యమన్న సం
భావన గన్నచందమునఁ బాఱుదుఁ *బయ్యెరదూది నై ప్రమో
దావహ మైన యీపని రయంబునఁ జేసినఁ జాలుఁ దెచ్చెదం
బో వసుదేవసూను నను బోఁటికిఁ గన్నుల పండు వొప్పదే.' 181

అర్థ: పయ్యెరదూదినై = గాలిలో దూదిపింజనై; సంభావన = బ్రాహ్మణులకు ఇచ్చెడి ధనము, దక్షిణ; కన్నుల పండువు, తెలుఁగుజాతీయము, ప్రియమైన దానిని చూచుట.

తా: చిత్రరేఖ అట్లనఁగనే నారదుఁడు అందమైన కన్నులుగల చిత్రరేఖతో "కలహమనఁగా, దక్షిణ పొందినట్లు గాలిలో దూదిపింజఁగా త్వరపడుదును. నాకు సంతోషమును కలిగించు పనిని నీవు శీఘ్రముగా చేయుము. అంత మాత్రము చాలును. నేను, కృష్ణుని తప్పక యుద్ధమునకు ప్రోత్సహించి తీసికొని వచ్చెదను. యుద్ధమును కలిగించు పని నావంటి కలహభోజనునకు ప్రియమైన కనువిందు కదా! (అది నేత్రోత్సవ మగును).

---

* బయ్యెక దూల నై.

అలం:1. ఉపమ. సంభావన గన్న చందమున.

2. రూపకము. పయ్యెర దూదినై

వ్యా : తెచ్చెదన్ + పొమ్మ > తెచ్చెదన్ + పో > తెచ్చెదంబో.

సూ. పొమ్మ నిశ్చయార్థంబునందగు. వాక్య, ప్రౌఢ - 22.

వ. అనిన విని చిత్రరేఖ 'వెండియు నొక్క తెఱంగు విన్నవించెద నాకర్ణింపు'
మని యి ట్లనియె. 182

తా: నారదుఁడట్లు ప్రత్యుత్తర మియ్యఁగా చిత్రరేఖ విని, "మఱియును మఱొక విధము మనవి చేయుదును. వినుము" అని ఇట్లనియెను.

కం. 'తన మనుమనిఁ గొనిపోయిన
మనమునఁ గోపించె నేని మధుసూదనుఁ డే
మని శాప మిచ్చునో నా
కను తలఁకున నీకుఁ జెప్ప కట పో వెఱతున్. 183

తా: "తన మనుమని అనిరుద్ధు నేను కొనిపోయితినని శ్రీకృష్ణుఁడు కోపించి శపించునని నీకు ముందు చెప్పక ఆ ద్వారకకు పోవుటకు భయపడుచున్నాను"

గీ. కెలని వారికి నెంతటి కీడు వుట్టె
నేని దొలఁగించు హరి దన కెగ్గు చేయు
వెడఁగుఁ జెఱుపండె యెదిరి కిన్మడఁచు వాఁడు
దనకుఁ దగరంబు చఱచు టెంతటి భరంబు. 184

అర్థ: కెలనివారికి = ప్రక్కనున్నవారికి; ఎగ్గు= కీడు; వెడఁగున్ = అవివేకిని; ఎదిరికిన్ = ఎదుటివానికి; ఇన్మ = ఇనుము(గట్టిలోహమును); అడఁచువాఁడు; తనకున్ + తగరము = మెత్తని లోహమును; చఱచుట = అడఁచుట; ఎంతటి భరంబు = ఎంతటి బరువు? అదెంతపని? తేలిక యైనపని అనుట.

అర్థాంతరము : ఎదిరికిన్; మడఁచువాడు = (కీడు) మరల్చు వాఁడు, తొలఁగించువాఁడు; తనకు + దగరము (డగరము) = కీడు. ఈ అర్థమున 'ద' కారమునకు ముందు అరసున్న ఉండదు.

తా: "ప్రక్క నున్న వారికి ఎంతటి ఆపద కలిగినను నివారించు కృష్ణుఁడు తనకు హాని చేయు అవివేకిని మట్టుపెట్టడా? ఎదుటివానికి, ఇనుము వంటి దృఢమైన లోహమునే అడఁచు వాఁడు తన విషయమున మెత్తని లోహమైన తగరమును అడఁచు టెంతపని?" అది అతి సులభము.

అర్థాంతరము : ఎదుటి వానికి, కీడును మరల్చువాడు తనకు కలిగిన కీడును తాను అడఁచుట ఎంతపని? అది అతనికి సులభమైని పనియే.

డగరము = కీడు. రూపాం. దగరము (శ.ర.).

అలం : అర్థాంతరన్యాసము.

కం. 'మునినాథ! నీవు మును ము
ట్టనె చెప్పినఁ జాలు మఱి కడంగఁడు నాపైఁ
గినియ; విని యతఁడు దర్పిత
దనుజకృతం బని రణంబు దడవుం బిదపన్.' 185

అర్థ: మునుముట్టనె = మొట్టమొదటనే; కినియన్ + కడంగడు = కోపించుటకు ప్రయత్నింపఁడు; దర్పిత దనుజకృతంబు = గర్వించిన రాక్షసుని పని; తడవున్ = వెదకును.

తా: "ముని నాయకా! నారదా! నీవు ముందే, చెప్పుట చాల మంచిపని. తర్వాత నాపై కోపము చెందఁడు. అనిరుద్ధుడు పోయిన విషయమును తెలిసికొన్న కృష్ణుఁడు అది గర్వించిన రాక్షస కృత్యమని, పిమ్మట యుద్ధమునకు సిద్ధపడును."

విశే. చిత్రరేఖ తాను చేయు పని, పార్వతీదేవి వరమును అనుసరించిన దని మొదటనే నారదునకు చెప్పి అది దైవనిర్ణయమగుటచే తన యెడ కృష్ణుఁడు కోపము చెందకుండుటయై, జాగరూకత వహించినది.

వ. అనుటయు నారదుండు గలహ సంపాదన విశారదుండు గావున
నమ్మదితతో నిట్లను 'నిది నీకుం బనిగాదు నాచేసిన సంవిధానంబున
నీవు నిశ్చింతంబుగా ననిరుద్ధుం గొనిపొమ్ము.' 186

తా: అని చిత్రరేఖ అర్థింపఁగా, ఆ మహర్షి నారదుఁడు, కయ్యములను కలిగించుటలో నిపుణుఁడగుట చేత, ఆ రాక్షసకన్యతో ఇట్లనెను. "ఓ ముదితా! ఇది నీవు చింతింప వలసినదికాదు. నీవు ఎట్టి భయమును చెందకుము. నేను చేయఁబోవు పనిని గూర్చి, ఆలోచింపక వంత వదలి అనిరుద్ధుని తీసికొనిపొమ్ము. (తన పనిని తప్పక చేసెదననుట).

వ్యా. నా చేసిన - నేను చేసిన. (చూడు, పద్య- 104)

మ. అనినం బొంగి లతాంగి యాదవ నగర్యంతఃప్రవేశంబు చే
సి నభోమండల హారిసౌధమయుతం జెన్నారు ప్రాద్యుమ్ని హ
ర్మ్య నితాం తాంతిక భూమి చేరి కనక ప్రాసాదమధ్యంబునం
దనిరుద్ధు న్విభవప్రసిద్ధుఁ గనియెన్ హాలామదాలంకృతున్. 187

ప్రతి: అనినన్; లతా+అంగి = తీవవంటి మేనుగల చిత్రరేఖ; పొంగి; యాదవ నగరీ+అంతఃప్రవేశము చేసి = యాదవుల ప్రోలగు, ద్వారక లోనికి వెడలి; నభస్+మండల హారి సౌధమయతన్ = ఆకాశ వలయమును పొందు రాచనగరుల బాహుళ్యమును కలిగి, సొంపైన (ఆకాశమును అంటుచున్న); ప్రాద్యుమ్ని హర్మ్య నితాంత+అంతికభూమి = ప్రద్యుమ్నుని సుతుఁడైన అనిరుద్ధుని భవనమునకు, మిక్కిలి సమీపప్రదేశమును; చేరి; కనక ప్రాసాద మధ్యంబునందున్ = బంగారు రాచనగరు నడుమ; విభవప్రసిద్ధున్ = సుఖసంపదలచే పేరుగలవాఁడును; హాలా మద+అలంకృతున్ = మద్యపు మత్తుచే, చెలువొందినవాఁడును (అయిన); అనిరుద్ధున్; కనియెన్.

తా: అని నారదుఁడు పలుకఁగనే, చిత్రరేఖ మిక్కిలి సంతోషించి ద్వారకను ప్రవేశించెను. అందు ఆకాశమును అంటుచున్న పెక్కు సౌధములుండెను. వానిలో అనిరుద్ధుని భవనమునకు చాల దగ్గఱచేరి, బంగారు రాచనగరు నడుమ మద్యపానముచే చెలు వొంది నిద్రించు వైభవముగల ఆరాకుమారుని కాంచెను.

అలం:సంబంధాతిశయోక్తి. నభోమండల హారి సౌధమయతన్.

లక్షణము : సంబంధము లేనిచోట ఉన్నట్లు కల్పించుట.

వ్యు. ప్రాద్యుమ్ని. ప్రద్యుమ్నుని కొడుకు, అనిరుద్ధుఁడు.

సీ. లలిత నూతనలతాలంకారముల మెచ్చి
మొగమిచ్చు లేమావి [1]మోక వోలెఁ
బరివార తారకాపటలంబుతో నవ్వ
దొరఁకొన్న పిన్న చందురుఁడు వోలెఁ
గమలినీ కలికా వికాసంబు లెఱఁగి పై
[2]వ్రాలెడు తేఁటి రాచూలి వోలెఁ

1. మొక్క 2. జాఱాడు; జాటాడు.

సరళ సౌదామనీ సల్లాపముల మేను
గరుపాఱు మిండ మేఘంబు వోలెఁ

గీ. నంతకంతకుఁ జిట్టంటు లంటి యంటి
చెలువలకు యౌవనము విందు చేయ నున్న
మాన గుణబద్ధు మన్మథ మంత్రసిద్ధు
రుచిర రసవిద్ధు నా యనిరుద్ధుఁ జూచి. 188

అర్థ: లలిత = మనోహరములైన; అలంకారములన్ = మొగ్గలు, పూలు, చిగుళ్లు మొదలగువానిని; మొగమిచ్చు = అనుకూలముగా నుండు (సుముఖతను చూపు); పరివార = తనతో వచ్చు సేవకులైన; తారకా = నక్షత్రముల యొక్క; పటలంబు = సమూహముతో; నవ్వన్ = వెలుఁగుటకు; కలికా = మొగ్గల యొక్క; రాచూలి+పోలెన్ = రాజకుమారుని వలెను; సౌదామనీ = మెఱపుల యొక్క; మిండమేఘంబు + పోలెన్ = విటుఁడైన మబ్బువలె (విలాసముతో నొప్పు) ఇచ్చట "మింత" పూర్వపదమై ఉండునని శబ్దరత్నాకరము. చిట్టి+అంటులు = చిన్నవి అయిన నఖ దంతక్షతములు; అంటి+అంటి = పెక్కు సార్లు చేసి; మానగుణబద్ధున్ = ఉదార గుణముతో కూడిన వాఁడును (చిత్తము యొక్క ఉన్నతి); మన్మథ మంత్ర సిద్ధున్ = మదనుని మంత్రమును ఉపాసించుట యందు సిద్ధి పొందిన వాఁడును, కామక్రియలన్నియును ఎఱిఁగినవాఁడు; రుచిరరసవిద్ధున్ = శృంగార రసమే రూపుగొన్నవాఁడును, ఆ రసమే శరీరముగా గలవాఁడు.

తా: మనోహరములు నూతనములు అయిన తీవల సొబగును మెచ్చు సుముఖత గల లేఁత మావి గున్న వలెను, (చక్కని అలంకారములతో నున్న వాఁడనుట), తన పరిజనమైన నక్షత్రములతో వెలుఁగు బాలచంద్రుని వలెను, తామర మొగ్గల వికాసములను ఎఱిఁగి, వానిపై వ్రాలు తుమ్మెద రాకుమారుని వలెను, చక్కనిమెఱపుల సమూహముతో మేను గగుర్పొడుచు, విలాసవంతుడైన విటుఁడైన మేఘమువలెను, క్రమక్రమముగా నఖదంతక్షతములు పెక్కుమాఱులు చేసి, యువతులకు జవ్వనపు ఇంపు రుచిచూపు ఉదారగుణము కలవాఁడును. కామ శాస్త్రప్రవీణుఁడును, శృంగార రసమునే రూపుగొన్నవాఁడును అయిన, అనిరుద్ధుని ఆ చిత్రరేఖ చూచి, (తరువాతి పద్యముతో).

అలం: 1 మాలోపమ, లతాచూతములు, తారకా చంద్రులు, పద్మినీ భ్రమరములు,

సౌదామనీ మేఘములు, ఉషా అనిరుద్ధులకు, ఉపమానములు. ఉషతో శృంగార జలధిలో మునుగఁబోవు అనిరుద్ధుని వర్ణనము, అతని యౌవన సామర్థ్యమును ప్రకటించుచున్నది.

2. అంత్యానుప్రాసము. బద్ధు, సిద్ధు, విద్ధు, అనిరుద్ధు.

కం. మును విద్యాధర సంతతి
యనఁగా వివిధంబు లగు నుపాయంబుల మీ
ఱిన తన మాయాబలమున
ననిరుద్ధుం బొదివె విస్మయాపాదిని యై. 189

తా: పూర్వము విద్యాధరులనెడి దేవతలలోనొక తెగ వారి సంతాన మేమో అనునట్లు పెక్కు రీతులైన ఉపాయములను మించిన, తనదైన మాయాశక్తి చేత, ఆశ్చర్యమును కలిగించు నదియై అనిరుద్ధుని ఆక్రమించెను.

## - : చిత్రరేఖ యుషాంతఃపురమున కనిరుద్ధుం దెచ్చుట : -

చం. పొదివి నభోవిహారమునఁ బువ్వునుఁ బోలె నలంగ కుండ న
మ్మదన సమానుఁ బట్టికొని మానవ దానవ దేవకోటికిం
గద లెఱుఁగంగ నీక చని కాంచె నుషాసతిఁ జిత్రరేఖ యా
ముదితకు రాకపోక [1]లొక మూఁడుముహూర్తములయ్యె [2]నయ్యెడన్. 190

అర్థ: నభస్ విహారమునన్ = ఆకాశమున, పయనించుచు; కదలు = ప్రయత్నము; ముహూర్తము = రెండుగడియలకాలము; గడియ = ఇరువది నిముసములు.

తా: ఈ విధముగా చిత్రరేఖ అనిరుద్ధుని పొదివి ఆకాశ మందు పయనించి పువ్వును వలె నలఁగకుండునట్లు పట్టుకొని మానవులకు దానవులకు దేవతలకు ఎల్లరకు తన ప్రయత్నమును తెలియ నియ్యక ఉషను చేరెను. ఆమె రాకపోకలు ఆఱుగడియల కాలము పట్టెను.

కం. 'ఇది నీ కోరిన ఫల' మని
సుదతికి ననిరుద్ధుఁ జెలువ చూపి యిటు లనున్

---

1. యెడ 2. ఁజూడఁగన్.

'మది సొచ్చి నీకుఁ గూరిమి
యదికిన వల రాచ చుట్ట మవునో కాఁడో.' 191

తా: అనిరుద్ధుని ఉషకు చూపి, చిత్రరేఖ "ఓ చెలీ! ఇదిగో నీవు కోరిన ఫలరూపమైన పతి . ఉషా! నీ మనస్సును ప్రవేశించి నీకు వలపు కలిగించిన కాముని చుట్టము, ఇతఁడు అగునో కాఁడో?'' అని ప్రశ్నించెను.

వ్యా. నీ కోరిన, నీవు కోరిన. కర్తృపద ప్రథమకు షష్ఠీ,కారక ప్రౌఢ -15, 16.

చం. అనుటయుఁ బూర్ణచంద్రముఖు నాదటఁ జూడఁ జకోర నేత్రకుం
గనుఁగొన నెమ్మనంబు శశికాంత శిలాతలమయ్యె నంతలోఁ
దనియక మున్న కన్నుఁగవ తామర జోడు తెఱంగు దాల్చె ముం
చిన పరితాప మంతయును జీఁకటితోఁ బురుడించు నత్తఱిన్. 192

ప్రతి: అనుటయున్ = అని చిత్ర రేఖ పలుకఁగా పూర్ణచంద్రముఖున్ = నిండు చందురుని వంటి మోము కలవానిని, అనిరుద్ధుని; ఆదటన్ = ప్రేమముతో; చూడన్ = చూడఁగా; చకోర నేత్రకున్ = చకోర పక్షులవంటి కన్నుల గల ఉషకు; కనుఁగొనన్ = (అతఁడే అని) గుర్తింపఁగా; నెఱ+మనంబు = నిండుమది; శశికాంత శిలాతలము+ అయ్యెన్ = చంద్రకాంతమణివంటి ప్రదేశమయ్యెను (చల్లఁబడెను); అంతలోన్; తనియక మున్న+అ= చూచి తృప్తి పడక ముందే; కన్ను+కవ = రెండు కన్నులును; తామర జోడు తెఱంగు = రెండు కమలముల జంట తీరు; తాల్చెన్ = పొందెను; ముంచిన పరితాపము+అంతయును (ఎడఁబాటు అనే సముద్రములో) తన్ను మునుఁగఁజేసిన, వేఁడిమి అంతయును; ఆ + తఱిన్ = ఆ సమయమందు; చీఁకటితోన్; పురుడించున్ = సమానమయ్యెను.

తా: ఉష, అనిరుద్ధుని పూర్ణచంద్రముఖమును చూడఁగా ఆమె కన్నులు అనెడి చకోరములు (పక్షులు) ప్రేమతో చూచినవి. (చకోరములు చంద్రుని చాల ఇష్టపడును). ఆమెమనస్సు చంద్రకాంత శిలయై కరఁగినది. అనఁగాచల్లఁదనమును వహించెను. ఇట్లు ఇంకను తృప్తిని పొందుచుండఁగా వెన్వెంటనే (పూర్తిగా తృప్తిని పొందకముందే) ఆమె కన్నుల జంట కమలముల విధమయ్యెను. అట్లగుటచే చంద్రదర్శనము వలన అవి కన్నులు మూతఁబడినవి. ఉష కన్నులు మూసికొనుటకు కారణము చాల కాలము తన్ను తపింపఁజేసిన ఎడఁబాటు వలన కలిగిన వేఁడిమి క్షణములో అంతరించుట. అదంతయు చీకఁటితో సమానమగుట, అనగా చంద్రుని వెన్నెలచే చీకఁటి మాయమగునట్లు ఆ తాపము తొలఁగెననుట.

చంద్రదర్శనముచే చల్లఁదనము, మైమఱపు కలిగి ప్రశాంతత చేకూరును. అట్లు ఉష శాంతిని పొంది ఆనందముచే పరవశించెను.

అలం: 1. పరికరము. 'చకోర నేత్ర' 'చంద్రముఖు' ఈ శబ్దములు సాభిప్రాయములు.

2. పర్యాయోక్తి. 'నెమ్మనము చంద్రకాంత శిలాతల మయ్యెన్'. 'కన్నుఁగవ తామర జోడు తెఱగుఁ దాల్చె.' ఇవి క్రమముగా చల్లఁదనము కలుగుటను, కన్నులు మూత పడుటను భగ్యంతరమున చెప్పుచున్నవి.

3. ఉపమ. పరితాపమంతయును చీఁకటితో పురుడించెను.

వ్యా. కన్ను+కవ = కన్నుఁగవ (చూడు, పద్య - 66)

గీ. చిత్తమున బాణకన్యక చిత్రరేఖ
చేఁత లన్నియు నత్యంత చిత్ర మనుచు
సంతసము నొంది యనిరుద్ధు నంతిపురము
నందుఁ బెట్టించె నేకాంత మందిరమున. 193

తా: మనస్సులో ఉష, చిత్రరేఖ చేఁతలు అత్యంతము చిత్రమని తలంచి సంతసించి, అనిరుద్ధుని అంతఃపురములో ఏకాంత మందిరమున పెట్టించెను.

వ. అక్కుమారుండు. 194

తా : సులభము

కం. ఏ మగువ పట్టికొనెనో
యేమిటికిం దెచ్చెనో యి దెక్కడి పాటో
యేమీ యెఱుఁగఁడు మది మఱి
తామసి యను విద్య తొలుతఁ దనుఁ బొందుటయున్. 195

తా: అనిరుద్ధుని తామసి అను సమ్మోహన శక్తి ఆవరించినది. దానికి అతఁడు వశుఁడయ్యెను. కావున ఏ మగువ తన్ను పట్టుకొనెనో, ఏమిటికి తెచ్చెనో, ఎక్కడ నున్నాడో (పాటో) ఏమియును ఎఱుఁగఁడు.

గమనిక: అతఁడు 'హిప్నటైజ్' చేయఁబడెను.

వ. ఇట్లు మాయామోహితుం డైన ప్రద్యుమ్న తనయుండు పాన్పుపైఁ
బవ్వడించి యున్న తఱి నత్తెఱవ చిత్రరేఖ కిట్లనియె. 196

తా: ఈ విధముగా సమ్మోహన విద్యకు వశుఁడై ఒడలు తెలియక అనిరుద్ధుఁడు, శయ్యపై పరుండి యున్నప్పుడు, ఉష, చిత్రరేఖతో ఇట్లు అనెను.

కం. 'ఇరుసెవి యెఱుఁగక యుండం
దరుణీ!సుఖ మనుభవింపఁ దలఁచినఁ బదివే
వుర కన్ను లెదుటఁ బడితిని
సరి వా రెల్లిదము చేయ జాణెత నయితిన్. 197

అర్థ: పదివేవురు = పదివేలమంది; ఎల్లిదము = హేళన; జాణెతన్ = నేర్పరిని, ధూర్తురాలను,

తా: "ఓ యువతీ! ప్రక్కనున్న ఇంటి వారిచెవిలో కూడ పడకుండు నట్లు (వారికిని తెలియనట్లు) రహస్యముగా సుఖమనుభవింపఁదలంచి, నేను ఇప్పుడు అనేకుల దృష్టిలో పడినాను. నాతో సరివారు హేళన చేయునట్లు వంచకురాల నయితిని (నేర్పరిని).

వ్యా. ఇరు+చెవి > ఇరుసెవి. గసడవాదేశము.

కం. జల తైల బిందు వయి నా
మెలఁకువ వెల్లివిరి యైన మే లగునే ని
ర్మల చరితుఁ డయిన బాణుం
డలుగఁడె ప్రాణముల కింత యపరాధమునన్.' 198

తా: నీటిపై నూనె చుక్క మాదిరిగా నా పదిలమైన నడవడిక, (జాగరూకవర్తనము శ.ర.) అందఱికిని తెలిసినచో (వెల్లడయినచో) అది మేలు చేయునా? (కీడు కలుగుననుట) మలినములేని జీవితమును కల బాణుఁడు, ఇట్టి ప్రాణములకు ముప్పు తెచ్చు గొప్ప తప్పుచే కోపము చెందఁడా?

విశే. "ప్రాణములకు" ముప్పుతెచ్చునట్టి తప్పు అనుటచే బాణుఁడు ఉష ప్రాణములకు కీడు తలపెట్టవచ్చును. మఱియు యాదవరాక్షస యుద్ధమువలన బాణుని ప్రాణములకును హాని కలుగ వచ్చునని సూచన. ఉష తన్ను తండ్రి కోపించి వధింపఁబూనుననియు, సంశయించుచున్నది.

వ. అనినం జిత్ర రేఖ యిట్లనియె. 199

తా : సులభము

కం. ఏ మనఁగ లాఁతి వారమె
నీమన సెట్లట్ల కాక నీరజ వదనా!
యేమిటికిఁ *దలఁకె దల్లిం
దామరయును బోలె నుండి తగవు విడుతురే. 200

అర్థ: లాతివారమె = పరులమా? నీ మనసు +ఎట్లు+అట్లు+అ కాక = నీ మనస్సునకు ఎట్లు ఇష్టమో, అట్లే నీవు వర్తింతువుగాక! అల్లిన్ +తామరయును +పోలెన్ = అల్లితీఁగవలెను, తామర తీఁగవలెను (అల్లితీఁగ కలువ వంటిది); తగవు = స్నేహధర్మమును.

తా: మేమందఱము, నీకు పరులమా? నీ చెలిమికత్తెలము కదా! పద్మముఖీ! నీ మనసునకు ఇష్టమైనట్లు ప్రవర్తింపుము. నీకు భయమేల? నీ చెలులు, అల్లి, తామరల వలె అరమరికలు లేక నీతో కలిసి యుండినవారు, స్నేహధర్మమును విడువక, నీ ప్రణయ వర్తనమును తప్పక రక్షింతురు.

అలం: ఉపమ, అల్లిందామరయును బోలె.

వ్యా. తలఁకెదవు. తలఁకెదు వకారలోకము.(చూడు, పద్య - 21)

నానా. తగవు = న్యాయము, జగడము, పెండ్లప్పుడు పెండ్లి కూతునకు తల్లిదండ్రులు ఇచ్చెడి బహుమానము, (విశే) తగినది.

వ. అనుచు సఖీజనంబుల మనంబులకు రహస్యంబు వెలిపుచ్చం దగమి
దోఁపం బలికి వారిం దమ తమ వినోదంబు నెప్పటి యట్ల నిలువం
బంచిన యనంతరంబ. 201

తా: చిత్రరేఖ, స్నేహితురాండ్ర మనస్సులకు ఉష ప్రణయవర్తన రహస్యమును వెల్లడి కాకుండు విషయమును బాగుగా హత్తించి (నొక్కిపలికి), వారినెల్ల మునుపటి వలెనే తమ తమ వినోదములలో మెలఁగునట్లు నియమించి, పిమ్మట (తరువాతి పద్యముతో).

---

* తలఁకె దల్లీ, తామర.

చం. పడఁతి కుమార చంద్రు కరపల్లవముం దన చన్ను దోయిపై
నిడి పులకించి కన్నుఁగవ యించుక యించుక మోడ్చి వెండియుం
జిడిముడి పాటుతో నతని చెక్కులు గ్రుక్కుచు మోవి వ్రేళులం
బుడుకుచు నుండెఁ దాల్మిగడి వోయిన నించుక లజ్జలావునన్.202

అర్థ: కరపల్లవమున్ = చిగురువంటి చేతిని; చిడిముడిపాటుతో = తొట్రుపాటుతో; పుడుకుచున్ = ఇంచుక నొక్కుచు; కడివోయినన్ = తగ్గిపోఁగా;

తా: ఉష అనిరుద్ధుని చిగురువంటి చేతిని, తన చన్నుల జంటపై నుంచుకొని గగుర్పాటు చెంది, కన్నుల జంటను కొంచెము కొంచెము, మూసి కొనుచు తత్తర పాటుతో అతని చెక్కిళ్లు అదుముచు, పెదవిని వ్రేళ్లతో నొక్కుచునుండెను. ఉష ఓర్పు తగ్గిపోయినది. లజ్జయొక్క బలము ఇంచుకంతయే శేషించి యుండెను. కనుక ఆమె బాహ్య సంభోగ చేష్టలకు ఉపక్రమించినది. ఆలింగనాసక్తి, రతి పారవశ్యము, సంభ్రమము; చుంబనాభిలాష వర్ణింపఁబడినవి.

అలం: స్వభావోక్తి.

వ. ఇట్లున్న యక్కన్నియ కన్నెఱింగి చిత్రరేఖ మధుమథను మనుమనిం బొదివిన మాయామోహంబు నెడలించి పరిబోధ పరచిత్తుం జేసి యత్తరుణితో రాత్రి కడచన్న కొలంది చెప్పి ప్రొద్దువోయెం బోయి వచ్చెద నని వీడుకొని వెడలె నా సమయంబున. 203

అర్థ: కన్ను = తీరు; మాయామోహంబు = మోహన ప్రభావమును, ఒడలు తెలియని స్థితిని; పరిబోధ పరచిత్తునిన్ = చక్కని తెలివికి వశమగు మనస్సు కలవానినిగా,

తా: ఇట్లు ప్రవర్తించు ఉష మానసికస్థితిని గ్రహించి కాముని వశమై ఆమె మనస్సు లగ్నమైనదని ఎఱింగి, చిత్రరేఖ అనిరుద్ధునిపై గల సమ్మోహన ప్రభావమును పోగొట్టి తెలివిని కలిగించినది. ఉషతో ఆ రాత్రి ఎంతవఱకు కడచినదో తెలిపి, "ప్రొద్దుపోయినది.నేను పోయి వత్తును'' అని ఉష నుండి సెలవు పుచ్చుకొని ఆమెను విడిచి పోయెను. అప్పుడు.

చం. *ఒదికిలి పొన్పుపైఁ బతికి నొయ్యన కేలు దలాఁపి చేసి క
ట్టెదురుగఁ గౌఁగిలించికొని యెత్తుచు నొత్తుచు మోము మోము తోఁ,

* ఒదకిలి

గదియ నమర్చి పేర్చి పయిఁ గా లిడి నేరిమి లేని నేర్పులం
బొదలెడి యూర్పులం గరువు వోసిన భంగి లతాంగి యుండఁగన్. 204

అర్థ: ఒదికిలి = ఒక ప్రక్కకు తిరిగి; కేలు = చేయి; తలాపి = తలగడ; కరువు పోసిన భంగిన్ = పోత పోసిన విధముగా.

తా: తీవబోఁడి, ఉష శయ్యపై ప్రక్కకు తిరిగి పరుండి, అనిరుద్ధునకు మెల్లఁగా తన చేతిని తలగడగా చేసినది. అతనిని బాగుగా చూచుటకు అతనికి ఎదురై వంగి కౌఁగిలించుకొని పైకి ఎత్తుకొనుచు గట్టిగా తనవైపు అదిమినది. అతని ముఖము తన ముఖమును తాఁకునట్లు చక్కగా అమర్చి, ఇంకను అతిశయించి తన ఉద్రేకమును అడఁచుకొనలేక కాలిని అతనిపై పెట్టినది. ఇట్లు తెలియక కావించు కామక్రియల నేర్పులు ఆయాసమును కలిగించి, శ్రమ పెట్టుచుండఁగా, ఊర్పులు అధికమైనవి. అపుడు ఆ యువతి కరఁగించి, ప్రత్యేకముగా నిర్మించిన పోఁత పోసిన బొమ్మవలె కన్పట్టెను. ఇట్టుండఁగా (మీఁది వచనముతో).

వ. ప్రద్యుమ్న తనయుండు. 205

తా: ప్రద్యుమ్నుని పుత్రుఁడు అనిరుద్ధుఁడు (సమ్మోహన శక్తిచే తెలివిని కోల్పోయినవాఁడు క్రమక్రమముగా తెలివిని పొందుచు, యువతి కౌఁగిటిలో, శయ్య మీఁద ప్రక్కకు వాలి యుండుటను గుర్తించెను.)

కం. బిగువుఁ జనుంగవ తాఁకును
జిగురుం గెమ్మోవి మోవి చేరుటయును సూ
డిగముల చే తలగడయును
మగువ కవుంగిట నొకర్తు మరగుటఁ దెలుపన్. 206

తా: అనిరుద్ధుఁడు, తన్ను బిగువైన చనుదోయి జంట తాఁకుటను, తన ఎఱ్ఱని పెదవిని, మఱొక పెదవి ఆనుటను, తనకు గాజులు గల చేతిని తలగడగా నుంచుటను మొదలగు వానిచే, క్రొత్తదైన యొక కాంత తన్ను తన కౌఁగిటిలో బంధించి, కామ క్రియను ఆశించునట్లు తెలిసికొనెను.

ఉష, నేరిమి లేని కామ వర్తనములు, ఆమె వాంఛను ప్రకటించినవి. అనిరుద్ధునకు ఆ ఉష, క్రొత్తది. తానై అతనిపై పడి పెనఁగుచున్నది. ఆతని పొందు ఆమె కోరుట,

అనిరుద్ధునకు, మేలు కొన్నంతనే అవగతమైనది. హేలామదాలంకృతునకు అట్టి అవకాశము అపూర్వము. కనుక తాను ధన్యుఁడని తలంచి అనంతర క్రియలకు వెంటనే సిద్ధపడెను.

వ. కనువిచ్చు నప్పుడు. 207

తా: తాను మేలుకొని కన్నులను తెఱచినప్పుడు (మీఁది పద్యముతో).

ఆ.వె. మెఱుఁగుఁ దీవ వోలె మెలఁతుక కౌఁగిట
మేలు కట్ల క్రింద మేడ మీఁద
రత్న దీప మధ్యరాజితం బగు తల్ప
తలమునందుఁ బొందు తన్నుఁ జూచి. 208

తా: మేడమీఁద, మెఱఁపు వంటి మగువ కౌఁగిటిలో చాందినీల క్రింద నలువైపుల రత్న దీపముల కాంతులు వెలుఁగు చుండఁగా తళతళలతో ఒప్పు పాన్పుపై ఒక తరళనయన, తన్ను పొందుటకై యత్నించుటను, అనిరుద్ధుఁడు కాంచి (మీఁది పద్యముతో).

కం. 'కలగన్న చందమో మది
కలఁగుటయో యైంద్రజాలిక వినోదంబో
తెలియఁగ నేర' నటంచును
దలఁచును 'నిజ మైన నేన ధన్యుఁడ' ననుచున్. 209

తా: "నేను కలను చూచుచున్నానా? నా మనస్సు కలవరించుచున్నదా? ఇంద్రజాల విద్యవలన కలిగిన వేడుకయా? ఈ యువతి నన్ను పొందుటకు యత్నించుట నాకు అర్థమగుట లేదు. నిజముగా ఆమె నన్ను ఆశించుచున్నచో, ఇది నా పుణ్యఫలమే! నా జన్మతరించినది. నేను ధన్యుఁడను" అని అనిరుద్ధుఁడు తలంచెను.

అలం: సందేహము.

కం. 'నా కనక ప్రాసాదము
నా కొలువు విలాసినులును నా చుట్టములున్
లేకున్న నేమి కౌఁగిట
నీ కామిని యున్నఁ జాలు నెల్ల చవులకున్.' 210

తా: నా స్వర్ణ సౌధము, నా కొలువు కూటములోని విలాసవతులు, నా బంధువులును లేకపోయినను నాకు కొఱత ఉండదు. నా కౌఁగిటిలో ఈ కామినిని చేర్చుకొన్న నాకు అన్ని విధములైన శృంగార సుఖముల రుచి లభించును. వాని కంటె, ఆమె వినోదక్రియలే కోరదఁగిన వనుట.

వ. అనుచు నయ్యనిరుద్ధుండు నిద్దురలేమి,నక్కామిని పొందు నిక్కంబుగాఁ
దెలిసి. 211

తా: అని తలంచుచు తాను నిద్దురలో లేనట్లు గుర్తించి, ఆమె నిజముగా తన్ను ఆశించుచున్నదని తెలిసికొని, (అనంతర రతి క్రియలకు కడంగెను).

సీ. తెమలించి కురు లొయ్యఁ దివియ [1]లే కట మున్న
కదిసిన కెమ్మోవి గమిచి కమిచి
[2]వెడవెడ సోఁకి పై నడర లే కట మున్న
యలవడ్డ కౌఁగిట నదిమి యదిమి
వలు వెడలింపఁ [3]జే వాటు లే కట మున్న
పైకొన్న జఘనంబుఁ బ్రాఁకి ప్రాఁకి
తమకించి కొసరు పంతంబు లే కట మున్న
[4]కదిసిన చిత్తంబు గరఁచి కరఁచి

గీ. తుది మొదలి కంటెఁ దుదికంటె మొదలు చాలఁ
జవుల గను లైన రతులకుఁ జనవు లిచ్చి
పూవిలుతు చేతి జంత్రంపు బొమ్మఁ జేసె
మానినీ తిలకంబుఁ గుమారవరుఁడు. 212

ప్రతి: కురులు = తలవెంట్రుకలు; తెమలించి = చిక్కు దీసి దువ్వి; ఒయ్యన్ = మెల్లఁగా; తివియలేక = ఆక్రమింప లేక (పూర్తిగా ఆనలేక); అటమున్న+అ = అంతకు ముందే తన్ను కదిసిన = తన పెదవిని చేరిన; కెంపు+మోవి = (ఉష) ఎఱ్ఱని పెదవిని; కమిచి కమిచి = బాగుగా ఆని;

1. కయటమున్న. 2. వెడ సోఁకినంత మై 3. బైవాటు. 4. కరఁగిన

వెడవెడ = కొంచెము, కొంచెము; సోఁకి = తాఁకి; పైన్+అడరలేక = పైన పడలేక; అటమున్న+అ; అలవడ్డ = వశపడిన; కౌఁగిటన్ = కౌఁగిటిలో; అదిమి అదిమి = చక్కగా నొక్కి;

వలువ+ఎడలింపన్ = చీరను తొలఁగించుటకు; చేవాటులేక = చేయి వైచుటకు వీలులేక; అటమున్న+అ (చేవాటులేక = సమీపించుటకు కాక); పై కొన్న = యత్నించుచున్న; జఘనంబున్ = మొల ముందు భాగమును; ప్రాఁకి ప్రాఁకి = మెల్లఁగా ఎక్కుచు;

తమకించి = కామావేశముతో; కొసరు పంతంబులేక = కొంత, కొంత అని కోరక; అటమున్న+అ; కదిసిన చిత్తంబున్ = తనకు అనుకూలమైన మనస్సును (రతికి ఇష్టపడు) కరఁచి కరఁచి = మిక్కిలి కరఁగించి;

తుది, మొదలికంటెన్ = మొదట కావించిన క్రియకంటె, తరువాత చేసిన చేష్ట (కామక్రియ); తుదికంటెన్ = చివర దాని కంటె; మొదలు = మొదట చేసిన చేఁత; చాలన్ = పెక్కు; చవుల గనులు +ఐన = రుచులకు నిలయములైన; రతులకు = సంగమక్రీడలకు; చనవులు+ఇచ్చి = అనురాగమును చూపి (పెక్కు రీతులైన రతి భంగిమలతో అలరించి); కుమార వరుఁడు; మానినీ తిలకంబున్ = యువతులలో మిన్న అగు ఉషను; పూవిలుతు చేతి = కాముని చేతిలో; యంత్రము + బొమ్మను; చేసెన్.

తా: తలవెంట్రుకల చిక్కుదీసి దువ్వి మెల్లఁగా ముడి వేయుటకు ముందే, తన పెదవిని చేరిన ఉష ఎట్టుని పెదవిని బాగుగా ఆస్వాదించి, కొంచెము కొంచెము తాఁకుచు పైన పడుటకు ప్రారభించుటకు ముందే, తనకు అందిన కౌఁగిటిలో, చక్కగా నొక్కి, చీరను తీసివేయుటకు చేయి వైచుటకు (సమీపించుటకు) ముందే తన్ను చేరుటకు యత్నించుచున్న మొల ముందు భాగమును, మెల్లఁగా ఎక్కి, కామోద్రేకముచే మఱికొంత కొంత అని, చుంబనాదులను కోరకముందే తనకు తగినట్లు ప్రవర్తించు ఉష మనస్సును కరఁగించి, తుది కంటె మొదటిది, మొదటి దాని కంటె తుదిది, ఇంపుగా, పెక్కు శృంగార చేష్టలకు (రుచులకు) నిలయములైన కామక్రీడలకు అనురాగమును, ప్రదర్శించి పెక్కు రీతులైన భంగిమలతో అనిరుద్ధుఁడు, కుమార శ్రేష్ఠుఁడు, యువతులలో మిన్న అయిన ఉషను కాముని చేతిలో మరబొమ్మగా చేసి, తన ఇష్టానుసారము, ఆమెతో ఆటలాడెను.

ఒక ప్రక్కకు ఒదిగి అనిరుద్ధుని చేరి క్రమ క్రమముగా అతనిని, నేర్పులేని చేఁతలత కలిపి అతనిని పొందు నాశించి తన కాలిని ఆతనిపై విడి, కరఁగిన పోత బొమ్మవలెనుండగా, తెలివిని పొందిన కుమారవరుఁడు అలసిసొలసిన అన్నులమిన్నను పెక్కు రీతులైన రతులతో శృంగార రస జలధిలో మునుంగ జేసి, ఆనందానుభూతిని అపూర్వముగా నొసఁగెను.

వ. ఇవ్విధంబున మదనకేళిం దేలి యక్కులపాలికా తిలకంబు చేతం
గలలోపలం గన్నది మొదలుగాఁ గౌఁగిటిలో నున్నది తుదిగాఁ
దనవృత్తాంతం బంతయు విని యనిరుద్ధుం డుషా సౌభా
గ్యానిరుద్ధుండయి కొన్ని దినంబు లొరు లెఱుంగకుండ వర్తించునెడ
నొక్కనాఁడు. 213

అర్థ: మన్మథకేళిన్ = సంభోగమందు (సంగమమందు); ఆ+కులపాలికా తిలకంబుచేన్ = ఆ కులకాంతా యువతీ రత్నముచే; సౌభాగ్య+ అనిరుద్ధుండు+అయి = సౌందర్యముచే అడ్డగింపఁ బడని వాఁడై, పూర్తి కట్టఁబడినవాఁడై, ఆమె సౌందర్యముచే ఆకర్షింపఁబడి, ఆమెతో ఎల్లప్పుడు, కామ సుఖములను అనుభవింపఁ దలచిన వాఁడై.

తా: మదన క్రీడలలో, అనిరుద్ధుఁడు, సంపూర్ణ సుఖ మనుభవించి, పిమ్మట ఆ ఉషవలన, కలలో తన్ను చూచుట మొదలుకొని చివరగా ఆమె కౌఁగిటిలో చేరువఱకు జరిగిన వృత్తాంతమంతయును విని, అతఁడు ఆమె సౌందర్యమునకు వశుఁడై కొన్ని దినములు ఇతరులు ఎవరును ఎఱుఁగనట్లు వర్తించు చుండఁగా (మీఁది పద్యముతో అన్వయము).

కం. ఆవసథ శోధనమునకు
సావాసులు వచ్చి కనిరి సౌధముపై సం
భావితుఁడై దనుజ సుతా
సేవితుఁడై యున్న మనుజసింహుఁ గుమారున్. 214

అర్థ: (అవసథము = ఇల్లు) ఆవసథ శోధనమునకున్ = ఇంటికి సంబంధించిన రక్షణకై వెదకుటకు; అర్థాంతరము. శుభ్రము చేయుటకు; సావాసులు = రక్షకులు, కంచుకులు;

తా: ఇంటిని వెదకుటకు వచ్చిన రక్షకులు మేడ మీద రాక్షసకన్య ఉషచే సేవలు పొందుచున్న మానవ శ్రేష్ఠుఁడైన అనిరుద్ధకుమారుని చూచిరి.

మ. కని యక్కోమలికిం గుమారునకు సంగం బంగజాయత్తమై
యునికిన్ బాణుని తోడఁ జెప్పఁ జని వారొండేమియున్ శంక లే
క నరుం డొక్కఁడు దేవ! నీ నగరిలోఁ గన్యాజనాంతఃపురం
బున నున్నాఁడు భవత్సుతా విభుత నిప్పొందియ్యకొన్నాఁడవే. 215

అర్థ: ఆ+కోమలికిన్ = ఆ మృదువైన ఇంతికి, ఉషకు; సంగంబు = కూటమి; అంగజ+ఆయత్తమై = మదన వశమై; భవత్ సుతావిభుతన్ = నీకూతునకు పతియై.

తా: రక్షకులు ఉషా అనిరుద్ధులు శృంగార క్రీడలలో వర్తించుచున్నారని బాణునితో చెప్పుటకు వెడలి ఏవిధమైన శంకయు లేక "దేవా! నరుఁడు ఒక్కడు నీ నగరిలో, అదియు కన్యలుండు అంతఃపురములో నీ కూతునకు పతియై సుఖములను పొందుచున్నాఁడు. ఈ సంగమమును నీవు సమ్మతించితివా ఏమి?"

ఉ. నావుడు రోషవహ్ని వలనం బొగ రేఁగిన భంగి మోమునం
గావిరి పర్వ నంగమునఁ గంపము నివ్వటిలంగ బాణుఁ డ
త్యావిలచిత్తుఁ డై మనుజుఁ డట్టె మదీయపురంబు చొచ్చె న
చ్చేవయ కాక నానగరు చెర్చె నిసీ మగమాట లేటికిన్. 216

అర్థ: రోషవహ్నిన్ = కోపాగ్ని; కావిరి = నలుపు; అతి+ఆవిల = మిక్కిలి కలఁగిన; ఆ+చేవ+అ కాక = ఆ పొగరే కాక; చెర్చెన్ = చెఱిచెను; మగమాటలు = పౌరుషము గల మాటలు.

తా: అన్నంతనే, బాణుఁడు, కోపాగ్ని నుండి పొగ రేఁగిన విధమున ముఖమందు నల్లని వన్నె పర్వఁగా మేనియందు వడఁకు కలుగఁగా, కలఁగిన మనస్సుతో "మానవుఁడు నా పురమును ప్రవేశించెనా ఏమి? ఇది ఆశ్చర్యము. అట్లు చొచ్చుటయే కాక, దిట్టతనముతో (పొగరుతో) నా అంతఃపురమును చేరి నా కూతును వశపఱచుకొని కీడుచేసి నా కులమునకు కళంకము తెచ్చెను."

అలం: రూపకాను ప్రాణితమైన ఉపమ. రోషవహ్నివలనం బొగ రేఁగిన భంగి.

వ్యా. చెర్చె -చెఱిచె . సూ. ప్రకీర్ణ, బాల - 17, ముక్త లక్షణ వివేకము, ప్రౌఢ - 2.

కం. *ఏ నటె నాకూఁతురి నటె
మానవుఁ డఁటె నగరు చొచ్చి మాకులమునకున్
హాని యొనరించెఁ గన్నులఁ -
గానఁడు దలయెత్త రోఁత గాదే నాకున్. 217

* ఏ నీ నటె నాకూఁతును.

తా: నేను, త్రిలోకములను జయించిన వాఁడను కదా! అట్టి నాకుమార్తె ఎక్కడ? (పాఠాం. నేను నాకూతును ఈనట) ఆశ్చర్యము. నరుఁడు ఎంతటివాఁడు మా నగరు చొచ్చి కీడు చేసెను. నా బలపరాక్రమములు కన్నులతో చూడఁడు. కన్నులు మూసికొని పోయినవా ఏమి అనుట. నా పరువు పోయినది. ఈ సంగతి లోకమునకు తెలిసిన నా తల పైకి ఎత్తుకొని తిరుగుట సిగ్గు పడవలసిన పని అగును.

విశే. అటె = ఆశ్చర్యమును, దుఃఖమును తెలుపును (అవ్యయము).

అఁట = వృత్తాంతమును, మహత్త్వమును తెలుపును.

నానా :అంట = అనుట, అడ; కుట్టిన ఆకు, గుంపు (బహు)

వ్యా. కూతురిని. ద్వితీయలో ఇది అసాధువు. ఆచ్చిక, బాల - 9.

కం. మను జాంగనలం బట్టుట
దనుజులకుం జెల్లుఁ గాక దనుజాంగనలన్
మనుజులు పట్టుటకును దొరఁ
కొనిరే బెండులు మునింగి గుండులు దేలెన్. 218

తా: మానవ కాంతలను బట్టుట దానవులకు చెల్లును. దనుజాంగలను మనుజులు పట్టుకొనుటకు ప్రయత్నించుచున్నారు. అయ్యో! ఇప్పుడు తేలికైన బెండులు నీటిలో మునిగినవి. బరువైన (ఇనుప)గుండులు నీటిపై తేలినవి కదా!

అలం: దృష్టాంతము.

**- : అనిరుద్ధుం బట్ట బాణుఁడు తన కింకరులఁ బనుచుట : -**

కం. అని తన కింకరసైన్యము
ననిరుద్ధునిమీఁదఁ బనిచె నదియు భయోత్పా
దనగతిఁ బట్టుఁడు కట్టుఁడు
తునుముఁ డను నెలుంగు లడరఁ దోతెంచె వడిన్. 219

అర్థ: భయ+ఉత్పాదన గతిన్ = భయమును కలిగించు విధమున; ఎలుంగులు = అఱపులు, కేకలు (కంఠ స్వరములు); వడిన్ = వేగముగా; తోతెంచెన్ = కన్పట్టెను.

తా: అని, బాణుఁడు తన సైన్యమున గల కాల్బంటులను, అనిరుద్ధుని పైకి పంపెను. ఆ సైన్యము వెఱపు కలిగించునట్లు "పట్టుఁడు, కట్టుఁడు, ముక్కలు చేయుఁడు" అను కేకలతో వేగముతో ముందుకు నడిచెను.

కం. అప్పలుకుల కలుకలు మది
నుప్పర మెగయంగ నెసఁగె నుల్లాసము మై
నొప్పారఁగ బరిగోలల
నొప్పించిన భద్రగజము నూల్కొన్నగతిన్. 220

అర్థ: అలుకలు = కోప భావములు; ఉప్పరము = ఆకాశమునను; ఎగయంగన్ = అంటఁగా (అతిశయింపఁగా); ఉల్లాసము మైన్ = ఉత్సాహముతో; బరిగోలలన్ = బరిసెలతో; ములుకోలలతో; భద్రగజము = మేలైన జాతికి చెందిన ఏనుఁగు; నూల్కొన్న గతిన్ = పురిగొని చెలరేఁగిన విధమున.

తా: ఆ మాటలకు కోప తీవ్రత మనస్సులో మెండై పొంగినది (మిన్ను ముట్టినది). బరిసెలచే నొప్పింపఁబడిన భద్రజాతి ఏనుఁగు వలె ఉత్సాహముతో అనిరుద్ధుఁడు శౌర్యముతో కన్పట్టెను.

వ. అక్కుమార కంఠీరవుండు. 221

ప్రతి: ఆ+కుమార కంఠీరవుండు = ఆ శ్రేష్ఠుఁడైన కుమారుఁడు.

తా: ఆ శ్రేష్ఠుఁడైన కుమారుఁడు, అనిరుద్ధుఁడు (మీఁది పద్యముతో).

కం. ఆ తరుణి వలదు వల దని
భీతిం దనుఁ బట్టఁ బట్ట భీకరతర ని
ర్ఘాత రవ సింహనాదుం
డై తత్సౌధంబు డిగ్గె నవుడు గఱచుచున్. 222

ప్రతి: ఆ తరుణి, వలదు, వలదు+అని; భీతిన్ = భయముతో; తనున్ = తన్ను; పట్టన్+పట్టన్ = మిక్కిలి అడ్డుకొన్నను; భీకరతర నిర్ఘాతరవ సింహనాదుండు+ఐన = మిక్కిలి భయంకరమైన పిడుగు వంటి ధ్వని యైన సింహగర్జనముతో; అవుడు + కఱచుచున్ = పెదవిని కొఱుకుచు.

తా: ఆ యువతి ఉష ఆ సేనమీఁదికి 'పోవలదు పోవలదు' అని ఎంతగా తన్ను అడ్డగించినను, అనిరుద్ధుఁడు మిక్కిలి భయంకరమైన పిడుగు వంటి సింహగర్జనతో పెదవులు కొఱుకుచు ఆ మేడ మీఁది నుండి క్రిందికి దిగి వచ్చెను.

అలం: పరికరాంకురము. విశేష్యము సాభిప్రాయమై ఉన్నది.

వ. ఇట్లు డిగ్గి తదంతఃపుర ద్వారంబున నిలిచి దారుణ తరం బగు
పరిఘంబు పుచ్చికొని. 223

తా: ఈ విధముగా దిగి ఆ అంతఃపుర ద్వార మందు నిలిచి మిక్కిలి వెఱపు కొల్పు ఇనుప గుదియను చేతపట్టుకొని (మీఁది పద్యముతో).

మ. తన ఘోరధ్వనికిం గలంగఁ బడు తత్సైన్యంబు దైన్యంబునం
దును కొందం బరిఘంబుపై విసరుచున్ దుర్వారుఁడై పైపయి
న్మునుఁగం బాఱు శరాసి ముద్గర గదా ము ఖ్యాయుధ శ్రేణిచేఁ
గినియం జేసిన వేసవిన్ రవి దివిన్ గ్రీడించు చందంబునన్. 224

ప్రతి: తన ఘోర ధ్వనికిన్ = తన యొక్క భయమును కలిగించు, సింహనాదమునకు; కలంగఁబడు = కలఁతచెందు; తద్ + సైన్యంబు = ఆ బాణుని సేన; దైన్యంబునన్ = విచారముతో, దీనభావముతో; తునుక+ఒందన్ = విడివిడిగా చీలి పోవునట్లు; పరిఘంబు = ఇనుపగుదియ; పైన్ = మీఁద; విసరుచున్; దుర్వారుఁడు+ఐ = అడ్డగింపఁబడని వాఁడై; పైపయిన్ = తనమీఁదికి; మునుఁగన్ పాఱు = ముంచి వేయునట్లు వచ్చుచున్న; శర = బాణములు; అసి ముద్గర = కత్తులు, ఇనుపకట్లగుదియలు; గదా = గదలు; ముఖ్య = మొదలైన; ఆయుధ శ్రేణిన్ = పోటు ముట్టుల వరుసచే; కినియన్ + చేసినన్ = కోపము చెందునట్లు ప్రయోగింపఁగా; వేసవిన్; రవి = సూర్యుఁడు; దివిన్ = ఆకాశమందు; క్రీడించు + చందంబునన్ = విహరించు విధమున. పాఠాం. దునుక = బాధ (శ.ర.)

తా: తన భయంకరమైన సింహనాదముచే సైన్యము చెల్లాచెదరైనది. ఇనుపగుదియను త్రిప్పుచు, అడ్డులేక తన్ను ముంచుటకు వచ్చు పోటుముట్టులన్నియును తనకు కోపము కలిగింపఁగా (అనిరుద్ధుఁడు) (మీఁది పద్యముతో).

అలం: ఉపమ. వేసవిన్ రవి దివిన్ గ్రీడించు చందంబునన్.

కం. మండి పదాతులఁ గొందఱఁ
జెం డాడిన నున్నవారు చెడి పాఱిరి బా

ణుం డున్న యెడకు నొడళుల
నిండను నెత్తురులు గ్రమ్మ నిట్టూర్పులతోన్. 225

తా: కోపముతో ఉడుకుచు, కాల్బంటులను కొంత మందిని వధించెను. తక్కినవారు కలఁగి బాణుఁడు ఉన్న చోటికి మేనుల నుండి రక్తము వెలువడు చుండఁగా నిట్టూర్పులతో పరుగిడిపోయిరి.

వ్యా. 1. ఒడళులు - బహువచనము. ఒడలు (ఏ.వ).

సూ. బహువచనంబు పరంబగునపుడు అసంయుక్తంబులయి ఉదంతంబులయిన 'డలర' లకు అలఘులకారము బహుళంబుగానగు. ఆచ్ఛిక, బాల - 13.

2 నిడు + ఊర్పు=నిట్టూర్పు.

సూ. కుఱుచిఱు కడు నడు నిడు శబ్దంబుల 'ఱడ' లకు అచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు. ఉత్వ సంధి నిత్యము, సంధి, బాల - 12,

వ. అప్పు డద్దనుజేంద్రుండు. 226

తా: ఆ సమయమందు ఆ రాక్షసశ్రేష్ఠుఁడు, బాణాసురుఁడు.

కం. వెఱవకుఁడు పాఱకుఁడు చిం
దఱవందఱ గాకుఁ డేల ధైర్యముఁ దూలన్?
మఱచితి రె కులముఁ గీర్తియుఁ
బిఱుకుల గతి నింత వలదు బీరము చెడఁగన్. 227

తా: (ఓ సైనికులార!) భయపడకుఁడు (యుద్ధమునుండి) పరుగిడిపోకుఁడు. కలఁతచెంది చెదరకుఁడు. ధైర్యమును ఏల కోల్పోవుచున్నారు? మన కులమును, కీర్తిని మఱచితిరా ఏమి? పిఱికి వాండ్రవలె, (ఈ విధముగా) ఇంతగా, పరాక్రమము చెడునట్లు చలింపరాదు.

ఉ. పాఱెడు త్రోవ మీకు నలవాటుగఁ జేసినవీరుఁ డెవ్వఁడో
మీఱి యనేక యుద్ధముల మీరు జయించుట లెల్ల నింతతోఁ
దీఱె ననుం గనుంగొనుఁడు ధీరతఁ దోడ్పడ రండు నాకునుం;
బాఱుఁడు పాఱుఁడంచుఁ బరిపంథుల నోర్వఁడు చాలు మీపనుల్. 228

తా: ఈ విధముగా (భయపడి) యుద్ధమునుండి వెనుదిరిగి పరుగెత్తి పోవు పద్ధతిని అభ్యసింపఁజేసిన (నేర్పిన) మొనగాఁడు ఎవ్వడు? అందతిని మించి, పెక్కు కయ్యములలో మీరు విజయము సాధించి కీర్తిని పొందియున్నారు. ఈ పోరులో ఇట్లు మీరు ప్రవర్తించి అపజయమునకు కారణమైనచో, మీకు కలిగిన మంచి పేరు పూర్తిగా నశించును. నన్ను చూడుఁడు. ధీరులై నాకు సాయపడరండు. శత్రుసైన్యమును 'వెనుకకు మరలి పరుగిడి పొండు, పొండు' అని శత్రువులను ఓడింపుఁడు. ఇప్పటి వఱకు మీరు కావించిన అవమానకరమైన పనులు విరమింపుఁడు. (ఆఁపి యుద్ధమునకై ముందుకు పొండు).

వ్యా. 'ఓడు' ధాతువునకు ప్రేరణార్థము, 'ఓరుచు' 'ఓడించు'. 'ఓడుచు'నకు, రేఫము, వకారము; ఉత్వలోపము. క్రియ, బాల - 80, 88 ప్రకీర్ణ, బాల - 16. > "ఓర్వు" మధ్యమ పురుష బహువచనమున 'డుజ్ వచ్చి "ఓర్వుఁడు" అగును.

నానా. ఓరుచు = క్షమించు, సహించు. ఓడు ధాతువు ప్రేరణము, ఓడించు. రూ. ఒర్చు.

వ. అని వారి నడకించియు నదలించియుఁ బొదుపు చేసి పోరికిఁ బురికొల్పి
మఱియు మహావీరులం బదివేవురుం బదివేవురుగాఁ బలుదెఱంగుల
మూఁకలు చేసి ప్రమథగణంబుల గలపి పంచిన. 229

అర్థ: అడకించియు = హేళనచేసియు; పొదుపు చేసియు = ధైర్యమును వృద్ధిచేసియు మూఁకలు చేసియు = దండులుగా (గుంపులుగా) ఏర్పఱచియు.

తా: అనుచు, యుద్ధవీరులను అపహసించియు బెదిరించియు, (తొలఁగిపోవుచున్న) వారి ధైర్యమును పదిలపఱచి వృద్ధి చేసియు, ప్రోత్సహించి, ఇంకను గొప్ప వీరులను పదివేల మంది, పదివేలమందిగా, పెక్కువిధములుగా దండులుగా (జట్టులుగా) తీర్చి, ప్రమథ గణములతో చేర్చి పంపఁగా (మీఁది పద్యముతో):

శా. నేలం గొందఱు మింటఁ గొందఱు గజానీకంబుఁ గీలాలము
గ్జాలంబుం బురుడింప సంచిత మదోత్సాహంబు దేహంబులం
జాలం గ్రాల నిశాత హేతిలతికా సౌదామనీ దామ భీ
మాలంకారము బీరముం దెలుప నుద్యద్విక్రమ క్రీడతోన్. 230

తా: ఒక వీరునకు అనేకులు గల సేనతో పోరుట ఆశ్చర్యము. దానవ సేన అనెడి పెను చీఁకటికి వెనుకాడక, యాదవ వంశీయుఁడైన యువకుఁడు అనిరుద్ధుడు సూర్యుఁడుగా నిలిచెను. అంధకారమును అడఁచెను.

అలం: రూపకము. దానవబలము - తిమిరము. యాదవ కుమారుఁడు - సూర్యుఁడు.

వ. ఇట్లు నిలిచి తనచేతి పరిఘంబు కంధరంబునం జేర్చి. 233

తా: ఈ విధముగా నిలిచి అనిరుద్ధుఁడు తన చేత నున్న ఇనుప గుదియను కంఠమునందు చేర్చి (మీఁది పద్యముతో).

గీ. పరిఘ తోమరాదులం దన్నుఁ బరులు వైవ
వారి వారి కైదువులన వారి వైచె
మఱియుఁ దన తొంటిపరిఘం బమర్చి చేత
నా సురారాతి సేనపై నడరె నపుడు. 234

ప్రతి: పరులు = శత్రువులు; పరిఘ తోమర+ఆదులన్ = ఇనుపగుదియ, చిల్లకోల మున్నగు ఆ యుధములతో; తన్నున్; వైవన్ = కొట్టఁగా; వారి వారి కైదువులన్+అ = వారివారి ఆయుధములతోనే; వారిన్ = ఆ శత్రువులను; వైచెన్ = కొట్టెను; మఱియున్; తన తొంటి పరిఘంబు = తాను ముందు ప్రయోగించిన గుదియను చేతన్; అమర్చి = చక్కఁగా ధరించి; ఆ+సుర+అరాతి = ఆ దేవతల పగవారైన; సేనపై = సైనికుల మొత్తముపై; అపుడు; అడరెన్ = ఉఱికెను.

తా: శత్రువులు అనిరుద్ధుని వివిధాయుధములతో కొట్టిరి. వారిని వానితోనే త్రిప్పి కొట్టెను. మఱియు తాను తొల్లి ప్రయోగించిన ఇనుపగుదియనే మరల చేత ధరించి రాక్షస సేనపైకి, ఉఱికెను.

వ. ఇట్లు. 235

తా :

కం. ఇరువదినాలుగువేవురు
వరభటులం గింకరుల నవారణఁ బోరం
బరిమార్చి విక్రమ క్రమ
ధురంధరుం డయిన విజయ దోహలి మఱియున్. 236

తా: ఇరువది నాలుగు వేల మంది మేలైన వీరులగు సైనికులను అడ్డులేక కయ్యమున చంపి పరాక్రమమాతిశయ భారమును వహించిన వాఁడును, విజయమందు ఉత్సాహమతిశయించు వాఁడును, అయిన అనిరుద్ధుఁడు (మీఁది పద్యముతో).

కం. పలకయుఁ గరవాలముఁ గొని
పొలికలనం గెలనఁ జదలఁ బొదల మెఱుంగుల్
వల నొప్పారఁ బ్రచారం
బులు ముప్పది రెండు నిండు మొనలకుఁ జూపెన్. 237

అర్థ: పొలికలనన్ = యుద్ధరంగమందు; కెలనన్ = ప్రక్కలందు; చదలన్ = మింటను; పొదలన్ = ఒప్పగా; వలను = ప్రచారంబులు = కత్తి త్రిప్పుటలు; నిండు మొనలకున్ = చుట్టును నిండియున్న సేనలకు.

తా: అనిరుద్ధుఁడు యుద్ధరంగమందు డాలును, కత్తిని, పూని, ప్రక్కలందు, ఆకసమందు కాంతులు ప్రసరింపఁగా చతురత ఒప్పునట్లు ముప్పది రెండు కత్తి త్రిప్పుటలు, చుట్టు నిండియున్న సేనలకు, చూపెను. (చూడు, వచన. 256 ఆ, 2)

నానా. వలను= నేర్పు, దిక్కు, ప్రక్క, ఉపాయము, విధము, ప్రదక్షిణము, ఒప్పిదము మొ.

వ. ఇట్లు వివిధవిక్రమవిహారంబులకు సారంబు లగు కరవాల ధారాప్రహారంబులఁ బరబలంబులం బొరిగడిగి యదుకుమార కుంజరంబు పంజరంబు విడివడిన సింగంబు నంగంబు లవణి ననుకరించుచుఁ గరటి ఘటాఘాట విఘటనంబునం జటుల వలాహక పటల విపాటనంబునఁ దురగ పరంపరా పరాఙ్ముఖీకరణ నైపుణంబునం దరళ తరంగ పాళీ పలాయన ప్రతివాదనంబున నిబిడ స్యందన సందోహ విదారణంబున విచిత్ర యాన పాత్ర విధ్వంసనంబున సముద్భట భటసముదాయ ఖండనంబునం బటువిటపి వాటి మోటనంబునఁ బ్రచండ పవమాన ప్రతిమానుం డగుటయుఁ దత్సైన్యంబు చాఁపకట్టు వడిన నందుఁ గొందఱు విఱిగి పాఱు చో సందడి ద్రుంగుడియు సంగడివారిం ద్రొందియు నెత్తురులు గ్రక్కియు

నిగుడ లేక చిక్కియ్యుఁ దాఁకి పడియును దల్లడ పడియును వ్రేళులు
గఱచియు వెనుకవారు వెఱచియుం గైదువులు వైచియుఁ గ్రంతలు
చూచియు బడిపాఁతఱలం ద్రెళ్ళియుఁ బలుకకు మని గిల్లియు నిండ్లు
దూఱియు నెడదవ్వు వాఱియుఁ బీనుఁగులలో డాఁగియుఁ బేరుకొన్న
రేఁగియుఁ బోరాక మరలియుఁ జోటు లేక పొరలియు నంతంత
విచ్చియు నతివల మఱుఁగు చొచ్చియు విరథులై కోలుకొన లేక పఱచి
రప్పుడు గొందఱు నేలయెడ చాలక నింగికిం దొలంగిన. 238

ప్రతి: ఇట్లు; వివిధ విక్రమ విహారంబులకున్ = పలురకములైన పరాక్రమ క్రీడలకును; సారంబులు+అగు = మేలైన, బలము కలవియగు; కరవాలధారా = కత్తి వాదలరల యొక్క; ప్రహారంబులన్ = వ్రేటులచే; పరబలంబులన్ = శత్రుసేనలను; పొరి+కడిగి = దృఢత్వమును తుడిచి వేసి; యదుకుమార కుంజరంబు = యదు కుమార వరుఁడైన, అనిరుద్ధుఁడు పంజరంబు = బోనునుండి; విడివడిన = వెలికి వచ్చిన; సింగంబు లవణిన్ = సింహము యొక్క మేని బిగువును, గట్టితనమును; అనుకరించుచున్; కరటి ఘటాఘాట విఘటనంబునన్ = ఏనుఁగుల గుంపుయొక్క పెడతలల బ్రద్దలు కొట్టుట యందు (ఘాటా ఆకారాంతస్త్రీ లింగము. ఇట అకారంతముగా నున్నది); చటుల వలాహక పటల విపాటనంబునన్ = చంచలములైన మేఘముల మొత్తమును విడగొట్టుట తోను, (చీల్చుటయందు); తురంగ పరంపరా పరాక్+ముఖీకరణ నైపుణంబునన్ = గుఱ్ఱముల వరుసలను పెడముఖము పెట్టించి వెనుకకు మరలిపోవునట్లు చేయు నేర్పునందును; తరళ = చంచలములైన; తరంగ పాళీ = అలల వరుసలను; పలాయన ప్రతి వాదనంబునన్ = పరువెత్తునట్లు చేయు గొప్ప మాఱు మ్రోతలు చేయుట తోను; నిబిడ = దట్టమైన; స్పందన సందోహ = తేరుల గుమి యొక్క; విదారణంబునన్ = బ్రద్దలు కొట్టుట యందును; విచిత్ర యాన పాత్ర విధ్వంసనంబునన్ = అచ్చెరువు కొల్పు దిట్టమైన పలు విధములగు ఓడలను (ప్రయాణ సాధనములను) నాశము చేయుట తోను; ఉద్దండ భట సముదాయ ఖండనంబునన్ = మహావీరులైన యోధుల సమూహము యొక్క నఱకుట యందును; పటు విటపివాటి మోటనంబునన్ = బలమైన చెట్ల తోటల యొక్క నలగఁగొట్టుట తోను; **ప్రచండ పవమాన ప్రతిమానుండు = అతి తీవ్రమైన వాయు శక్తికి, సమానుఁడు; అగుటయున్ = కాఁగా;** తద్+సైన్యంబు = ఆ బాణుని సేన; చాఁపకట్టు పడినన్ = చాప పఱచినట్లు నేలపై పడిపోఁగా; అందున్ = ఆ సేనలో; కొందఱు = కొందఱు వీరులు; విఱిగి పాఱుచోన్ = ధైర్యము కోల్పోయి, వెనుకకు మరలి పరుగిడి పోవుచుండఁగా; సందడిన్ = ఆ త్రొక్కు లాటలో; మంద్రియున్ = చచ్చియు; సంగడివారిన్

= చెంతనున్న వారిని; బ్రందియున్ = నిందించియును; నెత్తురులు + క్రక్కియున్ = నెత్తురులు (బ.వ) రక్తమును క్రక్కుచును; నిగుడన్ లేక = పైకి పోలేక; చిక్కియును; తాఁకి = ఎదిరించి; పడియును = కూలిపోయియును; తల్లడము+పడియును = బాగుగా చలించి బాధ పడియును; వ్రేళులు కఱచియును = ఏమియును తోఁచక, వ్రేళ్లను కఱచి కొనియును; వెనుక వారు వెఱచియున్ = వెనుక నున్న వారు భయపడియును; కైదువులు వైచియున్ = ఆయుధములను క్రింద పడవేసియును; క్రంతలు చూచియున్ = (తప్పించికొని పోవుటకు) సందులు వెదకియును; పడి(య) పాఁతఱలన్ = నీళ్లు గల చిన్న పల్లములలోను గుంటలలోను; త్రెళ్లియున్ = జాఱి పడియును; పలుకకుము+అని; గిల్లియున్; ఇండ్లు తూఱియున్ = చొచ్చియును; ఎడ దవ్వు పాఱియున్ = ఎక్కువ దూరము పరుగిడియును; పీనుఁగులలోన్; దాఁగియున్ = దాఁగుకొనియును; పేరు కొన్నన్ = పిలువఁగా; రేఁగియున్ = ఉత్సాహము చూపియు; పోరాక = పోవుటకు వీలులేక; మరలియున్ = వెనుకకు తిరిగియును; పోటులేక = శౌర్యము తొలఁగుటచే; పొరలియున్ = నేలపై పడి దొరలుచును; అంత+అంతన్ = క్రమక్రమముగా; విచ్చియున్ = వేఱు పడి పాఱి పోయియును; అతివల మఱుఁగు చొచ్చియున్ = అబలల చాటున దాఁగుకొనియును; విరథులు+ఐ = తేరులు లేని వారై; కోలుకొనలేక = మరల కొంత శక్తిని పొంది ఉత్సాహమును చూపుటకు మనస్సు అనుకూలముగా లేకపోవుటచే; పఱచిరి = కయ్యమును చాలించి పరుగిడిపోయిరి. అప్పుడు కొందఱు; నేల ఎడ చాలక = నేలపై చోటు లేక; నింగికిన్ = ఆకాశమునకు; తొలంగినన్ = వెడలఁగా.

తా: ఈ విధముగా పలు రీతులైన పరాక్రమ ప్రదర్శనముతో గట్టివైన కత్తుల పదునైన అంచులచే శత్రుసేనలను బాగుగా నొప్పించి వారి గట్టి తనమును తొలఁగించి, వీరత్వమును నశింపఁజేసి యాదవవంశ శ్రేష్ఠుఁడైన అనిరుద్ధుఁడు బోను నుండి విడువఁబడిన ఆఁకలిగొన్న సింగపు మేని బిగువును అనుకరించుచు, వరుసగా, ఏనుఁగులను, గుఱ్ఱములను, తేరులను, కాల్బంటులను తీవ్రమైన వాయువుతో సమానమైన ఉద్వేగముతో క్రింది విధముగా నేల మట్టము చేసెను.

**ఏనుఁగులు:** ప్రచండ వాయువు, ఆకాశమందున్న పటిష్ఠములైన మేఘ సముదాయమును చెదరఁగొట్టునట్లు ఏనుఁగుల గుంపు యొక్క పెడతలలను బ్రద్దలు చేసెను.

**గుఱ్ఱములు :** ప్రచండవాయువు, బాగుగా ఎగయుచున్న (పైకి లేచుచున్న) అలల వరుసలను, అతిశయించినపెళపెళమను (ఆర్భటులతో) మ్రోతలతో ముందునకు పాఱద్రోలునట్లు, గుఱ్ఱముల వరుసలను, వీరవచనముల శబ్దాడంబరముతో, పెడముఖము కలవై, నేర్పుతో మరలునట్లు చేసెను.

**తేరులు** : ప్రచండవాయువు అచ్చెరువు కొల్పునట్లు దిట్టముగా నిర్మింపఁబడిన నీటిపై పయనించు, సాధనములగు పలువిధములగు పెద్ద పెద్ద ఓడలను, నాశము చేయునట్లు, పెక్కు దృఢమైన తేరుల గమిని విఱుఁగఁగొట్టెను.

**వీరభటులు** : ప్రచండవాయువు బలమైన (బాగుగా వేర్లు నాటుకొని యున్న) చెట్లను తోటలను నలఁగఁగొట్టినట్లు మహావీర భటుల సమూహమును నఱకి వేసెను.

ఆ సైన్యములో కొందఱు వెనుకకు తిరిగి పరుగిడిపోవు త్రొక్కులాటలో చచ్చిరి. కొందఱు చెంతనున్న వారిని నిందించుచు రక్తమును క్రక్కుచుండిరి. కొందఱు పైకి పోలేక (నిలువలేక) చిక్కువడి మూర్ఛొని, క్రింద పడిరి. కొందఱు వెనుక నున్నవారు కలఁత చెంది బాధపడి, వ్రేళ్లు కఱచికొనుచు భయపడి, ఆయుధములను వదలిపెట్టి తప్పించుకొనుటకు సందులు వెదకుచు, నీళ్ల గల పల్లములందు గోతులందును, జాఱి పడిరి. కొందఱు మాట్లాడకుమని గిల్లియు, ఇండ్లు చొచ్చియు, చాల దూరము పాఱిపోయియు, శవములలో దాఁగుకొనియు, పిలువఁగా, ఉత్సాహము చూపియు, పోవుటకు వీలు లేక మరలియు శౌర్యముచాలక నేలపై దొర్లియు, క్రమక్రమముగా వేఱుపడి పరుగిడిపోయి ఆడువారి మఱుఁగు చొచ్చిరి. తేరులు పోగొట్టుకొన్నవారు, మరల శక్తిని పుంజుకొనలేక కయ్యమును ఉడిగి పరుగెత్తిరి. అప్పుడు నేలపై చోటు లేక పోవుటచే, ప్రాణభయముచే పైకి ఎగురుచుండిరి.

అలం: 1. స్వభావోక్తి - యుద్ధవర్ణనము 2. ఉపమ - పంజరంబు విడివడిన ..... అనుకరించుచు.

వ్యా. వ్రేలు +లు = వ్రేళులు. ఆచ్ఛిక, బాల - 13 (చూడు, పద్యము - 225)

నానా. పొరి = అధికము, దృఢము, క్రమము.

నానా. పోటు = పొడుపు, యుద్ధము, శౌర్యము, సముద్రపు పొంగు, ఊఁత (పోటుకంబము).

కం. చెడి విఱిగిన సైన్యంబుం
బొడగని బాణుండు లోన భుగభుగ మండెన్
విడువక సమి దాజ్యాహుతు
లడరింపఁగఁ బరఁగు నధ్వ రానలము గతిన్. 239

ప్రతి: చెడి = భయపడి; విఱిగిన = ఓడిన; సైన్యంబున్; పొడగని = చూచి; బాణుండు; విడువక = వదలక సమిధ+ఆజ్య+ఆహుతులు = (సమిధలు) మోదుఁగు పుల్లలు, నేయి అనెడి హోమములో వ్రేల్వఁబడు వానిచే; అడరింపఁగన్ = (మంట) అధికమగునట్లు చేయఁగా; పరఁగు=వర్తించు (జ్వలించు, మండు); అధ్వర+అనలముగతిన్ = యాగాగ్ని విధమున; లోనన్ = మనస్సులో; భుగభుగ మండెన్ = భుగభుగ రోషావేశముతో మండిపడెను.

తా: బాణుఁడు తనసైన్యము భయపడి ఓడిపోయి, వెనుదిరుగుటను చూచి, విరామము లేక మోదుఁగు పుల్లలు, నేయి, అన్నము మొదలైన హోమ ద్రవ్యములతో అధికముగా మంటలతో చెలరేఁగు యాగాగ్ని వలె మనస్సులో కుత కుత ఉడికి మండిపడెను.

అలం: ఉపమ.

విశే. సమిత్తు (త్) విశేష్యము. యుద్ధము; సమిధ(ధ్) విశేష్యము చిదుగు, వంట చెఱకు (రెండును స్త్రీ లింగ శబ్దములు).

వ. అప్పుడు. 240

తా: ఆ సమయమందు.

శా. కుంభిస్యందన వాజిసైనిక పరిక్షోభంబు వారించుచుం
గుంభాండుండు సహస్రవాహ యుతముం గోదండ ముఖ్యాయుధా
రంభోదగ్రము ఖడ్గచర్మవృతమున్ రత్నాఢ్యముంగా ససం
రంభుండై దశన ధ్వజోగ్రరథముం బ్రాంతంబునన్ నిల్పినన్. 241

ప్రతి: కుంభాండుండు = బాణుని మంత్రి అగు కుంభాండుఁడు; కుంభి = ఏనుగులయు; స్యందన = రథములయు; వాజి = గుఱ్ఱములయు; సైనిక = కాల్బంటులయు; పరిక్షోభంబున్ = ఎక్కువైన కలఁతను; వారించుచున్ = పోగొట్టుచు; సహస్ర వాహయుతమున్ = వేయి గుఱ్ఱములతో కూడినదియును; కోదండ ముఖ్య+ఆయుధ+ఉదగ్రమున్ = ధనుస్సు మొదలగు ఆయుధముల ప్రయత్నముచే భయంకరమైనదియును; ఖడ్గ చర్మ వృతమున్ = కత్తులతో డాలులతో కూడినదియును; రత్న+అఢ్యమున్ = మణులతో సంపన్నమైనట్టిదియును; కాన్ = కాఁగా; దశన+ధ్వజ +ఉగ్రరథమున్ = ఎఱ్ఱనైన పతాకముచే భయంకర మైనదియును అయిన రథమును; సంరంభుఁడై = త్వరతో కూడిన వాఁడై; ప్రాంతంబునన్ = చేరువను; నిల్పినన్ = నిలుపఁగా

(బాణుఁడు మయూరకేతనుఁడు, అది, సూర్యకాంతమణుల వలె ప్రకాశించెను).

తా: బాణుని మంత్రి అగు కుంభాండుఁడు తమ సైన్యమందలి గజ రథతురగ పదాతుల గొప్ప కలఁతను తొలఁగించుటకు వేయి గుఱ్ఱములు కలదియు, విండ్లు మొదలగు ముఖ్యమైన ఆయుధములను సమకూర్చుకొనుటచే, భయంకరమైనదియును మఱియును కత్తులును పలకలును కలదియు, మణులతో చెక్కఁబడిన దగుటచే ప్రకాశించునదియు, రక్తపతాక కలదియునైన (హరివంశము - ఎఱ్ఱన. ఉ. భా. అధ్యా - 7, పద్యము, 234. రక్త పతాక అని ఉన్నది.) భయంకరమగు రథమును అతి త్వరతో తెచ్చి సమీపమున నిల్పఁగా (మీఁది పద్యముతో).

ఉ. దానవనాథుఁ డారథ ముదగ్రత నెక్కి సహస్ర బాహులం
బూనిన శస్త్రజాలము నభోజలదంబున కింద్ర చాప సం
ధానము చేయ బీరపు టదల్పులతోఁ గవచాంగుళిత్ర గో
ధానికరంబుతో శరవితానముతో నెదిరించి నిల్చినన్. 242

242. ప్రతి: దానవనాథుఁడు = రాక్షస ప్రభువు, బాణుఁడు, ఆ రథము; ఉదగ్రతన్ = తీవ్రమైన కోపావేశముచే భయము కొల్పుచు; ఎక్కి; సహస్రబాహులన్ + పూనిన = వేయి చేతులతో పట్టుకొన్న; శస్త్రజాలము = ఆయుధముల సమూహము; నభస్+జలదంబునకున్ = శ్రావణ మాసమందలి (వర్షఋతువు) మేఘమునకు; ఇంద్ర చాపసంధానము = ఇంద్రుని వింటిని; చేయన్; బీరము+అదల్పులతోన్ = వీరులు చేయు బెదరింపులతో; కవచ+అంగుళిత్ర గోధానికరంబుతోన్ = మైమఱువులు, వ్రేళ్ల తొడుగులైన ఉడుముతో కుట్టిన చేతికవచములు మొదలగువాని మొత్తముతో; శరవితానముతోన్ = బాణముల సమూహముతో; నిల్చినన్.

తా: రాక్షసరాజైన బాణుఁడు, భయంకరుఁడై ఆ రథమును ఎక్కి తన వేయిచేతులందు పూనిన ఆయుధములు శ్రావణమాస మేఘమునకు ఇంద్రధనుస్సువలె, ఉండగా వీరవచనములు కల బెదరింపులతో మైమఱువులు వ్రేళ్ల తొడుగులైన ఉడుముల చేతికవచములు కలవాఁడై, అనిరుద్ధుని మార్కొని నిల్వఁగా.

అలం: ఉపమ. బాణుఁడు - శ్రావణ మేఘము, శస్త్రజాలము - ఇంద్రచాపము.

కం. కనుఁగొని చిఱున వ్వొలయఁగ
ననిరుద్ధుఁడు పూర్ణ శశి నిభాననుఁ డై మా

ర్కొని నరుణ లోచనుండై
దనుజుఁడు నిలు నిలువు మనుచుఁ దాఁకెం బెలుచన్. 243

తా: అనిరుద్ధుఁడు బాణుని చూచి, చిఱునవ్వుతో, నిండు చందురుని పోలిన, పూర్ణవికాసము గల ముఖము కలవాఁడై మార్కొనెను. బాణుఁడు కెంపు వన్నె కన్నులతో "నిలువుము నిలువుము" అనుచు, ఆకుమారుని కోపముతో, తాఁకెను.

నానా :పెలుచ. రూ. పెల్చ = అతిశయము. ఆగ్రహము, ఆధిక్యము, కాఠిన్యము ఆటోపము.

వ. అప్పుడు. 244

తా : సులభము

కం. ప్రాణము ఝుల్లన నుష క
ల్యాణనిధిం బ్రియునిఁ జూడ నతఁడు గుఱియు నా
బాణ కరనికర ఖరతర
బాణంబులకుం గటాక్ష బాణంబులకున్. 245

తా: ఉష, సర్వశుభములకు గనియైన తన ప్రియుని గుండె ఝల్లుతో చూచెను. అనిరుద్ధుఁడు బాణుని చేతుల మొత్తములో నున్న మిక్కిలి వాఁడియైన, బాణములకును ఆ యువతి కడగంటి చూపులకును, లక్ష్యముగా నుండెను.

నానా. గుఱి = లక్ష్యము, గుఱుతు, దృష్టాంతము, నిర్ణయము, మితి.

గీ. తండ్రిఁ గనుఁగొన వెఱచి సౌధంబులోన
మఱుఁగుపడు నింతి పతిఁ జూడ మఱియు వెడలుఁ
జిన్నఁ బోయిన మోముతోఁ జిత్రరేఖ
తనకు వచ్చిన చేటని తల్లడిల్లు. 246

తా: ఉషాకాంత, తండ్రి కేమి ఆపద మూఁడునో, తన్ను చూచి కోపించునో అని తలఁచుచు, అతనికి కానరాక, మేడలోనికి పోయి కొంత వడి దాఁగికొనును. కొంతసేపటికి పతికేమి కీడు కలిగెనో అని లోపల ఉండఁజాలక మేడనుండి వెలుపలికి వచ్చును. మిక్కిలి

దిగులు చెంది. వన్నె తగ్గిన మోముతో తనకు ఇట్టి దుర్దశ, చిత్ర రేఖ కారణముగా వచ్చినదని ఆ యువతి బాధపడును. అర్థాంతము. చిత్రరేఖ, చాల దిగులు చెంది తాను కారణముగా ఉషకు వచ్చిన ఆపదచే తనకే వచ్చిన కీడుగా తల్లడిల్లెను.

వ. అట్టియెడ బాణాసురుండు. 247

తా: ఆ సమయమందు బాణాసురుఁడు.

కం. దనుజసుతాసురతోత్థిత
మనోజ చిహ్నాభిరామమండన మగు నా
యనిరుద్ధు మేను గనుఁగొని
తనుత్ర రహితంబు సుకరదారణ మనుచున్. 248

ప్రతి: దనుజసుతా = రాక్షస పుత్రి అగు ఉష యొక్క; సురత+ఉత్థిత = సంగమమువలన (లేచిన) ఏర్పడిన; మనోజ చిహ్న+అభిరామ మండనము+అగు = మన్మథుని గుఱుతులచే (ఆలింగనాదులచే) చందనపు పూఁత, కేశసంస్కారము, తిలకము, సన్నని పట్టు వస్త్రములు మొదలగు వానిచే మనోహరమైన అలంకారములు కల; ఆ+అనిరుద్ధుమేను; కనుఁగొని; తనుత్ర రహితంబు = కవచము లేని దగుటచే; సుకర దారణము = సులభముగా చీల్పవచ్చును; అనుచున్.

తా: ఉషతోడి సంగమము వలన కలిగిన గుఱుతులతోను ఇతరములైన అలంకారములతోను ప్రకాశించుచున్న అనిరుద్ధుని శరీరమును చూచి రక్షణలేనిదై ఉండుటచే సులభముగా వధించుటకు వీలగునని తలంచుచు (మీఁది పద్యముతో).

కం. అడిదము గొని నాతోఁ దల
పడియెడు నీపడుచుఁ జంప భరమే యని పై
నడరించె వేయిచేతుల
జడిగొనఁ గైదువులు మఱియు శర నికరములున్. 249

అర్థ: అడిదము= కత్తి; తలపడియెడు = మార్కొను; భరమే = భారమే? కష్టమా? జడిగొనన్ = పెను ముసురువలె, ముమ్మరముగా; అడరించెన్ = ప్రయోగించెను.

తా: కత్తిని చేత కలవాడై, 'నన్ను ఎదిరించు ఈ యువకుని చంపుట తేలికయైన పని

కదా!' అని వేయి చేతులతో బాణుఁడు వేర్వేఱు ఆయుధములను, అమ్ముల మొత్తమును అనిరుద్ధునిపై ప్రయోగించెను.

వ. తదవసరంబున. 250

తా : ఆ సమయమందు.

మ. పలకన్ బాణపరంపరల్ జడియుచుం బ్రద్యుమ్న సూనుండు మొ
క్కలుఁడై యేనుఁగుఁ జంప నాది గొనుసింగంబు న్విడంబించి మం
డలవిభ్రాంతి నహర్పతిం జెనయుచున్ డాసెం దదంగంబు న
మ్ములచే రక్తమయంబు చేసి దిశలన్ మూసెన్ సురారాతియున్. 251

అర్థ: జడియుచున్ = నివారించుచు; మొక్కలుఁడై = ఉత్సాహవంతుఁడై; ఆదికొను = కన్నువేసి సూటిగా, దుముకు; మండల విభ్రాంతిన్ = గుండ్రముగ చుట్టుటచే; అహస్+పతిన్ = సూర్యుని; చెనయుచున్ = పోలుచు; సుర+ఆరాతియున్ = దేవతల శత్రువైన బాణుఁడును.

తా: చేత డాలును కొని అనిరుద్ధుఁడు, బాణుఁడు ప్రయోగించు బాణముల వరుసలను, తనపై రానీయక తొలఁగించుచు, ధీరుఁడై, ఏనుఁగును చంపుటకు గుఱిగొని, సూటిగా పరువిడు నట్టి సింహమును అనుకరించుచు, గుండ్రముగా తిరుగుటచే సూర్యునితో సమానుఁడై, బాణుని సమీపించెను. బాణుఁడును అతని శరీరమును రక్తధారలతో నిండించి, తన బాణములచే దిశలు కానరాకుండునట్లు వర్షించెను.

అలం: ఉపమ. 1. ఏనుఁగుఁ జంప నాదిగొను సింగంబును విడంబించి.

2. మండల విభ్రాంతి నహర్పతిం జెనయుచున్.

కం. శరములు దాఁకిన నెత్తురు
దొరిఁగిన సంగర విహార దోహలి యై ని
ర్భరరోష మడర బాణుని
యరదమునకుఁ జిత్ర గతుల నతఁడు గదిసినన్. 252

అర్థ: తొరిఁగినన్ = కాఱుచున్నను; దోహలియై = ఉత్సాహము కలవాఁడై; నిర్భర = అత్యధికమై; కదిసినన్ = సమీపింపఁగా.

తా: బాణుని బాణములు గ్రుచ్చుకొని, నెత్తురు తొనకు చున్నను, కయ్యమందలి

వేడుకతో, మిక్కిలి కోపము చెంది, అనిరుద్ధుఁడు బాణుని తేరును వింత వింత నడకలతో చేరఁగా.

వ. అక్కుమారసింహంబు మీఁద నసురేశ్వరుండు పరిఘ పట్టిస ముసల ముద్గర ప్రాస ప్రముఖంబు లగు వివిధాయుధంబు లొక్కుమ్మడి నడరించిన నతండు చలింపక సందీప్తక్రోధుండై. 253

అర్థ: పరిఘ = ఇనుపగుదియ; పట్టిస = ఆయుధ విశేషము; ముసల = రోకలి; ముద్గర = సమ్మెట; ప్రాస = ఈఁటె; ప్రముఖంబులు + అగు = ముఖ్యమైన; సందీప్తక్రోధుఁడై = మిక్కిలి పెంపయిన కోపము కలవాఁడై.

తా: ఆ కుమారవరుఁడు, అనిరుద్ధుఁడు, బాణుఁడు ఒక్క మాఱుగా ప్రయోగించిన పలురకములైన ఆయుధములకు ఏ మాత్రమును చలింపక పెంపయిన కోపము కలవాఁడై (మీఁది పద్యముతో).

కం. గగనమున కెగసి యరదము
నొగ దెగి పడ వ్రేసి ఖడ్గ నూతన గతు లొ
ప్పుగఁ దిరిగి తురగములఁ దన
మగతన మమరంగ యదు కుమారుఁడు వ్రేసెన్. 254

తా: యదువంశ కుమారుఁడు మింటికి ఎగసి తేరుయొక్క కాఁడికి కట్టిన బలమైన పొడవైన కొయ్యను తెగఁగొట్టి కత్తిని క్రొత్త రీతులతో త్రిప్పుచు, తన, శౌర్య మొప్పునట్లు గుఱ్ఱములను మోదెను.

ఉ. వ్రేసిన నింద్రవైరి యదువీరునిపై ముస లాసి ముద్గర
ప్రాస గదాది హేతి నికరంబు ముసుంగుగ వైచె నప్పుడా
యాసురసైన్య మార్చె నతఁ డంతటఁ బోక విచిత్ర ఖడ్గ వి
న్యాసముతో రథంబు కెలనన్ మెఱుఁగై మెఱిచెం దళుక్కనన్. 255

అర్థ: హేతినికరంబున్ = ఆయుధముల మొత్తమును; ముసుంగుగన్ = కప్పుగా; మెఱి(అ)చెన్ = మెఱసెను.

తా: అనిరుద్ధుఁడు అట్లు నొగను, గుఱ్ఱములను పడఁగొట్టఁగా బాణుఁడు రోకలి, కత్తి

వేడుకతో, మిక్కిలి కోపము చెంది, అనిరుద్ధుఁడు బాణుని తేరును వింత వింత నడకలతో చేరఁగా.

వ. అక్కుమారసింహంబు మీఁద నసురేశ్వరుండు పరిఘ పట్టిస ముసల ముద్గర ప్రాస ప్రముఖంబు లగు వివిధాయుధంబు లొక్కుమ్మడి నడరించిన నతండు చలింపక సందీప్తక్రోధుండై. 253

అర్థ: పరిఘ = ఇనుపగుదియ; పట్టిస = ఆయుధ విశేషము; ముసల = రోకలి; ముద్గర = సమ్మెట; ప్రాస = ఈఁటె; ప్రముఖంబులు + అగు = ముఖ్యమైన; సందీప్తక్రోధుఁడై = మిక్కిలి పెంపయిన కోపము కలవాఁడై.

తా: ఆ కుమారవరుఁడు, అనిరుద్ధుఁడు, బాణుఁడు ఒక్క మాఱుగా ప్రయోగించిన పలురకములైన ఆయుధములకు ఏ మాత్రమును చలింపక పెంపయిన కోపము కలవాఁడై (మీఁది పద్యముతో).

కం. గగనమున కెగసి యరదము
నొగ దెగి పడ వ్రేసి ఖడ్గ నూతన గతు లొ
ప్పుగఁ దిరిగి తురగములఁ దన
మగతన మమరంగ యదు కుమారుఁడు వ్రేసెన్. 254

తా: యదువంశ కుమారుఁడు మింటికి ఎగసి తేరుయొక్క కాఁడికి కట్టిన బలమైన పొడవైన కొయ్యను తెగఁగొట్టి కత్తిని క్రొత్త రీతులతో త్రిప్పుచు, తన, శౌర్య మొప్పునట్లు గుఱ్ఱములను మోదెను.

ఉ. వ్రేసిన నింద్రవైరి యదువీరునిపై ముస లాసి ముద్గర
ప్రాస గదాది హేతి నికరంబు ముసుంగుగ వైచె నప్పుడా
యాసురసైన్య మార్చె నతఁ డంతటఁ బోక విచిత్ర ఖడ్గ వి
న్యాసముతో రథంబు కెలనన్ మెఱుఁగై మెఱిచెం దళుక్కనన్. 255

అర్థ: హేతినికరంబున్ = ఆయుధముల మొత్తమును; ముసుంగుగన్ = కప్పుగా; మెఱి(అ)చెన్ = మెఱసెను.

తా: అనిరుద్ధుఁడు అట్లు నొగను, గుఱ్ఱములను పడఁగొట్టఁగా బాణుఁడు రోకలి, కత్తి

గుదియ ఈఁటె గద, మున్నగు ఆయుధములతో అతనిని కప్పునట్లు ప్రయోగించెను. అపుడు రాక్షససేన కిలకిలా రావములను చేసెను. అంతటితో ఆఁగక అనిరుద్ధుఁడు వింతయైన విధమున కత్తిని త్రిప్పుచు తేరు ప్రక్కకు వచ్చి, మెఱుపు తీఁగయై తళుక్కుమని మెఱసెను.

అలం: రూపకము. అనిరుద్ధుఁడే మెఱుఁగయ్యెననుట.

వ్యా. తళుక్కు+అనన్ = తళుక్కుమనన్, సూ. ధ్వన్యనుకరణ శబ్దములకు అనుధాతువు పరంబగుచో కొన్నియెడల ముగా గమంబగు. సంధి, ప్రౌఢ - 19.

తళుక్కనన్. ముగాగమము లేని రూపము.

వ. అట్టియెడ నద్దనుజేంద్రుండు సముద్ధత క్రోధుండై శక్తివైచిన. 256

తా: ఆ సమయమందు ఆ రాక్షస రాజు, బాణుఁడు బాగుగా ఎక్కువైన కోపముతో "శక్తి" అనెడి ఆయుధమును అనిరుద్ధునిపై వేయఁగా (మీఁదిపద్యముతో).

శా. ఘంటా టంకృతితోఁ గృతాంత లగు డాకారంబుతో దిక్కులన్
మింట న్మంటలు గ్రమ్మ క్రొమ్మెఱుఁగుతో నెక్కొన్న యాశక్తిపై
కొంట న్మేను మలంచి పట్టికొని కోకొమ్మంచు వ్రేసెన్ వెసన్
వెంటన్ గీఱి ధరిత్రి దూఱ నతఁడ.వ్వీరుండు మూర్ఛిల్లఁగన్. 257

అర్థ: ఘంటా టంకృతితోన్ = గంటల "టమ్‌టమ్" అనెడి ధ్వనులతో; కృతాంత లగుడ+ఆకారంబుతోన్ = యముని దండము యొక్క రూపుతో; మలంచి = వంచి, గీఱి = (బాణుని) శరీరమునందు గ్రుచ్చుకొని చీల్చి; తూఱన్ = ప్రవేశింపఁగా.

తా: గంటలు చప్పుడు చేయుచుండఁగా యముని దండము వంటి రూపుతో దిక్కులందు, ఆకసమందు మంటలు చెలంగు చుండఁగా క్రొత్తదైన కాంతులతో రేఁగుచు; "శక్తి" అనెడి ఆయుధము. అనిరుద్ధునిపై క్రమ్మెను, అతఁడు దాని గుఱినుండి తప్పించుకొనుటకు శరీరమును వంచి దానినే పట్టుకొని, "దీనిని నీవే తీసి కొనుము" అనుచు, ఆవేశముగా దానిని బాణునిపై వేసెను. అంత అది వెంటనే బాణుని శరీరమునకు గ్రుచ్చుకొని (కొంత) చీల్చి, భూమిని ప్రవేశించెను. ఆ వీరుఁడైన బాణుఁడు ఆగాయమునకు మూర్ఛను పొందెను.

వ్యా. క్రొత్త+మెఱుఁగు = క్రొమ్మెఱుఁగు. ప్రాతాది సమాస సంధి (చూడు, పద్య - 64)

గీ. అంత లోనన తేఱిన యసురనాథుఁ
జూచి కుంభాండుఁ డి ట్లను శూరుఁ డైన
యతనితో నింక నీవు గట్టెదుర నిలిచి
పాడిమై నని చేసిన బ్రదుకు కలదె. 258

తా: అంతలోనే తేఱుకొన్న బాణుని కని, కుంభాండుఁడు ఇట్లు పలికెను. "ఓయీ వీరుఁడా! ఆతనితో ఇంక నీవు ఎదుట నిలిచి యుద్ధ ధర్మమును పాటించుచు కయ్యము చేసినచో నీవు బ్రదుకఁ గలవా?"

వ్యా. కడు+ఎదురు = కట్టెదురు (చూడు, పద్య - 225)

కం. ఆయుధము దాఁకు టెఱుఁగఁ డు
పాయము బలియించి తింత వడి మనల నితం
డాయత భుజుండు మ్రింగును
మాయా బలమునన కాని మడియఁడు నీచేన్. 259

తా: "ఇంతవఱకును నీవు ఉపాయమును బలముగా చూపి కయ్యము చేసితివి. కాని నీ ఆయుధములు ఏవియును అతనిని తాఁకఁజాలక పోయినవి కదా! ఈ దీర్ఘములైన భుజములయొక్క బలముకల వాఁడు మనలను త్వరలో అడఁచివేయును. ఇతఁడు నీ మాయా బలము చేతనే చావఁగలఁడు. కానిచో, ఇతఁడు నీచే చావును పొందఁడు."

వ. అనుటయు నతండు రోష దహన దందహ్య మాన మానసుం డై యొం
డుపాయంబు చేయ నేరక మాయ గైకొనం దలంచి. 260

తా: అని కుంభాండుఁడు వచింపఁగా, బాణుఁడు రోషమనెడి అగ్నిచే మండుచున్న మనసు కలవాఁడై, మఱొక ఉపాయము చేయనేరక మాయా బలమునే ప్రయోగింప నెంచి (మీఁది పద్యముతో).

కం. ఉరగము నెర గొను గరుడని
వెరవున *నరు నణఁతు నని దివికి నెస దాఁటెన్

* నవు డతఁడు గగనవీధికి దాఁటెన్

సరథంబుగ సధ్వజముగ
సరథ్యసాహస్రముగ ససారథికముగన్. 261

తా: "పామును తిను గరుడుని వలె, ఈ నరుని అణఁచి వేయుదును", అని బాణుఁడు తేరు టెక్కెము వేయి గుఱ్ఱములు సారథి అనువానితో వేగముగా ఆకాశమునకు పైకి ఎగిరెను.

నానా. రథ్యము = తేరును లాగు గుఱ్ఱము లోనగునది.(ఆ. స్త్రీ)=రథసమూహము, మార్గము, రాజమార్గము.

నానా. వెరవు = ఉపాయము, విధము, యుక్తము.

వ. ఇవ్విధంబున. 262

తా : ఈ విధముగా.

కం. ధీరుఁడు బాణుఁ డదృశ్యా
కారుం డయి పోయి కలను గయికొని ఖడ్గ
స్ఫార ప్రచారపరుఁ డగు
నారాయణ పౌత్రు నేసె నాగాస్త్రములన్. 263

అర్థ: కలను+కయికొని = కయ్యము చేసి.

తా: ధీరుఁడైన బాణుఁడు, కనఁబడక మింటికి ఎగసి యుద్ధము చేయఁబూని కత్తి యొక్క అధికమైన వివిధములగు విన్యాసములందు ఆసక్తికల అనిరుద్ధునిపై నాగాస్త్రములను ప్రయోగించెను.

వ. అయ్యస్త్రంబులచేత. 264

తా: ఆ నాగాస్త్రములచే.

కం. సందాన దందశూ కా
స్పందిత సర్వాంగుఁ డయిన ప్రద్యుమ్న సుతుం
జందనగంధులు చూచిరి
చందన ధరణీరుహంబు చందాన ననిన్. 265

అర్థ: సందాన దందశూక+అస్పందిత సర్వ+ అంగుఁడు = పెద్ద త్రాళ్లైన పాములచే (కట్టఁబడి) చలింపని ఎల్ల అవయవములు కలవాఁడు; ధరణీరుహంబు చందానన్ = చెట్టువలె.

తా: త్రాళ్లైన పాములచే (కట్టఁబడి) చలింపని, అన్ని అవయవములు కలవాఁడైన అనిరుద్ధుని, చెలులు ఎల్లరు, (పాములు చుట్టిన) చందన వృక్షము వలెనున్న అతనిని కాంచిరి.

వ్యా. చందమున = చందాన. మువర్ణలోపము. పూర్వస్వరమునకు దీర్ఘము. తత్సమ, బాల - 43.

వ. ఇట్లు పాములచేతం గట్టువడి నేల కొఱగిన కుమారుం జేరి యరదంబు మీఁదన
టెక్కెంబు కామపై నొఱగి బాణుండుఁ గుంభాండున కిట్లనియె. 266

తా: ఈ విధముగా పాములచే కట్టఁబడి నేలపై వాలియున్న అనిరుద్ధకుమారుని చేరి, తేరిపైన టెక్కెపు కంబముపై వంగి, బాణుఁడు, కుంభాండునితో ఇట్లనెను.

కం. కులకన్యా దూషకులం
దల గోయక యున్న నేల తగ వగు వీనిం
బొలికలనికి బలి యిమ్మని
పలికినఁ గుంభాండుఁ డసురపతి కి ట్లనియెన్. 267

అర్థ: తగవు = న్యాయము; పొలికలను = యుద్ధభూమి.

తా: "సత్కులమునందు పుట్టిన కన్యలను చెఱిచిన వారిని (పెండ్లి కాకముందే వారిని కామించి కన్నెఱికమును తొలఁగించిన వారిని), తల తెగగొట్టకపోవుట ఏమి న్యాయము? కనుక ఈపాపిని, యుద్ధభూమికి బలి ఇమ్ము", అని పలుకఁగా కుంభాండుఁడు, బాణునితో ఇట్లనెను.

ఆ.వె. కలనఁ బడినవారిఁ గయికొని కొని పోయి
పుండ్ల నోమి మగుడఁ బుచ్చు టొప్పుఁ
బంత మడిగి మగుడ బవర మిచ్చుట యొప్పు
నించునేని దాన యేలు టొప్పు. 268

అర్థ: ఓమి = మాన్చి; పంతము = పందెము; బవరము = యుద్ధము; ఇంచున్+ఏని = ఇష్టమైనచో; ఏలు = పరిగ్రహింపుము.

తా: యుద్ధరంగమున మూర్ఛను పొందినవానిని, ఇంటికి కొనిపోయి వాని గాయములను మాన్పి తిరిగి వాని ఇంటికి పంపి వేయుట తగును. లేదా పందెము వేసి మరల వానితో యుద్ధము చేయుట ఒప్పును. ప్రీతి కలిగినచో, అట్టి వానిని మన్నించి, రక్షించి పరిగ్రహింపుము.

నానా. పంతము = పోటి, ప్రతిన, పౌరుషము, విధము, పందెము.

వ. వినుము చెప్పెద. 269

తా : సులభము.

కం. భుజగర్వ మడఁగఁ జుట్టిన
భుజ గాస్త్రము లిట్టు నట్టుఁ బొరలం బడినన్
గజిబిజి లేదు మొగంబున
మజ బాపురె వీనిఁ బోల మగలుం గలరే. 270

తా: "బాహుబల గర్వ మడఁగునట్లు, నాగాస్త్రములు ఇరుప్రక్కలందు, పొరలు చున్నను, వీని మొగమున కలఁత కలుగలేదు. (మజ) ఆశ్చర్యము! బాపురె! (ఔరా) ఇట్టి వీనితో సాటియైన శూరులుందురా?"

విశే. మజ, ప్రశంసార్థకము (అన్యదేశ్యమని కొందఱు).

రూ. మజా, మజ్జ మజ్జరే, మజ్జా మజ్జారే, మజ్జరె.

గీ. వేయి చేతుల వాఁడవు వివిధ సమర
విజయశాలివి దైతేయ వీరవరుఁడ
విట్టి నీతోడఁ బోరాడ నెవ్వఁ డోపు
విక్రమక్రీడ సరిలేని వీఁడ కాక. 271

తా: "నీవు వేయి చేతుల వాఁడవు. పెక్కు కయ్యములలో విజయములను గాంచి ఒప్పువాఁడవు. రాక్షసవీరులలో గొప్పవాఁడవు. ఇట్టి నీతోడ సామాన్యుఁడు యుద్ధము చేయఁగలఁడా? పరాక్రమ క్రీడలో తనతో సాటి ఎవ్వరును లేకపోవుటచే ఈ యువకుఁడు నీతో పోరాడెను." అన్యులకు సాధ్యము కాదనుట.

విశే. కుంభాండుఁడు అనిరుద్ధుని పరాక్రమమునకు అచ్చెరువొంది, అట్టి యువకుఁడు బాణునకు అల్లుఁడు అగుటకు తగినవాఁడనియే మనసున తలంచెనని మాటలలో ధ్వనించుచున్నది.

చం. ఇతని కులంబుఁ బేరు విని యేలఁ దలంచిన నేలు, మేలు నీ
కతిబలుఁ డైన బంటు హృదయంబున రోషము పట్టితేని వ
ధ్యతకు విధింప నేల యితఁ డాఁకకుఁ బాత్రము నీ వెఱుంగవే
ప్రతినయు నాజ్ఞయుం దగవుఁ బంతము రాజులు దప్ప రెన్నడున్. 272

అర్థ: ఏలు = పరిగ్రహింపుము; ఆఁకకు = నిర్బంధమునకు; కారాగారమున బంధింపఁబడుటకు; పాత్రము = తగిన వాఁడు.

తా: ఈ కుమారుని వంశమును, పేరును విని, ఇతనిని రక్షింపఁదలఁచిన, కాపాడుము. అది మంచిదే! మిక్కిలి బలవంతుఁడైన వీరుని విషయమున నీవు కోపముతో పట్టుదల మానవైతివేని ఇతనికి ఏల మరణ శిక్ష విధింపవలెను? కారాగార ప్రాప్తికి మాత్రమే, ఇతఁడు, తగును. రాజులు ప్రతినను, ఆనను, న్యాయమును, పట్టుదలను, ఎప్పుడు తప్పరు. నీకు అన్నియును తెలియును గదా!

వ్యా. 1. పట్టితివి+ఏని = పట్టితేని. వకారలోపము. క్రియ, బాల - 24. ఇత్వసంధి నిత్యము. సంధి, బాల - 7. (చూడు, పద్యము - 21)

2. ఆఁగు. దీని కృదంత రూపము, ఆఁక.

3. పాత్రము. సూ. క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బులింగ తుల్యంబులగు. తత్సమ, బాల - 18.

విభాష అగుటచే, పాత్రుఁడు అగును.

మ. అనినం బండులు గీటికొంచు హృదయం బల్లాడ బాణాసురుం
డనఘా! నీపలు కేను దాఁటుదునె వీఁ డన్యాయ కార్యంబు చే
సిన సైరింపక యుంటి వంశమునకుం జేటైన యీకౌలటే
యునిఁ గన్యా కులటా సమేతముగఁ జేర్తుం గాక కారాస్థితిన్. 273

అర్థ: కొలటేరునిన్ = కులటా పుత్రుని, రండాపుత్రుని; కన్యాకులటా సమేతముగన్ = కులటయైన ఉషతోకూడ; కారాస్థితిన్ = చెఱసాలయందు ఉనికికి.

తా: కుంభాండుఁడు అట్లు కోరఁగా, బాణుఁడు పండ్లు పటపట కొఱుకుచు, మనస్సు కోపముచే అల్లల్లాడఁగా, "ఓ ఉత్తముడా! నీ మాటను దాఁటుదునా? వీఁడు న్యాయము కాని, చెడ్డ పని చేయుటచే, సహింపలేక ఉన్నాను. నా వంశమునకే చెడ్డచేసిన ఈ అంకు టాలి కొడుకును, రండయైన ఈ పడుచు దానితో కూడ, చెఱసాలలో తప్పక పెట్టించెదను. ఇదియే వారికి సరియైన దండన."

విశే. బాణునకు అనిరుద్ధునకు మరణ దండన తగినదని తోఁచినను, మంత్రుని మాటలను మన్నించుట చూడఁగా ఆతనియెడ గౌరవాదరములుగల ప్రభువన నొప్పును.

## - : బాణాసురుఁ డనిరుద్ధునిఁ జెఱసాలం బెట్టించుట : -

గీ. అనుచుఁ జెఱసాలవారికి నప్పగించి
యాదవకుమారుఁ గూఁతును నసుర విభుఁడు
మనసులోపల నెగ్గించి మరలి పోయె
నాత్మమందిరమునకుఁ గుంభాండుఁ గూడి. 274

అర్థ: ఎగ్గించి = నిరసించి, తిరస్కరించి, పాఠాం. నెగ్గించి = రోసి.

తా: అనుచు బాణుఁడు, అనిరుద్ధుని, కూతును, చెఱసాలవారికి అప్పగించి మనస్సులో వారిని తిరస్కరించుచు, వారు చేసిన పనికి రోఁత చెందుచు కుంభాండునితో కలిసి ఇంటి మరలెను.

కం. అంత నిట హరినగరిలో
నంతఃపురకాంత లెల్ల ననిరుద్ధుని సౌ
ధాంతరమునందుఁ దడవుచుఁ
జింతించుచు నింక నేమి చేయుద మనుచున్. 275

తా: అంతలో ద్వారకలో శ్రీకృష్ణుని అంతఃపురములోని అంగనలందఱును అనిరుద్ధుని మేడలో కానరాక, అతని కొఱకై వెదకుచు, దుఃఖించుచు, "ఇంకేమి చేయుదము" అనుచు (మీఁది పద్యముతో).

సీ. చెందమ్మివిరులలోఁ జిందు తేనెలు వోలెఁ
గన్నుల బాష్పాంబుకణము లడర
వలుఁద చీఁకట్లలో వ్రాలు చుక్కలు వోలె
వేణీ భరమ్ములో విరులు వ్రేలఁ
దూలు తీగెల వెంటఁ దూగు తేఁటులు వోలె
నసదు నెన్నడుముల నారు లొలయ
*రాపు జక్కవలఁ జేరని చంద్రికలు వోలెఁ
జన్నుల ముత్యాల సరులు పెనఁగ
గీ. ముద్దు మోము లల్లార్చుచో మూఁపు లందుఁ
గర్ణ భూషణ జాలంబు గళవళింప
మార్చి మార్చి చేతుల వ్రేళ్ల మడఁచి కొనుచు
నింక నెట్లమ్మ యంచు నయ్యింతు లేడ్వ. 276

ప్రతి: చెన్ను+తమ్మి, విరులలోన్ = ఎఱ్ఱదామరపూవులలో; చెందు = చేరు; తేనెలు+పోలెన్; కన్నులన్; బాష్ప+అంబుకణములు = కన్నీటి బిందువులు; అడరన్ = ఎక్కువకాఁగా; వలుఁద చీఁకట్లలోన్ = దట్టమైన చీఁకటులలో; వ్రాలు = నేల మీఁదికి పడుటకు వ్రాలిన; చీఁకట్లు (ప్రదేశాంతరములచే, బహువచనము). చుక్కలు + పోలెన్ = నక్షత్రముల వలెను; వేణీభరమ్ములోన్ = (వీడిన) బరువైన జడలలో; విరులు = పూలు; వ్రేలన్ = వ్రేలాడు చుండఁగా; తూలు తీఁగెల వెంటన్ = కదలుచున్న లతలతో కూడ; తూఁగు తేఁటులు+పోలెన్ = ఊఁగెడి తుమ్మెదల వలె; అసదు నెన్నడుములన్ = సన్నని అందమైన నడుములందు; ఆరులు = రోమావళులు, ఒలయన్ = కదలుచు కన్పట్టుచుండఁగా; రాపు = ఒరయిక గల, పాఠాం. రావు = రాజు (మేలైన) బలిసిన, రేయి = రాత్రి; జక్కవలన్ = చక్రవాకములను; చేరని = కూడని; చంద్రికలు + పోలెన్ = వెన్నెలవలె; చన్నులన్; ముత్యాల సరులు = ముత్తెముల సరములు, పెనఁగన్ = మెలికలు పొందఁగా; (వెన్నెల చేరకపోవుటచే చక్రవాకములు తాపముతో బిగువుగా ఒక దానికొకటి రాఁచుకొనుచు వెతచెందును. అట్లే మనఃక్లేశముచే, చెలుల స్తన ద్వయములు చలించు చుండఁగా వాని పైనున్న ముత్యాల సరాలు, మెలికలు కలవైనవి); ముద్దుమోములు = అందమైన ముఖములు; అల్లార్చుచో = ఆడించునప్పుడు;

* రేయిజక్కవలఁ జేరిన

మూపులందున్ = భుజములయందు; కర్ణ భూషణ జాలంబు = చెవులకు అమర్చిన (వ్రేలాడు కమ్మలు బుగడలు లోలకులు) తొడవుల మొత్తము; కళవళింపన్ = తొట్రుపాటు పడఁగా; మార్చి మార్చి = ఒక సారి కుడిచేయి; తర్వాత ఎడమ చేయి, మార్చుకొనుచు; చేతుల వ్రేళ్ళన్; నుడఁచికొనుచు = (ఒక్కొక్కటిగా) విఱుచుకొనుచు; ఇంకన్ +ఎట్లు+ అమ్మ? = ఇంక ఏమి చేయుదమమ్మా; ఇట్టి కష్టము వచ్చెనే; అంచున్ + ఆ ఇంతులు రోదింపఁగా.

తా: ఎఱ్ఱతామరపూవులనుండి తేనెలవలె, కన్నులనుండి కన్నీరు అధికముగా వెలువడినది. దట్టమైన చీఁకటిలో మినుకు మినుకుమను నక్షత్రములవలె విడివడుచున్న జడలలో పువ్వులు వ్రేలాడుచుండినవి. కదలుచున్న తీఁవెలలో విహరించుచు, వానిపై ఊఁగు నల్లని తుమ్మెదలవలె, సన్నని అందమైన నడుముల నడుమ రోమావళి, ఇటునటు చలించుచుండినది. వెన్నెల ప్రసరింపక పోవుటచే వెతచెంది, ఒక దానితో ఒకటి రాఁచుకొను చక్రవాక పక్షులవలె బలిసిన (దృఢమైన) స్తన ద్వయములందు, ముత్యాల సరములు మెలికలు పడుచుండినవి. ముచ్చటైన ముఖాలను ఆడించుచుండఁగా, మూఁపులపై చెవి కమ్మలు, బుగడలు, లోలకులు మొదలగు తొడవులు, తొట్రుపాటు చెందినవి. ఒక దాని తర్వాత, చేతులను మార్చి, వ్రేళ్లను మఁడిచి కొనుచు, విఱుచుకొనుచు, "ఇంక ఏమి చేయుదమమ్మా! మాకు ఇట్టికష్టము వచ్చె గదా" అని ఉష చెలులు, విలపింపఁగా.

అలం: పూర్ణోపమ, స్వభావోక్తి.

వ్యా. చెన్ను+తమ్మి = చెందమ్మి, ప్రాతాదిసమాస సంధి. ద్రుతకార్యములు (చూడు, పద్య - 50)

వ. అందుఁ గొందఱు. 277

తా: అందుఁగొందఱు.

సీ. చక్కని వారిలోఁ జక్కని వాఁడు దాఁ
*గడుఁ బిన్న గాని వేగంబు వీఁడు
బంటు నొచ్చిన నోరఁ బలుకండు నెఱవాది
సుఖభోగి చుట్టాల సురభి రాచ

* గడుఁ బిన్న గాన వేగంబ వీఁడె.

బిడ్డ యై యుండి గబ్బిదనం బెఱుంగఁడు
గరగర నై యుండుఁ గలయ నేర్చు
నూఁపరలాఁడు గాఁ డుపకారి నవ్వు మే
లము గాని తనవారు లాఁతివార

గీ. నఁడు గడాని బంగారు రత్నంపు బొమ్మ
ముంగిటి నిధాన మమ్మల ముద్దు దమ్మ
లన్న యీతనిఁ గనదేని కన్నతల్లి
కడుపు మసిగా దె దయ్యమ! కరుణ లేదె. 278

అర్థ: వేగంబువీఁడు = వేగమునకు నిలయమైనవాఁడు; బంటు = వీరుఁడు; నెఱవాది = నేర్పరి; సురభి = కామధేనువు; (కోరికలను ఇచ్చు) దేవతల ఆవు; గబ్బితనంబు = గర్వము; గరగరన+ఐ = పరిశుద్ధ మనస్కుఁడై; కలయన్ నేర్చున్ = కలసి మెలసి యుండుట ఎఱుఁగును (వివేకి); ఊపరలాఁడు = తేలికయైనవాఁడు (తన్ను పొగడుకొనువాఁడు; అధిక ప్రసంగముచేయువాఁడు); మేలము కాని = తన్ను హేళన చేసిననే; ముంగిటి నిధానము = ఇంటి నడుమ నున్న ధన నిక్షేపము; అమ్మల ముద్దు = తల్లులకు ప్రియమైనవాఁడు; తమ్ముల+అన్న = తమ్ములకు, ఎల్లరకు, ప్రియమైన అన్న; కనదు+ఏని = చూడక పోయినచో; మసికాదె = బూడిద కాదా! తీవ్రవేదన ను పొందును; కడాని = అపరంజి

తా: అందమైనవారిలో అందఁగాఁడు. పిన్నవాఁడైనను చుఱుకుఁదనము (త్వర) కలవాఁడు. వీరుఁడు. ఇతరులు నొచ్చినను తాను నొప్పింపఁడు. నేర్పరి. సుఖములను అనుభవించువాఁడు. బంధువుల కోర్కెలు తీర్చు వేల్పుటావు. రాచబిడ్డ అనెడి గర్వము లేని వాఁడు. నిర్మలమైన మనస్సు కలవాఁడు, వివేకి. అనవసరముగ మాటలాడఁడు. ఉపకారము చేయు వాఁడు. తన్ను పరిహసించిననే నవ్వును. (ఇతరులను హేళన చేయఁడనుట). అందఱను సమానముగా ఆదరించును. మేలైన బంగారుతో చేయఁబడిన రత్నములను పొదిగిన బొమ్మవంటి వాఁడు. (అపరంజి బొమ్మవలె లావణ్యము కలవాఁడు). ఇంటిలో నుండు నిధి. అమ్మలకు ప్రీతి పాత్రుఁడు. తమ్ములయెడ, ప్రేమ కలవాఁడు. ఈతని చూడని, తల్లి కడుపు తీవ్ర వేదనకు లోనగును. దైవమా! ఎంత పని చేసితివి! నీకు జాలియే లేదు కదా!

నానా. ముంగిలి = అంకణము యొక్క మధ్య ప్రదేశము, అంకణము, మధ్య ప్రదేశము.

వ. అని మఱియుం గొందఱు. 279

తా: అని కొందఱు విలపించిరి. మఱి కొందఱు (మీఁది పద్యముతో).

సీ. అఖిల లోకాధీశుఁ డగు చక్రధరు నింట
నొక కీడుమాట నేఁ డొదవె నమ్మ
బాల్యంబు నంద శంబరుఁ జంపెఁ బ్రద్యుమ్నుఁ
డతని లా వెల్లిద మయ్యె నమ్మ
[1]కీడు లే దన దేవకీ దేవి బలఁగ మొ
ప్పినఁ బాలలోఁ బండ్లు పిసికి రమ్మ
యదువీరులు ప్రమత్తు లని మున్ను మెచ్చని
చుట్టాలు నగ సేగి చూపె నమ్మ

గీ. చెడఁ దలంచిరి గా కేమి సిలుగు చింత
లేని యివ్విటి కొరు లింత పూని రేని
గడచె నింక మా రతిదేవి కడుపు చల్ల
నగుట [2]విధి యిన్ని గలిగించె నక్క టకట. 280

అర్థ: లావు = బలము; ఎల్లిదము = పరిహాసము; పండ్లు పిసికిరి = (పాలగుణమును) చెఱిపిరి; సేగి = కీడు, ఆపద.

పాఠాం. కన్నికలు = సంకటములు, (కన్నమునుండి కన్నిక ఏర్పడినది).

తా: "అఖిల లోకములకు ప్రభువగు శ్రీకృష్ణుని ఇంటిలో నేఁటి కొక కీడు కలిగెనను మాట వినఁబడినది. ఇతని తండ్రి ప్రద్యుమ్నుఁడు బాల్యముననే శంబరాసురుని చంపెను. అట్టి ఆతని బలము నేఁడు పరిహాస పాత్రమైనది. దేవకీ దేవి సంతానము కష్టమును పొందని దని ఒప్పి యుండఁగా, పాలగుణమును చెఱచునట్టి పుల్లని పండ్ల రసమును అందు పిండినట్లు, ఇప్పుడు దుర్దశ సంభవించినది. యాదవ వీరులు, మిక్కిలి మదించిన వారని,పూర్వము మెచ్చని బంధువులు,నవ్వునట్టి ఆపద వచ్చిపడినది. ఏ కష్టము గాని, శోకముగాని ఎఱుఁగని,ఈ పట్టణమునకు కీడు చేయుటకు పూనిన వారు

1. గెడలేదనఁగ 2. విధి గన్నికలు చేసె నక్కటకట.

చెడుట నిశ్చయము. మా రతీదేవి కడుపు చల్లఁగా నుండు కాలము తొలఁగినది. అకటా! విధి ఇన్ని ఇక్కట్లు కలిగించెను గదా!"

కం. మధుమథన క్రోధానల
మధికముగా మండ నూఁదు న వ్వెంగలికిన్
విధి యలుగక [1]ముని మృత్యు
క్షుధార్తి వివృతాస్య పదవికోఱ యలుగదే. 281

ప్రతి: మధు మథన క్రోధ+అనలము = మధువను రాక్షసుని మథించిన కృష్ణుని కోపమనెడి అగ్ని; అధికముగాన్; మండన్ = మండఁజేయుటకై; ఊఁదు = వాయువును ప్రసరింపఁజేయునట్టి; ఆ+ వెంగలికిన్ = ఆ వెఱ్ఱివానికి; విధి; అలుగకమును = కోపించుటకు ముందే; మృత్యుక్షుధా+ఆర్తి = మరణదేవత, ఆఁకలి వలన బాధచే, వివృత+ఆస్య పదవి = తెఱచినట్టి (విశాలమైన) నోటి యొక్క త్రోవలో నున్న; కోఱ = కోఱపల్లు (కోఱపళ్ళు బ.వ); అలుగదే = కోపింపదా! (ఆ వెఱ్ఱిని హత మార్చును కదా).

తా: మధువను రక్కసుని శత్రువైన శ్రీ కృష్ణుని కోపాగ్నిని మండించు, వెఱ్ఱివానిపై దైవము కోపము చెందుటకు ముందే మృత్యుదేవత, వెడల్పైన తెఱచిన నోటిలో కల తన వాఁడియైన కోఱపళ్లు అలిగి, అతనిని నమలి హరించును.

అలం : 1. రూపకము. కోపానలము.

2. విశేషము: ఆధారమైన మృత్యువుగాక, ఆధేయమైన కోఱ అనుట.

సీ. అనిరుద్ధ సింహంబు నంటి చావునకుఁ ద
ప్పిన కరి హరితోడఁ బెనఁగ కున్నె
యదు పుంగవున కింత యపకార మొనరించి
దేవతా విభుఁ డైన దిగులు చొరఁడె
ముర వైరి నీడన మూఁడు లోకంబులు
బ్రదుకంగ మనకేల పలవరింప
నద్దేవుమనుమని నద్దిరా యెటు చూతు
ననక [2]కేరడ మెవ్వఁ డలవరించె

1. మృత్యువునకు 2. కోఱడ మె.

గీ. వెఱవ కోడక యొకరుండు వ్రేలఁ జూప
నెంతవాఁ డక్కుమారు నోరంత ప్రొద్దు
గలసి పాసిపోఁ జాలని కతన మనకు
నేలతలఁ గాళ్ళు నిలువమి నిజము గాక. 282

అర్థ: అంటి = ఎదుర్కొని, కలిసి; కరి = ఏనుఁగు; హరితోడన్ = శ్రీకృష్ణుఁడు అనెడి సింహముతో; దిగులు చొరఁడె? = భయపడఁడా? పలవరింపన్+ఏల = వెఱ్ఱిమాటలు పలుకనేల? చూతున్ = చూడఁగలను; కేరడము = తిరస్కారము; అలవరించెన్ = చేసెనో? వెఱవక = భయపడక; ఓడక = వెనుదీయక (జంకక); వ్రేలన్ చూపన్ = నిందించుటకు; ఎంతటి వాఁడు? = ఎంత తెగువ కలవాఁడో?; ఓరంత ప్రొద్దు = ఎల్ల కాలము; పాసిపోన్+చాలని కతనన్ = విడిచి ఉండలేని కారణమున; నేల తలన్ = నేలపై.

తా: అనిరుద్ధుఁ డనెడి సింహమును ఎదుర్కొని ఎట్లో చావును తప్పించుకొన్న ఏనుఁగు శ్రీకృష్ణుఁడు అనెడి సింహముతో పోరాడకుండునా? యాదవ శ్రేష్ఠుడైన శ్రీకృష్ణునకు ఇట్టి కీడు ఒనర్చిన దేవేంద్రుఁడైనను, దిగులు పడఁడా? మురారిని ఆశ్రయించి (రక్షణచే) మూడు లోకముల వారును బ్రదుకు చుండఁగా మనకు వెఱ్ఱిమాటలేల? ఆ దేవుని మనుమఁడైన అనిరుద్ధుని ఎట్లు చూడఁగలను అవి, చింతింపక, ఆయువకునికి ఎవడు తిరస్కారము కావించెనో కదా! భయములేక జంకులేక ఒకానొకఁడు అతని నిందించుటకు ఎట్టి సాహసము కలవాఁడో! ఆ అందగాఁడైన అనిరుద్ధునితో పగలును రాత్రియును కలసి మెలసి ఉండి ఇపుడు అతనిని విడిచి యుండలేని కారణమున మనకు నేలపై కాళ్లు నిలువక పోవుట నిజమైనది కదా!

అలం: 1. రూపకము. అనిరుద్ధ సింహము.

2. శ్లిష్ట రూపకము. హరి = సింహము, శ్రీకృష్ణుఁడు.

3. కావ్యార్థాపత్తి: దేవతావిభుఁడైన దిగులు చొరఁడె. ఇక సామాన్యుని మాట చెప్పవలయునా, అను అర్థము సిద్ధించును.

ఆ.వె. అనుచు నుండ లేక యార్తస్వరంబున
నేడ్చె రంతిపురము నింతు లెల్ల
బురజనంబు లెల్లఁ గురరీ నినాదమో
యంగనా రవంబొ యని తలంప. 283

తా: అని పలుకుచు, అతని ఎడఁబాటును ఓర్చుకొనలేక, అంతఃపురకాంతలు శోకముతో కూడిన ఎలుఁగుతో ఏడ్వఁగా అది, ఊరి యందలి జనులు, 'ఆడుపిట్టల (లకుముకి) స్వనమా? లేక, ఆఁడపడుచులు చేయు ధ్వనియా?' అని తలంచిరి.

అలం: సందేహము.

వ. అట్టియెడ వీరభటులు గడు రయంబునం జనుదెంచి యెక్క డెక్కడ
యనువారును నే మేమి యనువారును నెవ్వ రెవ్వ రనువారును నిలు
నిలు మనువారును బోకు పో క ను వారును నగుచుఁ గళవళించి
యక్కామినులచే ననిరుద్ధుం డూరక యదృశ్యుం డయ్యె నని
యెఱింగి విస్మయంబున. 284

తా: ఆ సమయమున వీరులైన భటులు మిక్కిలి వేగముతో వచ్చి "ఎక్కడ ఎక్కడ" "ఏమి? ఏమి", 'ఎవ్వరు ఎవ్వరు', 'నిలునిలుము', "పోకుపోకుము" అనుచు వచ్చి కలఁత చెందినవారై, ఆ కామినులచే"అనిరుద్ధుఁడు కారణములేకయే కనఁబడక పోయె"నని తెలిసికొని, ఆశ్చర్యముతో (మీఁది పద్యముతో).

గీ. హలధరుండును హరియు సాత్యకియు మఱియుఁ
బేరు గల దొరలందఱు బెరసి సభకు
నరిగిరి పురంబులో వీరు లంతవట్టు
నెఱుఁగ సన్నాహభేరి వ్రేయించి పిదప. 285

అర్థ: హలధరుండును = బలరాముఁడు; బెరసి = కలసి; అంతవట్టున్ = అందఱును; సన్నాహ భేరి = యుద్ధ ప్రయత్నపు ఢంకా (లను); వ్రేయించి = మ్రోఁగునట్లు చేసి;

తా: బలరాముఁడు, శ్రీ కృష్ణుఁడు, సాత్యకి, ఇంకను పేరుగల సేనా నాయకులు నగరములోని వీరులు, అందఱును ఎఱుఁగుటకై యుద్ధ ప్రయత్నపు ఢంకాలను మ్రోఁగించి, పిమ్మట అందఱు కలసి కొలువు కూటమునకు వెళ్ళిరి.

కం. ఇత్తెఱఁగున సభ లోపల
దత్తఱమునఁ గూడఁబడిన దర్పిత సామం
తోత్తములలోన విపదుఁడు
మత్తద్విపలీల మనసు మండ నిటు లనున్. 286

తా: ఈ విధముగా సభలో తత్తఱపాటుతో గుమిగూడి గర్వించిన, శ్రేష్ఠులైన సామంత రాజులలో ఒకఁడగు విపదుఁడు మదించిన ఏనుఁగు ప్రవర్తించు విధమున మనసు మండుచుండగా (తీవ్రమైన క్రోధావేశముతో) ఇట్లనెను.

అలం: ఉపమ. మత్తద్విపలీలన్.

చం. ఒకఁ డ నిరుద్ధుఁ బాపుటకు నుల్లములో వగ లేదు నాదు సై
నికులఁ దలంప కిందు రజనీ సమయంబునఁ జొచ్చి యెవ్వఁడో
మకుటము దన్ని నాశిరము మానికముం గొనిపోయె నంచు సి
ప్పుకలఁ బొరల్చి నట్లు మదిపొక్కెడు నెక్కుడు భంగపాటునన్. 287

అర్థ: పాపుటకున్ = కొనిపోవుటకు; ఉల్లములోన్ = మనస్సులో; వగ = శోకము; రజనీ సమయంబునన్ = రాత్రివేళ; మకుటమున్ = కిరీటమును; పొరల్చిన+అట్లున్ = పొరలించిన రీతిఁగా; భంగపాటునన్ = అవమానముతో; పొక్కెడున్ = (కుతకుత) ఉడుకుచున్నది.

తా: "ఒకఁడెవఁడో ఊరుపేరు లేనివాఁడు, మన అనిరుద్ధుని హరించుకొని పోవుటకు నాకు శోకము లేదు. కాని వాఁడెవ్వఁడో నా సైనికులను లెక్కచేయక ఇచ్చటికి రాత్రి వేళవచ్చి నా కిరీటమును తన్ని (క్రింద పడవేసి) నా తలలోని రత్నమును అపహరించినట్లు నా మనస్సు మిక్కిలి ఎక్కువైన అవమానముతో కుతకుతమని ఉడుకుచున్నది."

విశే. విపదుఁడు, స్వామి భక్తి పరాయణుఁడు. అనిరుద్ధుని అపహరణమును స్వావమానముగా తలంచెను.

అలం: అపహ్నుతి. నిక్కముగా తన అవమానమునకు కారణమును మఱుఁగు పఱచి మఱొకవిధముగా చెప్పుట.

కం. కన్నుండఁ గంటి పాపం
గొన్నట్లు మొఱంగి బాలుఁ గొనిపోవుటకై
యన్నీచు బంధు యుతముగ
మన్ని గొనక యున్న నేటిమాటలు మనకున్. 288

తా: "కన్నుండఁగా కంటిపాపను కొనిపోయినట్లు వంచించి, ఏ పాపము ఎఱుఁగని పిన్నవానిని హరించుకొని పోయిన కారణముగా, ఆ నీచుని, వాని బంధువులతో కూడ వధింపక యున్నచో, వట్టి మాటల వలన ప్రయోజనము లేదు."

అలం: రూపకాతిశయోక్తి. ఉపమేయమును మఱుఁగుపఱచి, ఉపమానమును
మాత్రము చెప్పుట.

ఉపమానము : కన్నుండన్ కంటిపాపన్ కొన్నట్లు .

ఉపమేయము : (పెద్దలుండఁగా) బాలుఁగొని పోవుట .

కం. నావుడు సాత్యకి యిట్లను
దేవా! కుఱఁగటనె వెదకి తెలియఁగ వచ్చుం
జూవే చోరులఁ జారుల
చే; వీటికి దవ్వు వోరు చిక్కుదు రింతన్. 289

తా: అని విపదుఁడు పలికినంతనే సాత్యకి ఇట్లనెను. "దేవా! వేగుల వారి వలన సమీప ప్రదేశములందు వెదకించినచో, చోరులు, ఎవరో తెలియును చూడుమా! వారు నగరమునకు దూరముగా పోయి యుండరు. తప్పక సులభముగా, వారు మనకు దొరకుదురు."

ఆ.వె. అనుడు దనుజవైరి యాహుకుఁ బంచిన
నతఁడు చరులఁ బంచె నా క్షణంబ
గజ తురంగ రథనికాయము లెక్కి వే
యరుగు దెంచి వార లరసి యరసి. 290

తా: సాత్యకి అన్నంతనే, శ్రీకృష్ణుఁడు ఆహుకుఁడను వానిని నియోగింపఁగా అతఁడు వెంటనే గూఢచారులను నియమించెను. వారు గజాశ్వరథ సమూహములను అధిరోహించి, శీఘ్రముగా మరలి వచ్చి (మీఁదిపద్యముతో).

గీ. కలయఁ దిరిగికి రైవతకం బనంగ
మఱి లతావేష్ట మన వేణుమంత మనఁగ
ఋక్షవంత మనంగ మహీధరముల
నంతఁ బోక యుద్యానంబులందుఁ జొచ్చి. 291

తా: చారులు రైవతకము, లతావేష్టము, వేణుమంతము, అను పర్వత ప్రాంతములందు, తిరిగిరి. అంతటితో విరమింపక, వేర్వేఱు ఉద్యానవనములను ప్రవేశించి (మీఁది వచనముతో).

వ. అరయుచుండి రాసమయంబున సేనాపతి యగు ననాదృష్టి వెఱచి
వెఱచి నారాయణున కిట్లనియె. 292

తా: వెదకు చుండిరి. ఆ సమయమున అనాదృష్టి అనువాఁడు, మిక్కిలి భయముతో హరితో ఇట్లు విన్నవించెను.

కం. ఏ నొకటి విన్నవించెద
దానవకుల మథన! పెద్ద దడవున నుండిం
బూని వినిపంపఁ గలపని
యౌనో కాదో విచార మది దెలియఁ దగున్. 293

తా: "రాక్షసవంశ నాశకా! శ్రీకృష్ణా! నేనొకటి నీకు మనవి చేసెదను. చాలసేపటి నుండి ప్రయత్నించి, వినిపించుటకు తగిన పని అవునో, కాదో, ఆలోచింపఁదగినది, విషయము ఒకటి మీరు తెలియఁదగినదై ఉన్నది."

కం. [1]దెస చెడి మైందద్వివిదులు
నసిలోమ పులోములును హయగ్రీవుండున్
[2]వసి మాలి సాంభ సాల్వులు
నిసుంభ నరకులును జెడిరి నీఖడ్గమునన్. 294

అర్థ: దెసచెడి = దిక్కులేక; వసిమాలి = ఉత్సాహము. శౌర్యము నశించి.

తా: "దిక్కులేక (రక్షణ లేక చేఁతకాని వారై) మైంద ద్వివిదులు, అసిలోమ పులోములు, హయగ్రీవ సాంభ సాల్వులు, నిసుంభనరకులు, నీతోయుద్ధము చేయు ఉత్సాహము, శౌర్యము, నశించి నీ ఖడ్గముచే కూలిరి కదా."

గీ. మఱియుఁ గొందఱు నీచేత మడిసి రందు
మిడి యడఁగఁజొచ్చి తమ సూడు దడవలేరు
పారిజాతంబుఁ దెచ్చుచో బ్రదికి పోయె
నిర్జరాధీశుఁ డొకరుఁడు నిన్నుఁ దాఁకి. 295

1. కస. 2. వసి మాలి.

తా: "మఱియును కొంత మంది నీతో యుద్ధమునకు వచ్చి నీ ఖడ్గమందు గర్వము అడఁగునట్లు ప్రవర్తించి చొచ్చి నీచే చచ్చిరి. ఇంక వారందఱు గతించుటచే, తమవైరమును చూపలేరు. దేవేంద్రుఁడు ఒక్కఁడు మాత్రము, నీవు పారిజాత వృక్షమును స్వర్గమునుండి అతనిని ఓడించి తెచ్చునప్పుడు, నిన్ను ఎదిరించినవాఁడు బ్రదికి ఉన్నాఁడు."

శా. నాకుం జూడ మనంబునం గుటిలుఁడై నాకేశుఁ డిబ్బాలుఁ దా
నే కొంపోయిన వాఁడు; వాఁడు దగువాఁడే; గౌతమస్త్రీ రహ
స్స్వీకారాదులు తచ్చరిత్రములు నాచేఁ గ్రొత్తగా నేల క
ర్ణాకర్ణిం గథలందు మున్ను వినమే నానాప్రకారంబులన్. 296

అర్థ: కుటిలుఁడై = వక్రబుద్ధితో, చెడ్డతలంపుతో; నాక+ఈశుఁడు = స్వర్గమునకు ప్రభువు; ఇంద్రుఁడు; గౌతమ స్త్రీ = గౌతమ ముని భార్య, అహల్యను; రహస్+స్వీకార+ఆదులు = రహస్యముగా పొందుట మున్నగునవి; కర్ణాకర్ణిగా = ఒకరి చెవి నుండి మఱొకరి చెవికి.

తా: "ఆ ఇంద్రుఁడే, దుష్టబుద్ధి కలవాఁడై ఈ బాలుని కొనిపోయి యుండునని నా అభిప్రాయము. వాఁడు అందులకకు తగినవాడే కదా! గౌతముని ధర్మపత్ని అయిన అహల్యను మాఱు వేషముతో వచ్చి, మోసము చేసి పొందుట, మున్నగు ఆతని చెడ్డ నడతలు మనము ఎఱిఁగినవే! నేను మరల క్రొత్తగా ఏల చెప్పవలెను? మొదటనుండి ఇతరుల వలన మనము ముందే విన్నాము కదా?"

వ. అనుటయు దనుజవైరి విచారించి నిట్టూర్పు నిగిడించి. 297

తా: అని పలుకఁగా, ఆలోచించి శ్రీ కృష్ణుఁడు నిట్టూర్పుతో (మీఁది పద్యముతో).

కం. నా తండ్రీ! సురపతి పై
నే తప్పును లేదు మన మనేకవిధములన్
దైతేయవధము చేయుట
యాతనికార్యంబ; మనల నతఁడు విడుచునే! 298

తా: "ఓయీ నా తండ్రీ! అనాదృష్టీ! ఇంద్రుని యందు తప్పేమియును లేదు. మనము పెక్కు రీతులుగా, వారి వైరులగు రాక్షసులను చంపుట అతని పనియే కదా! అట్లగుటచే ఆతఁడేల, విశ్వాసములేని వాఁడై మనలను విడుచును?

వ. అట్లుం గాక. 299

తా : సులభము.

గీ. ఉత్తముండు హితము చేసి యూర కుండు
మధ్యముండు హితముచేసి మాఱు వెదకు
నధముఁ డొరుచేయుహిత మైన నణఁచి పుచ్చు
హితమునకు నెగ్గు చేయువాఁ డెవ్వఁ డగును? 300

తా: "ఉత్తముఁడైన వాఁడు, ఇతరులకు మేలు చేసి, ప్రతిఫలమును కోరక ఊరకుండును. మధ్యముఁడు మేలుచేసి, తన కేదైన లాభముండునా అని ఎదురు చూచును. అధముఁడు. తనకు మేలు చేసిన వానిని గుఱించి మఱచిపోవును. ఇంక మఱొకఁడు, మేలు చేసిన వారికే, అపకారము చేయును. ఇతఁడు ఎట్టి వాఁడో కదా! అధములలో అధముఁడనుట."

కం. చేసిన మే లెఱుఁగుదు రొరు
గాసింపరు కుచ్చితంపుఁ గఱద లెఱుఁగ ర
త్యాసక్త సౌహృదులు *స
త్యాసీనులు సురలు వార లపకారకులే? 301

అర్థ: గాసింపరు = బాధింపరు; కుచ్చితము+కఱదలు = తప్పు పట్టఁదగిన చెడ్డపనులు; సౌహృదులు = మిక్కిలి ప్రీతి గల మనస్సు కలవారు; సత్య+ఆసీనులు = సత్యమందు నిలుచువారు, సత్యమును తప్పనివారు.

తా: "స్నేహమునకు తగిన మంచి హృదయము కలవారు, సత్యమార్గమును అనుసరించువారు, అయిన దేవతలు, తమకు, ఇతరులు చేసిన మేలును ఎఱుఁగుదురు. మఱచిపోరు. ఇతరులను బాధింపరు. నీచమైనట్టి, వంచించునట్టి, చెడ్డ పనులను ఎఱుఁగరు. ఇంత ఏల, వానికి పూనుకొనరు. అట్టి వారు మనకు అపకారము చేయుదురా?"

కం. ఇప్పుడు నీపలికిన పలు
కొప్పదు ప్రద్యుమ్న తనయుఁ డొక్కతె వలపుం

* స, త్యాసికు లగు.

త్రిప్పులఁ బడఁ గొని పోయెను
దప్పెం బుంశ్చలికి నేటి తగవుం గిగవున్. 302

తా: "ఇప్పుడు నీవు చెప్పినమాటలు సమ్మతము కాదు. ప్రద్యుమ్నతనయుఁడగు అనిరుద్ధుని ఎవరో నీతి మాలిన యువతి వలపు త్రిప్పటలలో (కామ వికారమునకు) వశమై మైమఱచి చిక్కుకొని అతనిని తన సుఖమునకై కొనిపోయి యుండును. అంకుటాలు న్యాయ మెఱుఁగునా?"

వ్యా. 1. నీ (యొక్క) పలికిన పలుకులు > నీవు పలికిన పలుకులు. కారక, ప్రౌఢ - 15, 16.

2. వలపు +త్రిప్పులన్. నుగాగమ సమాస సంధి. సంధి, బాల - 25, ద్రుతకార్యములు, సంధి, బాల - 16, 17. (చూడు, పద్య - 66)

3. తగవు గిగవు. నిందయందు గిగీలు. ప్రకీర్ణ; బాల - 22.

వ. అని చింతించుచున్న మురాంతకునకు నక్రూరుం డి ట్లనియె. 303

తా: అని, చింతతో ఆలోచించుచున్న, మురసంహారియైన శ్రీకృష్ణునకు అక్రూరుఁడు ఇట్లనియెను.

కం. మనపని దనపని దన పని
మనపని గా నడుతు మతఁడు మనము నొకఁడు మో
చినమో పిందఱు మోచిన
యనువున నీ తోడుపడుట యతనికిఁ గీడే! 304

తా: "ఆ ఇంద్రుఁడును మనమును ఒకరు వహించిన భారమును అనేకులు (మనము) మోచిన విధమున, మన పని, తన పనిగాను, అతని పని, మన పనిగాను, ఒకరికొకరు, సాయపడుచు ప్రవర్తించు చున్నాము. నీవు అతనికి తోడ్పడుట అతనికి కీడైనదా ఏమి? అది అతనికి మేలగుటచే మనకు కీడు తలంపదు, సుమా!"

ఉ. ఎట్టి కుబుద్ధియైనఁ దన యిష్టసహాయుని కెగ్గు చేయునే?
పట్టెడు చోటు గాల్చు కొను బాలిశుఁడుం గలఁడే! సురేశ్వరుం

డట్టె యతండు నిన్ను దనుజాంతకుఁ డంద్రు విరోధ మేటికిన్
బుట్టెడు నిద్దఱుం ద్రిదివ భూతల రక్షణ మాచరింపఁగన్? 305

అర్థ: పట్టెడు చోటున్ = ఆశ్రయించు చోటును; బాలిశుఁడు = తెలివి లేని వాఁడు; త్రిదివభూతల = స్వర్గము, భూమిని.

తా: "ఎటువంటి చెడ్డ వాఁడైనను, తనకు ఇష్టుఁడై సాయపడు మిత్రునకు కీడు చేయునా? తాను ఆశ్రయించు చోటును (తన రక్షణకై) తానే, కాల్చి వేయు తెలివి మాలిన వాఁడు కూడ ఉండునా? అతనిని దేవతలకు ప్రభువు అనుటయు (జనులు) నిన్ను వారి శత్రువులైన దనుజులను అంతము చేయు వాఁడనియు అందురు కదా! కావున మీరివురును ఒకే తీరున స్వర్గమును, భూమిని రక్షించుచుండఁగా, మీలో మీకు వైరమేల కలుగును?"

అలం. అర్థాంతరన్యాసము. విశేషము, సామాన్యముచే సమర్థింపఁబడినది.

కం. దేవతలఁ గావ మానుష
భావంబున నవతరించి పని పూనిన యా
దేవాది దేవుఁడవు నీ
వే విధమున వారు నీకు నిటు చేయుదురే. 306

తా: "నీవు ఆ దేవతలను రక్షించుటకై మానవ రూపముతో, అవతార మెత్తి వారి రక్షణ బాధ్యతను నిర్వహించు దేవతలకు ఆది దేవతవు. అట్టి నీకు ఆ సురలు ఏ రీతిగానైనను మఱియు ఈ తీరుగా, హాని చేయుదురా?"

అర్థాంతరము. అట్టి నీకు ఈ రీతిగా ఏ విధిచే (నియమము) హాని చేయుదురు?

నానా. విధము = ప్రకారము, విధి, వేతనము, గజకబళము.

వ. అనుటయు నచ్యుతుండు. 307

తా: అని అక్రూరుఁడు వచింపఁగా శ్రీకృష్ణుఁడు.

శా. గంధర్వామర యక్ష రాక్షసుల కీ కార్యంబు సిద్ధించునే
*బంధ క్యాహృతుఁడైన వాఁడు దలఁపం బ్రాద్యుమ్ని; దైత్యాధిప

* బంధవ్యాహృతుఁ.

స్కంధా వార విహారిణుల్ గులట లీచందంబు గావింతు రీ
బంధు భ్రాంతి వెలార్చెదన్ మనుమనిం బ్రాగ్వృత్తికిం జేర్చెదన్.308

అర్థ: బంధకీ + ఆహృతుఁడు = అంకులాఁడిచే అపహరింపఁబడిన వాఁడు; ప్రాద్యుమ్ని = ప్రద్యుముని తనయుడు; అనిరుద్ధుఁడు; స్కంధావార = బిడారమునందు; కులటలు = జారిణులు; బంధు భ్రాంతిన్ = ఈ విధమైన చుట్టరికపు తికమకను (భ్రమను); వెలార్చెదన్ = వెడలించెదను; పాఠాం. బంధ భ్రాంతిన్ = సంయోగ విశేషమునకు చెందిన తికమకను, సంయోగమునకై భ్రమతో అతనికి కలిగిన (బంధమును) చెఱను; ప్రాక్+వృత్తికిన్ = పూర్వము గల ఉనికికి, స్థితికి.

తా: ఇట్టి అపహరణ కార్యమును, గంధర్వులు దేవతలు యక్షులు రాక్షసులు చేయరు. ఆలోచింపఁగా అనిరుద్ధుఁడు ఒక అంకులాఁడిచే అపహరింపఁబడిన వాడై యుండును. రాక్షసరాజుల బిడారములందు విహరించు కులటలు ఇట్లు చేయుదురు. వారి బంధు భ్రాంతిని పోఁగొట్టెదను. అనిరుద్ధుని పూర్వస్థితికి తెచ్చెదను. (ద్వారకకు తెత్తును).

కం. అనుటయు నచ్యుతు పదిలపు
మనంబు నిలుకడకు వందిమాగధగణముల్
వినుతించినఁ గైవారము
లనర్గళంబుగఁ జెలంగె నాస్థానము లోన్. 309

తా: అని శ్రీకృష్ణుఁడు అన్నంతనే అతని మనసు నిలుకడను, వంది మాగధుల సమూహములు పొగడిన స్తుతులు, అడ్డులేక ఆ సభలో విండినవి.

వ. తదనంతరంబ మున్ను వోయిన చారులు. 310

తా: తర్వాత ఇంతకు ముందు, అనిరుద్ధుని వెదకుటకు వెడలిన వేఁగువారు.

ఆ.వె. కూడి గిరులుఁ దరులుఁ గొల్లంబుఁ బల్లంబు
నరసి మిట్టఁ బుట్ట నడవిఁ దడవి
యోపి తొలలు సెలలు నోలంబుఁ గూలంబుఁ
జూచి క్రంత గ్రుంతఁ జొచ్చి వచ్చి. 311

ప్రతి: కూడి = కలసి; గిరులున్ = కొండలు; తరులున్ = చెట్లు; కొల్లంబున్ = చిన్న పల్లములు రూ. కొలి, కొల్లి, కొలము, కొల్లము (ఇట్లు రూపములు ఏర్పడుటకు అవకాశమున్నది. కొల్లము = లోఁతుగల పల్లము.) పల్లంబున్ = పల్లపు నేలలును; అరసి = చూచి; మిట్టన్ = ఎత్తైన చోట్లును; పుట్టన్ = చిన్న పొదలును; అడవిన్ = దట్టముగా చెట్లు మొలిచిన విశాలప్రదేశములను (అరణ్యములు); తడవి = వెదకి; ఓపి = ఓర్చి (సహనముతో తిరిగి); తొలలున్ = నీరు గల పల్లపు చోట్లును, సెలలున్ = కొండలపై నుండి, ప్రవహించు చిన్న నీటి ధారలను కల సెలయేర్లును; ఓలంబున్ = మఱుఁగై ఉండు, రహస్య స్థానములును; కూలంబున్ = (నదుల) గట్టులును, మట్టి దిబ్బలును; చూచి; క్రంత = సందు త్రోవలును; గ్రుంతలు (రూపాం.) గుంతలు, గుంటలు = చెఱువులు; చొచ్చి = ప్రవేశించి (వెదకి); వచ్చి = మరలి వచ్చి(రి).

తా: కొండలు, చెట్లు, చిన్నపల్లములు, పల్లపు నేలలు (లోయలు), ఎత్తైనచోటులు, చిన్న పొదలు, అడవులు, నీరుగల పల్లపు చోట్లు, సెలయేర్లు, మఱుఁగైన నెలవులు, నదుల గట్టులు (మట్టి దిబ్బలును) సందు త్రోవలు, చెఱువులు ప్రవేశించి మరలి వచ్చి (మీఁది వచనముతో).

వ. మధు సూదను సభామంది ద్వారంబున నిలిచి యిట్లనిరి. 312

తా: ఆ చారులు శ్రీకృష్ణుని కొలువు కూటము యొక్క మందిరము కడకు వచ్చి, వాకిటి ముందు నిలిచి ఇట్లనిరి.

కం. తిరిగితిమి గాలి కై నం
జొరఁ గూడని చోటు లెల్ల సూర్యమరీచుల్
పరఁగని సెలవులు చూచుట
యరుదే యనిరుద్ధుఁ జూడ నలవడ దయ్యెన్. 313

తా: "గాలి కూఁడ చొరలేని ఎల్ల చోటులు తిరిగితిమి. సూర్యకిరణములు ప్రసరింపని మిక్కిలి సన్నములైన చోటులు చూచితిమి. ఇట్లనుటలో ఆశ్చర్యము లేదు. కాని అనిరుద్ధుని చూచుటకు శక్యము కాదయ్యెను."

గీ. ఇంక నేదిక్కుఁ దడవుదు మెఱుఁగఁ జెప్పుఁ
డనుచు గన్నీరు దొరుఁగంగ నవుడు గఱచి
కొనుచు బొమగంటు వెట్టుచుఁ గొంద ఱచట
నొండుపాయంబు నేరక యున్న యంత. 314

తా: "ఇంక, ఏ దిశను వెదకవలెనో తెలియఁజెప్పఁడు" అనుచు, కన్నీరు కాఱుచుండఁగా పెదవిని కఱచి కొనుచు, కనుబొమలు ముడివైచుచు కొందఱు అచట, వేఱొక ఉపాయము తెలియక నిలిచి ఉండఁగా (మీఁది పద్యముతో అన్వయము).

మ. చెలఁగెం దూర్యరవంబు శంఖములు మ్రోసెన్ శౌరిచిత్తం బునం
దళుకొత్తంగఁ బ్రమోద మట్టియెడ నా దైత్యారి యేకార్యమున్
నిలుప న్నేరనివాఁడ యై మనుమనిం దేఁ బోయెదన్ వార్ధిలో
పల మున్నన్ మును గొంత జాడ యెఱిఁగింపం జాలు వాఁ డెవ్వఁడో. 315

తా: శ్రీకృష్ణుని మనసులో అత్యధికమైన సంతోషము మెఱయఁగా, వాద్య ధ్వనులు, శంఖములు మ్రోగినవి. ఆ సమయమున రాక్షస విరోధి ఏ పనియందును బుద్ధి నిలుప లేని వాఁడై "సముద్రములో నున్నను, నేను నామనుమని కొని తెచ్చెదను. మొదట అతఁడున్న చోటును తెలుపఁగల వాఁడు ఎవ్వఁడైనను ఉన్నాఁడా?"

వ. అనుచుండె నాసమయంబున. 316

తా: అనుకొనుచుండెను. అప్పుడు.

(షష్ఠాశ్వాసములోని రెండవ గద్యముతో అన్వయము)

శా. పారావార నగాధిరాజ తనయాపాంగేక్ష ణోదంచిత
శ్రీరాజ త్పులకావళీ వరతనుప్రీతి ప్రకాశాంతరా
కారుణ్యామృతవర్షి భాషణ విధా కళ్యాణ రత్నాకరా
దూరీభూతత రాంతరాయ నివహా దుష్టాత్మ శిక్షాపరా. 317

ప్రతి: పారావార నగ+అధిరాజ తనయా= సముద్రుని, పర్వత రాజైన హిమవంతుని యొక్కయు కుమార్తెలైన లక్ష్మియు, పార్వతి యొక్కయు; అపాంగ + ఈక్షణ = కడగంటి చూపుల యొక్క; ఉదంచిత = పెంపొందుచు, ఒప్పుచున్న; శ్రీ = శోభ చేత; రాజత్ = ప్రకాశించు చున్న; పులక+ఆవళీ = గగుర్పాటు వరుసలచే; వర తను = మేలైన (వారి) శరీరమందుఁగల; ప్రీతి = సంతోషముతో; ప్రకాశ = వెలుఁగొందునట్టి; అంతరా = హృదయము కలవాఁడా!

కారుణ్య+అమృత వర్షి = దయ అనెడి సుధను కురియునట్టి; భాషణ = మాటల యొక్క; విధా = సమృద్ధికల; కల్యాణ = శుభములకు; రత్నాకరా = సముద్రుఁడా!

దూరీభూతతర = మిక్కిలి దవ్వైన; అంతరాయ నివహా = విఘ్నముల సమూహము కలవాఁడా! (విఘ్నములను తొలఁగించిన వాఁడు). దుష్టాత్మ శిక్షా పరా = దుష్టులను శిక్షించుట యందు, ఆసక్తి కలవాఁడా! హరిహర నాథా!

శ్రీ లక్ష్మి పార్వతుల యొక్క కడగంటి చూపులు, క్రమముగా, హరిహరులపై ప్రసరించుచున్నవి. అట్లు హరిహరనాథుని వారు చూచుటచే, వారి శరీరములు పులకాంకురములు కలవైనవి. అట్టి తమ సతుల పులకిత శరీరములను, చూచి, హరిహర నాథుడు, ప్రీతి గల హృదయము గల వాఁడయ్యెను. ఆతని మాటలు, కారుణ్యమనెడి అమృతమును వర్షించుచున్నవి. అట్టి మాటల సమృద్ధి వలన కలుగు మంగళములకు సముద్రుఁడు (అట్టి శుభములను అధికముగా కల్గించువాఁడు) అంతరాయములను, దూరము చేసిన వాఁడు, దుష్టశిక్షణ పరాయణుఁడు,

తా: తన్నుచూచి పులకిత శరీరులైన మహాలక్ష్మి యొక్క, మంగళగౌరి యొక్క కడగంటి చూపుల శోభచే ప్రకాశించుచున్న, వారి మేలైన శరీరమందు ప్రీతిని ప్రకటనము చేయు మనసు కలవాఁడా!

కరుణామృతమును వర్షించు వాక్కుల సమృద్ధిచే శాంత్యానందాది కల్యాణగుణములకు సముద్రుఁడా! విఘ్నములను పాఱద్రోలి, దుష్టులను శిక్షించు ఆసక్తి గలవాఁడా! హరిహరనాథా!

విశేషములు. విరాటపర్వాదిలో కవిబ్రహ్మ తిక్కన హరిహరనాథుని ఏకరూపతను, శ్రీయను, గౌరియను ఒకే రూపముగల చెల్వను వర్ణించెను.

అలం: రూపకము. "కారుణ్యామృత" 2. "కల్యాణ రత్నాకరా"

కం. దోషాకర జయభూషా
దూషిత ని శ్శేషితారి దురితపరాళీ
భీషణ ఘోషాఢ్య యశః
పోషణ నిత్యాభివృద్ధ పుణ్యసమృద్ధా. 318

318. ప్రతి: దోషా+ఆకర = దుష్టుల యొక్క, జయ = గెలుపనెడు; భూషా = ఆభరణము గలవాఁడా; దోషాకర = చంద్రుఁడనెడి; జయ=జయచిహ్నమైన, భూషా;(హర పరము); దూషిత నిశ్శేషిత+అరి = దూషింపఁబడువారై మిగిలియున్న శత్రువులను, పూర్తిగా నాశము చేసినవాఁడా!

(దూషితులై మిగిలియున్న నాశనము చేయఁబడిన శత్రువులు గలవాఁడా); దురితపర+ఆళీ = పాపులైన వారి మొత్తము యొక్క; భీషణ ఘోష+ఆఢ్య = భయంకరమైన హాహాకారములు (ధ్వని) కలవాఁడా! (వారిని మర్దించువాఁడు); యశఃపోషణ నిత్య+ అభివృద్ధ పుణ్యసమృద్ధా = కీర్తియొక్క పెంపుచే, ఎల్లప్పుడు పెరిగిన పవిత్రకార్యముల యొక్క సమృద్ధి కలవాఁడా! పెక్కు పుణ్య కార్యములను చేసిన కీర్తిమంతుఁడు. (ఉభయపరము). హరిహరనాథా!

తా: దుష్టులజయము, చంద్రుఁడనెడి జయచిహ్నమును (క్రమముగా) అలంకారములుగా కలవాఁడా! దూషితులును, నిశ్శేషితులునైన శత్రువులు గలవాఁడా! దురితపరుల సమూహము యొక్క హాహాకారములు గలవాఁడా! కీర్తి పోషణమగు నిత్యమును వృద్ధి పొందుచున్న పుణ్యకార్యములను అధికముగా గలవాఁడా! హరిహరనాథా!

అలం: శబ్దశ్లేష, దోషాకరజయ భూషా.

**మాలిని.**

నిగమనివహరంగా! నిత్యమానాంతరంగా!
విగతజననసంగా! వీతభేదప్రసంగా!
ఖగహిమకరనేత్రా! గౌరనీలాభ్రగాత్రా!
జగదధికృతపాత్రా! సమ్మదోద్యచ్చరిత్రా! 319

ప్రతి: నిగమ నివహ రంగా = వేదముల సమూహమును రంగభూమిగా గలవాఁడా! (వేదములందు సంచరించువాఁడా)! నిత్యమాన +అంతరంగా = ఎల్లప్పుడును; వేద ప్రమాణముగల మనస్సు గలవాఁడా! విగత జనన సంగా = పోయిన పుట్టుక యొక్క సంబంధము కలవాఁడా! (జనన రహితుఁడా). వీత భేద ప్రసంగా = పోయిన భేద ప్రసక్తి గలవాఁడా! (హరిహరులు వేర్వేఱు అను ప్రసంగము లేనివాఁడా). ఖగహిమకర నేత్రా = సూర్య చంద్రులను కన్నులుగా కలవాఁడా! గౌర నీల+ అభ్రగాత్రా = తెల్లని, నల్లని మేఘము వంటి శరీరము కలవాఁడా! (హరి నల్లనయ్య హరుఁడు తెల్లనయ్య). జగత్+అధికృతపాత్రా = లోకముల యొక్క అధికారము నందు అర్హుఁడైనవాఁడా! (లోకములను పాలించుటకు తగినవాఁడా). సమ్మద ఉద్యత్ చరిత్రా = సంతోషముచే మించుచున్న చక్కని నడవడిక కలవాఁడా! హరిహర నాథా!

తా: వేదములందు విహరించువాఁడా! వేద ప్రామాణ్యమును అంతరంగమున కలవాఁడా! జననము లేని వాఁడా! హరిహరులు అభేదమను వాదము కలవాఁడా! సూర్యచంద్రులను కన్నులుగా కలవాఁడా! తెల్లని నల్లని మేను కలవాఁడా! సంతోషముతో అతిశయించుచున్న నడవడి కలవాఁడా! హరిహరనాథా!

# గద్యము

ఇది శ్రీమదుభయ కవి మిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున, శ్రీమత్సకల భాషాభూషణ, సాహిత్యరసపోషణ, సంవిధాన చక్రవర్తి, సంపూర్ణ కీర్తి, నవీన గుణ సనాథ, నాచన సోమనాథ ప్రణీతంబైన యుత్తర హరివంశంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు

ఓమ్ నమో భగవతే వాసు దేవాయ

# ఉత్తర హరివంశము

## నాచన సోమనాథ ప్రణీతము

## షష్ఠాశ్వాసము

శ్రీ కలిత యోగి హృన్నా
ళీ కాంత ర్నిజనివాస లేఖాధిప సం
ధ్యా కాల మూల జపన
స్వాకా రోంకార రూప హరిహరనాథా. 1

ప్రతి : శ్రీ = అతిమానుషమైన దివ్య శక్తితో; కలిత = కూడుకొన్న; యోగి = యమ నియమాదులను అభ్యసించు, ధ్యాన నిష్ఠుల యొక్క; హృద్+నాళీక = పద్మములవంటి హృదయముల యొక్క; అంతస్ + నిజనివాస = నడుమ తన, ఉనికిని కలవాఁడా!

లేఖ+అధిప = దేవతల ప్రభువైన ఇంద్రుని యొక్క; సంధ్యాకాల = ప్రాతః సాయం సంధ్యల యందు; మూల జపన = జప చర్యకు ప్రధానమైన; స్వ+ఆకార+ఓంకార రూప = తన ఆకారమే అయిన 'ఓమ్' అనెడి ప్రణవమే రూపముగా కలవాఁడా! హరిహరనాథా!

తా : "శ్రీ", శబ్దముచే పిలువఁబడు (శక్తి స్వరూపిణి, జ్ఞాన స్వరూపిణి, ఆనంద స్వరూపిణి అయిన లలితా త్రిపుర సుందరి) అతిమానుష శక్తి అంతర్లీనమై యున్న తన నివాసమును, ఉత్తమ జ్ఞానులగు పరమ హంసల యొక్క హృదయ పద్మములందు కలవాడా!

సంధ్యాకాలమందు మహేంద్రుని జపచర్యకు మూలమును తన ఆకారమును అయిన ఓమ్ అను ప్రణవమే రూపముగా కలవాఁడా! హరిహరనాథా!

వ్యా. స్వాకార +ఓంకార - ఇచ్చట వృద్ధి సంధిరాక, పరరూపసంధి వచ్చినది.

వృద్ధి సంధి : 'అఆ' లకు, 'ఏఐ' పరమైన 'ఐ' కారమును, 'ఓఔ' లు పరమైన 'ఔ' కారమును, 'ఋ' పరమైన 'ఆర్' ఏకాదేశముగా వచ్చును. ఇచ్చట 'ఓ' పరమైనను

'ఔ' ఏకాదేశము కాలేదు. పూర్వ పరస్వరంబులకు, పరస్వరము ఒక్కటియే నిలుచుటచే, పరరూప సంధి అగును.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తా : దేవా. వైశంపాయన ముని జనమేజయ మహారాజునకు, అనంతర కథను చెప్పుటకు మొదలిడెను.

చం. తెలతెల వేగునంత నరుదెంచు నభోమణి వోలె నారదుం
డలరు మొగంబుతో సభ రయంబునఁ జొచ్చినఁ గంసవైరి య
క్కొలువున మించియు న్మనసు గుందఁగఁ బీఠము డిగ్గి యమ్మునిం
బలుకుల గో ప్రదాన మధుపర్కములం బరితృప్తుఁ జేసినన్. 3

ప్రతి : తెలతెల వేఁగు నంతన్ = తెల్లతెల్లగా సూర్యుఁడు ఉదయించిన వెంటనే; అరుదెంచు = వచ్చునట్టి; నభస్ + మణి + పోలెన్ = ఆకాశమందలి రత్నమగు సూర్యునివలె; నారదుండు; అలరు మొగంబుతోన్ = వికసించెడి మోముతో; సభన్ = (శ్రీకృష్ణుని) కొలువు కూటమును రయంబునన్ = వేగముగా; చొచ్చినన్; కంసవైరి; ఆ కొలువునన్; మించియున్ = అతిశయించియు; మనసు; కుందఁగన్ = బాధతో నుండఁగా; పీఠమున్ +డిగ్గి = తాను కూర్చుండు సింహాసనమునుండి దిగి; ఆ మునిన్; పలుకులన్; గోప్రదాన మధుపర్కములన్ = గోవులతోను పెరుగు, తేనే, నేయి, నీరు పంచదార అనువానితోను, వస్త్రములతోను సంతృప్తినిగా చేయఁగా.

తా : తెల్లవాఱు చుండఁగా, అతివేగముగా ఆకసమున పయనించు దివాకరునివలె, నారదమహర్షి వికసించిన వదనముతో, శ్రీకృష్ణుని కొలువు కూటములోనికి ప్రవేశింపఁగా మనసులో అనిరుద్ధుడు కానరాక పోవుట బాధించుచున్నను గంభీరుఁడుగా సింహాసనము నుండి దిగి శ్రీకృష్ణుఁడు ఆ దేవమునికి స్వాగత వచనములను పలికి, ఆవులను, పెరుగుతో కలిపిన తేనె మొదలగువానిని, వస్త్రములను ఇచ్చి సంతృప్తిని చేయఁగా (మీఁది పద్యముతో).

విశే. ఇది "నీరజ మిత్రుఁడేల ధరణీ గతుఁడయ్యె" అను పద్యమును స్మరణకు తెచ్చును. సభాపర్వము, 1, ఆ - 23వ , పద్యము

చం. అతఁడు సితాంబరావరణ మైన మహామణిపీఠ మెక్కి య
చ్యుతు నిజసింహపీఠగతుఁ జూచి 'మురాంతక యెంత చిన్నవో

యితి మది నెంత వంత గల దీయదువీరులు నేల చాల ధీ
రతఁ దరలించి చిత్తముల రాఁజెద' రన్న మురారి యిట్లనున్. 4

ప్రతి : అతఁడు = ఆ నారదుఁడు; సిత+అంబర+ అవరణము + ఐన = తెల్లని (పట్టు) వస్త్రములచే కప్పఁబడియున్న; మహామణి పీఠము + ఎక్కి = గొప్ప, మణులతో (రత్నములతో) పొదిగియున్న ఆసనమును ఎక్కి; నిజసింహ పీఠగతున్ = తన సింహాసనము పై కూర్చున్న అచ్యుతున్ = శ్రీకృష్ణుని; చూచి; ముర+అంతక=మురుఁడను రక్కసుని చంపిన వాఁడా! శ్రీ కృష్ణా!; ఎంత చిన్నపోయితి (వి) = ఎంతో క్రుంగియున్నావు; మదిన్; ఎంత వంత గలదు = ఎంత శోకము కలదో? ఈ యదువీరులున్; చాలన్ ధీరతన్ తరలించి = మిక్కిలి నిలుకడను వదలి; చిత్తములన్ = మనస్సులందు; ఏల?; రాఁజెదరు? = వేదనను చెందుచున్నారు?; అన్నన్ = అనఁగా, ముర+అరి = మురునకు శత్రువు (కృష్ణుఁడు); ఇట్లు + అనున్.

తా : తెల్లని వస్త్రములతో కప్పఁబడిన గొప్ప మణిమయ పీఠమును ఎక్కి, తన సింహాసనమందు కూర్చున్న శ్రీకృష్ణుని నారదుఁడు చూచి "ఓ మురహరా! ఎంత దీనముగా నుంటివయ్యా! నీ మదిలో ఎంత వేదన ఉన్నదో కదా! ఈ యాదవ వీరులును నిలుకడను కోల్పోయి, మనస్సులలో పొగులు చున్నారు ఏల?" అని అడుగఁగా, శ్రీకృష్ణుఁడు ఇట్లు సమాధాన మిచ్చెను.

కం. మునినాథ।చెప్పఁ జిట్టలు
మన యనిరుద్ధుండు నిన్న మగువలు గొలువం
దనయింట రాత్రి నెమ్మది
నునికి గలిగెఁ బిదప నున్న యునికిన యడఁగెన్. 5

అర్థ : చిట్ట = ఆశ్చర్యము, నిన్న = ఒక్కనాఁడు; (గతకాలమున); ఉన్న ఉనికిన = ఉన్నవాఁడు ఉన్నట్లే, తటాలున (అతి శీఘ్రముగా); అడఁగెన్ = కనఁబడకపోయెను.

సూచన : అనిరుద్ధుఁడు శోణితపురమున, కొన్ని దినములు ఉషతో ఇతరులకు తెలియక ఉండెను. అనంతరము అది తెలిసి బాణుఁడు అతనితో యుద్ధము చేసెను. కనుక శ్రీకృష్ణుఁడు నారదునితో "నిన్న" అనుట పొసఁగదు. ఒక సవరణ చేయవీలున్నది. "అనిరుద్ధుఁడు నన్ను మగువలు గొలువం". దీనికి అర్థము ఇట్లు చెప్పవచ్చును. అనిరుద్ధుండును = యువకుఁడు, వీరుఁడైనవాఁడును; అన్నున్ = ఒళ్లెఱుఁగమి, పారవశ్యముచే (శ.ర). మై మఱచి యుండుటచే.

తా : మునినాయకా! నారదా, ఆశ్చరకరములగు వార్తలున్నవి. మన ప్రియమైన

అనిరుద్ధుఁడు మైమఱచి, మగువలు కొలుచుచుండఁగా తన యింటిలో నెమ్మదిగా నుండెను. పిమ్మట ఉన్నటులుండి కనఁబడలేదు.

వ్య. అనిరుద్ధుఁడు- ఇతరులచే అడ్డగింపఁబడనివాఁడు. మన్మథుని పుత్రుడు.

విశే : "మన" అనుటచే నారదునకు ఇష్టుఁ డనుట.

## - : నారదుఁడు శ్రీ కృష్ణున కనిరుద్ధుని వృత్తాంతము చెప్పుట : -

ఉ. నావుడు నారదుండు యదునాయకవీరులఁ జూచి యద్భు తా
రావ రణంబు చూచితిమి రాత్రి నిజం బనిరుద్ధ బాణ బా
ణావలిచేత నాదితి సుతాత్మజకై చెలి చిత్ర రేఖ సం
భావన నక్కుమారవరుఁ బట్టుట నయ్యుష వాని ముట్టుటన్. 6

అర్థ : అద్భుత + ఆరావ రణంబు = అచ్చెరువు కొల్పు ధ్వనులతో యుద్ధము; సంభావనన్ = ఆదరముతో; పట్టుట = నిర్బంధించి కొనిపోవుట; ముట్టుట = కలియుట (రమించుట).

తా : శ్రీ కృష్ణుఁడు, అట్లు పలుకఁగా, నారదుఁడు యాదవ నాయకుఁడగు శ్రీ కృష్ణుని, ఇతర వీరులను చూచి "అద్భుతమైన ధ్వనులతో, అనిరుద్ధుని యొక్కయు బాణాసురుని యొక్కయు, బాణముల సమూహముతో జరిగిన యుద్ధమును రాత్రి చూచితిమి. ఇది నిజము. అనిరుద్ధ కుమారుని, బాణుని పుత్రిక ఉష కొఱకై, ఆమె ఇష్ట సఖి చిత్రరేఖ ఆదరముతో అతనిని నిర్బంధించి అపహరించుకొని పోయినది. తర్వాత ఉషాకాంత అతని కలిసినది. ఈ కారణముగా ఆ రణము, జరిగినది".

కం. బలివాసవులును బోలెం
దలపడి రనిరుద్ధ బాణదైత్యులు వే చే
తులవాఁడు రెండు చేతుల
చెలువునిచేఁ జిక్కి మాయ చేకొని భీతిన్. 7

తా : బలి చక్రవర్తియు, మహేంద్రుఁడును పోరాడిన విధమున, అనిరుద్ధుఁడును బాణాసురుఁడును ఎదుర్కొనిరి. వేయి చేతులవాఁడు బాణుఁడు, రెండు చేతులవాడు అందగాఁడయిన అనిరుద్ధునిచే, ఆ యుద్ధమందు సంకట పడి, చేయునది లేక, భయముతో, ఆతనిని అణఁచుటకు మాయను ఉపయోగించి (మీఁది పద్యముతో).

అలం : ఉపమ 'బలివాసవులునుం బోలె .... బాణ దైత్యులు'

వ్యు. వాసవుఁడు - వసువులు (రత్నములు) కలవాఁడు, ఇంద్రుఁడు.

నానా : మాయ = ఇంద్రజాలము, మోసము, లక్ష్మి, రతి, పార్వతి, భ్రమ, ఒక పట్టణము, అజ్ఞానము, విష్ణువు. మొ.

చం. తన చతురంగ సేనలు శతంబులు వేలును గోట్లునున్ ధరం
బెనఁగొనఁ గూల్చె వీఁడు గడు బె ట్టనుచుం బెనుఁ బాము కట్టునన్
దనువు మునుంగఁ గట్టె విను దానవ సూదన! యింతభంగ మే
మనుజుఁడు నోర్వఁ డన్న దరమా పరమాత్మ జయాభిలాషికిన్. 8

అర్థ : బెట్టు = బలియుఁడు; పెనఁగొనన్ = అన్నియు ఒకదానితో మఱియొకటి కలియునట్లు; పాము కట్టునన్ = పెద్దపాము యొక్క కట్టుతో; దానవ సూదన! = రాక్షసులను అంత మొందించిన వాఁడా! భంగము = అవమానము; జయ+అభిలాషికిన్ = యుద్ధమందు గెలుపును కోరు వానికి; తరమా = శక్యమా?.

తా : 'భూమి మీఁద నూర్లు, వేలు, కోట్ల కొలఁది తన రథగజ తురగ పదాతులు అనెడి నాలుఁగు రకములైన సేనలను, ఈ యువకుఁడు, అన్నియు ఒకే చోట కలియునట్లు కూల్చెను. వీఁడు గొప్ప గట్టివాఁడు' అనుచు బాణుఁడు పెద్ద పాము అనెడి త్రాటిచేత (నాగపాశము) వాని శరీర మంతటిని కదలనీయక, కట్టెను. ఓ రాక్షస సంహారా! ఓ పరమాత్మా! ఇట్టి అవమానమును సామాన్య మానవుడు సహింపలేఁడు కదా! ఇంక యుద్ధమందు గెలుపునే కోరు వాఁడైన మహావీరుఁడు, ఓర్వఁగలఁడా?

అలం : కావ్యార్థాపత్తి. ఒక అర్థము వలన మఱొక అర్థమును సాధించుట. అనిరుద్ధుఁడు మహావీరుఁడు. అసాధారణమైన పరాక్రమశాలి. అవమానమును సహింపఁజాలఁడని భావము.

వ్యా. పెను+పాము > పెనుఁబాము. సంధి, బాల - 32.

కోటులు > కోట్లు, ఆచ్ఛిక, బాల -12

నానా : భంగము = అవమానము, అల, ఓటమి, నాశము, భాగము మొ.

చం. అని ముని చెప్పిన న్విని మురాంతకుఁ డంతకు భంగి దైత్యుపైఁ
గినిసి ప్రయాణ వస్తువులు కింకరకోటికి నప్పగింపఁబో

యిన నగి నారదుం డసుర యిచ్చటికిం బదునాల్గు వేల యో
జనముల నున్న వాఁ డరుగఁ జాలునె మానవ లోక యానముల్. 9

అర్థ : అంతకు భంగిన్ = యముని విధమున; కింకర కోటికిన్ = సేవక సమూహమునకు; యోజనము = రెండు కోసుల దూరము, మానవలోక యానముల్ = మానవులు ఉపయోగించు ప్రయాణ సాధనములైన తేరులు గుఱ్ఱములు; అరుగన్ + చాలునె? = వెడలఁగలవా?

తా : నారదుఁడు చెప్పఁగా, విని శ్రీ కృష్ణుఁడు యముని విధమున, బాణునిపై కినుక వహించి, సేవక సమూహమునకు ప్రయాణమునకు వలయు వస్తువులను అప్పగించుటకు సిద్ధము కాఁగా, ఆ ముని నవ్వి "ఆ రాక్షసుఁడు, ఇచ్చటికి పదునాలుగు వేల యోజనముల దూరమున ఉన్నాఁడు. అట్లగుటచే మానవులు ఉపయోగించు వాహనము లైన తేరులు గుఱ్ఱములు అంతదూరము వెడలఁజాలవు".

అలం : ఉపమ, మురాంతకుఁడు అంతకు భంగి.

వ్యు. అంతకుఁడు- అంత మొందించువాఁడు, యముఁడు.

నానా : కోటి = అంచు, వింటికొప్పు, నూరు లక్షలు, మొ.

వ్యా. అసుర, ఇది వైకల్పికముగా స్త్రీ తుల్యమగును. కానిచో అసురుఁడు, అగును. తత్సమ, బాల - 60.

కం. గరుడనిఁ దలఁపుము పగఱం
బొరి గొని కీర్తియును విజయముం గొను మనుడున్
హరి నుబ్బఁ జేసె ముని భూ
సుర పుణ్యాహములతోన సుదతుల సేసల్. 10

అర్థ : పుణ్య+అహములతోన్ + అ = శుభములను పొందుటకై కావించు పవిత్రములైన పూజాదికమైన వచనములతోనే; సేసల్ = పసుపు, కుంకుమ పూసిన బియ్యము; ఉబ్బన్ = చేసెన్ = ఉత్సాహ పఱచెను.

తా : "నీ వాహనమైన గరుడుని పిలిపింపుము. శత్రువులను నిర్మూలించి, కీర్తిని జయమును పొందుము" అని నారదుఁడు వచింపఁగా మునులయొక్క విప్రుల యొక్క పుణ్యాహవచనములతోనే ముత్తైదువుల ఆశీర్వాదములును, అక్షింతలును, శ్రీకృష్ణుని ఉప్పొంగునట్లు చేసినవి.

సీ. తలఁచె నాగాంతకు దానవాంతకుఁ డంత
నతఁడును దోఁచెఁ గెంపారు మేనుఁ
*గుంతంబు లన నొప్పు గోళ్లను భుజములు
రెండు రెండులు రెండు రెండ్లు మెఱయ
నన్ని వేదంబులు నాఱంగములతోడఁ
జదివి శ్రీవత్సాంక జలజనేత్ర
రుచి మీఱఁగా నూర్ధ్వరోముఁ డై సమధిక
కరశాఖుఁ డై కెంపు గలుగు పాణి

గీ. తలము లమరంగ గౌరు నిద్దపు టెలుంగు
దనర సింహసంహననుఁ డై తరణి కోటి
దీప్తి సుముఖుఁ డై యాజాను దీర్ఘ బాహుఁ
డై తరుణ సుకుమారుఁ డై హర్ష మెసఁగ. 11

అర్థ : నాగ+ అంతకున్ = పాములను అంత మొందించిన వానిని గరుడుని; కెంపు+ఆరు = ఎఱ్ఱని; కుంతంబులు = ఈఁటెలు (పదునైన మొనలు కలవి); శ్రీవత్స+అంక = ఱొమ్మున శ్రీవత్సము అనెడి నల్లని పుట్టుమచ్చ; జలజనేత్ర = కమలము వంటి కన్నుల యొక్క; రుచి = కాంతి; మీఱఁగాన్ = అతిశయింపఁగా; ఊర్ధ్వరోముఁడై = పైకి నిక్కిన వెండ్రుకలు కలవాఁడై; సమధిక కర శాఖుఁడై = బలమైన కొమ్మలవంటి భుజములు కలవాఁడై; పాణి తలములు = అఱచేతులు; గౌరు నిద్దము + ఎలుంగు = ఏనుఁగు యొక్క గంభీరమైన గీఁక (ధ్వని) వంటి కంఠస్వరము; సంహననుఁడై = శరీరము కలవాఁడై; ఆజాను దీర్ఘ బాహుఁడై = మోకాళ్ల వఱకును ఉన్న పొడవైన భుజములు కలవాఁడై; తరుణ = యౌవనము కల; సుకుమారుఁడై = సుందరరూపుఁడై.

తా : శ్రీ కృష్ణుఁడు గరుత్మంతుని తలఁచెను. వెంటనే ఎఱ్ఱని శరీరము, ఈఁటెలవంటి మొనదేఱిన గోళ్లను (ఎనిమిది), భుజములు (రెండు), ప్రకాశింపఁగా ఋగ్వేద యజుర్వేద సామవేద అధర్వణవేదములు, నిరుక్తము వ్యాకరణము శిక్ష ఛందస్సు, కల్పము, జ్యోతిషము అను వేదాంగములును, చదివిన వాఁడును, శ్రీవత్సమును కలిగి, కమలముల వంటి కన్నులు కల వాఁడైన విష్ణువుయొక్క కాంతిని మించిన వాఁడును,

* గుంతలంబులు

నిక్కిన వెంట్రుకలు, బలమైన కొమ్మలవంటి వెడల్పైన చేతులు ఎఱ్ఱనైన అఱచేతులు, ఏనుఁగు గీఁకవంటి కంఠస్వరము, సింహమువంటి జవము గల శరీరము, కోటి సూర్యుల తేజస్సుతో అందమైన మోమును, నిడుపైన భుజములును కలిగి, యౌవనవంతుడును సుందరాకారుడును అయిన గరుడుఁడు సంతసమును కూర్చుచు కన్పట్టెను.

విశే. గరుత్మంతుని మహాకారము వర్ణింపఁబడినది.

వ్యా. నిద్దము + ఎలుంగు > నిద్దంపుటెలుంగు. పుంప్వాదేశ టుగాగమము. సంధి, బాల - 32, 28

నానా : నాగము = పాము, కొండ, ఏనుఁగు, మబ్బు, సత్తు, పొన్న, ముస్తె మొ॥.

నానా : అంగము = దేశ నామము, అవయవము, శరీరము, వేదాంగము, అప్రధాన విషయము, అందము, విధము మొ॥.

వ. తదనంతరంబ. 12

తా : ఆ పిమ్మట

కం. భూతముల కాత్మ యాత్మకు
భూతంబులు దాన యగు విభుం డితఁ డనఁగా
నీతం డష్ట విభూతి
ఖ్యాతి వడసెఁ బ్రీతుఁ డగు ప్రజాపతి చేతన్. 13

ప్రతి : ఇతఁడు = శ్రీకృష్ణుఁడు; భూతములకున్ = పుడమి, నీరు, అగ్ని వాయువు, ఆకాశము అనువానికి సర్వప్రాణులకు (సమస్తమునకును); ఆత్మకున్ = అందున్న జీవునకును; ఆత్మ = పరబ్రహ్మము (పరమాత్మ); (కనుక) భూతంబులు; తాను + అ = తానే; అగు విభుండు = అయిన జగన్నాథుఁడు; అనఁగాన్ = అను (గౌరవమును); ప్రీతుఁడు+అగు = సంతోషించిన; ప్రజాపతి చేతన్ = బ్రహ్మవలన; అష్ట విభూతుల ఖ్యాతిన్ = అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, వశిత్వము ఈశిత్వము అను ఎనిమిది సిద్ధుల యొక్క కీర్తిని; పడసెన్ = పొందెను.

తా : సర్వము తానే అయిన శ్రీ కృష్ణుఁడు జగన్నాథుఁడు, ప్రజలను సృష్టించు కార్యమును చేపట్టి సంతసించిన బ్రహ్మవలన, ఈతఁడే అష్ట సిద్ధులు గల పరబ్రహ్మము అనెడి కీర్తిని పొందెను. (సృష్టికర్తయు సృష్టికి మూలమును అతఁడే అని గుర్తించెను).

గీ. సాధ్యులకు దేవతలకుఁ బ్రజాపతులకు
శాశ్వతుఁ డితఁడ యని దివ్య సంయ మీంద్ర
సూత మాగధ వంది సంస్తుతులు చెలఁగ
శ్రీవిభుం డా సుపర్ణునిఁ జేర వచ్చె. 14

తా : 'సాధ్యులు, దేవతలు, ప్రజాపతులు, మొదలగు వారి కంటెను, ఈ కృష్ణుఁడే నిత్యుడు' అని దేవతలు, మునీశ్వరులు, భట్రాజుల యొక్క వంశ వీర్యాదులను స్తుతించు స్తోత్రపాఠకుల యొక్క గొప్ప పొగడ్తలు మిక్కిలి అతిశయించు చుండఁగా, శ్రీకృష్ణుఁడు గరుడుని సమీపించెను.

విశే : సాధ్యులు పన్నిద్దఱు (12) ఇంద్రలోకవాసులు. ప్రజాపతులు (బ్రహ్మలు) ఇరువది యొక్కరు (21).

వ్యు. సుపర్ణుఁడు. చక్కని ఱెక్కలు కలవాఁడు, గరుత్మంతుఁడు.

కం. దేవుఁడు సాత్యకిఁ గనుఁగొని
నా వచ్చిన యంతదాఁక నగరమునకు నీ
కావలి సుమ్మని సుత బల
దేవ సహాయుఁ డయి వైన తేయుని నెక్కెన్. 15

తా : దేవుఁడైన శ్రీకృష్ణుఁడు, తమ్ముఁడైన సాత్యకిని చూచి, "నేను వచ్చునంత వఱకును, 'ద్వారకను రక్షించుచుండుము సుమా!" అని పలికి, ప్రద్యుమ్నుఁడు, బలరాముఁడు తన్ను కూడి రాఁగా గరుత్మంతుని అధిరోహించెను.

వ్యా. నా వచ్చిన యంతదాఁక. ప్రథమకు షష్ఠి ప్రౌఢ, కారక - 15, 16.

వ్యు. వైనతేయుఁడు. వినత యొక్క సుతుఁడు, గరుడుఁడు. ఇతని తండ్రి కశ్యపుఁడు.

కం. గెలువుము బాణుని వానికిఁ
గలవారిని. విజయలక్ష్మిఁ గయికొను టరుదే।
కలనఁ బదాఱు మొగంబుల
మలయుదు నీ వనుచుఁ జెలఁగె మాగధరవముల్. 16

తా : "నీవు బాణుని అతని బంధుమిత్రులను జయింపుము. విజయమను

సంపదను, నీవు పొందుట ఆశ్చర్యముకాదు. యుద్ధమందు పదునాఱు ముఖములతో, (సర్వతోముఖుఁడవై) ప్రవర్తింతువు" అను స్తోత్రపాఠకుల ధ్వనులు నిండెను.

పదునాఱు మొగంబులు అనుటచే యజ్ఞమూర్తి ప్రస్తావన. చూడు, ఋత్విజుఁడు, శ.ర. వీరందఱు యాగకర్తలు.

అలం. రూపకము, విజయలక్ష్మి.

వ్యా. మలయుదువు > మలయుదు. వకారలోపము. క్రియ, బాల - 24.

## - : గరుడని నెక్కి కృష్ణుండు బల భద్ర ప్రద్యుమ్నులతో దండయాత్ర వెడలుట : -

గీ. ఆకసంబున వేం చేయు హరికి సిద్ధ
సాధ్య చారణ గంధర్వ సంయమీంద్ర
వివిధ సంస్తుతుల్ చెవుల పండువులు చేసె
జయ జయారావముల తోడ సకలదిశల. 17

తా : గరుడ వాహనుఁడై, ఆకాశమందు, పయనించుచున్న (విష్ణువైన) శ్రీ కృష్ణునకు సిద్ధులు, సాధ్యులు చారణులు, గంధర్వులు మునివరులు, పెక్కు రీతులైన గొప్ప పొగడ్తలతోను, జయ జయ అనెడి ఆరావములతోను (ధ్వనులతోను) అన్ని దిక్కుల యందు చెవులకు ఇంపు కొల్పిరి (వీనులకు విందుగా గానము చేసిరి).

సిధ్య, సాధ్య, చారణ, గంధర్వులు ఆకాశగమనులు.

తోదకవృత్తములు.

జయ జయ మంగళ సంగత రూపా!
జయ జయ పావక సంభృత రూపా!
జయ జయ కల్పిత సాగర తాపా!
జయ జయ ఖండిత శంకర చాపా!

జయ జయ మస్తక శస్త కలాపా!
జయ జయ కౌస్తుభ చారు క లాపా!

జయ జయ కాళియ సారదురాపా!
జయ జయ కంస నృశంసహ కోపా!
జయ జయ ధౌత విశంకట పాపా
జయ జయ మోహ నిశామణి దీపా,
జయ జయ పాద లసత్సరి దాపా
జయ జయ విక్రమ శాసిత భూపా. 18

తా : జయ+జయ = జయ మగుఁగాక, జయింపుము. ఇట్లే ప్రతి పాదమునకు అన్వయము.

1. శుభములతో కూడిన రూపము కలవాఁడా. 2. పవిత్రము, గురువు (బరువైన, గొప్పదైన), అయిన రూపముకలవాఁడా! 3. కల్పింపఁబడిన సముద్రము యొక్క తాపము కలవాఁడా! (శ్రీరాముఁడు సముద్రమునకు వంతెన కట్టి లంకను ప్రవేశించెను.) 4. ఖండింపఁబడిన శివుని ధనుస్సు కలవాఁడా!( సీతకొఱకై శ్రీరాముడు శివధనుర్భంగము కావించెను.) 5. తలయందు పొగడఁదగిన నెమిలిపురి కలవాఁడా! (శ్రీకృష్ణుఁడు నెమిలి పింఛమును ధరించును) 6. కౌస్తుభము అనెడి అందమైన అలంకారమును ఱొమ్మున కలవాఁడా! 7. కాళియుఁడను సర్పరాజు బలమును అడఁచిన వాఁడా! 8. కంసుఁడను దుష్టుని చంపిన, కోపము కలవాఁడా! (కంస నామక నృశంసం, హన్తీతి కంస నృశంసహః). 9. కడుగఁబడిన విరివియైన (ఘోరమైన) పాపములు కలవాఁడా! (పాపులను తుడిచిపెట్టుటకై వారిని మట్టుపెట్టెను.) 10. అజ్ఞానము అనెడి చీఁకటికి రత్నమనెడి దీపమైన వాఁడా! (అజ్ఞానమును జనులలో తొలఁగించెను). 11. పాదములందు ప్రకాశించుచున్న ప్రవాహ రూపమైన నీటిని కలవాఁడా! (గంగానది విష్ణుపాదముల యందు జనించెను). 12. పరాక్రమముచే శాసింపఁబడిన పుడమి ఱేడులు కలవాఁడా! (పరశురాముఁడు దుష్టులగు రాజులను చంపెను).

తా : మంగళాకారా! పపవిత్రమూర్తీ! సముద్ర భయంకరా శివ ధనుర్భంజకా! మౌళ్యలంకృతపింఛా! కౌస్తుభ సుందరాభరణా! కాళియబలహరా! కంస సంహారక కోపా! ఘోరపాపనాశకా! మోహనివారకా! పాదోద్భవ గంగాపగా! విక్రమ శాసిత రాజా! శ్రీకృష్ణా జయింపుము. జయింపుము. (డా. జొన్నలగడ్డ)

అలం : రూపకము, మోహనిశా, మణి దీపా.

నానా : పావకుఁడు = అగ్ని, సూర్యుఁడు, మంచినడవడి కలవాఁడు.

నానా : కలాపము= నెమిలిపురి, అలంకారము, సమూహము, ఒడ్డాణము, బాణముల పొది, జ్ఞానము మొదలగునవి.

ఛం : తోదకము 'న, జ, జ, య' గణములు. 8వ, అక్షరముతో యతి మైత్రి. "సుముఖి" న, జ, జ లఘు గురువులు.

చం. జయ జయ శంఖ చక్ర ధర శార్ఙ్గ గదాధర శ్రీధరా ధరా!
జయ జయ భక్తి భావిత నిశాచర ఖేచర చిత్త గోచరా!
జయ జయ కిల్బి షాపనుద శాంత హృ దాస్పద చిత్త సమ్మదా!
జయ జయ భూత భావన ప్రజాకలి తావన లోక పావనా! 19

తా : జయమగుఁగాక, జయింపుము. శంఖమును చక్రమును, శార్ఙ్గమును (విల్లు) గదను (కౌమోదకి) శ్రీదేవిని, భూదేవిని ధరించినవాఁడా! భక్తితో కూడిన రాక్షసులయు, ఆకాశ గమనులయు (దేవతలు మొదలగువారి) మనస్సులందు ప్రత్యక్షమగువాఁడా! పాపములను పోగొట్టువాఁడా! శాంతము గలవారి హృదయమందు నెలవు కల్పించు కొని, వారి మనస్సులకు మోదము కల్పించు వాఁడా! సర్వ భూతములు (పృథివ్యాదులు) తానే అని తలంపఁబడువాడా! చూడు పద్యము - 13 భూతంబులు దాన) ప్రజలచే పొందఁబడిన రక్షణ కలవాఁడా (రక్షించువాఁడు). లోకములను పరిశుద్ధము చేయువాఁడా! (లోకుల దోషమును తొలఁగించి వారిని పవిత్రులను చేయును). శ్రీకృష్ణా! జయింపుము, జయింపుము.

మ. జయ నారాయణ పుండరీక నయనా శార్ఙ్గీ జగన్నాయకా!
జయ పీతాంబర భక్తవత్సల విరించ స్తోత్ర పాత్ర క్రియా!
జయ జంభారి విరోధి విక్రమ కథాశ్లాఘావిఘాత క్రమా!
జయ గోవింద ముకుంద మందరధరా శౌరీ మురారీ హరీ! 20

తా : జయమగుగాక. ఓ నారాయణా! తెల్ల దామరలవంటి కన్నులు కలవాఁడా! శార్ఙ్గమను ధనుస్సు కలవాఁడా! లోకములకు నాయకుఁడా! పచ్చ పట్టు వస్త్రమును కలవాఁడా! భక్తులయెడ దయ కలవాఁడా! బ్రహ్మ పొగడ్తలను పొందునట్టి పనులు చేయువాఁడా! ఇంద్రునికి పగవారైన రాక్షసుల పరాక్రమమునకు చెందిన కథలయొక్క

పొగడ్తలకు అడ్డుపడు విధము కలవాఁడా! (రాక్షసులయొక్క కీర్తిని తుడిచి పెట్టువాఁడా!) గోవింద! ముకుంద! మందరపర్వతమును ధరించిన వాడా! శూరునివంశపు వాఁడా! మురవిరోధి హరి! అనెడి పేర్లతో పిలువఁబడువాఁడా! జయింపుము.

వ్యు. 1. నారాయణుఁడు: నీటిని స్థానముగా కలవాడు,

2. హరి: జంభ + అరి .. జంభారి, జంభుఁడను రాక్షసునికి పగవాఁడు ఇంద్రుఁడు.

3. గోవిందుఁడు: గోవును, భూమిని స్వర్గమును వేదమును పొందెడివాఁడుహరి.

4. మందర ధరుఁడు ఆదికూర్మమై, మందర పర్వతమును నీటిలో మునుఁగ నీయక, తన వీపుపై ధరించినవాఁడు హరి.

5. హరి: భక్తుల యొక్క హృదయములను, హరించువాఁడు. జనుల తమస్సును చీఁకటిని హరించువాఁడు (సూర్యచంద్రులు నేత్రముల గుటచే చీఁకటిని తొలఁగించును). విష్ణువు.

వ. అని యివ్విధంబున దవ్వు దవ్వుల నివ్వటిల్లు దివ్యుల జయ
జయాశీర్వచనంబులు దుర్వార సమర గర్వంబు నిర్వహింపం జేయ
నజేయ విక్రమ ధురంధరుం డయిన విశ్వంభరుండు. 21

తా : అని ఈ విధముగా దూర దూరమున వినఁబడుచున్న దేవతల "జయ జయ' లతో కూడిన ఆశీర్వచనములు, అడ్డులేని, కయ్యమునకు గర్వమును పురికొల్పఁగా తన్ను జయించుటకు శక్యము కానట్టి పరాక్రమ భారమును వహించి విశ్వమును భరించు శ్రీకృష్ణుఁడు (మీఁది పద్యముతో).

కం. హరి తేజము హరి కాంతియు
హరి విభవము హరి భయంక రాకృతి హరి వే
గిరము హరి విక్రమంబును
హరి యను పేరిటికి లక్ష్మి నాపాదింపన్. 22

తా : సూర్యుని తేజస్సు, చంద్రుని కాంతి, ఇంద్రుని వైభవము (సంపద) యముని భయంకర రూపము, వాయు వేగము, సింహ విక్రమము, 'హరి' (సర్వమును హరించువాఁడు) అను నామమునకు శోభను (లక్ష్మిని) కలిగింపఁగా (మీఁది పద్యముతో).

నానా : హరి = (ఇతరార్థములు), అగ్ని, కోఁతి, గుఱ్ఱము, కిరణము, కోయిల, కప్ప, చిలుక, నెమిలి, పాము, శివుఁడు .

నానా : లక్ష్మి = విష్ణువు భార్య, సంపద, శోభ, కాంతి, సరస్వతి, పార్వతి, సాలెపురుగు, మారేడు, బుద్ధి, విషము మొ॥.

చం. గరుడని కాంతికిన్ హరి పొగడ్త యొనర్చు నిజప్రభా పరం
పర పరఁగించు రూపము గృపానిధి గైకొని యొప్పె నప్పు డో
నరవర చంద్ర నాఁటి జతనంబు మనంబున నాఁటి నేఁటికిన్
బొరిఁ బొరిఁ దృప్తి లేదు నను బోఁటిఁకి వేఱ తలంపు లేటికిన్. 23

అర్థ : పొరిన్ పొరిన్ = మాటి మాటికిని; నాఁటి = ఆనాఁటి; నాటి = నెలకొని;గట్టిపడి; వేఱు + అ = వేఱే.

తా : శ్రీ కృష్ణుఁడు గరుడుని శరీర కాంతిని నుతించెను. అప్పుడు దయానిధియైన, హరి, తన తేజః ప్రభలు శోభిల్లు, రుచిర సుందరరూపమును ధరించెను. ఓ జనమేజయా! ఆ నాఁటి ఆ రమ్య కృష్ణ దర్శనము (ఆ సమర ప్రయత్నము) నా మనస్సున నాటుకొని నేఁటికిని మాటి మాటికిని కన్పట్టుచున్నది. సంతృప్తి కలుగుట లేదు. నా వంటి వారికి ఇతరములగు ఆలోచనలు ఏల? ఆ దర్శనము నిత్యము నాకు గోచరమగు చున్నచో, మఱేమియును వలదు. అదియే బ్రహ్మానందము కదా!

వ. ఇట్లు దివ్యరూపధరుం డై. 24

తా : ఈ రీతిగా దివ్యమైన రూపమును పొంది (మీఁది పద్యముతో).

కం. విలు నమ్ము సంకుఁ జక్రముఁ
బలకయుఁ గౌక్షేయకంబుఁ బాశము గదయుం
గల యెనిమిది చేతుల దాఁ
పల వలపలఁ దాల్చె శౌరి బాణుని యనికై. 25

తా : బాణునితో (అని) యుద్ధము చేయుటకై హరి తన ఎనిమిది చేతులలో క్రింది విధముగా ఆయుధములను ధరించెను.

ఎడమ వైపు, విల్లు, శంఖము, పలక, పాశము. (4).

కుడివైపు, అమ్ము, చక్రము, కత్తి (కౌక్షేయకము) గద (4).

చతుర్థాశ్వాసము - 316 వ, పద్యమందు కుడిచేతిలో సుదర్శనచక్రము, ఎడమ చేతిలో 'జలజంబునొక పాణి జలజంబు నేదేవు సవ్య భుజంబుతో సరసమాడు' అని ఉన్నది. ఎడమ చేతిలో, జలజ మనఁగా శంఖమున్నది. మఱియు జలజమనఁగా నీటిలో పుట్టినవి పద్మములేదా పాశ మనెడి ఆయుధము.

కంచిలోఁగల అష్టభుజ పెరుమాళ్ ప్రాచీనాలయమందు, విష్ణువు యొక్క ఎడమ చేతులలో విల్లు, శంఖము, పలక, గద, కుడిచేతులలో అమ్ము, చక్రము, కత్తి, పద్మము ఉన్నవి. పాశము (ఆయుధము) కానరాదు, గద ఎడమ చేతిలో ఉన్నది. సోమన వర్ణనలో గద కుడిచేతిలో ఉన్నది.

చం. పడగలు వేయి చేసి బలభద్రునికిన్ హరి పాఁప లాగుతో
నొడలును వేయి రూపముల నొప్పఁగ నప్పుడు వైన తేయుపై
విడిసిన వేయిశృంగముల వెండినగంబును నంజనాద్రియుం
దడఁడబఁజేసి రిద్దఱు నుదంచిత భానుయుగంబు చాడ్పునన్. 26

ప్రతి : పడగలు = (పాముయొక్క) పడగలు; బలరామునకున్; వేయి (సంఖ్య); (ఆదిశేషుని అవతారమగుటచే) చేసి = ఉండుటచే (ఇది తృతీయా విభక్త్యర్థకము); హరి = శ్రీకృష్ణుఁడు; పాఁపలాగుతోన్ = ఆ వేయి పడగలు, టెక్కెముల విధమున నుండఁగా, వానిచే; ఒడలును, వేయి రూపములన్ + ఒప్పఁగన్ = శ్రీ కృష్ణుని యొక్క శరీరము వేయి రూపములతో చక్కగా కన్పట్టఁగా; అప్పుడు; వైనతేయుపై = గరుత్మంతునిపై; ఇద్దఱున్ = బలరామకృష్ణులు ఇర్వురును; విడిసినన్ = కూర్చుండఁగా; వేయి శృంగముల = వేయి శిఖరములు గల (కొనలు); వెండి నగంబునున్ = వెండి కొండను; అంజన+అద్రియున్ = కాటుక కొండను; ఉదంచిత = పై కెగయుచున్న; భాను యుగంబు చాడ్పునన్ = ఇద్దఱు సూర్యుల విధమున ; తడఁబడన్ + చేసిరి = తొట్రుపాటు కలుగునట్లు కన్పట్టిరి.

తా : బలరాముఁడు ఆదిశేషుని అవతారమగుటచే అతనికి వేయి పడగలున్నవి. అవి శ్రీకృష్ణునికి వేయి తెల్లని టెక్కెముల విధమున నుండెను. వాని ప్రభావమున శ్రీ కృష్ణుని శరీరము, వేయి రూపములతో చక్కగా కన్పట్టెను. ఇరువురును గరుత్మంతునిపై ఆసీనులైనప్పుడు, బలరాముఁడు తన పడగలచే వేయి కొనలు గల వెండి కొండవలెను, శ్రీ కృష్ణుఁడు, తన నల్లని వర్ణముచే తనపై ప్రసరించు తెల్లని టెక్కములు, నల్లఁదనమును

పొందుటచే, వేయి కొనలు గల కాటుక కొండవలెను, కన్పట్టిరి. మఱియును, ఇరువురును ఇద్దఱు సూర్యుల వలె చూపఱులకు భ్రాంతిని కల్గించిరి.

నానా : పడగ = (పాము) పడగ, టెక్కెము, చెవినగ.

వ్యా. పాము+లాగు. సూ. కొండొకచో సమాసంబులందు, నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు పఙ్ ప వర్ణంబులగు. సమాస, బాల - 19 'జత్తు' బిందు పూర్వకంబగు. తత్సమ, బాల - 19.

శా. ఉద్య ద్విక్రమ కేళికిం గలన నుద్యోగించువాఁ డైన యా
ప్రద్యుమ్నుండు సనత్కుమార తనుఁడై భాసిల్లె నమ్ముమ్వురన్
మాద్యల్లీల ధరించి దాఁటెను గరుత్మంతుండు విద్యాధరీ
పద్యా విద్యు దనర్గ ళానిల దురాప స్వర్గ మార్గంబునన్. 27

అర్థ : కలనన్ = యుద్ధమునందు; ఉద్యత్ + విక్రమ కేళికిన్ = ప్రయత్నముతో పరాక్రమమును చూపు క్రీడకు; ఉద్యోగించువాఁడైన = ఉత్సాహించు వాఁడైన; ఆ ప్రద్యుముండు, సనత్ కుమార తనుఁడై = ఎల్లప్పుడు కౌమారమున నుండు బ్రహ్మ మానస పుత్రుఁడగు సనత్ కుమారుని వంటి శోభతో కూడిన శరీరము కలవాఁడై; భాసిల్లెన్; మాద్యత్ + లీలన్ = సంతోష విలాసముతో (వృద్ధి పొందిన); విద్యాధరీ = విద్యాధరీ స్త్రీల యొక్క; పద్యా = మార్గమును; విద్యుత్ = మెఱపు తీఁగెలతో; అనర్గళ+అనిల = అడ్డులేని వాయువుతోను, దురాప = పొందుటకు శక్యము కానట్టి; దాఁటెను = దాఁటిపోయెను.

తా : యుద్ధ క్రీడయందు ఉత్సాహము చూపుటకు ప్రయత్నించు ప్రద్యుమ్నుఁడు నిత్యము కౌమారమున నుండు సనత్కుమారుని శరీరమును పోలిన శోభతో, ప్రకాశించెను. గరుత్మంతుఁడు, ముగ్వురిని అతిశయించిన సంతోషముతో వహించి విద్యాధరాంగనలు విహరించు, మెఱపు తీఁగలతోను, అతి తీవ్రముగా వీచు వాయువులతోను, సులభముగా చొచ్చుటకు వీలు కానట్టియు అయిన స్వర్గమార్గమును దాఁటి పోయెను.

ఛం. "ద్య" ప్రాసాక్షరము. గరుత్మంతుని యాన వేగ విజృంభణ ధ్వనికి పోషకముగ నున్నది.

వ్యు. ప్రద్యుమ్నుఁడు_ ఎక్కువ బలము కలవాఁడు, మన్మథుఁడు.

వ. ఇట్లు పన్నగారి నగారి నగరి పొరువు తెరువునం జను నప్పుడు చప్పుడుచే ఱెక్కల మొక్కలంబుచే రేకుల వీకులచే గగన గంగా భంగంబుల భంగంబులకు నెలవు లవు రవంబులు జవంబులకు లవంబులం దెలుప నవ్వినతా తనయుండు తనతమ్ముఁ డగుటం దెలుప నిలుప రాక పరా కయిన యనూరుండు రెండుకరంబుల నురంబు లా వునం బగ్గంబు లగ్గంబులు గాఁ గుదియింప నదియింపక వెరవున సరకుగొనక యణకలు వైచిన పచ్చ మావుల యొచ్చె మావల నీవలఁ గావలి నడుచు మారరుండుకఠోరవచనంబు లాడినఁ బింగళుఁ డంగలార్చిన దండుండు దండించినం జక్కం బడమిఁ దనయె డమిఁదానకడిమిఁ దడిమి నిజంబుగా రవి గారవించి గోచరు లగు ఖేచరుల నడి త్రోవం ద్రోవక నను వు చెల్లింప నిలింప దంపతుల నగవులు చలింప నప్పొలుఁగు ఱేని గఱుల నెఱులలోఁ జిక్కిన చుక్కలు లెక్కలు గడవం బొడవుననుండి పడి పొడ వడంగి వడివడి జడివడం గడివోయిన వీరుల నురలించు సురతరువుల శాఖల రేఖ లెఱుకలకుం గఱప నత్తెఱపి నప్పు డప్పతత్రిపతి పత్త్ర వైచిత్రి చూచి వెఱపున మైమఱపునఁబఱపనేరక యూరకయున్న యన్నభో గమనుల విమానంబులు చిందఱవందఱ లయి ఘంటలు వెంటలు గొన రాలియుఁ బడగ లెడగలుగఁ బడలు వడియునుం దల్పంబులు శిల్పంబులం బాసియుం దలుపులు వెలుపలం గెడసియుఁ జెంచుల యంచుల మించులు మంచుల లయ్యునుం జెదర మఱియుఁ గాకోదరవిదారి యాకసం బెల్లఁ బెల్లగిల దిశలు దుర్దశంబులుగ నిర్జరులు జర్జరులుగా మేఘంబులు మోఘంబులుగాఁ గిన్నరులు గన్నరులుగా భూతంబులు భీతంబులుగా రయంబు గండరువును జయంబు బండరువును నయి యరుగు నట్టియెడ రేవతీరమణుండు రుక్మిణీరమణునితో ని ట్లనియె. 28

ప్రతి : ఇట్లు; పన్నగ + అరి = పాములకు శత్రువు, గరుత్మంతుఁడు; నగ+అరి = కొండలకు పగవాఁడైన, ఇంద్రునియొక్క; నగరి = పట్టణమైన అమరావతి యొక్క; పొరువు తెరువునన్ = ప్రక్కనుండు త్రోవలో; చను+అప్పుడు = పోవు సమయమున; చప్పుడు చేన్ = ధ్వని చేతను; ఱెక్కల; మొక్కలంబుచేన్ = మోటు (అతిశయము) తనము చేతను; రేకుల వీకుల చేన్ = ఈకల వేగముచేతను; గగన గంగా భంగముల == ఆకాశ గంగానది అలల యొక్క; భంగంబులకున్ = చేడ్పాటులకు, నెలవులు + అగు = చోటైన, రవంబులు = శబ్దములు; జవంబుల లవంబులన్ = వీని వేగముల యొక్క కొలఁదులను (అల్ప పరిమాణములను); తెలుపన్; ఆ+వినతా తనయుండు = ఆ, వినత పుత్రుఁడైన గరుడుఁడు; తన తమ్ముఁడు+అగుటన్; తెలుపన్ = తెలుపుటకు, నిలుపన్ + రాక = (సూర్యుని తేరును) నిలుప లేని వాఁడై; పరాకు+అయిన = ఏమఱుపాటు చెందిన; అనూరుండు = వినత పెద్ద కొడుకు, గరుడుని అన్న, సూర్యుని రథసారథి; రెండు కరంబులన్ = రెండు చేతులతోను; ఉరంబు లావునన్ = ఱొమ్ము బలముతోను; పగ్గంబులు; అగ్గంబులు కాన్ = మిక్కుటముగా; కుదియింపన్ + కాన్ = బిగ పట్టఁగా; అది = అట్లు సారథి పగ్గములు లాగుట; ఇంపక = (గుఱ్ఱములు) ఇష్టపడక; ఆ + వెరవునన్ = (ఆ చర్యచే) ఆ ఉపాయమును; సరకు+కొనన్ = లక్ష్యము చేయక; అణకలు వైచిన = మెడ మీఁది కాఁడిని మెడ క్రిందికి తెచ్చుకొనఁగా; పచ్చమావుల = పచ్చని గుఱ్ఱముల యొక్క; (సూర్యుని గుఱ్ఱములు ఆకు పచ్చనివి కావుననే సూర్యునకు హరిదశ్వుఁడని పేరు); ఒచ్చెమున్ = కొఱఁతను గుఱించి (లోపమును); ఆవలన్ + ఈవలన్ = ఆ ప్రక్కను, ఈ ప్రక్కను (ఇరువైపులందు); కావలి నడచు; మాఠరుండు (ఆ పేరుగల రక్షకుఁడు); కఠోర వచనంబులు = కటువైన (కఠినమగు) మాటలు; ఆడినన్ = పలుకఁగా; పింగళుఁడు (రక్షకుఁడు); అంగలార్చినన్ = (మెడక్రిందికి కాడి వచ్చుటచే) భయపడి అఱవగా; దండుఁడు (రక్షకుఁడు); దండించినన్ = అదలించి శిక్షింపఁగా (కొట్టఁగా); చక్కన్ + పడమిన్ = (కాఁడి) సరియైన చోటికి, ఆ గుఱ్ఱముల యెడల మీఁదికి రాకపోవుటచే; తన ఎడమిన్ = తన అవకాశమందు (చోటున); తాను + అ = తానే (గరుడుఁడు); కడిమిన్ = ఎక్కువగా; పాఠాంతరము : తా = తాను (గరుడుఁడు); నడిమిన్ = నడుమనున్న చోటును; తడిమి = ఆలోచించి; (రవితేరు పోకకు, అంతరాయమును కలిగింపక); నిజంబుగాన్ = నిశ్చయముతో; రవిన్ = (తన విధిని నిర్వహించుచున్న) సూర్య నారాయణ మూర్తిని; గారవించి = పూజించి; గోచరులు + అగు = కన్నులకు కనఁబడునట్టి; చరులన్ = ఆకాశ గమనులను; నడిత్రోవన్; త్రోవన్ = (వారిని మార్గ్యాని) క్రిందఁ బడునట్లు చేయక; అనువు చెల్లింపన్ = ప్రీతిని చూపఁగా; నిలింప దంపతుల నగవులు చలింపన్ = (ఆకాశమందు జంటలు జంటలుగా పోవు) దేవలోకపు భార్యాభర్తల యొక్క నవ్వులు వికాసము నొందఁగా; ఆ పులుగు తేని= ఆ గరుడుని యొక్క; గఱుల నెఱులలోన్ = ఱెక్కల వెంద్రుకలలో; చిక్కిన; చుక్కలు =

నక్షత్రములు; లెక్కలన్, కడవన్ = లెక్కించుటకు వీలుకానివి కాఁగా; (చాల ఎక్కువైనవి); పొడవున నుండి పడి = ఎత్తున నుండి క్రిందపడి; పొడవు+అడంగి = రూపుతొలఁగి; వడివడిన్ = మిక్కిలి వేగముతో; జడివడన్ = జడత్వమును పొందునట్లు తెలివిని పోగొట్టుకొనునట్లు; కడిపోయిన = గట్టితనము, బిగువు, పోయిన; పీరులను; ఉరలించు = జార్చు (క్రిందికి నెట్టు); సుర తరువుల శాఖల రేఖలు = కల్ప వృక్షముల కొమ్మల చిక్కని వరుసలు; ఎఱకులకున్ +కఱపన్ = ఱెక్కల యొక్క శక్తిని సూచింపఁగా; ఆ పతత్రిపతి = ఆ పక్షిరాజు యొక్క; పత్ర వైచిత్రి = ఱెక్కల వింతను; చూచి; వెఱపునన్ =భయముచే; మై మఱపునన్ = ఒడలు తెలియక పోవుటచే, పఱప నేరక = నడపఁజాలక ఊరకయున్న; ఆ నభస్+గమనుల = ఆ ఆకాశమందు సంచరించు వారియొక్క; విమానములు; చిందఱ వందఱలు+అయి; ఘంటలు; వెంటలు కొనన్ = పెనఁగొనుచుటచే; రాలియున్ = రాలుచుండఁగా; పడగలు = పతాకములు; ఎడ కలుగన్ = దూరమగు చుండఁగా; పడలు పడియును = రాసులుగా పడుచుండఁగా; తల్పంబులు = పాన్పులు; శిల్పంబులన్ = అమర్చిన అందమైన చిత్తరువులను, మణులను,; పాసియున్ = విడివడఁజేయఁగా; తలుపులు; వెలుపలన్; కెడసియున్ = విఱిగి పడుచుండఁగా; చెంచుల = (కొండలలో జీవించువారు) శబరుల యొక్క; అంచుల = దగ్గఱనున్న; మించులు = మించుఁబోడులు, చెంచెతలు; మంచులు+అయ్యున్ = మేలైన వారు (దిట్టమైన వారయ్యును); చెదరన్ = చెల్లా చెదరఁగా; మఱియును; కాకోదర విదారి = పాములను చంపువాఁడు, గరుడుఁడు; ఆకసంబు+ ఎల్లన్; పెల్లగిలన్ = పగులఁగా; దిశలు; దుర్దశంబులు గన్ = దీన స్థితిని పొందఁగా; నిర్జరులు = ముసలితనము లేనివారు, దేవతలు; జర్జరులు +కాన్ = కదలిపోయి, వికల మగుచుండఁగా; మేఘంబులు = మబ్బులు; మోఘంబులు+కాన్ = చెదరి చెడుచుండఁగా; కిన్నరులు = (అశ్వముఖము నరశరీరము కలవారు) ఆకాశగమనులు; కన్నరులు+కాన్ = శోకించుచుండఁగా (కన్నీటి దుఃఖము శ.ర); భూతంబులు = ప్రాణులు; భీతంబులు +కాన్ = భయము చెందఁగా; రయంబు + గండరువును = వేగము నిలుకడగా పోతపోసినట్లు కన్పట్టఁగా; జయంబు బండరువునున్ = గెలుపు కూటమి (రాశి); అయి; అరుగునట్టి + ఎడన్ = పోవు సమయమున; రేవతీ రమణుండు = రేవతి పతి బలరాముఁడు; రుక్మిణీ రమణునితో = రుక్మిణి పతి, శ్రీకృష్ణునితో; ఇట్లు + అనియెన్.

తా : గరుత్మంతుఁడు అమరావతి సమీప మార్గమందు పోవుచుండఁగా కలిగిన శబ్దము చేతను, ఱెక్కల ఆధిక్యము చేతను; ఈకల వేగముచేతను, గంగా జలంబులందు అలలు చెదరినవి. అవి చేద్పాటు చెందిన చోట్లు గరుడుని ధ్వనుల అతిశయమును, కొలఁదిగ తెలియఁ జేసినవి. ఆ సమయమందు సూర్యుని రథమును అనూరుఁడు గరుడుని అన్న, సారథిగా, నడపుచుండెను. అతఁడు, గరుడుఁడు, తన తమ్ముఁడని

తెలుపుటకై సూర్యుని తేరును నిలుపఁదలఁచెను. కాని నిలుపఁజాలక, ఏమఱుపాటు చెంది (అనూరుఁడు) తటాలున రెండు చేతులతో తన ఱొమ్ము యొక్క బలముచే గుఱ్ఱములకు కట్టిన కళ్లెములుగల తాళ్లను (పగ్గములను) బాగుగా బిగించునట్లు పట్టెను. ఆ విధముగా లాగుటను సమ్మతింపని (వేగమును తటాలున తగ్గించుటకు), పచ్చని గుఱ్ఱములు ఆ చర్యకు వశముకానివై, లక్ష్యము చేయక పోవుటచే వాని మెడ క్రిందికి కాఁడి దిగఁబడినది. ఆ లోపమును గుఱించి, గుఱ్ఱములకు ప్రక్కన నుండు మాఠరుఁడు వానిని కటువుగా తిట్టెను. పింగళుఁడు భయపడి కేకలు వేసెను. దండుఁడు, గుఱ్ఱములను కొట్టెను. అయినను, కాఁడిని మెడమీఁదికి గుఱ్ఱములు తెచ్చుకొనపోవుటచే తన ఉనికిని గుఱించి గరుడుఁడు తానే ఆలోచించి సూర్యుని రథ మార్గమునకు అడ్డు తగులక, నిశ్చయముతో, సూర్యదేవుని విధి నిర్వహణను గుర్తించి అతనిని ఆదరణతో పూజించెను. మఱియును కనఁబడుచున్న ఆకాశగమనులకు అడ్డుపోక దారినడుమ వారిని క్రిందఁ బడనీయక, వారి యెడ ప్రీతిని ప్రదర్శించెను. అట్లు జాగరూకతతో వేగ మధికమైనను ఎట్టి కష్టములను కలుగఁ జేయక గరుడుడు పయనించుటచే, సురదంపతుల నవ్వులు వికసించినవి.

అప్పుడు గరుడుని ఱెక్కల ఈఁకలలో లెక్కించుటకు వీలుకాని నక్షత్రములు చిక్కుకొని, ఎత్తున నుండి క్రింద పడినవి. కొందఱు వీరులు (ఆకాశగమనులు) ఎత్తున నుండి పడుటచే రూపు చెడి (తెలివిని కోల్పోయి) వడివడిగా జడిగా పడుచు బిగువు లేని వారైరి. అట్టి వారిని దేవతల చెట్ల యొక్క కొమ్మలు దట్టములైనను వారినిక్రిందికి విడిచినవి. అట్లు చేసి, అవి గరుడుని ఱెక్కల గమన వేగమును సూచించినవి. ఆ సమయమందు, గరుడుని ఱెక్కల వింత శక్తిని చూచి భయపడి మైమఱచి, నడపలేక ఊరక యుండగా ఆకాశ సంచారుల విమానములు చెదరినవి. వానికి అమర్చిన గంటలు పెనఁ గొనుచు, రాలినవి. టెక్కెములు దూర దూరముగా, రాసులుగా పడినవి. పాన్పులకు అమర్చిన కళాఖండములు విడివడినవి. తలుపులు విఱిగి వెలుపల పడినవి. కొండలపై జీవించు శబరుల సమీపమందే మెలఁగు, వారి కాంతలు (చెంచెతలు), దిట్టతనము కలవారైనను కలఁతను పొందిరి. ఆ గరుడుఁడు ఆకాశమంతయు పగులునట్లు దిక్కులన్నియు సడలిపోవునట్లు, దేవతలు, దిగులు చెందునట్లు, మబ్బులన్నియు విడిపోవునట్లు, కిన్నరులు చింతను చెందునట్లు, ప్రాణులు భయపడునట్లు, మఱియు తన వేగాతిశయము నిలుకడగా పోతపోసినట్లు, పయనించుచు, తమకు కలుగఁబోవు విజయము రాశియైనట్లు గోచరింపఁజేసెను. అప్పుడు బలరాముఁడు శ్రీకృష్ణునితో ఈ క్రింది విధముగా పల్కెను.

వ్యు. పతత్త్రి-ఱెక్కలు కలది, పక్షి.

నానా : భంగము = అల, అవమానము, చెఱుపు, ఓటమి మొ॥

నానా : చుక్క = నక్షత్రము, శుక్రుఁడు, బొట్టు మొ॥

పత్త్రము = ఆకు, బాణము, ఱెక్క, ఉత్తరము, చురకత్తి మొ॥

నభము = ఆకాశము, మబ్బు, వర్షాకాలము, శ్రావణమాసము మొ॥

మించు = అతిక్రమించు, మెఱపు, ప్రకాశము, అతిశయించు మొ.

సోమన మించు శబ్దమును మించుఁబోఁడి అను అర్థమున ప్రయోగించి నట్లున్నది.

సీ. 'బాలార్కబింబంబు పరఁగించి రేయెండ
మనమీఁదఁ జల్లిన మాయ లేదు
కొంతంబు మెఱుఁగులు గుప్పించి మెఱుఁగులు
మనమీఁదఁ *జిలికిన మహిమ లేదు
హర జటామండలం బడరించి క్రొమ్మించు
మనమీఁదఁ జిమ్మిన మమత లేదు
కమల భవాండంబు గదలించి సలిలంబు
మనమీఁదఁ ముంచిన మలపు లేదు

ఆ.వె. పసుపు నిగ్గు వోలెఁ బ్రద్యుమ్ననకు నాకు
నీకుఁ జాయ మేన నివ్వటిల్లెఁ
గనక భూధరంబుఁ గదిసిన వారమో
కాక వేఱె తెలుఁగొ కమలనాభ.' 29

ప్రతి : కమల నాభ = పద్మము నాభియందు కలవాఁడా! శ్రీకృష్ణా! బాల+అర్క = లేఁత సూర్యుని యొక్క; బింబము = మండలము; లేఁతఎండ; పరఁగించి = ప్రసరింపఁజేసి; మనమీఁదన్; చల్లిన, మాయ = ఇంద్ర జాల విద్య; లేదు; కొంతంబు మెఱుఁగులు = ఈఁటెల కాంతులు; కుప్పించి = వర్షించి; మన మీఁదన్ చిలికిన = చిందిన; మహిమ = గొప్పతనము, లేదు; హర జటా మండలంబు = శివుని జడల ముడిని; అడరించి = వ్యాపింపఁచేసి; క్రొత్త + మించులు = క్రొత్త ప్రకాశమును; మనమీఁదన్, చిమ్మిన = ప్రసరింపఁ జేసిన; మమత =

* బొలసిన

(ఆదరము) అభిమానము; లేదు; కమలభవ+అండంబున్ = బ్రహ్మాండము, (గ్రుడ్డు ఆకారములో నుండు) చాల పెద్దదైన భూమండలమును; కదలించి; సలిలంబున్ = (చుట్టును ఉన్న) నీటిని మన మీఁదన్ ముంచిన = మన మీఁద చల్లిన; మహిమ = గొప్ప శక్తియు; లేదు; ప్రద్యుమ్నునకున్, నాకున్, నీకున్; పసుపు నిగ్గు+పోలెన్ = పసుపు వర్ణముగల జిగి వలె; చాయ = మైపూత; మేనన్; నివ్వటిల్లెన్ = అలము కొన్నది; కనక భూ ధరంబున్ = బంగారు కొండను (మేరువును); కదిసిన వారమో = సమీపించితిమా ఏమి? కాక = అట్లు కానిచో; వేఱు+అ, తెఱఁగో = మఱొక రీతియా ఏమి?

తా : కమలనాభా! లేఁత సూర్యబింబము, మనపై లేఁత ఎండను ప్రసరింపఁ జేయలేదు. ఈఁటెల కాంతులు తళతళలను మనమీఁద చల్లఁలేదు. శివునిజడల మొత్తము ప్రకాశమును మనమీఁద చిందలేదు. బ్రహ్మాండము తన చుట్టు నున్న నీటిని కదలించి మనలను మునుగఁ జేయలేదు. మన ముగ్వురి శరీరముల మీఁద పసుపు జిగి ప్రసరించినది. బంగారు కొండను సమీపించితిమా ఏమి? లేదా ఇట్లు మనపై వన్నె ఏర్పడుటకు వేఱు కారణమున్నదా?

అలం. వృత్త్యనుప్రాసము. సందేహము

చం. అనుడుఁ బ్రలంబ వైరికి మురాంతకుఁ డిట్లను 'నిగ్గిరివ్రజం
బను నగరంబు గాచికొని యాహవనీయము మండుచుండు న
య్యనలము చాయఁ జూవె మన మందఱము న్వరవర్ణినీ ఘన
స్తన వరవర్ణినీ ద్యుతికిఁ దావలన మైతిమి ప్రీతి మీఱఁగన్.' 30

అర్థ : ప్రలంబవైరికిన్ = ప్రలంబుఁడను రాక్షసునకు శత్రువైన బలరామునకు; ఆహవనీయము = త్రేతాగ్నులలో ఆహవనీయము ఒకటి, తక్కినవి, దక్షిణాగ్ని, గార్హపత్యము; వేదికి, పూర్వ దక్షిణ పశ్చిమ దిక్కుల యందుండునవి; ఆ + అనలము = ఆ అగ్ని; చాయన్ + చూవె = కాంతిచే సుమా; వరవర్ణినీ = శ్రేష్ఠమైన కాంతి కల కాంత యొక్క; వరవర్ణినీ = బంగారు వన్నెకల పసిమికి; తావలము+ఐతిమి = నెలవయితిమి.

తా : బలరాముఁడు అట్లు పలుకఁగా శ్రీ కృష్ణుఁడు అతనితో 'ఈ గిరివ్రజము అనెడి నగరమును, ఆహవనీయము అనెడి అగ్ని కాచుకొని మండుచుండును. దాని కాంతిచే సుమా, మనము, అందఱము ఆ పురస్త్రీయొక్క గొప్ప కుచముల బంగారు (పసుపు వన్నెకు) వన్నెకు నెలవయితిమి.

అలం : పరికరాంకురము. వరవర్ణిని అను విశేష్యము సాభిప్రాయముగా ప్రయుక్తమైనది.

వ్యు. వరవర్ణిని-శ్రేష్ఠమైన రూప సంపద కలది, ఉత్తమ వనిత.

నానా : వరవర్ణిని = ఉత్తమ స్త్రీ, పసుపు, గోరోజనము, లక్క మొ॥

గిరివ్రజము : బాణుని నగరము, దీనికి శోణిత పురమనియు పేరు.

ప్రలంబుఁడు : ఒక రాక్షసుఁడు గోప వేషమును ధరించి శ్రీకృష్ణ బలరాములను చంపఁదలచి బలరామునిచే హతుఁడయ్యెను.

మురుఁడు : ఒక రాక్షసుఁడు. బ్రహ్మచే తాను అంటిన వారు, భస్మమగునట్లు వరమును పొందెను. యమునిపై తన వరమును ప్రయోగించుటకు ప్రయత్నించెను. అపుడు, యముఁడు విష్ణువును ఆశ్రయించెను. మురుఁడు తనకడకు రాఁగా విష్ణువు అతనితో, 'నీ గుండె ఏల కొట్టుచున్నది?'అని ప్రశ్నింపఁగా తన అఱచేతిని తన ఎదపైన పెట్టుకొని బూడిద అయ్యెను.

కం. నావుడు నీలాంబరుఁ డ
ద్దేవునితో 'దీని కెయ్యది యుపాయంబో
నీ వెఱుఁగు దేని వేగమ
కావింపుము ప్రతివిధానకరణం' బనినన్. 31

తా : అన్నంతనే, బలరాముఁడు శ్రీకృష్ణునితో "ఈ అగ్నినుండి రక్షించు కొనుటకు, ఏది ఉపాయమో దానిని నీవు ఎఱిఁగినచో వెంటనే, త్వరలో, ఆ నిప్పును ఆర్పుటకు, ప్రతి క్రియను చేయుము" అనఁగా (మీఁది పద్యముతో).

మ. వినతా నందనుఁ బ్రీతిఁ జూచి పలికె న్విశ్వంభరుం 'డిప్పు డీ
యనలం బార్పు మనంతర క్రియ నిరాయాసంబునం జేఁత నా
పని' యన్నన్ గరుడండు రెండెఱకలన్ భాగీరథీవారిఁ గై
కొని యయ్యాహవనీయ మాఱ గురిసెం గోలాహ లోత్పాదియై. 32

అర్థ: విశ్వంభరుఁడు = విశ్వమును (సమస్తమును) మోయువాఁడు, హరి; అనంతరక్రియన్ = తరువాతి పనిని; నిరాయాసంబునన్ = శ్రమలేక; ఎఱకలన్ = ఱెక్కలతో; వారిన్ = నీటిని; కోలాహల + ఉత్పాదియై = కోలాహలమును (సందడిని) పుట్టించువాఁడై; ఆఱన్ + కురిసెన్ = (అగ్ని) ఆఱి పోవునట్లు వర్షించెను.

తా : హరి, గరుడుని ప్రీతితో చూచి "నీవు ఇప్పుడు ఈ నిప్పును ఆ
తరువాత శ్రమ లేకుండ నా పని చేయుదును'' అనెను. అతఁడు తన రెండు
గంగా జలమును సమృద్ధిగా గ్రహించి, సందడితో ఆ నిప్పు ఆఱునట్లు వర్షిం

వ్యు. భాగీరథి- భగీరథునిచే భూమికి తేఁబడినది, గంగ,

గాథ : సగరపుత్రులు యజ్ఞాశ్వమును అన్వేషించుచు, పాతాళమునకు పో
సమాధియందున్న కపిల మహర్షిని నిందించి అతనిచే హతులైరి. వార
లోకమును చేరుటకై వారి అస్థులమీఁద. భగీరథుఁడు తన తపశ్శక్తిచే
ప్రవహింపఁజేసెను. కనుక, గంగకు, భాగీరథి అని పేరు కలిగినది.

కం. నరనాథ! యపుడు నీలాం
బరుండునుఁ బీతాంబరుండుఁ బ్రద్యుమ్నుఁడు ము
వ్వురు మూఁడుజగంబులుఁ జా
లరె సాధింప నని నాతలంపునఁ దోఁచెన్.

తా : ఓ జనమేజయ రాజా! ఆ సమయమందు, ముువ్వురు, స్వర్గము,
పాతాళము అనెడి మూడు లోకములను జయింపఁగల సమర్థులు అని నా
తోఁచినది

వ్యు. నీలాంబరుఁడు- నల్లని వస్త్రము కలవాఁడు, బలరాముఁడు.

వ్యు. పీతాంబరుఁడు- పచ్చని వస్త్రము కలవాఁడు, విష్ణువు.

వ. తదనంతరంబ.

తా : ఆ తర్వాత.

మ. దహనం బాఱుడుఁ బక్షినాథుఁడు మహోత్సాహోత్థ రంహస్
రుహుఁ డై పోఁగిన నా గిరివ్రజములో రుద్రాజ్ఞఁ ద ద్రాజధా
ని హితాపాదకు లైన యయ్యనుచరాగ్ని శ్రేష్ఠులొండొండ ద
స్పృహ రో షావృత చిత్తులై దశదిశాజాజ్వల్యమా నాంగులై.

ప్రతి : దహనంబు + ఆఱుడున్ = మండుచున్న నిప్పు, చల్లారఁగా; పక్షి
పక్షులకు ప్రభువు, గరుడుఁడు; మహా + ఉత్సాహ + ఉత్థ = అధికమైన ప్రయత్

ఎగసిన; రంహస్ = వేగముకల; తనూ రుహుఁడై = ఱెక్కలు కలవాఁడై; సాగినన్ = ముందునకు పోవుచుండగా; ఆ గిరివ్రజములో; రుద్ర + ఆజ్ఞన్ = శివుని పంపున; తద్ + రాజధాని = ఆ ప్రధాన నగరము యొక్క; హిత+ఆపాదకులైన = శ్రేయస్సును కోరు సంరక్షకులైన; ఆ + అనుచర + అగ్ని శ్రేష్ఠులు = ఆ గొప్పవారైన శివ భటులగు అగ్ని రూపులు; ఒండొండ = క్రమక్రమముగా; దుస్సహరోష+ఆవృతచిత్తులై =తాళలేని కోపముతో; దశ దిశా జాజ్వల్య మానాంగులై = పది దిక్కులందును, జ్వలించు చున్న శరీరములు కలవారై.

తా : గరుడుఁడు ఆహవనీయమును చల్లార్చి, వడిగల ఱెక్కలతో ముందునకు పోవు చుండగా, శివుని ఆనతి చొప్పున గిరి వ్రజ పురములో రాజధానిని కాచుకొని యుండి సంరక్షించు గొప్పవారగు శివుని భటులైన అగ్ని దేవతలు, సహింపరాని కోపముతో అన్ని దిక్కులందును మండుచున్న శరీరము కలవారై (మీఁది పద్యముతో).

(వ్యు) తనూ రుహము_ తనువున (శరీరమున) మొలిచినది, ఱెక్క, రోమము.

వ. తమ లోన. 36

తా : తమలో తాము.

ఉ. ఎక్కడి వారొకో గరుడుఁ డెక్కుడుగాఁ గలవారు వీర పో
యెక్కుడు వారు లోకుల కనేక విభాకర భీక రాకృతుల్
ముక్కుట మూవు రిక్కడకు మొక్కలు లై యరుదెంచి రంచుఁ బే
రుక్కున యాదవ త్రయ రణో ద్భటులై చటులైక విక్రముల్. 37

అర్థ : ఎక్కుడుగాన్ = వాహనముగా; వీరు+అ, పో = నిశ్చయముగా వీరే; ఎక్కుడువారు = అధికులు; అనేక విభాకర భీకర + ఆకృతుల్ = పెక్కంద్రు సూర్యుల వలె భయంకరములైన రూపములు కలవారు; ముక్కుట మూవురు = కిరీటములతో, ముప్వురు,ముకుటము, రూపాం. ముకుటము. అర్థాంతరము, ముక్కుటన్ = సరిగా; మొక్కలులై = శూరులై; పేరు + ఉక్కున = ఎక్కువ నిలుకడతో; యాదవత్రయ రణ + ఉద్భటులై = ముప్వురు గొల్లవారితో కయ్యము చేయుటకు ఉత్సహించిన వారై; చటుల+ఏక + విక్రముల్ = ప్రకట మగుచున్న ప్రశస్తమైన పరాక్రమము, కలవారై.

తా : "ఏ ఊరి వారో వీరు! గరుడుని వాహనముగా వచ్చినారు. లోకులు అందఱికంటె వీరే అధికులు. అనేక సూర్యుల వలె భయంకరమైన రూపములతో కిరీటములు ధరించి (సరిగా) ముప్వురు ఇచ్చటికి శూరులై వచ్చిరి" అనుచు, ఎక్కువ నిలుకడతో (స్థిరత్వముతో)

ప్రకాశించు అధికమైన పరాక్రమము కలిగిన వారైన ముప్పురు, గొల్లవారితో కయ్యము చేయగలవారై. (మీఁది వచనముతో).

అలం : వృత్త్యనుప్రాసము. ద్విరుక్త కకారము ఆవృత్తమైనది.

ఛం. అదియే ప్రాసాక్షరము.

వ. పురారి యనుచరాగ్నులు పరాక్రమించు సమయంబున. 38

తా : త్రిపురములకు విరోధి అయిన శివుని యొక్క సేవకులగు అగ్ని రూపుకలవారు, పరాక్రమమును చూపుటకు వచ్చుచుండఁగా (మీఁది పద్యముతో).

త్రిపురాసురులు : విద్యున్మాలి. తారకాక్షుఁడు, కమలాక్షుఁడు. వీరు తారకాసురుని సుతులు. కామ గమనముల కల పురములు మూడింటిని కలిగి త్రిలోకములను పీడించుచుండిరి. వారి పురములు, ఒకదానితో నొకటి కలియనంత కాలము వారికి మరణముండదని బ్రహ్మ వరమిచ్చెను. శివుఁడు వారిని ఒక చోట కలియఁజేసి సంహరించెను. ఆ ప్రయత్నములో రథము (భూమి), అశ్వములు (వేదములు), చక్రములు (సూర్యచంద్రులు), సారథి (బ్రహ్మ), బాణము (విష్ణువు), విల్లు (మేరువు), ప్రత్యేకముగా శక్తిమంతమైనవి సమకూరెను. రథికుడైన ముక్కంటి, వారిని ఒక్కచోట కలిపి అంత మొందించెను.

కం. దానవుఁ డొకఁడు మనోజవుఁ
డా నెఱి విని బాణుచేత నారణము తెఱం
గేను విన వలతుఁ గనుఁగొను
మా నా కెఱిఁగిం తనుడు సమాలోకించెన్. 39

ప్రతి: ఆ నెఱి విని = ఆ ముప్పుర పరాక్రమమును గుఱించి వినుటచే; బాణుచేతన్ = బాణాసురునిచే; ఆ రణము తెఱంగు = ఆ యుద్ధ క్రమమును; ఏను = నేను; వినవలతు = వినవలెనని ఉన్నాను; కనుఁగొనుమా = తెలిసికొనుమా! నాకు + ఎఱిఁగింతు = నాకు తెలియఁజేయుదువు గాక!; అనుడు = ఆనతిని పొంది; దానవుఁడు + ఒకఁడు = ఒక రాక్షసుఁడు; మనస్+జవుఁడు = మనస్సువలె వేగముకలవాఁడు, సూక్ష్మగ్రాహి; సమాలోకించెన్ = ఆ రణ సరణిని చూడసాగెను.

తా : ఆ యాదవత్రయము యొక్క పరాక్రమ కృత్యమును విని, వారి యుద్ధక్రమమును

తెల్పుటకు ఒక సూక్ష్మగ్రాహియైన దానవునికి ఆనతియ్యగా అతఁడు ఆ రణ క్రమమును చక్కగా పరిశీలించెను.

వ్యా : విని = వినుటచే, సూ. ఒక్కొక్కచో, భూతార్థక అసమాపక క్రియ హేత్వర్థకంబునగు. క్రియ, ప్రౌఢ - 15.

2. ఎఱిఁగింతువు > ఎఱిఁగింతు. వకారలోపము. క్రియ, బాల - 24.

గీ. మంట జోదులు కలనఁ గల్మాష కుసుమ
దహన తృషిత మహాబల తపను లనఁగ
నుద్భటులు స్వధా కారాశ్రయులు మురారి
తోడఁ దలపడి యేగురుఁ దొలఁగి చనిరి. 40

అర్థ : మంట జోదులు = మంటల రూపమున నున్న యోధులు; కలనన్ = రణమునందు; తపనులు = తపింపఁజేయువారు; ఉద్భటులు = శూరులు (తేజస్వంతులు); స్వధాకార + ఆశ్రయులు = "స్వధా స్వధా" అనెడి ధ్వనిని ఆశ్రయించినవారు; తొలఁగి చనిరి = వెడలిపోయిరి.

తా : అగ్ని రూపులైన శూరులు కల్మాషుఁడు, కుసుముఁడు, దహనుఁడు, తృషితుఁడు, మహాబలుఁడు అను పేర్లు గల సూర్యునివలె తపింపఁ జేయువారు 'స్వధా' అనెడి ధ్వనిని ఆశ్రయించువారు, ఐదుగురు, యుద్ధమందు, శ్రీకృష్ణుని మార్కొని, అతనితో యుద్ధము చేయుటకు శక్తి లేక వెనుదిరిగిపోయిరి.

వ్యు. తపనుఁడు - తపింపఁజేయువాఁడు, సూర్యుఁడు.

వ. మఱియును. 41

తా : సులభము

## - : కృష్ణుఁడు గిరివ్రజ పుర రక్షకులగు నగ్నుల గెలుచుట : -

కం. పోరిరి మురారితో రణ
పారంగతు లయి పతంగ పటహ స్వర్ణాం
గార భ్రాములు స్వాహా
కారాశ్రయు లేవు రనల కాయు లజేయుల్. 42

అర్థ : రణ పారంగతులు = యుద్ధ విద్య నెఱిఁగినవారు; స్వాహాకార + ఆశ్రయులు = స్వాహా అనెడి ధ్వనిని ఆశ్రయించిన వారు; అనల కాయులు = అగ్ని దేహులు.

తా : యుద్ధ విద్యావిశారదులు, స్వాహా ధ్వనిని ఆశ్రయించిన వారు, అగ్ని శరీరులు, జయింప శక్యము కాని శూరులు, పతంగుఁడు, పటహుఁడు, స్వర్ణుఁడు, అంగారుఁడు, భ్రాముఁడు, అను అయిదుగురు, శ్రీకృష్ణునితో పోరాడిరి.

కం. అహతము లయి జ్యోతిష్టో
మ హవిర్భాగములు రెండు *మంటలు వపుష
న్మహిమ మయి నడువ నడుమను
సహాయుఁ డయి యంగిరుఁ డను సంయమి నడచెన్. 43

అర్థ : అహతములు+అయి = నశింపనివై క్రొత్తవైన; జ్యోతిష్టోమ = ఈ పేరుగల యాగమువున అర్పింపఁబడిన; హవిస్ + భాగములు = హోమద్రవ్యములు; వపుషత్ + మహిమములై = శరీరము కలిగి గొప్ప రూపుతో; సంయమి = ముని.

తా : జ్యోతిష్టోమము అనెడి యాగమునందు వ్రేల్చఁబడుటకు అర్పింపఁబడిన రెండు హోమద్రవ్యములు నూతనమైన తేజస్సుతో (నశింపక) మంటల శరీరముతో నడచుచుండఁగా, వాని నడుమ, వారికి తోడుగా (రక్షగా) అంగిరుఁడు అను ముని రణమునకు వచ్చెను.

వ్యా. హవిస్+భాగము, రేఫాగమసంధి.
వపుషత్ + మహిమము, అనునాసికసంధి.

చం. అరదముపై నుదగ్రుఁ డగు నంగిరసుం గని నెమ్మొగంబునన్
దర హసితంబు చె న్నెసఁగ దానవ సూదనుఁ డల్ల నిట్లనున్
మరలు మునీంద్ర నీకు వసమా యస మాయుధ కేళి గేలికిం
దరమె మదీయ సాయక వితానము; మానము గోలు పుచ్చదే. 44

అర్థ : ఉదగ్రుఁడు = రౌద్రుఁడు, భయంకరుఁడు, గర్వితుఁడు; నెఱి+మొగంబునన్ = తన నిండైన ముఖమునందు; దరహసితంబు = చిఱునవ్వు; చెన్ను+ ఎసఁగన్ = అందము ఒప్పఁగా;

* మంటల పురుషుల్

అల్లన్ = మెల్లఁగా (మర్యాదతో); అసమ= సమముకాని; ఆయుధకేళి = యుద్ధమను ఆట; వసమా = సాధ్యమా! మదీయ సాయక వితానము = నా యొక్క అమ్ముల మొత్తమును గేలికిన్ + తరమె = పరిహసించుటకు శక్యమగునా? మానము+కోలు పుచ్చదె? = నీ గర్వమును, నశింపఁ జేయదా?

తా : రాక్షసాంతకుఁడగు శ్రీకృష్ణుఁడు తేరిపై భయంకరుఁడుగా నున్న అంగిరసుని, చూచి తన ముఖమునందు చిఱు నవ్వు ఒప్పఁగా గౌరవ భావముతో (మృదు వచనములతో) "ఓ మునివరా! మరలిపొమ్ము, సాటికాని యుద్ధ మను ఆట నీకు సాధ్యమా? నీకు నా బాణముల మొత్తమును పరిహసించుటకు శక్యమగునా?

(నా బాణములు నీ గర్వమును నశింపఁజేయుఁ ననుట).

వ్యా :నెఱ+మనము > నెమ్మనము. ప్రాతాది సమాస సంధి. సంధి, బాల - 39.

2. మరలుము + మునీంద్ర > మరలు మునీంద్ర. మధ్యమ పురుష ముపర్ణలోపము. సంధి, బాల - 47.

3. అంగిరస్. ఇది సకారాంత హలంత శబ్దము. తత్సమ, బాల - 70, 71. అంతిమ మకారములోపించి, 'అంగిరుఁడు' అగును. లోపమురానిచో, తత్సమ, బాల 80, 81, 'అంగిరసుఁడు' అగును.

మ. అనుడుం గోపము రూపముం బడసి నట్లమ్మౌని శూలంబు చే
కొని నారాయణు ప్రాణముల్ రణములోఁ గోడాడఁ జూడన్ జనా
ర్దనుఁ డాశూలము నర్ధచంద్ర విశిఖ వ్రాతాహతిం ద్రుంచి య
మ్మౌని వక్షంబు ముహుర్ముహుఃక్షర దసృ జ్ముద్రాతి రౌద్రం బుగాన్. 45

45. ప్రతి : అనుడున్ = ఆ మాటలు పలుకఁగనే; కోపము రూపమున్; పడసినట్లు = పొందిన విధమున; ఆ + మౌని = ఆ అంగిరుఁడు అను ముని; శూలంబు = శూలమును; చేకొని; నారాయణు ప్రాణముల్; రణములోన్; కోడాడన్ = బాధించుటకు; చూడన్ = ప్రయత్నింపగా; జనార్దనుఁడు = హరి; ఆ శూలమున్; అర్ధ చంద్ర విశిఖ వ్రాత + ఆహతిన్ = క్షురప్రము అనెడి (అర్ధ చంద్రాకారముగల) బాణముల మొత్తము యొక్క వ్రేటులచే; త్రుంచి = తెగగొట్టి; ఆ + ముని వక్షంబు = ఆ మునియొక్క ఱొమ్మును; ముహుస్ + ముహుస్ = మాటి మాటికి, (ధారగా); క్షరత్ + అసృక్ + ముద్ర + అతి రౌద్రంబుగాన్ = వెలువడుచున్న నెత్తుటి స్థితిచే మిక్కిలి భయము కొల్పునట్లుగా.

తా : కృష్ణుఁడు అట్లు పలుకఁగనే అంగిరుఁడు కోపము రూపు తాల్చెనో అనువిధమున శూలమును చేతధరించి రణములో అతని ప్రాణములను కొనఁదలచెను. అపుడు హరి, అతని శూలమును, పెక్కు అర్ధ చంద్రాకారముగల అమ్ములను ప్రయోగించి ఖండించి, ఆ ముని రొమ్మునుండి రక్తము భయంకరమై ధారగా స్రవించునట్లు (మీఁది పద్యముతో).

వ్యు. జనార్దనుఁడు : దుష్టజనులను శిక్షించువాఁడు, విష్ణువు.

వ్యా. ముహుస్ + ముహుస్ > ముహుర్ముహుః, రేఫాగమ సంధి.

అసృక్ + ముద్ర > అసృఙ్ముద్ర అనునాసిక సంధి.

శా. స్థూణాకల్ప నిశాత బాణ నిహతిం దూలించి సోలించినం
బ్రాణ త్రాణ పరాయణుల్ హుతవహుల్ బ్రహ్మాత్మజుల్ నల్వుర
బ్బాణుం డున్నెడకుం గళేబరముఁ జూపం దెచ్చి రాలోడిత
క్షోణీ భాగ పరాగ ధూసర పరిక్షుణాంగ శృంగారమున్. 46

ప్రతి : స్థూణా, కల్ప నిశాత బాణ నిహతిన్ = కొంచెము తక్కువగా, ఇనుప కంబములతో సాటియగు, వాఁడియైన బాణముల దెబ్బలచే; తూలించి సోలించినన్ = చలింపఁ జేసి మూర్ఛను పొందింపఁగా; ప్రాణ త్రాణ పరాయణుల్ = (అతని) ప్రాణమును కాపాడుట యందు ఆసక్తి కల వారగు; హుత వహుల్ = అగ్నులు; బ్రహ్మ+ఆత్మజుల్ = బ్రహ్మకుమారులు; నల్వురు; ఆ బాణుండు +ఉన్న+ ఎడకున్; ఆలోడిత = బాగుగా నిండిన (కూడిన); క్షోణీ భాగ పరాగ ధూసర పరిక్షుణ్ణ+అంగ శృంగారమున్ = నేలపైఁ గల దుమ్ముచే; బూడిద వన్నె కలిగి, బాగుగా నలఁగియున్న అవయవముల యొక్క అందముతో నున్న; కళేబరమున్ = (అంగిరుని) శవమును; చూపన్ + తెచ్చిరి.

తా : కించి దూనముగా ఇనుప కంబములతో సమానమై వాఁడియైన బాణముల దెబ్బలచే అంగిరుని చలింపఁ జేసి మూర్ఛను కలిగింపఁగా, అతని ప్రాణ రక్షణమునందు ఆసక్తులగు బ్రహ్మకుమారులు నల్వురు అగ్నులు, నేలపైఁగల దుమ్ముతో నిండిన అవయవములు అందము చిందఁగా ఆ అంగిరోముని శవమును, బాణుడు ఉన్న చోటికి, అతనికి చూపుటకై తెచ్చిరి.

వ్యా. ఉన్న+ఎడకున్ > ఉన్నెడకున్, సూ. అత్తునకు సంధి. బహుళంబుగా నగు : సంధి, బాల -4.

సంధి లేనిచో, ఉన్న+ఎడకు > ఉన్న యెడకు అగును. (యడాగమము).

అలం : స్వభావోక్తి. అంగిరుని శరీరము, రక్తము ధారగా స్రవించుటచే ఎఱ్ఱఁదనము వహించెను. అట్టి అతని శరీరమంతటిని నేలపైఁ గల దుమ్ము (బూడిదవలె) వింత వన్నెతో కప్పుటచే అది అందముతో ఒప్పెను, "క్షోణీ పరాగ ధూసరము" అనుటచే అంగిరుఁడు యతి రూపముననే మరణించెనని చిత్రోక్తి.

కం. అంగిరసుడు పెల్లగిలిన
సంగరజయ మమరఁ బాంచజన్యముఁ బూరిం
చెం గంసవైరి ముందఱ
మ్రింగిన శశి నుమియు నీల మేఘము పోలెన్. 47

తా : అంగిరుఁడు మరణింపఁగా, విజయానందముతో హరి, పాంచజన్యము అనెడి శంఖమును తాను ముందు మ్రింగిన చంద్రుని ఉమ్మివేయు మేఘమువలె, పూరించెను.

అలం : ఉపమ :

ఉపమేయములు: కృష్ణుఁడు (నీలవర్ణుఁడు) 2. శంఖము (తెలుపు)

ఉపమానములు : 1. మేఘము, 2. శశి (చంద్రుడు).

మేఘము చంద్రుని కప్పివేయుట, మ్రింగినట్లు ఊహింపఁబడినది. చంద్రునిపైనున్న మేఘము తొలఁగుట మేఘము చంద్రుని నోటినుండి ఉమ్మి వేసినట్లు ఊహింపఁబడినది.

వ్యు. పాంచజన్యము : పంచజనుఁడు అనెడి రక్కసుని శరీరమునుండి పొందఁబడినది శంఖము.

చం. భయ రస మగ్నులం బ్రథన భగ్నుల దుర్భర దైన్య భుగ్నులన్
నయన విలగ్నుల న్నివసనాయిత నిర్వృత నగ్నులన్ బరా
జయ పరివిగ్నులం బ్రణతి సాఁర వలగ్నుల నగ్నులం బిలే
శయ శయనుండు చూచి నడ సాగె గిరివ్రజ రాజధానికిన్. 48

ప్రతి : బిలేశయ శయనుండు= సర్పమును పాన్పుగా కలవాఁడు, శ్రీ కృష్ణుఁడు (హరి); భయ రసమగ్నులన్ = భయము అనెడి జలములో మునిఁగిన వారును; ప్రధన భగ్నులన్ = యుద్ధమందు అవమానపడిన వారును; దుర్భర దైన్య భుగ్నులన్ = భరించుటకు శక్యముకాని, జాలి గొలుపు ఉనికిచే క్రుంగినవారును, (విచారముచే విఱిఁగిన వారును); నయన విలగ్నులన్

= కన్నులయొక్క నిలుకడలేని వారును (బెదరుచున్న వారనుట); వివస నాయిత = వస్త్ర హీనులవలె ప్రవర్తించుచున్న; నిర్వృత నగ్నులన్ = మేనిపై కప్పులేక పోవుటచే దిగంబరులైన వారును; పతాజయ పరి విలగ్నులన్ = ఓటమిచే ఆవేదన చెందిన వారును; ప్రణతి సార విలగ్నులన్ = నమస్కరించుటకు తగినట్టి (బలమైన) నడుములు కలవారును; (అయిన) అగ్నులన్ = అగ్ని రూపుకలవారిని; చూచి; గిరివ్రజ రాజధానికిన్; నడసాగెన్ = పోవుటకు సిద్ధపడెను. వివిసనాయితాః = వివసవత్ అచరితాః.

నివస నాయితాః, నివసనులవలె ఆచరించువారు (ప్రవర్తించువారు).

తా : భయపడిన వారును, యుద్ధమందు భంగపాటు చెందినవారును, దుస్సహమైన దైన్యముచే క్రుంగిన వారును, తీవ్రమైన చలించు చూపులు కలవారును, బట్టలను ధరింపక ఇహలోక బంధములను వదలుటచే, దిగంబరులైన వారును, ఓటమిచే మిక్కిలి కలఁతను పొందినవారును, నమస్కరించుటకు యోగ్యమైన బలమైన నడుములు కలవారును, అయిన అగ్నిరూపులైన వారిని శేషశయనుఁడు, హరి, కని గిరి వ్రజమనెడి రాజధానికి వెడలెను.

అలం :అంత్యప్రాసము, గకారనకార సంయుక్తాక్షరము.

వ్యు. బిలేశయము- బిలమందు నిద్రించునది పాము.

నానా :రసము =జలము, (శృంగారాది) రసము, పాదరసము, పసరు, ద్రవము, వీర్యము, విషము మొ॥

ఛం. 'న' కును, 'నాయిత' లో 'నా' కును యతి మైత్రి.

మ. బలి విధ్వంసనుఁడుం బ్రలంబరిపుఁడుం బ్రద్యుమ్నుఁడున్ శంఖముల్,
పెలుచం బట్టిరి పన్నగాంతక గరు త్పేటీస్ఫుటారావముం,
గలసెం దచ్చతురర్ణవీ రవ సపక్షధ్వాన మప్పేటి లో
పలఁ గోలాహల దోహలం బయి గతప్రాణుండు బాణుం డనన్.49

ప్రతి : బలివిధ్వంసనుడున్ = బలి చక్రవర్తిని అణఁచిన వాడును; (శ్రీకృష్ణుఁడు) ప్రలంబరిపుఁడున్ = ప్రలంబ వైరియు, (బలరాముఁడును); ప్రద్యుమ్నుఁడున్ = కృష్ణుని తనయుఁడు, ప్రద్యుమ్నుఁడును; శంఖముల్ = తమ శంఖములను; పెలుచన్ + పట్టిరి = ఆగ్రహముతో పట్టుకొనిరి (పూరించిరి); పన్నగ+అంతక = పాములను అంతము చేయు గరుడుని; గరుత్ పేటీ = పెట్టెలవంటి ఱెక్కల (దృఢమైన); స్ఫుట+ఆరావమున్ = స్పష్టమైన

మ్రోఁతయును; తద్+ చతుస్ +అర్ణవీ రన సపక్షధ్వానము = ఆ నాలుగు సముద్రముల యొక్క అలలతో సమానమైన ధ్వనులు కలవై; ఆ +వీటి లోపలన్ = ఆ నగర మందు; కోలాహల దోహలంబు + అయి = కలకలమును అతిశయముగా కల్గించునవై; బాణుండు = బాణాసురుఁడు; గత ప్రాణుండు = గతించిన (పోయిన) ప్రాణములు కలవాఁడు; అనన్ = అనునట్లు; కలసెన్ = మిళితములైనవి.

తా : శ్రీ కృష్ణ, బలరామ ప్రద్యుమ్నుల యొక్క శంఖనాదములు గరుడుని ఱెక్కల చప్పుడుతో కలిసి నాలుగు సముద్రముల అలల ఘోషలవలె, బాణుని నగరమందు, కలకలమును కల్గించునవై, బాణుఁడు, ప్రాణములను వదలెనేమో అనునట్లు భీతిని పుట్టించెను.

ఆ ధ్వనుల మొత్తము బాణుని హృదయ స్పందనమును నిరోధింపఁదగియుండెనని భావము.

వ. అట్టి యెడ మిట్టిపడి గిరివ్రజంబు గజిబిజించిన చందంబున, గిరివ్రజంబు గజిబిజి భజించెఁ, దదనంతరంబ దైతేయ పతి పదాతి వ్రాతం బన్యోన్య సైన్య సన్నాహంబులు దేహంబుల యుల్లాసంబులు రోసంబుల మోసంబుల నోసరింప, నిలింపారి పారిషద పరంపరా పరస్పర శంఖనాదంబుల మోదంబులు నలుమడింపఁ, జలము డింపక యంపకట్టలు తిట్టలు గొనం బేర్చియు నార్చియు, నట్లు పలుగోట్లం గూర్చియు నేర్చియుఁ, దరవరుల వెరవరుల కిచ్చియు మెచ్చియుఁ, గొంతంబును పంతంబులతోఁ బట్టియుఁ దట్టియు, నత్తళంబులు కత్తళంబుల వారిచేఁ పోరించియు సారించియుఁ, బరశువులు పరశూరుల కొసంగియు నెసంగియు, జక్రంబులు వక్రంబులు వలుకక సవరించియు వివరించియు, బల్లెమ్ములు బెల్లెమ్ముల విఱువ నమర్చియుఁ జెమర్చియు, సెలకట్టియలు నెల కట్టియల నిలిపియుఁ దెలిపియు, నడిదంబులు బెడిదంబులుగఁ గదలించియు ముదలించియు, శూలంబుల మేలంబులఁ జూపియు మోపియు, గదలు జోదులు మెచ్చం బాటించియుఁ దాటించియు, పరియలు పరియలు

గొనవైచియుఁ ద్రోచియు, ముప్పిళ్ళు నప్పిళ్ళు వదలకయుఁ గదలకయుఁ, గతారువులు వతారుల కొప్పించియుఁ దప్పించియుఁ, బిడియమ్ముల గడియమ్ములం బన్నియు నెన్నియుఁ, భేరీభాంకారంబుల దూరంబుల వారించియు వేరించియుఁ, జిందంబు లందంబులుగా నెరయించియు నొరయించియు, గజంబులకు ధ్వజంబు లెత్తించియుఁ జొత్తెంచియు, హయంబులకు జయంబు లాశీర్వదించియు మదించియు స్యందనంబులకు వందనంబులు జేసియు డాసియుఁ, గాలు బలంబులకు మేలుబలంబు లెక్కించియు నిక్కించియు, సవరణల సవరణ లక్షణంబు లక్షణంబునం బొడమం గడమ వడని కింక రానీకంబునుం గింకర లోకంబును యక్ష రాక్షస దానవ గణంబులు గణంబు లై యొయిది కదిసి నడువ నారాయణుం దాఁకె నయ్యవసరంబున. 50

50. ప్రతి : అట్టి+ఎడన్ = ఆ సమయమునందు; గిరి వ్రజంబు = కొండల సమూహము; మిట్టిపడి = ఎగసిపడి; గజిబిజించిన చందంబునన్ = కలవరపడిన విధమున; గిరివ్రజంబు = గిరివ్రజ పత్తనము; గజిబిజిన్ + భజించెన్ = కలవరము నొందెను; తద్ + అనంతరంబు + అ = ఆ పిమ్మటనే; దైతేయ పతి = రాక్షస రాజయిన బాణుని యొక్క; పదాతి వ్రాతంబు = కాల్బంటుల సమూహము; అన్యోన్య సైన్య సన్నాహంబులు = పరస్పర సైన్యముల ప్రయత్నములు; దేహంబుల +ఉల్లాసంబులు = మేనుల ప్రకాశములు; రోసంబులన్ + మోసంబులన్ = రోషముల వంచనలను (ఏమఱుపాటులను); ఓసరింపన్ = తొలఁగింపఁగా, నిలింప+అరి = దేవతల శత్రువైన బాణుని యొక్క; పారిషద పరంపరా పరస్పర శంఖనాదంబులన్ = అనుచరుల వరుసయొక్క అన్యోన్య శంఖ ధ్వనులచేత, మోదంబులు = సంతోషములు; నలుమడింపన్ = నాలుగు రెట్లధికము కాఁగా; చలము డింపక = పట్టుదల వదలక అమ్ము + కట్టలు = బాణముల కట్టలు; తిట్టలు + కొనన్ = ప్రోవు పడఁగా; పేర్చియున్ = చెలరేఁగియు, ఆర్చియున్ = బొబ్బరించియు; అట్లు = ఆరీతిగా; పలు + కోట్లన్ = పెక్కు కోటులను; కూర్చియున్; ఏర్చియున్ = సంధించియు; తరవరులన్ = పట్టాకత్తులను; వెరవరులకున్ = నేర్పరులకు; ఇచ్చియున్; మెచ్చియున్; కొంతంబును = కుంతము (ల)ను ఈఁటెలను; పంతంబులతోన్ = పట్టుదలలతో ప్రతిజ్ఞలతో; పట్టియున్; తట్టియున్ = తాడించియును; అత్తళంబులన్ = బల్లెములతో; కత్తళంబులవారిచే = కవచధారులచే;

పోరించియున్ = యుద్ధము చేయించియు; సారించియున్ = ప్రయోగింపఁ జేసియు; పరశువులు = గండ్రగొడ్డళ్లను; పరశూరులకున్ = శ్రేష్ఠులైన వీరులకు; ఒసంగియున్ = ఇచ్చియు; ఎసంగియున్ = అతిశయించియు; చక్రంబులు = చక్రాయుధములు; వక్రంబులు +పలుకక = వంకరమాటలు పలుకక; సవరించియున్ = చక్కఁబుచ్చియు, వివరించియున్ = విచారణ చేసియును; బల్లెమ్ములు = బల్లెములు ఈఁటెలు; పెల్లు + ఎమ్ములన్ = పెక్కు ఎముకలను; విఱువన్ = విఱుచుటకు; అమర్చియున్ = సమకూర్చియును; చెమర్చియున్ = చెమరించియును; సెలకట్టియలు = బాణములు; నెలకట్టియలన్ = అర్ధ చంద్రాకారబాణములతో; నిలిపియున్ = నిలువరించియును; తెలిపియున్ = తెలియఁజేసియు; అడిదంబులు = కత్తులు; బెడిదంబులుగన్ = భయంకరములుగా; కదలించియున్ = కదలునట్లు చేసియు; ముదలించియున్ = ప్రయోగించియు; శూలంబులన్; మేలు+అంబులన్ = మేలైన బాణములను; అర్థాంతరము : మేలంబులన్ = పరిహాస వచనములతో; చూపియున్; మోపియున్ = మోయించియును గదలు; జోదులు = యోధులు; మెచ్చనన్ = మెచ్చునట్లు; పాటించియున్ = ధరించియును; తాటించియున్ = ఒకదానితో నొకటి తాఁకించియును; పరి(ఱి)యలు పరి(అ)యలు కొనన్ = కేడెములు ఖండ ఖండము లగునట్లు; వైచియున్ = కొట్టియును; త్రోచియున్ = పడవేసియును; ముప్పిళ్లన్ = బాఁకులును; ఆ+పిళ్లన్ = ఆ పిడులను = వాని పిడులను, వదలకయును; కదలకయును; కఠారువులు = కత్తులు; వఠారులకున్ = సమర్థులకు; ఒప్పించియున్ = అప్పగించియును; తప్పించియున్ = మీఱునట్లు చేసియును; పిడి యమ్ములన్ = పిడిగల చిన్న బాణములను; గడియమ్ములన్ = గట్టి బాణములను; పన్నియున్ = సిద్ధపఱచియు; ఎన్నియున్ = పరిశీలించియు; భేరీ భాంకారంబులన్ = దుందుభి ధ్వనులను; దూరంబుననే; పారి(ఱి)ంచియున్ = వర్తింపఁ జేసియును పాఠాం. వారించియున్ = అడ్డగించియు; వేరి(ఱి)ంచియున్ = (ఆ ధ్వనులను) వేఱుపడఁజేసియును; చిందంబులు = శంఖములు; అందంబులుగాన్, నెర(అ)యించియున్ = ధ్వనింపఁజేసియును (ఊఁదియును); ఒరయించియున్ = విచారించియును; గజంబులకున్ = ఏనుఁగులకు; ధ్వజంబులు = టెక్కెములో ఎత్తించియున్ = కట్టించియును; చొత్తెంచియున్ = ప్రవేశించియును; హయంబులకున్ = గుఱ్ఱములకు; జయంబులు = గెలుపులు; ఆశీర్వదించియున్ = దీవించియును; మదించియున్ = గర్వించియును; స్యందనంబులకున్ = రథములకు, వందనంబులు చేసియున్ = నమస్కరించియు; డాసియున్ = సమీపించియు; కాలు బలంబులకున్ = కాల్బంటులకు; మేలు బలంబులు = విశేషమైన శక్తి (ఉత్సాహమును, ఉద్రేకమును); ఎక్కించియున్ = కలిగించియు; నిక్కించియున్ = గర్వింపఁ జేసియును; సవరణల = యుద్ధ పరికరములయొక్క; సవరణ = సన్నాహము యొక్క; లక్షణంబులు = తీరులు, అక్షణంబునన్ = తెలుపి లేకుండఁగా; పొడమన్ = కలుగఁగా; కడమ+పడని =

కొఱవడని, కింకర + అనీకంబునున్ = భటుల (సైన్యమును); కింకరలోకంబును = సేవకుల సమూహమును; యక్ష రాక్షస గణంబులున్ = యక్షులయు; రక్షకులయు దానవులయు ప్రమథులయు గణంబులు +ఐ = గుంపులయి; ఎయిది = చేరి; కదిసి = కూడి; నడవన్ = నడవఁగా; నారాయణున్ = శ్రీకృష్ణుని; తాఁకెన్=మార్కొనెను; ఆ +అవసరంబునన్ = ఆ సమయమున.

తా : ఆ సమయమందు కొండల సమూహము ఎగసినట్లు గిరివ్రజ పురజనులు తడఁబడిరి. తర్వాత రాక్షసరాజగు బాణుని కాల్బంటులు తమ తమ సమర యత్నములు, తమ శరీరములందు విలాసములు వెదఁ జల్లు చుండఁగా రోషముల వలన కలుగు ఏమఱుపాటులు తొలఁగఁగా, అనుచరుల మొత్తము కలిగించు శంఖ ధ్వనులచేత సంతోషము నాలుగు రెట్లు ఎక్కువ కాఁగా, పట్టుదల, వీడక, అమ్ముల కట్టలు రాసులుగా అమర్చియు, ఉప్పొంగియు, బొబ్బరించియు (కేకలు వేసియు) అట్లే, పెక్కింటిని ఒక చోట సమకూర్చుకొనియు, నిలువఁజేసియు, పట్టాకత్తులను నేర్పరులకు ఇచ్చియు, వారిని మెచ్చియు, ఈఁటెలను పంతములతో, పట్టుకొనియు, తాడించియు, బల్లెములను కవచధారులచే ప్రయోగింపఁ జేసియు, గండ్రగొడ్డళ్లను, శ్రేష్ఠులైన వీరులకు ఇచ్చియు, అతిశయించియు, చక్రాయుధములను వంకర మాటలను చెప్పక ధరించియు, (సరిదిద్దియు) పరిశీలించియు, బల్లెములను పెద్ద ఎముకలను విఱుఁగ గొట్టుటకు సిద్ధము చేసియు, చెమట బిందువులతో చెమ్మగిల్లియు, బాణములను, అర్ధచంద్రాకార బాణములతో నిలిపియు, వానిని గుఱించి వివరించియు, కత్తులను భయము కొల్పునట్లు కదలించియు, వానిని ప్రయోగించియు శూలములను మేలైన అమ్ములను, చూపియు, మోయించియు, గదలు యోధులు మెచ్చునట్లు ధరించియు, ఒక దానితో మఱియొక దానిని తాఁకించియు, పేముతో అల్లిన కేడెములు (బద్దపరియలు) ముక్కలు ముక్కలగునట్లు కొట్టియు, వానిని పడవేసియు, మూడు పిళ్లుగల బాకులను, వాని పిడులను వదలకయు, చలింపకయు. పెద్ద కత్తులను సమర్థులకు (బలిష్ఠులకు) అప్పగించియు, మీఱునట్లు చేసియు (అతిశయించునట్లు), పిడి ఉన్న బాణములను గట్టి బాణములను, ఏర్పఱచియు, వానిని (శక్తిని) పరిగణించియు (పరిశీలించియు), దుందుభి మ్రోఁతలను దూరముగా, ప్రవర్తింపఁ జేసియు ధ్వనుల వ్యత్యాసమును గుర్తింపఁ జేసియు; (వేర్వేఱు యుద్ధ వాద్య ధ్వనులను ప్రకటముగా మ్రోగించియు), శంఖములను ముచ్చటగా ఊఁదించియు (మనస్సులను హరించునట్లు), విచారణ చేసియు, ఏనుఁగులకు పతాకములను కట్టించియు వానిని ప్రవేశపెట్టియు, గుఱ్ఱములకు

"జయ జయ" అనెడి శుభాకాంక్షలు అర్పించియు, సంతసించియు, తేరులకు వందనములు చేసియు, దగ్గఱకు చేరియు, కాల్బలంబులకు, విశేషమైన ఉత్సాహము ఉద్రేకము కలిగించియు, గర్వింపఁ జేసియు యుద్ధ పరికరముల యొక్క సన్నాహముల తీరులు తెలుపి లేక, కన్పట్టు చుండఁగా, భటుల సైన్యము, సేవకుల సమూహము, యక్షులు రక్షకులు రక్కసులు ప్రమథగణములు గుంపులై చేరి నడచు చుండఁగా, శ్రీకృష్ణుని మార్మ్రోగెను. ఆ సమయమందు.

నానా : పరియ- రూపాం. పఱియ = ముక్క, (బద్దపరి(కేడెము).

నానా : మేలు = శ్రేష్ఠము, శుభము, ఉపకారము, అధికము, ఉపరి (పైన).

నానా : అనీకము = యుద్ధము, సేన.

కం. ద్విరదంబులు నరదంబులు
హరులు నరులు నిక్కు నుక్కు నలవు న్నెలవుం
బురుడున గరుడున కలుకలు
బెరయ నెరయ శౌరి సీరిఁ బిలుచున్ బెలుచన్. 51

ప్రతి : ద్విరదంబులున్ = ఏనుఁగులును; అరదంబులున్ = తేరులును; హరులున్ = గుఱ్ఱములును; నరులున్ = కాల్బంటులును; (క్రమముగా) నిక్కున్ = మదమును; ఉక్కున్ = దృఢత్వమును (గట్టి తనమును); అలవున్ = శ్రమమును; నెలవున్ = నిలుకడయును; పురుడునన్ = సాటి అగుటచే (సమానముగా); గరుడునకున్; అలుకలు = కోపములు; బెరయన్ నెరయన్ = అధికముగా కల్గింపఁగా; (అట్లు వర్తించు చుండఁగా); శౌరి = కృష్ణుఁడు, సీరిన్ = బలరాముని; పెలుచన్ = పెద్ద గొంతుతో (బిగ్గఱగా); పిలుచున్.

తా : చతురంగ బలములు క్రమముగా పొగరు, గట్టి తనము, అలసట, నిలుకడ, సమానముగా గరుడునకు మిక్కిలి కినుకను కల్గించినవి. అప్పుడు, కృష్ణుఁడు బలరాముని గొంతెత్తి పిలిచెను.

అలం : వృత్త్యనుప్రాసము. పదునొకండు జంటలున్నవి.

వ్యా. పిలుచున్ = పిలిచెను. భూతార్థమునకు "లాట్టు" (తద్ధర్మార్థకము).

సూ. వచ్యర్థంబులకు ఒకానొకచో భూతంబున లాట్టు కానం బడియెడు. క్రియ, బాల - 22.

వ్యు. ద్విరదము - రెండు దంతములు కలది, ఏనుఁగు

నానా : పురుడు = సమానము, స్పర్ధ, శిశువు పుట్టినపుడు కలుగు అశుచి.

శా. ధారాస్ఫార కృపాణ బాణపటలీ ధారా హతిం దచ్చతు
*ర్ధారీ శోణిత ఫాణిత ద్రవ నిపీత ప్రీతు లై తన్నుఁ జె
న్నారం బన్నగ యక్ష రాక్షసు లమర్త్య వ్రాత చేత స్స్ఫురత్
స్ఫార స్ఫోర విహార ఘోర నటనా ఝాట స్ఫు టాటోపు లై. 52

ప్రతి : పన్నగ = సర్పములు; యక్ష = జక్కులు; రాక్షసులు; (తమ) ధారా = వాదరల యొక్క; స్ఫార = ఆధిక్యముగల మిక్కిలి వాఁడియైన; కృపాణ = కత్తుల యొక్కయు; బాణ పటలీ = అమ్ముల మొత్తము యొక్కయు; ధారా+ఆహతిన్ = జడి యొక్క పోట్లచే; తద్+చతుస్ + ధారీ = ఆనల్వురి యొక్క (ఆయుధధారుల ద్రవించుచున్న); శోణిత ఫాణిత ద్రవ = రక్తము అనెడి కండ చక్కెర నీటియొక్క; నిపీత ప్రీతులై = బాగుగా త్రాగుటచే; సంతోషము చెందిన వారై; పాఠాం : (ధీర) వీర+ ఉద్యత్+రిపు శోణిత ప్రసవ సంప్రీత+ఆత్ములై = విజృంభించుచున్న తమ శత్రువులైన నల్వురు వీరుల (ధీరుల) యొక్క రక్త ప్రవాహముచే, బాగుగా తృప్తిపొందిన మనస్సు కలవారై; అమర్త్యవ్రాత = దేవతల సమూహము యొక్క; చేతస్స్ఫురత్ = మనస్సులందు; స్ఫార = చలనము (కంపము); స్ఫోర = ప్రకటనము గల; విహార = యుద్ధ సంచారమనెడి క్రీడలచే; ఘోర నటనా ఝాట = భయంకరమైన పెక్కు నర్తనములచే; (వివిధములైన నృత్య భంగిమల చేత); స్ఫుట = స్పష్టమైన; ఆటోపులై = ఉద్రేకము కలవారై; తన్నున్ (అన్నున్) = తన్మయత్వముతో; చెన్నారన్ = చక్కగా ప్రవర్తింపఁగా; ఇచ్చట "ప్రీతులై యన్నుఁజెన్నారన్" అని సవరణ చేయవచ్చును. అన్నున్ = ఒడలు ఎఱుఁగమి; పారవశ్యము (శ.ర);

తా : బాణుని సైనికులగు పన్నగులును, యక్షులును, రాక్షసులును, మిక్కిలి వాఁడియైన తమ కత్తులు బాణములు, మొదలగువాని దెబ్బలచే ఆ నల్వురు వీరుల రక్త ధార లనెడి ఎఱ్ఱని తియ్యని చక్కెర ద్రవపానముచే ఒడలు మఱచి సంతుష్టులైరి. దేవతలు అందఱు, కలఁత చెందిరి. యుద్ధ క్రీడలయందు పెక్కురీతులైన నాట్యములతో వారు విజృంభించుచు ప్రవర్తింపఁగా (తరువాతి పద్యముతో), "అన్ను" అనుపదము ఈ ఆశ్వాసమందు 5వ, పద్యమందును ప్రయోగింపఁబడి నట్లున్నది. అచట "నిన్న"కు మాఱుగా, "అన్ను" పదము చక్కఁగా అమరును.

* ర్వీరోద్యద్రిపుశోణిత ప్రసవ సంప్రీతాత్ములై యున్న చె.

అలం : 1. రూపకము, శోణిత పాణిత ద్రవ.

2. వృత్త్యనుప్రాసము, రేఫము, పునరావృత్తమైనది. దీర్ఘ సమాసములు బాణ సైనికుల ఆటోపమును సూచించునవై యున్నవి.

కం. తమ నలువుర రుధిరంబును
సమరంబునఁ గ్రోలు బాణ సైనికుల, భుజం
గమ యక్ష రాక్షసులఁ, గని
రమారమణుఁ బిలిచి నిలిచి రాముం డనియెన్. 53

తా : బలరాముఁడు యుద్ధమందు, తమ నల్వురియొక్క రక్తపానము చేయు, బాణుని సైనికులైన, సర్పములు, యక్షులు, రాక్షసులను చూచి లక్ష్మీపతి యైన శ్రీకృష్ణుని పిలిచి ఇట్లనెను.

కం. 'ఆలంబులోన రక్కెస
మేలంబులు గలవె మనల మేనుల రుధిరం
బేలా క్రోలఁగ నిచ్చెదు
బేలా భూతములఁ బఱపు భీతంబులు గాన్.' 54

అర్థ : ఆలంబులోనన్ = యుద్ధములో; (రక్కస = రక్కసుల) రక్కెస = అయుక్తములైన శ.ర.; మేలంబులు = హేళనలు; బేలా! (బాలుఁడా) వెఱ్ఱీ! భూతములన్ = పిశాచములను; పఱపు (ము) = (యుద్ధముచేసి) పాఱఁ ద్రోలుము.

తా : రణములో (రక్కసుల) అయుక్తములైన హేళనలకు తావు లేదు. వారు మన రక్తమును పానము చేయుటకు అవకాశమును ఏల ఇచ్చుచున్నావు? ఓ వెఱ్ఱివాఁడా! వారికి వెఱపు పుట్టించి పాఱఁద్రోలుము.

వ్యా : ఇచ్చెదవు > ఇచ్చెదు; వకారలోపము, క్రియ, బాల - 24,

పఱపుము > పఱపు, మధ్యమపురుష మువర్ణకలోపము. సంధి, బాల - 47.

వ. అనుటయుఁ బాంచజన్యధరుండుఁ దత్సైన్యంబు దైన్యంబు నొందింపం దలంచి యాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన. 55

తా : బలరాముఁడు అట్లు పలుకఁగా, శ్రీ కృష్ణుఁడు, బాణుని సైన్యమును

దుర్బలమగునట్లు చేయుటకు నిశ్చయించుకొని ఆగ్నేయాస్త్రమును ప్రయోగింపఁగా (మీఁది పద్యముతో).

మ. అసురారాతి శరాస నారణిజమై యాగ్నేయ బాణంబు బా
ణసురారాతి పతాకినీ స్ఫుర దరణ్యానిం భృ తాశా పట
శ్వస నానేకప కర్ణ తాళ పవన వ్యాఖ్యాత సఖ్యంబ యై
భసి తాకారత నొందఁ జేసె హలి యుబ్బం బెల్లగిల్లం దిశల్. 56

ప్రతి : అసుర+అరాతి = రాక్షసులకు శత్రువైన శ్రీకృష్ణుని యొక్క; శరాసన + అరణిజమై = విల్లనెడి నిప్పుపుట్టించెడు కొయ్యనుండి పుట్టినదై; ఆగ్నేయ బాణంబు = అగ్ని దేవతకు చెందిన అమ్ము; భృత + ఆశా = నిండిన అన్ని దిక్కులందున్న; పటు = దృఢమైన; శ్వసన + అనేకప కర్ణతాళపవన వ్యాఖ్యాత; సఖ్యంబు + అ+ఐ = వాయువుతో, ఏనుఁగుల చెవుల అప్పళింతలయొక్క వాయువుచే వ్యాఖ్యానము చేయుచు, చెలిమి చేయునదై; (ప్రకృతిలోఁ గల వాయువు కంటె ఏనుఁగుల చెవులచే కలుగు గాలి అతిశయించి యున్నదని భావము.) పెక్కు ఏనుఁగులు యుద్ధభూమిలో నుండెను. కాన వాని వలన సహజమైన వాయువునకు కర్ణతాళ పవనముచే ఊపు ఎక్కువైనది. పట=వస్త్ర మను అర్థమును కుదుర్చుట కష్టము). పాఠాం. పతాకా+ఆవళీ = టెక్కెపు గుడ్డల వరుసలయొక్క; శ్వసన = వాయువుతో; బాణసుర+అరాతి = బాణుఁడనెడి దేవతలకు శత్రువైన; పతాకినీ = సేన అనెడు; స్ఫురత్ + అరణ్యానిన్ = ప్రకాశించుచున్న పెద్ద అడవిని; హలి= హలము కలవాఁడు, బలరాముఁడు; ఉబ్బన్ = పొంగఁగా; దిశల్ = దిక్కులు; పెల్లగిలన్ = తలక్రిందులై కలఁత చెందునట్లు; భసిత + ఆకారతన్ = బూడిదరూపును; ఒందన్+ చేసెన్ = పొందునట్లు నాశము చేసెను.

తా :శ్రీకృష్ణుని ధనువైన శార్ఙ్గము అనెడి అరణినుండి, ఆగ్నేయాస్త్రము వెల్వడినది. అది దిక్కులందున్న దృఢమైన వాయువుతో, ఏనుఁగుల చెవుల యొక్క (తాళములవంటి) తటతట మను ధ్వనుల వాయువుచే వివరించుచు, చెలిమి చేయునదై, బాణుని సేన అనెడి మహారణ్యమును, బలరాముఁడు మిక్కిలి సంతోషించుచుండఁగా, దిక్కులన్నియు కలఁత చెందఁగా, కాల్చి బుగ్గిచేసెను.

అలం : రూపకము.

ఉపమేయము : 1. శరాసనము (విల్లు) 2. ఆగ్నేయబాణము 3. పతాకిని.

ఉపమానములు : 1. అరణి, 2. అగ్నిజ్వాల (అరణిజము) 3. అరణ్యాని.

వ. ఇవ్విధంబున నవ్వధంబునం జిందఱవంద లై యనీకంబు లనేకంబులు పొడ వడంగి నిక్కిన భయంబునం దక్కిన రయంబునం గలబలంబులు గళవళించి మగిడి నిగిడి నగరంబు చొచ్చిన వెనువెంట నంటం దఱిమి వైనతేయుం డజేయుండయి తోడన చొచ్చె నట్టియెడ. 57

అర్థ : ఆ వధంబునన్ = ఆ బాణము యొక్క వినాశముచే; చిందఱ వందఱలై = చెల్లాచెదరై; అనీకంబులు = సైన్యంబులు; పొడవు +అడంగి = రూపుచెడి, నశించి; నిక్కిన = అతిశయించిన; దక్కిన = కలిగిన (వీలైన) రయంబునన్ = వేగముచే; కల బలంబులు = మిగిలి ఉన్న సేనలు; మగిడినిగిడి = వెనుకకు మరలి, చక్కఁబడి; వెనువెంటన్ =వెనుకనే; అంటన్ తఱిమి = వెంబడించుచు, తఱుముకొనుచుపోయి; తోడన్+ఆ = ఆసేనతోకూడ;

తా : ఆ సమయమున ఆగ్నేయ బాణముచే నాశమై చెల్లాచెదరైన పెక్కు సేనలు, రూపుచెడి ఎక్కువైన భయముచే, వీలైన వేగముచే, మిగిలి ఉన్నవి, మరలి చక్కఁబడి నగరమును ప్రవేశింపఁగా; గరుత్మంతుఁడు జయముతో (ఓటమిని పొందని వాఁడై) సేనలతో కూడ వాని వెనుక, నగరమును చొచ్చెను. (మీఁది పద్యముతో).

అలం : వృత్త్యనుప్రాసము. సేనల తడఁబాటు తిరుగుడుపాటు, ధ్వనింపఁజేయు వర్ణములు ఆవృత్తములైనవి.

నానా : నిగుడు = వ్యాపించు, నిక్కు, చాగు, పఱఁగు, విజృంభించు, వేగిరపడు, కవియు. చక్కఁబడు, చిప్పిట్లు.

కం. నానా విధాయుధంబును
నానావిధసైన్య రవము నానా విధ భ
ద్రానేకప ఘోటక రథ
సైనికమును నైన ప్రమథ సైన్యము దోఁచెన్. 58

అర్థ: నానావిధ భద్ర+అనేకప, ఘోటక రథ సైనికమునున్+ఐన = పెక్కువిధములైన మేలు జాతి ఏనుఁగులును గుఱ్ఱములును, తేరులును వీరవరులును కలదియు అయిన.

తా : నానా విధములైన ఆయుధములతోను, వివిధములగు వీరనాదములతోను, నాలుగు విధములైన శివభటులసేన కన్పట్టెను.

చం. పలకలు నొడ్డనంబులును బాసట చేయఁగఁ గత్తి గొంతముల్
బలు సబళంబులు న్వెనుకఁ బన్నిన విండుల వారు పైపయిం

దలముగఁ *(బోవ వారువపుఁ దండము నేనికపిండు దేరు మూఁ
కలుఁ బరిపాటిమై సమర కౌతుక హేతుక మై చెలంగఁగన్. 59

ప్రతి : పలకలున్ = డాలులు (లోహనిర్మితములు); ఒడ్డనంబులున్ = కేడెములు (బెత్తముతో చేయఁబడినవి); బాసట చేయఁగన్ = సాయ పడఁగా; కత్తి, కొంతముల్ = కత్తులును, ఈఁటెలును; (పలు) బలు సబళంబులున్ = (పలురకములైన) బలిష్ఠములైన ఆయుధ విశేషములును; వెనుకన్ +పన్నినన్ = వెనుక వైపున, వెంబడిని సిద్ధముకాఁగా; విండులవారు = విండ్లు గలవారు; పై పయిన్ = మీఱుచు అతిశయించుచు, తలముగన్ = దట్టముగా; తోఁపన్ = కన్పట్టఁగా; పాఠాం. (ప్రోవన్ = గుంపులుగా కూడఁగా; వారువము + తండమున్ = గుఱ్ఱములయొక్క గుంపును; ఏనిక పిండున్ = ఏనుఁగుల గుమియును; తేరు మూఁకలున్ = తేరుల దండులును; పరిపాటిమైన్ = క్రమముగా; సమర కౌతుక హేతుకమై = యుద్ధము చేయు ఉత్సాహము కారణముగా; చెలంగఁగన్ = ప్రవర్తించుచు, అతిశయింపఁగా.

తా : లోహ నిర్మితము లైన డాళ్లు, బెత్తపు కేడెములు, సాయపడు చుండఁగా, కత్తులు కుంతములు బలువైన ఆయుధములు వెనుక వైపున వెంబడించుచు సిద్ధముకాఁగా విలుకాండ్రు, మిక్కిలి దట్టముగా గుంపులుగా కూడఁగా గుఱ్ఱములు, ఏనుఁగులు తేరులు క్రమముగా యుద్ధోత్సాహముచే, చెలరేఁగినవి. (మీఁది పద్యముతో).

నానా : సంగడి = స్నేహము, జత, సమీపము, తెప్ప, పార్శ్వము, వెనుక, సమూహము;
పలక = వ్రాసికొను పలక, జూదమాడు పలక, డాలు, చెక్క, బల్ల.
కొంతము (వి) కుంతము (ప్ర).
ఈ పద్యమందు మొదటి మూడు పాదములలో అన్నియును అచ్చ తెనుఁగు పదములు ఉన్నవి.

సీ. నిస్సాణముల మ్రోఁత నింగి ముట్టి మురారి
పాంచజన్యమ్ముతోఁ బాదరింపఁ
గరుల తొండముల సంగడి నిక్కి తాలాంకు
వలుఁద నాఁగటితోడ వక్కళింపఁ
దురగ ఖురోద్ధూత ధూళి దిక్కులఁ బ్రాఁకి
భుజగారి ఱెక్కలఁ బూజ సేయఁ

* దోఁప

గరవాల రుచులు భాస్కర కరంబులఁ ద్రోచి
ప్రద్యుమ్న శరములఁ బంత మడుగ

గీ. నరదములు గాల్బలంబుల కడ్డ మైనఁ
గ్రింద మీఁదను దెరువు లై క్రిక్కిఱియఁగఁ
డెక్కెములుఁ గొంతములు జల్లెడెలు మలంగఁ
బ్రమథ దైతేయ సైన్యంబు బయలు మెఱసె. 60

ప్రతి : నిస్సాణముల మ్రోఁత = చర్మ వాద్యముల ధ్వనులు; నింగి ముట్టి = ఆకాశమును తాఁకుచు; మురారి; పాంచజన్యముతోడన్ = ఆ పేరుగల శంఖధ్వనితో; బాదరింపన్ = సమానముకాఁగా; కరుల తొండముల సంగడి = ఏనుఁగుల తొండముల మొత్తము; నిక్కి = పైకి లేచి; తాల+అంకు = బలరాముని యొక్క; వలుఁద నాఁగటితోడన్ = పెద్ద నాఁగేటితో; వక్కళింపన్ = తిరుగఁబడఁగా; రూపాం. వక్కరింపన్ (శ.ర.)

తురగ ఖుర+ఉద్ధూత ధూళి = గుఱ్ఱముల గిట్టలచే ఎగురఁగొట్టఁబడిన దుమ్ము; దిక్కులన్ ప్రాఁకి = దెసలందు వ్యాపించి; భుజగ + అరి = పాములకు పగవాడైన గరుత్మంతుని యొక్క; తెక్కలన్; పూజె చేయన్ = చిత్రించుటకు ప్రయత్నింపఁగా, (ఈ పదమును శ.ర. ఉదాహరించినది). పాఠాం. పూజచేయన్ = అర్చింపఁగా;

కరవాల రుచులు = కత్తుల కాంతులు; భాస్కర కరంబులన్ = సూర్యుని కిరణములను; త్రోచి = తిరస్కరించి (అతిశయించి); ప్రద్యుమ్న శరములన్ = ప్రద్యుమ్నుని బాణములతో; పంతము+అడుగన్;

అరదములు; కాల్బలంబులకున్; అడ్డము + ఐనన్; క్రిందను మీఁదను; తెరువులై = దారులై (ఎల్లెడలను తేరులు వరుసలుగా దారులైనవి); క్రిక్కిఱియఁగన్ = బాగుగా ఎడము లేక కూడఁగా;

టెక్కెములున్; కొంతంబులున్ = బల్లెములును; జల్లెడలును = చామరములును (శ.ర); మలంగన్ = వంకర లగు చుండఁగా; ప్రమథదైతేయ సైన్యంబు = శివ భటులయు బాణ భటులయు సేన; బయలు మెఱసెన్ = గోచరించెను.

తా : యుద్ధ వాద్యముల మ్రోఁతలు పాంచజన్య రవముతో రవణించినవి. ఏనుఁగుల తొండములు పైకి లేచి(గర్వించి) బలరాముని నాఁగేటితో తలపడినవి. గుఱ్ఱముల గిట్టలచే ఎగసిన దుమ్ము గరుత్మంతుని తెక్కలను చిత్తరువులో వ్రాయఁదొడగినవి

(అర్చించినవి). కత్తుల కాంతులు సూర్యకిరణములను అతిశయించి, ప్రద్యుమ్నుని బాణములతో పోటీ పడినవి. తేరులు, కాల్బంటుల కదలికలకు అడ్డములై, క్రింద మీఁద ఎచ్చట చూచినను, అవియే, దారులుగా ఏర్పడి, దట్టముగా ఎడములేక ఉండినవి.

టెక్కెములు చామరములు, వంకరలైనవి. శివ భటులయు, బాణ భటులయు సేన, ప్రకటముగా గోచరించెను.

కం. మున్నాకసమున సేనలు
పన్ని హరి శరాగ్ని నపుడు భస్మీత మగుటం
గన్నారఁ జూచి మఱియును
సన్నాహముతోడ నడిచె సైన్యము ధరణిన్. 61

తా : అంతకుముందే, ఆకాశమందు సిద్ధమైన సేనలు, శ్రీకృష్ణుని బాణాగ్నిచే బూడిద అగుటను స్పష్టముగా చూచియును, సైన్య మంతయును ప్రయత్నముతో నేలపై నడిచెను.

వ. అ ట్లున్న సేనలం గనుంగొని నీలాంబరుండు పీతాంబరునకి ట్లనియె. 62

తా : ఆ విధముగా ధరణిపై మోహరించిన ప్రమథులయు దైత్యులయు సైన్యములను చూచి నీలాంబరుడు (బలరాముడు), పీతాంబరునితో ఇట్లనెను.

ఉ. ఈ చతురంగ సేన పయి నెక్కుడు వేడుక నెక్కొదన్ మదిం
జూచెదవా యొకింతవడి శూరులఁ దేరులతోడి వ్రేసి వే
లాచల వీచు లట్లు కరులన్ హరులన్ గదియించి నుగ్గుగా
వైచెద వైజయంతు విలు వంచెద బాణుని లజ్జ చించెదన్. 63

అర్థ : ఒకింత వడిన్ = కొంత సేపటిలో; వేలాచల వీచుల +అట్లు = సముద్రపు టొడ్డున (చెలియలికట్టపై) ఉప్పెనలో చలించు, అలల వలె; వైజయంతు విలు = కుమార స్వామి యొక్క వింటిని; లజ్జ చించెదన్ = సిగ్గు పడునట్లు చేసెదను.

తా : ఈ చతురంగ సేనలను చించి చెండాడవలెనను ఉత్సాహము నాలో అతిశయించినది. చూడుమా! కొంత సేపటిలో రథములతో శూరులను కొట్టి సముద్రము పొంగినప్పుడు, ఒడ్డున తీవ్రముగా చలించు అలల వలె ఏనుఁగులను గుఱ్ఱములను, సమీపించి పొడిచేసెదను. కుమార స్వామి వింటిని వంచెదను.

అలం : ఉపమ. వేలాచలల వీచులట్లు వైచెద.

వ్యా. విలు = వింటిని, ద్వితీయకు ప్రథమ వచ్చినది. కారక, బాల - 24.

నానా : వేల = చెలియలికట్ట, పొలిమేర, ఉప్పెన, వ్యాధి, రాజ భోజనము మొ॥

నానా : వడి = వేగము, కాలము, శౌర్యము, పద్యమందలి యతి మొ॥

నానా : వీచి = అల, కొంచెము, అవకాశము, సుఖము

వ. అనుటయు విశ్వంభరుండు. 64

తా : సులభము

శా. నాచిత్తంబున నిత్తెఱంగె పొడమెన్ నాగారి మున్నై చనం
ప్రాచీ దిఙ్ముఖుఁడైన నాకు సరసం బ్రద్యుమ్నుఁడు న్నీవు హే
లాచాతుర్యము దాపలన్ వలపలన్ లా వై పచారింప ధా
త్రీచారంబున మోహరింతము పురారిం జేర లేఁ డిమ్మెయిన్. 65

అర్థ : ప్రాచీదిక్ + ముఖుఁడైనన్ = తూర్పుదిక్కు మొగము కలవాఁడైన; సరసన్ = చెంతను; హేలా చాతుర్యమున్ = సౌలభ్యముతో కూడిన నేర్పును; దాపలన్ = ఎడమవైపున; వలపలన్ = కుడివైపున; లావై = సమర్థులై; ప్రచారింపన్ = ప్రకటింపఁగా; ధాత్రీ చారంబునన్ = నేలమీఁద సంచరించుచు; పురారిన్ = పురారియును, శివుఁడును.

తా : 'నా మనస్సులో కూడ ఈ ఆలోచనయే పుట్టినది. గరుడుఁడు ముందు నడచుచుండఁగా తూర్పు ముగము కల నాకు ప్రద్యుమ్నుఁడును, నీవును, ఎడమ కుడివైపులలో సమర్థులై సౌలభ్యముతో, బాణ ప్రయోగమును చక్కఁగా చేయఁగా, నేల మీఁదనే యుండి, శత్రువులను ఎదుర్కొందుముగాక! ఇట్లు కావించిన శివుఁడు కూడ మనలను చేరలేఁడు.

వ్యా. పురారియున్ = పురారిన్, యువర్ణవిరహితమైన సముచ్చయము. శబ్ద ప్రౌఢ - 116.

నానా : హేల = బొమముడిచే తెలియు మనోవికారము, విలాసము, సంతోషము, తిరస్కారము, సౌలభ్యము, వెన్నెల, సురతేచ్ఛ.

వ. అనుటయుం బతంగపతి వసుమతికి నవతరించి వసుదేవ సుతుని తలంపున కనుగుణంబుగ నడచి కడచి ముంగిలి యై జంగిలి వెలుచు

గోపాలు పోలికం బ్రతిబలంబుల గదలించియు నదలించియుఁ, గడంగి యూటడంగి తాళఫలంబులు డులుచు పెలుచనం బొదివి పెల్లొదివి, హస్తికుల మస్తకంబుల ధర నురలించియుఁ బొరలించియు ముంచి మెయివెంచి మించిన తురగ దళంబులం బొలియించియు నలియించియు, నరదంబులు చెక్కలు వాయ ఱెక్కల విఱిచియుఁ నఱిచియుఁ, బేరెలమిం దలపడిన వీరుల నారెలం జీరి నాఱులు వోసినట్లు చేసియు, మెండుకొని యున్న శుండాలంబుల తొండంబులు వట్టికొని గుండెలు వగులం దన్నియుఁ, గడిమిఁ గడచన్న పన్నగ యక్ష రాక్షసులఁ బెడచేత వ్రేసియు డాసియుఁ బాసియు లాసియు, వాసి చెడక కలకలంబులు సేయు పలకలవారి నుంగుటంబుల నింగికిం జిమ్మియు, పఱిపఱిగా నఖంబుల వ్రచ్చియు విచ్చియుఁ జొచ్చియుఁ బెచ్చు పెరిఁగి వచ్చు బేతాళంబులం బాతాళంబు సొర నడిచియుఁ, బిడిచి వైచిన చందంబున మడఁచి త్రోచియు, సరసాన బెరసినం గరసాన నొరసిన వెరవు చేసియు, గేడించినం గూడించి యడంచియుఁ, బెల్లగిల్లిన మల్లడి గొలిపియు ననేకప్రకారంబులం జీకాకు పఱిచె నట్టియెడ. 66

ప్రతి : అనుటయున్; పతంగపతి = పక్షిరాజు; వసుమతికిన్ = భూమికి; అవతరించి = దిగి; వసుదేవ సుతుని; తలంపునకున్ =భావమునకు; అనుగుణంబుగన్ = తగినట్లు; నడచి; కడచి = దాఁటి; ముంగిలియై = ముందు పోవువాఁడై; జంగిలిన్ = ఆలమందను; వెలుచు = తోలు; గోపాలు పోలికన్ = ఆల కాపరివలె; ప్రతి బలంబులన్ = శత్రుసేనలను, కదలించియున్ = చలింపఁజేసియు; అదలించియున్ = బెదరించియు; కడంగి = ప్రయత్నించి; ఈటడంగి = ఉత్తదగు (శూన్యమైన); తాళఫలంబులు = తాటి పండ్లు; డులుచు పెలుచనన్ = రాల్చు వేగిరపాటుతో; పొదివి = నలువైపుల చుట్టుచు; పెల్లు +ఒదివి = ఎక్కువగా ఆక్రమించి; హస్తికుల మస్తకంబులన్ = ఏనుఁగుల గుంపుల తలలను; ధరన్; ఉరలించియును = రాల్చియును; పొరలించియున్ = దొర్లించియు; ముంచి = ముందునకు వచ్చి; (ముంచు రూపాం. మునుచు = మునుకొను, ముందు పడుశ.ర); మెయి+పెంచి = శరీరమును పెద్దది చేసి; మించిన = మీఱుచున్న; తురంగదళంబులన్ = గుఱ్ఱపుసేనలను; పొలియించియున్ = చంపియు; నలియించియున్ = నలగఁగొట్టియు (ముక్కలు చేసియు); అరదంబులు =

తేరులు; చెక్కలు పాయన్ = చెక్కలు చెక్కలుగా వీడునట్లు; ఱెక్కలన్ = ఱెక్కలను; వి(బ్రిచియున్ = విదిలించియు; అ(బ్రిచియున్ = చలిపంజేసియు; పేరు + ఎలమిన్ = మిక్కిలి ఉత్సాహముతో; తలపడిన వీరులన్; ఆరెలన్ = ఆయుధ విశేషములతో; చీరి = చీల్చి; నాఱులు +పోసినట్లు = విత్తులు వేసి పెంచిన చిన్న మొలకలను నాటినట్లు; చేసియున్ = నిల్పియును (మ్రాన్పాటు చెందించియు); మెండుకొని ఉన్న = ఎక్కువగా ఉన్న; శుండాలంబుల తొండంబులు = ఏనుఁగుల తొండములు; పట్టికొని; గుండెలు+పగులన్; తన్నియున్; కడిమిన్ = పరాక్రమముతో; కడచన్న = మీఱిన (ప్రశస్తులైన); పన్నగ యక్ష రాక్షసులన్; పెడచేతన్ = చేతి వెనుక భాగముతో; వ్రేసియున్ = కొట్టియు; డాసియున్ = సమీపించియు; పాసియున్ = తొలఁగియు; లాసియున్ = ఉద్రేకము చూపియు; వాసి చెడక = తమ పెంపు నష్టముగాక పోవుటచే; కలకలంబులు చేయు; పలకలవారిన్ = డాలు గల వారిని; ఉంగుటంబులన్ = బొటన వ్రేళ్లతో; నింగికిన్ = ఆకాశమునకు; చిమ్మియున్ = ఎగురఁగొట్టియు; పఱి పఱిగాన్ = ముక్కలు ముక్కలుగా; నఖంబులన్ = గోళ్లతో; వ్రచ్చియున్ = చీల్చియును, విచ్చియున్ = విడఁగొట్టియును; చొచ్చియున్ = ముందునకు సాగియును; పెచ్చుపెరిగి = (గర్వము ఎక్కువగుటచే) చెలరేఁగి; వచ్చు; బేతాళంబులన్; పాతాళంబు చొరన్ = చేరునట్లు; అడిచియున్ = మోదియును; పిడిచి వైచిన చందంబునన్ = పిండిచేసిన తీరున; మడఁచి త్రోచియున్ = వంచి గెంటియు; సరసానన్ = తేలికదనముతో, హేళనతో; బెరసినన్ = ముందునకు దూఁకఁగా (కవియఁగా); కరసానన్ = సానఱాతిపై; ఒరసిన వెరవు చేసియున్ = ఒరపెడి పెట్టినట్లు, నేర్పుచూపియు; కేడించిన్ = తొలఁగినచో; కూడించియున్ = చేరునట్లు చేసియు; అడంచియున్ = అణఁచి వేసియు; పెల్లగిల్లినన్ = పాఱిపోయినచో; మల్లడి+కొలిపియున్ = పీడించియు; అనేక ప్రకారంబులన్ = పెక్కురీతులలో; చీకాకు పఱిచెన్ = కలఁతను కల్గించెను; అట్టి+ఎడ= ఆ సమయమందు.

తా : అని శ్రీకృష్ణుఁడు పలుకఁగా గరుడుఁడు నేలకు దిగి, అతని తలఁపునకు తగినట్లు, ముందునకుపోయి ఆలమందను తోలు, ఆలకాపరివలె, శత్రుసేనలను చిందఱ వందఱ చేసియు, బెదిరించియు ఉత్తదైన తాటి పండ్లను రాల్చు వేగిరపాటుతో, నలువైపుల చుట్టి ఆక్రమించుచు, ఏనుఁగుల గుంపుల యొక్క తలలను నేలపై రాల్చియు, వానిని దొర్లించియు, ముందునకు వచ్చి, మేనును పెంచి మీఱుచున్న గుఱ్ఱపు దండును చంపియు, వానిని ముక్కలు చేసియు తేరుల చెక్కలు వీడునట్లు, ఱెక్కలను విదిలించియు చలింపఁజేసియు, మిక్కిలి ఉత్సాహముతో ఎదిరించిన వీరులను ఆయుధములతో చీల్చియు, నాఱు నాటినట్లు, మ్రాన్పాటు చెందునట్లు నిల్పియు, ఎక్కువగానున్న ఏనుఁగుల తొండములను పట్టుకొని గుండెలు పగులు నట్లు తన్నియు, పరాక్రమవంతులైన సర్పములను, యక్షులను రాక్షసులను చేతి వెనుక

భాగముతో చిదిమియు, సమీపించియు, తొలఁగియు, ఉద్రేకము చూపియు, పెంపు చెడక, సందడి చేయు డాలు వారిని బొటన వ్రేళ్లతో ఆకాశమునకు ఎగురఁగొట్టియు, గోళ్లతో ముక్కలు ముక్కలుగా చీల్చియు, విడఁగొట్టియు ముందునకు సాగియు, చెలరేఁగి వచ్చు పిశాచములను పాతాళమునకు అణఁగఁద్రొక్కియు పిండి చేసినట్లు, వంచి గెంటియు, హేళనతో, వచ్చినవారిని, సాన ఱాతిపై రాచినట్లు ఒరపిడి పెట్టి నేర్పుచూపియు తొలఁగినచో, చేర్చియు, అణఁచి వేసియు, పాఱిపోయినచో పీడించియు, ఇట్లు పెక్కురీతులలో, ఆందోళనను కల్గించి బాధించెను.

అలం : ఉపమ. జంగిలి వెలుచు గోపాలు పోలికన్, తాళఫలంబులు డులుచు పెలుచనం బొదివి, నాఱులు వోసినట్లు చేసి ధర నురలించియు,

2. అనుప్రాసము.

శా. ఈషాదండము సీరతుండము ననిన్ హేరాళమై మూఁకలా
ఘోషింపంగ విహంగ మాధిప నఖాంకూరంబు ధీరంబుగా
శేషాహిం గొనివచ్చి చొచ్చి రిపులం జెండాట సూచింపఁగా
రోషోద్రేకముఁ జూపుచుండె బలభద్రుం డుల్లస ద్రౌద్రుఁడై. 67

ప్రతి : అనిన్ = యుద్ధమునందు; ఈషా దండమున్ = నాఁగేటి కొయ్యను; సీర తుండమున్ = నాఁగటి కఱ్ఱును (ఇనుపముక్కను); హేరాళమై = అధికమై, రూపాం. ఏరాళము; మూఁకలు = సేనలు; ఆఘోషింపఁంగన్ = ఎక్కువగా బాధతో మూల్గుచుండఁగా; విహంగమ + అధిప నఖ+అంకూరంబు = పక్షిరాజైన గరుడుని యొక్క, గోటికొన; ధీరంబుగాన్ = ధైర్యముతో; శేష+అహిన్ = శేష సర్పమును, కొనివచ్చి చొచ్చి; రిపులన్ = శత్రువులను; చెండు+ఆట = బంతి, (నఱకునట్టి) ఆటను; సూచింపఁగా; బలభద్రుండు; ఉల్లసత్ రౌద్రుఁడై = కోపము యొక్క విజృంభణమును, వేగమును; చూపుచున్ + ఉండెన్.

తా : బలరాముడు యుద్ధమందు నాఁగేటికొయ్యను కఱ్ఱును నిరాంతకముగా ప్రయోగించుటచే శత్రుసేనలు పెద్దగా అఱచినవి. గరుడుని గోటికొన, ధైర్యముతో శేష సర్పమును పట్టుకొని శత్రువులను నఱకునట్లు బలరాముఁడు, కోపము అధిక మగు చుండఁగా, కోపము యొక్క ఆటోపమును (వేగిరపాటును) చూపెను.

అలం : ఉపమ.

ఉపమేయములు : ఈషాదండము, సీరతుండము.

ఉపమానములు : నఖాంకూరము, శేషాహి.

ఉపమా వాచకము : సూచింపఁగా.

ఉ. నాఁగలి సాఁచుచుం దిగుచు నాగ రథాశ్వ భటావళిం దగన్
జాఁగఱగొన్న జక్కులఁ బిశాచిక లా చిఱు నుగ్గు [1]లేఱుచో
రేగిన చోట్లనుం దెలుపు రెండును మూఁడును నాలుగైదుగాఁ
గౌఁగిటఁ గొమ్ములు న్నొగలుఁ గాళులు వ్రేళులుఁ బట్టి చూపుచున్. 68

అర్థ : చాఁగఱ కొన్నన్ = నాశము చేయఁగా; పిశాచికలు = పిశాచ కాంతలు, చిఱునుగ్గు లెక్కకై= చిన్న ముక్కలను లెక్కించుటకు గాను; కొమ్ములున్ = ఏనుఁగుల దంతములును; నొగలున్ = కాఁడిని కట్టునట్టి నిడుపైన మ్రాకులును (తేరుల నొగలు); కాళులున్ = (గుఱ్ఱపు) కాళ్లను; వ్రేళులున్ = కాల్బంటుల వ్రేళ్లను; రేఁగిన చోట్లనున్ = చెలరేఁగిన చోట్లను; తెలుపున్.

తా : బలరాముఁడు, తన నాఁగేటిచే లాగి నాశముచేసిన గజ రథ తురగ భటుల సమూహమును, గదచే ముక్కలు చేసిన యక్షులను, పిశాచ కాంతలు తమ కౌఁగిటిలో చేర్చుకొని క్రమముగా రెండు దంతములని, మూడు నొగలని, నాలుగు కాళ్ళని, ఐదు వ్రేళ్లని లెక్క పెట్టుచు, అవి చెలరేఁగిన చోట్లను తెలుపుదురు.

అలం : యథా సంఖ్యము (క్రమాలంకారము). ఆ ఖండములు, ఏనుఁగులు, తేరులు, గుఱ్ఱములు, కాల్బంటులకు క్రమముగా అన్వయించును.

వ్యా. కాలు+లు > కాళులు, వ్రేలు +లు > వ్రేళులు. ఆచ్ఛిక, బాల - 13

శా. ద్యుమ్నంబు న్నికషంబు వోలెఁ బగఱన్ దోఃఖడ్గమున్ రాయఁ బ్ర
ద్యుమ్నుం డాహవకేళి సేయునెడఁ దోడ్తోభూతముల్ ప్రీతితో
నామ్నాయా గత భూత మాంసములు చేయారంగ [2]మార్చున్ వెసన్
నిమ్నోత్తానతలంబు లొక్క మొగిగా [3]నిండారు బండారముల్. 69

ప్రతి : ప్రద్యుమ్నుండు; పగఱన్ = శత్రువును (శత్రువుల యొక్క); ద్యుమ్నంబున్ = శారీరకబలమును; నికషంబు + పోలెన్ = ఒరపిడి ఱాయివలె; దోఃఖడ్గమున్ = చేతి కత్తిచే; రాయన్ = ఒరయఁగా (రుద్దగా, రాపిడి పెట్టగా); ఆహవ కేళి చేయు+ ఎడన్ = యుద్ధక్రీడ చేయు సమయమందు; తోడ్తోన్ = వెన్వెంటనే భూతముల్; ప్రీతితో; ఆమ్నాయ +ఆగత భూత మాంసములు =పూర్వపద్ధతి ప్రకారము తమకు వచ్చిన ప్రాణుల మాంసములు (ఆచారమును అనుసరించి); నిమ్న + ఉత్తాన = పల్లములు, మెట్టలు అయినచోట్లను; ఒక్క మొగిగాన్ = ఒకే

1. లెక్కకై 2. ఁగూర్చున్ 3. నిండార బండారమున్

రీతిగా (ఒకే మట్టమున నుండునట్లు), బండారముల్ = నిల్వచేయు నెలవులు (బొక్కసములు); నిండారన్ = నిండునట్లు; చేయారంగన్ = చేతులలో నిండుగా; వెసన్ = వేగముగా కూర్చున్ = (వానిని సవరించుచు) చేర్చెదరు.

పాఠాం. మార్చున్ = మార్చుకొందురు.

తా : యుద్ధ క్రీడలో ప్రద్యుమ్నుఁడు శత్రువుల బలమును ఒరపిడి ఱాయిగా, తన చేతి కత్తితో బాగుగా, రుద్ది (రాపిడి పెట్టి) పీడించెను. అప్పుడు కూలిన ప్రాణుల మాంసమును, సంప్రదాయమును అనుసరించి, తమవంతు వచ్చిన దానిని పంచుకొనుచు, పిశాచములు వానిని నిలువఁజేయు భాండాగారములను (కోశములను, బొక్కసములను) పల్లము ఎత్తు లేక సమతలముగా (మాంసమును) అమర్చి సమకూర్చుకొందురు.

నానా : ఆమ్నాయము = వేదము, ఉపదేశము, సంప్రదాయము.

శా. ప్రద్యుమ్న ప్రదరంబులున్ బలములం బైపై నివారింపఁగా
విద్యు ద్దామపుర స్సరాంబుధర మై విస్ఫారముం బాంచ జ
న్యోద్య ధ్ధ్వానము గర్జితంబులుగ దైత్యుల్ భీతిఁ జక్రాంగ చం
చద్యానంబునఁ బెల్లగిల్ల వెలిచెం జక్రాయుధుం డుద్ధతిన్. 70

ప్రతి : చక్రాయుధుండు = సుదర్శన చక్రమును గల శ్రీకృష్ణుఁడు; ప్రద్యుమ్న ప్రదరంబులు = మిక్కిలి బలము గల బాణములు; ఆ బలములన్ = ఆ సేనలను; పైపైన్ = సులభముగా, నివారింపఁగా; విద్యుత్+దామ+పురస్ సర అంబుధరమై = మెఱపుకాంతులు ముందు గల మేఘమై; విస్ఫారమున్ = ధనుష్టంకారమును; పాంచజన్య ఉద్యత్ ధ్వానమున్ = పాంచజన్య మనెడి శంఖము యొక్క గొప్ప ధ్వనియును; గర్జితంబులుగన్ = ఉఱుములు కాఁగా; దైత్యులు; భీతిన్ = భయముతో, చక్రాంగ చంచత్ యానంబునన్ = హంసల వలె(చలించు) వడకుచున్న నడకలతో; పెల్లగిల్లన్ = పరుగిడి పోవునట్లు; ఉద్ధతిన్ = గర్వముతో; వెలిచెన్ = వెడలించెను.

తా : శ్రీకృష్ణుఁడు, తన శక్తిమంతములైన బాణములు, శత్రుసేనలను సులభముగా అడ్డగించుచుండఁగా, మెఱపు కాంతులు ముందును, పిమ్మట ఉఱుములును కల మేఘమువలె, బాణములనుండి వెల్వడు తళతళతో ధనుష్టంకారము, పాంచజన్య శంఖధ్వానమును, గర్జనలు కాఁగా, రాక్షసులు, భయముతో, హంసలవలె, వడకుచున్న నడకలతో, భయపడి పరుగిడి పోవునట్లు వారిని యుద్ధ రంగమునుండి గర్వముతో వెడలించెను (పాఱద్రోలెను).

అలం : 1. రూపకము :

**ఉపమేయములు** : 1. శ్రీకృష్ణుఁడు, 2. బాణముల తళతళలు 3. విండ్ల అల్లెత్రాటి ధ్వని, శంఖ ధ్వానము 4. శత్రువులు,

**ఉపమానములు** : 1. మేఘము (నల్లనిది) 2. మెఱుములు, 3. ఉఱుములు 4. హంసలు.

మేఘములను చూడఁగనే హంసలు పాఱిపోవుట సహజము.అట్లే శత్రువుల శ్రీకృష్ణుని కని యుద్ధరంగమునుండి భయపడి వెడలిరి.

2 ఉపమ. చక్రాంగ చంచద్యానంబున ... వెలిచెన్.

చం. నలుగుర చేత నిన్తెఱఁగున న్నఖ లాంగల సాయ కాంబ కా
ద్యలఘు మహాయుధ ప్రహత మై దితి జాఁ ధిప సేన పాఱినన్
జలజ దళాక్షుఁ డొత్తె జలజ ప్రతిమాన్యము బాహు మధ్య సం
చల దుపగూహనా కలిత సాగరకన్యముఁ బాంచజన్యమున్. 71

ప్రతి : నలుగురచేతన్; ఈ +తెఱఁగునన్; నఖ = (గరుడుని) గోళ్ల చేతను, లాంగల = (బలరాముని) నాఁగలి చేతను; సాయక = (ప్రద్యుముని) కత్తిచేతను; అంబక = (శ్రీకృష్ణుని) బాణములచేతను; ఆది +అలఘు మహాయుధ ప్రహతిమై = మొదలగు బలమైన గొప్ప ఆయుధములచే వరుసగా, బాగుగా కొట్టఁబడి; దితిజ+అధిపసేన = రాక్షసరాజైన బాణుని సేన; పాఱినన్; జలజదళ+అక్షుఁడు = పద్మనేత్రుఁడు, శ్రీకృష్ణుఁడు; జలజ ప్రతిమాన్యము = పద్మమువలె గౌరవింపఁదగినదియు; బాహు మధ్య సంచలత్ ఉపగూహన+ఆకలిత సాగర కన్యమున్ = రెండు చేతులనడుమ, బాగుగా కదలాడుచు (ప్రకాశించుచు) సముద్రుని పుత్రికయగు లక్ష్మి యొక్క కౌఁగిటిని కూడినదియునైన; పాంచజన్యమున్, ఒత్తెన్.

తా : గరుడుడు, బలరాముఁడు, ప్రద్యుమ్నుడు, శ్రీకృష్ణుఁడు అను, నల్వురియొక్క గోళ్లు, నాఁగలి, కత్తి, బాణముల ప్రయోగముచే కొట్టఁబడి శత్రుసేనలు పరుగిడిపోయినవి. జయ సూచకముగా కమలాక్షుడు శ్రీకృష్ణుఁడు, పద్మమువలె గౌరవింపఁదగినదియు, భుజముల మధ్య వ్రేలాడుచు లక్ష్మి యొక్క కౌఁగిలి సుఖమును పొందునట్టిదియు నైన పాంచజన్య మనెడి తన శంఖమును పూరించెను.

నానా : జలజము = పద్మము, శంఖము, మొ॥

నానా : సాయకము = కత్తి, బాణము.

గాథ : సాగరకన్య = లక్ష్మి క్షీరసాగరమును మథించినపుడు పుట్టెను.

## - : శివ జ్వరము వచ్చి బల రామునిఁ దాఁకుట : -

ఉ. అట్టియెడం గడంగి ప్రమ థాధిపు పంపున సీరపాణికిం
గట్టెదుర న్మహాజ్వరము గాళ్ళు శిరంబులు మూఁడు మూఁడుగా
ముట్టిన రేవ నిక్కముగ మూఁపులు మూఁడయి వచ్చి తాఁకి ము
చ్చుట్టును బాఱి యార్చె నతిశూరతమై భసి తాయుధస్థితిన్. 72

అర్థ : కడు+ఎదురన్ = ఎట్ట ఎదుట; మహాజ్వరము = గొప్పదైన శివజ్వరము; ముట్టిన రేవ = మార్కొన్న విధము; మూడు+చుట్టులును; అతిశూరతమైన్ = మిక్కిలి శౌర్యముతో; భసిత + ఆయుధ స్థితిన్ = బూడిదయే ఆయుధమై ఉండఁగా; ఆర్చెన్ = అఱచెను.

తా : ఆ సమయమందు, శివుని ఆనతిచే శివ మహాజ్వరము బలరాముని ఎదుట, మూడు కాళ్ళు, మూడు తలలు, మూడు మూపులు కలదై వీరత్వము యొక్క పెంపుతో, బూడిదయే ఆయుధముగా, పరుగిడివచ్చి ఎదుర్కొని మూడు సార్లు చుట్టి అఱచెను.

వ్యా. కడు+ ఎదురు > కట్టెదురు, సంధి, బాల - 12

మూడు+చుట్టులు >. ముచ్చుట్టు, సమాస, బాల - 17, 18

ఛం. ద్విరుక్త 'ట'కారము ప్రాసాక్షరము.

చం. తఱిమి సహస్ర మేఘములు దాఁకి పరాక్రమకేళి చూపఁ బై
నుఱిమిన భంగి నార్చి విను మోరి హలాయుధ! బుద్ధిహీన! యి
ట్లెఱిఁగి యెఱింగి నన్నుఁ గినియించితి ప్రాణముతోడ నింక నె
త్తెఱఁగునఁ బోయె దీమదము ద్రెవ్వఁగ జెక్కుదు మేను నొక్కుదున్. 73

అర్థ : ఉఱిమిన భంగిన్ = గర్జించిన రీతిని; కినియించితి (వి) = కోపమును కలుగఁజేసితివి; ఏ+తెఱఁగునన్ = ఏ విధముగా; పోయెదు = తప్పించుకొని పోయెదవు? ఈ మదము = ఈ (నీ యొక్క) క్రొవ్వు, పొగరు; త్రెవ్వఁగన్ = తెగునట్లు (నాశమగునట్లు); చెక్కుదున్ = చెక్కలుగా చీల్చెదను; నొక్కుదున్ = అదుముదును.

తా : 'ఓరీ! హలాయుధా! బుద్ధిహీనుఁడా! విను, నా శక్తి ఎట్టిదో బాగుగా తెలిసియే నాకు కోపము తెప్పించితివి. ఇంక, నీవు ఏ విధముగా ప్రాణములతో తప్పించుకొని పోఁగలవు? నీ పొగరును పోగొట్టెదను. నీ మేనిని అణఁచెదను.' అని శివమహాజ్వరము,

వేయి మేఘములు, వెంటపడి ఎదుర్కొని పరాక్రమ క్రీడను చూపుటకు ఉఱిమినట్లు అఱచెను.

అలం : ఉత్ప్రేక్ష : ఒక్క మేఘము గర్జించినచో సహించుట కష్టము. వేయి మేఘములు గర్జించినట్లు చెప్పఁబడినది.

1. కినియించితి 2. పోయెదు, వకారలోపము క్రియ, బాల -24.

విశే : నాఁగేటిని ఆయుధముగా కలవాఁడా! (ఇందుహేళన ఉన్నది). బూడిదయే రూపముగా కలిగియున్న శివజ్వరము వేయి పడగల సామి అయిన, నీలాంబరుని, వేయి మేఘములవలె అఱచుచు తాకుట వింతయైన దర్శనము.

కం. 'గదరాజ నేను౼నీవును
గదరాజవు౼నిలువు నిలువు కాని' మ్మనుచుం
బొదు లైన బాణ వృష్టుల
గదుని మనంబునకు వెఱవు గఱపుచు నడచెన్. 74

అర్థ : గద రాజను = వ్యాధి శ్రేష్ఠుఁడను, శ్రేష్ఠుఁడైన వ్యాధిని; గదరాజవు = గదకల రాజవు (మధ్యమపదలోపి సమాసము), అర్థాంతరము. (కృష్ణుని తమ్ముఁడగు) గదుని వంశములో రాజవు (శ్రేష్ఠుఁడవు); పొదులై = రాశులై; బాణ వృష్టులన్ = అమ్ముల జడిచే; గదుని = (గదుని వంశములోని వానిని) బలరాముని, వెఱపు+కఱపుచున్ = భయమును పుట్టించుచు; నడచెన్.

తా : "నేను వ్యాధి శ్రేష్ఠుఁడను. నీవు గదను చేత పట్టిన యాదవుఁడైన రాజవు. (నీవు గదుని వంశములో శ్రేష్ఠుఁడవు). ధైర్యముతో నిలిచి యుద్ధమునకు సిద్ధపడుము." అనుచు, బలరాముని మనస్సునకు, భయమును పుట్టించుచు, శివ మహాజ్వరము రాశులైన బాణముల జడితో ముందునకు నడచెను.

విశే. "గదా" ఆకారాంత స్త్రీలింగ సంస్కృతపదము. సంస్కృత సమాసమైనచో 'గదారాజు" అగును. "గదరాజు" కాదు. (డా. జొన్నలగడ్డ). "గదరాజు" వంటలక్క వంటిదని గ్రహింపవలెను.

నానా : గదా (స్త్రీ) = గద; గదము = వ్యాధి, గదుఁడు = శ్రీకృష్ణుని తమ్ముఁడు.

మ. బలభద్రుండును వేయి మండలము లొప్పం గ్రమ్మఱ న్వేగముం
బలముం గాంచి మహాజ్వరం బెడమచే భస్మంబు మంత్రించి పైఁ

జిలికింపంగ నొకింత సోఁకె నురమా శేషంబు బంగారు గు
బ్బలియం దొక్కెడఁ జిందినం దరికొనెన్ భ స్మావ శేషంబుగాన్.75

అర్థ : మండలములు = గాలి గుడులు (పరివేషములు, గుండ్రని వెలుఁగులు); ఆదిశేషుని అవతారమగుటచే వేయి పడగల మణుల వెలుఁగు తోఁచెను; కాంచి = కాంచఁగా పొందఁగా; ఎడమచేన్ = ఎడమ చేతితో; సోకెన్ + ఉరము = ఱొమ్మును, తాఁకెను; ఆ శేషంబు = ఆ మిగిలిన బూడిద; బంగారు గుబ్బలియున్ = (బంగారుకొండ) మేరుపర్వతముపై; భస్మ+అవశేషంబుగాన్ = బూడిద మిగులునట్లు; దరికొనెన్ = మండెను.

తా : వేయి మణుల గుండ్రని వెలుఁగులను కలిగి, బలరాముఁడు వేగమును బలమును పొంది (పోరాడుటకు) సిద్ధపడఁగా, శివజ్వరము ఎడమ చేతితో బూడిదను మంత్రించి ఆతనిపై చల్లెను. అది కొంత మాత్రమే అతని ఱొమ్మును తాఁకెను. అందులో కొంత మేరు పర్వతమందు ఒక చోట రాలినది. ఆ చోటు మండినది. బూడిద మాత్రమే అచట మిగిలెను.

వ. ఇవ్విధంబున నమ్మేరు నగంబునం దొక్కమోరు నీఱగుట యుం
దదనంతరంబ. 76

తా : ఈ విధముగా ఆ మేరుగిరియందు, ఒక్క శిఖరము(మోరు) బూడిద అగుటయును, పిమ్మట.

నీరు = జలము, నీఱు = బూడిద,
రూపాం. నిగుఱు, నివుఱు.

నానా : మోరు = పర్వత శిఖరము, మజ్జిగ, (శ.ర).

కం. బలదేవుమేను సోఁకిన
వెలిమిడిచే వేఁకి సఱచి విటతాటముగా
నిలుగుటతో ములుగుటతో
నలమటతో నావులింత లం తంతకుఁ గాన్. 77

అర్థ : వెలిమిడి = బూడిద; వేఁకి = జ్వరము; చఱచి = వ్యాపించి; విటతాటముగాన్ = తాఱుమాఱుగా (తడఁబాటుతో); నిలుగు = నీల్గు; ములుగు = మూల్గు; అలమటతోన్ = చింతతో.

తా : బలదేవు మేనును అంటిన బూడిదచే, జ్వరము శరీరమందు వ్యాపించినది. అది తీవ్రమైన తాపమును కల్గించుటచే బలరాముఁడు నిలుకడను కోల్పోయి తడఁబడుచు, నీల్గుచు, మూల్గుచు చింతించుచు, ఆవులింతలు అధికముగా కలవాఁడయ్యెను.

వ్యా. చఱచి = చఱచుటచే; భూతార్థక అసమాపక క్రియ, హేత్వర్థకమైనది.

వ్యా. అంతకున్ + అంతకున్ > అంతంతకున్. ఆమ్రేడిత సంధి.

కం. జడనుం దాపము నిద్రయు
నిడు వెంద్రుకతోడ నెగయు నిట్టూర్పులు సం
దడి గొని వడిగొని మదిలోఁ
జిడిముడి పడి కన్నుఁగవయుఁ జిడిముడి వడఁగాన్. 78

ప్రతి : జడనున్ = మాంద్యమును, అలసతయును; తాపమున్ = వేఁడిమియు; నిద్రయున్; నిడు వెంద్రుకతోడన్ = నిక్క పొడుచుకొన్న వెంద్రుకలతో; నెగయు నిడు + ఊర్పులు = పైకి తోఁచుచున్న నిడుదలైన ఊర్పులు (శ్వాసక్రియలు); సందడి+కొని = అధికమై; వడి+కొని = వేగము కలిగి; మదిలోన్; చిడిముడి +పడి = తొట్రుపాటు చెంది; కన్ను+కవయున్ = కన్నుల జంటయును; చిడిముడి పడఁగాన్ = కలఁత నొందఁగా.

తా : చేష్టలు తగ్గి, అలసత, వేఁడిమి, నిద్ర, నిక్కిన వెంద్రుకలతో ఎక్కువగుచున్న నిడుదలైన ఊర్పులు, మిక్కిలియై, వేగముతో మనస్సులో కలవరపాటును తొట్రుపాటును కలిగించినవి. కన్నుల జంటయును కలఁత నొందినది. శరీరము, వశము తప్పినది.

వ్యా : నిడు + ఊర్పులు > నిట్టూర్పులు. సంధి, బాల - 12

కన్ను+కవ > కన్నుఁగవ, సమాస, బాల - 25, సంధి, బాల - 25, 16, 17.

వ. తదవసరంబున గదుండు సగదుండయి గదాధరున కిట్లనియె. 79

తా : ఆ సమయమందు గదుని వంశము వాఁడైన బలరాముఁడు, (గదము) జ్వరము సోకినవాఁడై కౌమోదకి అనెడి గదను ధరించిన శ్రీకృష్ణునకు ఇట్లనెను.

కం. 'ఓకృష్ణ కృష్ణ చిక్కితిఁ
జేకొను మభయంబు నాకుఁ జేయుము నాతం
ద్రీ! కాలఁ దొడఁగె నొడ లిదె
లోకాధిప! నీకృపాబ్ధిలో ముంపఁ గదే.' 80

తా : "ఓ కృష్ణా! కృష్ణా! నేను వేఁడిమికి (వ్యాధికి) వశమైతిని. నన్ను ఆదరింపుము. నా భయమును తొలగించి రక్షింపుము. నాతండ్రీ! (ప్రేమ సూచక సంబోధనము), నా శరీరమంతయు, ఇదిగో చూడు, కాలిపోవుచున్నది. (వేఁడెక్కినది). లోకములకు నాయకుఁడా! నీ కరుణ అనెడి సముద్రములో నన్ను ముంచుము." (వేఁడిమిని వెంటనే చల్లార్పుమని ప్రార్థన.)

అలం : రూపకము, కృపాబ్ధి.

కం. నావుడుఁ గడు రయమున వసు
దేవ తనూభవుఁడు రేవతీ రమణుని సం
భావనఁ గౌఁగిటఁ జేర్చిన
నావిర్భూత జ్వ రాహపహరణం బయ్యెన్. 81

అర్థ : ఆవిర్భూత = పుట్టిన.

తా : బల రాముఁడు అట్లు ప్రార్థింపఁగా, వసుదేవుని పుత్రుఁడు, శ్రీకృష్ణుఁడు, మిక్కిలి వేగముతో రేవతి పతియైన బలరాముని ఆదరముతో కౌఁగిలించెను. వెంటనే ఆ జ్వరము తొలఁగెను (హరిచే హరింపఁబడిన దయ్యెను).

వ. ఇవ్విధంబున. 82

తా : సులభము.

శా. రాకా చంద్రికఁ దేల్చినట్లు ఘనసారంబుం బయిం గూర్చి న
ట్లాకా శాపగ నీర వ్రాల్చి నటు లాత్మానంద యో గామృతం
బేకాంతస్థితిఁ గ్రోల్చి నట్లు హరిచే నింపారు నాలింగన
స్వీకారంబున శీత లాంగధరుఁ డై సీ రాయుధుం డుండఁగన్. 83

ప్రతి : రాకా చంద్రికన్ = పున్నమ నాఁటి వెన్నెలతో; తేల్చినట్లున్; ఘనసారంబున్ = కర్పూరమును; పైన్ = మేనిపైన; కూర్చినట్లున్ = పూసిన విధమున; ఆకాశ +ఆపగ నీరన్ = ఆకాశగంగానది యొక్క నీటిలో; వ్రాల్చిన+అటులున్ = ముంచి నట్లును; ఆత్మ + ఆనంద యోగ + అమృతంబు = ఆత్మానంద యోగమనెడి అమృతమును; ఏ కాంత స్థితిన్ = జీవాత్మ పరమాత్మల అనుసంధాన సమాధి స్థితిలో; క్రోల్చిన + అట్లునున్ = త్రావించినట్లు; హరిచేన్

= శ్రీ కృష్ణునిచేత; ఇంపారు, ఆలింగన స్వీకారంబునన్ = ప్రీతి నిచ్చు కౌఁగిలింతను పొందుటచే; సీర +ఆయుధుండు = నాఁగలిని ఆయుధముగాఁ గలవాఁడు, బలరాముఁడు; శీతల+అంగధరుఁడై = చల్లఁబడిన శరీరావయవములు కలవాఁడై; ఉండఁగన్ = ఉండఁగా.

తా : ఇంపైన శ్రీకృష్ణుని కౌఁగిలింతచే, బలరాముఁడు, పున్నమ వెన్నెలలో తేలినట్లు, కర్పూరమును శరీరముపై అలదినట్లు, ఆకాశగంగా జలములో ముంచినట్లు, జీవాత్మ పరమాత్మల ఏకత్వానుభూతిలో స్రవించు అమృతము అనెడి మహానందమును అత్యంతము ఆస్వాదించినట్లు చల్లఁబడిన అవయవములు కలవాఁడై, తేరుకొనఁగా (మీఁది పద్యముతో).

అలం : ఉత్ప్రేక్ష.

వ్యా : ఇంపారు +ఆలింగన > ఇంపారు నాలింగన. సంధి, బాల - 33

వ్యు. ఆపగ-నీటి మొత్తముతో, పోవునది, నది

నానా : అప్పు = నీళ్లు, ఋణము.

కం. ఉభయ గద మధ్యమునఁ గై
టభ మర్దనుఁ డుండి యచ్చుటన్ రణమునకై
యభిముఖునిఁ జేసె నొక్కని
విభు నొక్కనిఁ జేరి వింత వేడుక చూపన్. 84

ప్రతి : కైటభమర్దనుఁడు = కైటభుఁడను రక్కసుని మర్దించినవాఁడు, శ్రీ కృష్ణుఁడు; ఉభయ గద మధ్యమునన్; గద వంశీయుఁడగు బలరాముని యొక్కయు, శివగదుని యొక్కయు నడుమ; ఉండి; అచ్చుటన్ = నొక్కని విభున్ = వశము చేసికొనుటకు వీలుకాని శివజ్వరుని; ఒక్కనిన్ = ఒక్కనినే; చేరి = సమీపించి; వింత వేడుక చూపన్ = క్రొత్తదైన వినోదమును; చూపన్ = చూపుటకు; రణమునకై = యుద్ధము చేయుటకై; అభిముఖునిన్ + చేసెన్ = ఇష్టపడునట్లు చేసెను.

తా : బలరాముని శివజ్వరుని నడుమ నున్న శ్రీకృష్ణుఁడు గర్వించుచున్న శివజ్వరుని ఒక్కనిని సమీపించి, క్రొత్త వినోదము చూపుటకు అతనిని తనతో యుద్ధమునకు సమ్మతింపఁజేసెను.

నానా : విభుఁడు = ప్రభువు, శివుఁడు, బ్రహ్మ, సర్వ వ్యాపకుఁడు.

విశే : విభుఁడనగా శైవామయ విభుఁడని అర్థము. 102 వ, పద్యములో, వైష్ణ వామయ విభుడను పద ప్రయోగమున్నది. కనుక ఇచ్చట విభుఁడు శివ జ్వరునకు వర్తించును.

గాథ : మధు కైటభులు రాక్షసులు. శక్తి ప్రభావమున బలవంతులై బ్రహ్మను యుద్ధమునకు ఆహ్వానింపఁగా అతఁడు విష్ణుని శరణు వేఁడెను. విష్ణువు వారిని చంపుటకు తాను నీటిపై నుండి తొడలపై వారుండఁగా వారిని చంపెను. జలము లేనిచోట చావును వారు కోరి యుండుటచే, విష్ణువు, ఆ విధముగా చంప వలసి వచ్చెను.

గీ. బాహు లెత్తి చటిల్లనఁ బరిఢవించి
దేవ దేవుఁడు పలుకు నత్తెవులు ఱేనిఁ
దఱిమి నీశక్తి యెంత యంతయును నేఁడు
నెఱపుమీ యని గర్వంబు నింగి ముట్ట. 85

అర్థ : చటిల్లనన్ = చటిల్లను ధ్వని కలుగునట్లు, పరిఢవించి = మించి; తఱిమి = నొక్కి, గట్టిగా; నెఱపుమా = చూపుమా! అనిన్ = యుద్ధమందు; నింగి ముట్టన్ = ఆకాశ మంటునట్లు.

తా : శ్రీకృష్ణుఁడు రెండు చేతులతో శివజ్వరుని పైకెత్తి చటిల్లని కొట్టి గదరాజుతో నొక్కి పలికెను.

"ఓయీ, నీ శక్తి ఎంత మాత్రము? ఆ శక్తిని అంతటిని నీ గర్వము ఆకాశమును అంటునట్లు, నేఁడు నాతో, యుద్ధము నందు, చూపుమా".

"తఱిమి" నిఘంటువులలో కానరాదు.

కం. ఆమాటలు విని రోగ
గ్రామణి గోపించి కుడికరంబుల రెంటన్
దామోదరు నురము పయిన్
వేమఱు మిడుఁగుఱుల తోడి వెలిమిడి చల్లెన్. 86

తా : ఆ పలుకులు విన్న వ్యాధి వరుఁడు, కోపము చెంది, తన రెండు కుడి చేతులతో శ్రీకృష్ణుని ఱొమ్ముమీఁద, నిప్పు కణములతో నిండిన బూడిదను వేయిమాఱులు (పెక్కుసార్లు) చల్లెను.

వ్యు. దామోదరుఁడు, ఉదరమందు తులసి మాలిక కలవాఁడు 2. దమాదులచే ఉత్కృష్టమైన బుద్ధికి విషయమైన వాఁడు 3. యశోదచే ఉదరమందు, కట్టఁబడిన త్రాడు కలవాఁడు, విష్ణువు.

వ్యా. దామోదరు + ఉదరము. షష్ఠీ సమాస నుగాగమ సంధి.

వ. ఇట్లు చల్లుటయును. 87

తా : సులభము

ఉ. మఞ్జుంభిరామ జైత్ర మగు మాధవు గాత్రము దైన్యపాత్ర మై
సంజ్వర మొందఁగన్ ధర వెసం దన చేతులు మూఁడు నెత్తి వ్రే
సెం జ్వరుఁ డంతఁ బోక తులసీ వన మాలిక పచ్చ గంద మం
టం జ్వలనంబు రాఁ బిడికిటం బొడిచెం దదురః కవాటమున్ 88

ప్రతి : మంజు + అభిరామ జైత్రము + అగు = మృదువై సుందరమై, జయముకొను; మాధవు గాత్రము = శ్రీకృష్ణుని శరీరము; దైన్యపాత్రమై = జాలిని పొందుటకు తగినదై (విచారమునకు యోగ్యమై); సంజ్వరము + ఒందఁగన్ = తీవ్రమైన వేఁడిమికి నెలవుకాఁగా, తన చేతులు మండును +ఎత్తి; వెసన్ = శీఘ్రముగా; ధరన్, వ్రేసెన్ = పడవేసెను; జ్వరుఁడు; అంతన్ +పోక = అంతటితో ఊరుకొనక; తులసీ వనమాలిక = తులసి దళములు గల పెద్ద దండలో గల; పచ్చ కందన్ = పచ్చని వన్నె నల్లఁబడఁగా; మంటన్, జ్వలనంబు రాన్ = మంటలతో కూడ, నిప్పురవ్వలు వెల్వడునట్లు; తద్+ఉరస్ +కవాటమున్ = శ్రీ కృష్ణుని పలక వంటి ఱొమ్మును (గట్టిదైన); పిడికిటన్; పొడిచెన్.

తా : మృదువైన అందమైన జయశీలమగు, మాధవుని మేను, తపించునట్లు తన మూడు చేతులతో శివజ్వరుఁడు, ఎత్తి త్వరితముగ నేలపై వేసెను. అంతటితో ఆఁగక, మంటలతో నిప్పురవ్వలు రేఁగుచుండఁగా, అతని తులసి మాలలో పచ్చఁదనమును పోగొట్టి, మాడ్చి, తన పిడికిటితో అతని దృఢమైన ఱొమ్మును గుద్దెను.

వ్యా. వ్రేసన్ + జ్వరుఁడు, వ్రేసెంజ్వరుఁడు.

సూ. వర్గయుక్సరళములు పరములగునపుడు ఒకానొకచో ద్రుతమునకు పూర్ణబిందువు కానంబడియెడిని. సంధి, బాల - 19.

పిడికిలి+చేతన్ = పిడికిటన్, ఆచ్ఛిక, బాల - 28, 29, 31, 38.

వనమాల : కంఠమునుండి పాదములవఱకు వ్రేలాడు మాల.

వ్యు. వనమాలి, వనమాలను ధరించిన వాఁడు, విష్ణువు.

ఛం. దుష్కరప్రాసము ప్రాసాక్షరము. బిందు పూర్వక జకార వకారములు.

వ. ఇట్లు వ్రేటునుం బోటునుం జూపి మఱియును.

తా : ఈ విధముగా శివజ్వరుఁడు హరిని, పడవేసియు, పిడికిటితో పొడిచియు, వ

చం. అదరులు వాఱ నూఁదికొని హస్తయుగంబునఁ గంసవైరిఁ గ
ట్టెదుర నురంబు వ్రేసి పెరయీఁగ గతిం గఱచె న్మొరాంత
డది చిఱునవ్వునం దెగడి యాననముం జదియంగ మోఁది
బెదరక వ్రేటుపాటు నెడ పెట్టి గదంబు మదంబు చూపఁగ

అర్థ : అదరులు = మిడుఁగుఱులు; ఊదికొని = అదిమి పట్టుకొని; పెరఈం
గండు తేనెటీఁగవలె; తెగడి = లెక్క పెట్టక; చదియంగన్ = నలఁగునట్లు; వ్రేటుపాట
పడుటను దాని వలన కలిగిన బాధను); ఎడపెట్టి = విడిచిపెట్టి, ఓర్చుకొని;

తా : శివజ్వరుఁడు శ్రీకృష్ణుని రెండు చేతులతో గట్టిగా పట్టుకొని మిడు
వ్యాపించుచుండగా ఎట్టఎదుట ఆతని ఱొమ్ముపై పిడిగుద్దులు ఇచ్చి, త
కఱచెను. దానిని చిఱునవ్వుతో సహించి, తిరస్కరించి, వాని ముఖమును నలఁ
శివజ్వరుఁడు, భయపడక, ఓర్చి, గర్వాతిశయము చూపఁగా (మీఁది పద్యమ

వ్యా. 1.కడు +ఎదురు .. కట్టెదురు. సంధి, బాల - 12

2. కంసవైరిన్ = కంసవైరియొక్క. సూ. క్రియాన్వయంబున రెండు ప
స్వస్వామి సంబంధంబు గలచో సంబంధి పదంబు షష్ఠికి ద్వితీ
షష్ఠికి, "ద్వితీయ వచ్చినది. కారక, ప్రౌఢ - 23.

శా. దైతే యారి ఘనంబు గర్జిలి భుజా దండాహతిం జూపి *య
య్యాతంకాద్రి యురఃప్రపాతమును మూర్ధాధిత్యకన్ ముష్టి
ర్ఘాతవ్రాతము వైచి నొంచె నిటు ప్రారంభించె ఘోరాభి సం
పాతం బష్టభుజత్రిబాహుల కపూర్వ స్తోత్ర పాత్రంబుగన్.

ప్రతి : దైతేయ + అరి = రాక్షస శత్రువగు శ్రీ కృష్ణుఁడు అనెడి; ఘనంబు = మే
= ఉఱిమి, వీరనాదము చేసి; భుజాదండ+ఆహతిన్ = దుడ్డుకఱ్ఱలు అనెడి భుజము
చూపి; అతి+ఆతంకంబగు=అడ్డయిన (బాధించు); రౌద్ర తాపమును = రుద్ర సం
వేఁడిమిని; మూర్ధ అధిత్యకన్ = శిరస్సనెడి కొండ మీఁదినేలను;

---

* య త్యాతంకం బగు రౌద్ర తాపమును

పాఠాం : ఆ+ఆతంక+అద్రి = ఆ శివ జ్వరరము అనెడి కొండ యొక్క; ఉరః ప్రపాతమును = ఱొమ్ము అనెడి కొండ చఱియను; మూర్ధ +అధిత్యకన్ = శిరస్సు అనెడి కొండమీఁది నేలను; ముష్టినిర్ఘాతవ్రాతము = పిడికిటి పోటులు అనెడి పిడుగుల సమూహముతో; వైచి = కొట్టి; నొంచెన్; ఇటు, అష్టభుజ త్రిబాహులకు = ఎనిమిది భుజములు కల శ్రీ కృష్ణునకు, మూ డు భుజములు కల శివ జ్వరునకు అపూర్వ స్తోత్ర పాత్రంబుగన్ = ఇంతకుముందు జరుగని విధమున, అబ్బురమైన స్తుతికి యోగ్యమై; ఘోర+అభిసంపాతము = భయంకరమైన యుద్ధము; ప్రారంభించెన్ = మొదలయ్యెన్.

తా : శ్రీకృష్ణుఁడు అనెడి మేఘము ఉఱిమి, భుజములు అనెడి దుడ్డుకఱ్ఱల దెబ్బలను ఇచ్చి; (మేఘముల తాఁకిడియే కొండకు శిక్ష) శివజ్వరతాపమును శిరస్సనెడి కొండ మీఁది నేలను పిడికిటి పోట్లు అనెడి పిడుగుల సమూహముతో కొట్టి బాధించెను. ఈ విధముగా వారిరువురికి, ఎన్నడు లేని తీరున భయంకరమైన యుద్ధముమొదలయ్యెను.

అర్థాంతరము : (శివజ్వరమనెడి కొండయొక్క ఱొమ్ము అనెడి కొండ చఱియను శిరస్సనెడి కొండ మీఁది నేలను) .

అలం: రూపకము : 1. దైతేయారి ఘనంబు 2. భుజాదండము 3. మూర్ధాధిత్య 4. ముష్టి నిర్ఘాతము.

పాఠాంతరము : 1. ఆతంకాద్రి 2. ఉరఃప్రపాతము.

ఉపమేయములు : 1. దైతేయారి 2. భుజములు 3. మూర్ధము 4. ముష్టి

ఉపమానములు 1. ఘనము 2. దండములు 3. అధిత్యక 4. నిర్ఘాతము .

పాఠాంతరము : ఉపమేయములు : 1. ఆతంకము, 2. ఉరము,

ఉపమానములు : 2. అద్రి 3. ప్రపాతము.

నానా : 1. ప్రపాతము = కొండచఱియ, కునికిపాటు,
2. సంపాతము = చక్కనిపాటు, పక్షిగతివిశేషము,
(అభి) సంపాతము = యుద్ధము
3. నిర్ఘాతము = పిడుగు, వజ్రము.
4. ఆతంకము = వ్యాధి, ఆరాటము, మద్దెల మ్రోత, వెఱపు, చేమిరి.

గీ. పురుష సింహంబు లిమ్మెయిఁ బోరి ముష్టి
ఘట్టనంబుల నదలించు దట్టనలకు
వెక్కసంబుగ నిర్జరుల్ వెఱచి యింత
వలదు వల దంచు నించుక వడిఁ దలంక. 92

అర్థ : దట్టనలకు = బెదరింపులకు, అదలుపులకు; వెక్కసంబుగన్ = సహింపలేక, దుర్భరముగ.

తా : పురుష శ్రేష్ఠులైన ఇరువురు ఈ విధముగా పోరుచు పిడికిటి పోట్లతో, అదలించునట్టి బెదరింపులకు, దేవతలు భయపడి "ఇట్టి భయంకరమైన పోరు వలదు వలదు" అని ఇంచుక సేపు కలఁత చెందిరి (మీఁది పద్యముతో).

కం. సరి సరి ముహూర్త మాత్రం
బరితో హరి పెనఁగి చంప ననువు గని భుజా
పరిఘముల నొక్కెఁ గనకా
భరణంబుల తోడ వానిబరులు న్నొగులన్. 93

అర్థ : ముహూర్తమాత్రము = రెండు గడియల కాలము మాత్రమే. నలుబది నిముసములు పెనఁగి = పోరాడి; అనువు = ఉపాయమును; బరులున్ = ప్రక్కలను; నొగులన్ = చీల్చుటకై; భుజాపరిఘములన్ = ఇనుపగుదియలవంటి భుజములతో.

తా : శ్రీకృష్ణుఁడు శివజ్వరునితో రెండు గడియల కాలము మాత్రమే సమానముగా పోరాడి, అతని చంపుటకు తగిన ఉపాయమును తెలిసికొని, తన బంగారు నగలతో ఇనుపగుదియలవంటి భుజములతో, వాని ప్రక్కలు పగులునట్లు అదిమెను.

గీ. జ్వరుఁడు మృతుఁ డయ్యె నని భుజావలయమున ని
మీలితాక్షుఁ డై యున్న యమ్మేటి మగని
నెత్తి యల్లంత వైచిన నెగసి వచ్చి
లోకనాథుని హృదయంబులోను చొచ్చె. 94

అర్థ : నిమీలిత + అక్షుఁడు = మూసిన కన్నులు కలవాఁడు.

తా : శివ జ్వరుఁడు, శ్రీకృష్ణుని గుండ్రని భుజముల నడుమ కన్నులు మూసికొని యుండెను. ఆ మహావీరుఁడు మరణించెనని తలంచి, శ్రీకృష్ణుఁడు చేతులతో పైకెత్తి ఇంచుకంత దూరములో పడవేసెను. వెంటనే అతఁడు పైకి ఎగిరి లోకనాయకుని హృదయములోనికి ప్రవేశించెను.

వ. అట్టి యెడ ముకుందుండు. 95

తా : సులభము

వ్యు. ముకుందుఁడు-మోక్షము నిచ్చువాఁడు, విష్ణువు.

కం. గడగడ వడఁకెడు మేన
న్నిడు వెంట్రుక వెట్ట నెదుర నిదుర చలింపన్
మెడ మడుఁచు నావులించుం
దడఁబడుఁ బడఁబోవు నిలుచు ధరఁ గూర్చుండున్. 96

అర్థ : నిడు వెంట్రుకపెట్టన్ = గగుర్పాటు కలుగఁగా; వెంట్రుకలు నిక్కి నిడుపులు కాఁగా; ఎదురన్ = ప్రతికూలముగా; చలింపన్ = (మనస్సునకు) నిలుకడలేనట్లు చేయఁగా.

తా : శ్రీ కృష్ణుని శరీరములో గడగడ వణకు మొదలయ్యెను. వెంట్రుకలు నిడుదలై గగర్పాటును కలిగించినవి. అతనిని ఎదిరించుచు, నిద్ర,మనస్సు నిలుకడను పోగొట్టినది. మెడ వాలిపోయినది. ఆవలింతలు అధికమైనవి. అతఁడు తడఁబాటు చెందుచు, పడఁబోవుచుండెను. వెంటనే నేల మీఁదపై పడిపోక నిలుచు చుండెను. పిమ్మట నేల మీఁద కూర్చుండెను.

వ. అట్లు గూర్చుండి. 97

తా : సులభము

**- : కృష్ణుఁడు తన్నుఁదాకిన శివ జ్వరముపై విష్ణు జ్వరమును బనుచుట : -**

మ. తనలోఁ జొచ్చిన శాంకరజ్వరముపై దండెత్తఁ గల్పించె న
ద్దనుజారాతి ప్రతిజ్వరంబు నది యాత్మస్వామి డెందంబులోఁ
గని హస్తాంఘ్రి శిర స్త్రయాన్వితుని నాకర్షించి హర్షించెఁ గే
లును మస్తంబులుఁ గాళులుం దనకు నాల్గు న్నాల్గు నాల్గుం దగన్. 98

అర్థ : ఆ దనుజ+అరాతి = ఆ రాక్షసవైరి, శ్రీకృష్ణుఁడు; ప్రతిజ్వరంబున్ = మాఱు జ్వరమును; కల్పించెన్ = పుట్టించెను; అది; ఆత్మస్వామి = తనయజమానియొక్క; డెందంబున్ = హృదయమును; లోన్+కని = మనస్సుచే తెలిసికొని; హస్త+అంఘ్రి శిరస్ + త్రయ + అన్వితున్ = చేతులు కాళ్లు, తలలు మూడింటితో కూడినవానిని; కేలును = చేతులను; మస్తంబులన్ = తలలను; ఆకర్షించి = వెలుపలికి లాగివేసి = హర్షించెన్ = సంతోషించెను.

అర్థాంతరము : డెందంబులోన్ +కని = హృదయంబులో, చూచి

తా : శ్రీ కృష్ణుఁడు, తనలో చేరిన శివజ్వరమును ఎదుర్కొనుటకు, మాఱుజ్వరమును కల్పించెను. అది తనకు నాలుగు చేతులు తలలు, కాళ్లు అమరి ఉండఁగా స్వామి హృదయములో చేరిన మూడు చేతులు, తలలు, కాళ్లు ఉన్న శత్రువైన శివజ్వరమును తెలిసికొని వెలుపలికి లాగివేసి, సంతోషించెను.

వ్యా. నానా. కేలు (ఏక). చేయి, తొండము (శ.ర) •

వ. ఇట్లు వైష్ణవజ్వరంబు నిజ తేజః ప్రభావంబున శాంకర జ్వరంబుం
బుండరీకాక్షు డెందంబున నుండ నీక వెలికి వెడలించి. 99

తా : ఈ రీతిగా వైష్ణవజ్వరము, తన తేజస్సు యొక్క మహిమచే, శివజ్వరమును, హరి హృదయము నుండి వెలుపలికి లాగి గెంటి వేసినది.

శా. సాహాయ్యం బఖి లాయుధంబులు నిజస్వామి ప్రభావంబునన్
బాహా దండములందుఁ జేయఁ గలిగెన్, బ్రత్యర్థికిన్ భస్మస
న్నాహం బాయుధ హీనతం దెలుప విన్నాణంబు గైకోలుగా
నూహింపం గదిసెన్ హరిజ్వరముపై నుగ్రజ్వరం బుద్ధతిన్. 100

అర్థ : భస్మ సన్నాహంబు = బూది తోడ యుద్ధప్రయత్నము; ఆయుధ హీనతన్ = ఆయుధములు లేకపోవుటను; విన్నాణంబు = మల్లబంధ విశేషము; కైకోలు + కాన్ = గ్రహింపఁదగినదిగా; ఉద్ధతిన్ = గర్వముతో.

తా : విష్ణువు యొక్క మహిమచే దండములవంటి బాహువులకు, అన్ని ఆయుధముల సాయము లభించినది. శివ జ్వరమునకు యుద్ధ ప్రయత్నమునకు బూది మాత్రమే ఉండెను. కాన చేయునది లేక, శివజ్వరము గర్వముతో విష్ణుజ్వరముతో చేతులతో యుద్ధమునకు పూనుకొనెను.

నానా : విన్నాణము : మల్లబంధము, నేర్పు, ఒప్పిదమైనది.

ఉగ్రుడు = శివుఁడు, భయంకరుఁడు.

గీ. అటు గదిసి మూఁడు చేతుల నడిచి మగుడ
నతఁడు వ్రేసిన వాపోవు నవసరమున
మదనరిపు బంటు మందుల మారి మఱియు
విష్ణుకింకరు వెజ్జును వీఁపుఁ గఱచె. 101

తా : ఆ రీతిగా శివజ్వరుఁడు ఎదుర్కొని మూ డు చేతులతో అతనిని మోదెను. మరల విష్ణుజ్వరుఁడు అతనిని కొట్టి, అఱచుచుండగా, మరులు మందు పెట్టు వాఁడైన (వశ్య క్రియావేది) శివజ్వరుఁడు, విష్ణు సేవకుఁడైన వైద్యుని, వైష్ణవ జ్వరుని వీపు కఱచెను.

వ్యా. 1. వాపోవు+అవసరమున,నుగాగమ సంధి. సంధి, బాల - 33

2. వెజ్జును వీపున్ = వెజ్జుయొక్క వీపును, షష్ఠికి ద్వితీయా విభక్తి ప్రత్యయము వచ్చినది.

కారక, ప్రౌఢ - 23.

శా. వ్రేటుం బోటును గాటు నిత్తెఱఁగునన్ వేమాఱు సైరించి వీ
రాటోపంబున వైష్ణ వామయవిభుం డాకోప తాపాధిపుం
ద్రాటం బెబ్బులిఁ గట్టిన ట్లొకట దోర్దండద్వయిం జుట్టి మో
మోటం బించుక లేక తక్కిన భుజాయుగ్మంబునన్ వ్రేయుచున్. 102

అర్థ : వ్రేటులన్ = దెబ్బలను; పోటున్ = పొడుపులను; కాటున్ = కాటులను (కఱచుటను); వేమాఱు = వేయి మాఱులు, పెక్కుసారులు; కోపతాప+అధిపున్ = ఉగ్రజ్వరస్వామిని; ఒకటన్ = ఒక్క మాఱుగా; దోస్+దండ ద్వయిన్ = దండముల వంటి రెండు చేతులతో; మోమోటము = సంకోచము; తక్కిన = మిగిలిన; భుజాయుగ్మంబునన్ = రెండు చేతులతో.

తా : విష్ణు జ్వరుఁడు, ఈ రీతిగా, శివజ్వరుని పెక్కు దెబ్బలను పొడుపులను పంటి కాట్లను ఓర్చి, ఆ ఉగ్ర జ్వరస్వామిని వీరత్వముతో విజృంభించి ఒక్కటిగా అతని చేతులను కాళ్లను, త్రాళ్లతో పెద్దపులిని కట్టిన విధముగా బంధించి సంకోచము చెందక, తన మిగిలిన రెండు చేతులతో మర్దించెను.

అలం : ఉపమ. త్రాటం బెబ్బులిఁ గట్టినట్లు.

వ్యా. త్రాటన్+బెబ్బులి > త్రాటంబెబ్బులి. ఇచ్చట ద్రుతమునకు సరళము పరముకాఁగా పూర్ణ బిందువు వచ్చినది. సంధి, బాల - 19.

కం. రాఁ దిగుచు నెగుచు నగుచుం
బోఁ దట్టుం బట్టుఁ దిట్టుఁ బొరిఁ బొరి రోఁదున్
మోఁదు మె డ ద్రొక్కు నెక్కును
మీదిఁకి నెగయించు వంచు మెయి సారించున్. 103

తా : వైష్ణవ జ్వరుఁడు. శివజ్వరుని తనవైపునకు లాగును. ముందునకు పడఁద్రోయును. నవ్వుచు, దూరముగా నెట్టును. మరల పట్టుకొనుచు, తిట్టును. మాటి మాటికి, అతని మెడను, రోఁత చెందుచు బాఁదును. మెడపై కాలు పెట్టి నొక్కుచు, అతని పైకి ఎక్కును. మీఁదికి ఎగురవేసి, అతని శరీరమును వంచుచు ఆడించును.

విశే. ఈ కందమున, పంద్రెండు సమాపకక్రియలు ఉన్నవి.

పద్యమున "రోదున్" "రోయున్" గా గ్రహింపఁబడినది.

గీ. ఎంత చేసిన నంతంత కెక్కు డైన
బలముఁ జలమును జూప శాంభవ రుజా వ
రుండు రుక్మిణీ వరు జ్వర రోగరాజు
భుజము లుద్ధతిఁ బుతపుతఁ బోవఁ గఱచి. 104

అర్థ : పుత పుత+పోవన్ = వివశమగు, శ.ర.

తా : విష్ణుజ్వరుఁడు ఈ రీతిగా ఎంత బాధించినను అంతకంటె ఎక్కువబలమును, పంతమును చూపుటకై శివజ్వరవరుఁడు విష్ణు జ్వరరాజు యొక్క భుజములను గర్వముతో కలఁత నొందునట్లు కఱచి (మీఁది వచనముతో).

వ్యా. అంతకున్ +అంతకున్ > అంతంతకున్, ఆమ్రేడిత సంధి. సంధి, బాల - 41.

వ. విడిపించికొని మగుడం దలపడి కేశవ రుగ్వల్లభునకు. 105

తా : విష్ణు జ్వరుని భుజముల పట్టునుండి తన్ను విడిపించుకొని, శివజ్వరుఁడు మరల అతనిని ఎదుర్కొనుచు (మీఁది పద్యముతో).

కం. తల దలతోఁ దాఁకించినఁ
దలమీఱుం, గాలు గాలఁ దాకించిన మి
క్కిలి కాలు గలుగుఁ, జేతులఁ
గులికినఁ దనచేయి మీఁ దగున్, వ్రేటునకున్. 106

తా : శివజ్వరుఁడు, తన తలలను, విష్ణు జ్వరుని తలలతో ఢీకొట్టఁగా, అతని తలలే అతిశయించినవి. తన కాళ్లతో అతని కాళ్లను తాఁకఁగా, అతని కాళ్లే అతిక్రమించినవి. తన చేతులతో అతని చేతులను కదిలింపఁగా, ఆ వ్రేటులకు అతని చేతులే మీఱుచుండెను.

ఉ. హత్తిన చోట నేడు దల లౌ [1]నలు వాయిఁ బెనంగ వ్రేయుచో
నెత్తినఁ జేతు లేడును బయిం [2]బొడగానఁగ వచ్చు మెచ్చుగా
నుత్తర [3]దోఃకరంబు సరి నొత్తినఁ గాళులు నేడు దోఁచు నే
క్రొత్తరణంబులుం దలఁపఁ గూడవు వేఁకుల రాచ పోరిలోన్. 107

అర్థ : అలువాయిన్ = కోపముతోకూడిన ముఖముతో; ఉత్తర డొక్కరంబు = మల్లబంధము; వేఁకుల రాచపోరిలోన్ = జ్వరరాజుల కయ్యములో; తలపన్+కూడవు = భావింపరాదు.

తా : విష్ణు, జ్వరుఁడు కోపముతో కూడిన ముఖముతో, (పాఠాం. నలువాయిన్ = నాలుగు ముఖములతో) శివజ్వరుని ఎదుర్కొన్నప్పుడు మొత్తము ఏడు తలలు కనఁబడినవి. కొట్టుటకు చేతులెత్తగా ఏడు చేతులు కానవచ్చినవి. (దోఃకరము) మల్లబంధ విశేషమును చూపఁగా, ఏడు కాళ్లను తోఁచినవి. జ్వరరాజుల పోరిలో క్రొత్త యుద్ధములు భావింపరావు. (వీరియుద్ధమే, క్రొత్తది. ఇట్టిది ముందెన్నడును జరిగియుండదు. ఇంక జరుగఁబోదనియు భావము.)

వ. ఇవ్విధంబునం గ్రొవ్వున నివ్వటిల్ల డిల్లంబులు గాక మల్లయుద్ధంబు సిద్ధంబుగాఁ దొడంగిన గడంగిన మహాజ్వరంబులు జ్వలన జ్వాలాకలాపంబులు రూపంబులు గైకొన్న విన్న నువు నఁ గన్న నువు చూప అగ్గింప బగ్గింప సెగ్గించియుఁ, బోరు నెడ నారాయణజ్వరంబు గరంబు గినిసి కవిసిన పరువంబు గరువంబున నుండ నీక ఖండపరశు జ్వరంబు బట్టి మెట్టుకొని పదంబున మదంబునఁ దాఁచియుఁ ద్రోచియు మడమల వెడ మలంచియు నలంచియుఁ బిక్కల మొక్కలంబునఁ జప్పరించియు నుప్పరించియు జానువు నానువున నదిమియుఁ గదిమియుఁ దొడల నొడ లరికట్టయుఁ జుట్టియు జేతుల వాతు లడిచియు విడిచియు మనికట్ల విఱిచియుఁ జఱిచియుఁ గొప్పరంబుల దెప్పరంబుల దెలిపియు నిలిపియు సందుల బొందులఁ గలయ నొత్తియు హత్తియుఁ గారించియు సారించియుఁ దూలించియు

1. నమవాయి 2. మెడ 3. డొక్కరంబు

సోలించియు నయ్యదుకుంజరుని సన్నిధికిం దెచ్చి పెచ్చు పెరిగి
మెచ్చింపం దలంచి యిట్లనియె. 108

ప్రతి : ఈ విధంబునన్; క్రొవ్వునన్ = మదముతో; నివ్వటిల్లినన్ = అతిశయించినన్; డిల్లంబులు+కాక=బలంబులు కోల్పోవక; మల్లయుద్ధంబు; సిద్ధంబుకాన్ +తొడంగినన్ = సిద్ధమై (వారు) మొదలు కాఁగా; కడగిన మహాజ్వరంబులు = పూనిన ఆ గొప్ప జ్వరరాజులు; జ్వలన జ్వాలా కలాపంబులు = అగ్ని జ్వాలల సమూహములు; రూపంబులు; కైకొన్న విన్నను వునన్ = ధరించిన తీరును; కన్ననువును = కన్పట్టిన విధమును; చూపఱు = చూచువారు; అగ్గింపన్ = పొగడఁగా; పగ్గింపన్ = పంతములు పలుకఁగా (శ.ర.); సెగ్గించియున్ = రోఁత చెందియు; పోరు+ఎడన్; నారాయణ జ్వరము; కరంబున్ = మిక్కిలి; కినిసి = కోపించి; కవిసిన పరువంబు = పొందియున్న యౌవనము; గర్వంబునన్ = గర్వముతో; ఉండనీక = (నిశ్చలముగా) ఉండనియ్యక; ఖండపరశు జ్వరంబున్ = శివజ్వరమును; పట్టి మెట్టుకొని = ముందునకు వచ్చి గట్టిగా నిలిచి; పదంబునన్ = కాలితో; మదంబునన్ = పొగరుతో; తాఁచియున్ = తన్నియును; త్రోచియున్ = నెట్టియును; మడమలన్ = గుదికాళ్లతో; వెడ మలించియున్ = ఇంచుక త్రిప్పియును; నలంచియున్ = నలఁగఁగొట్టియును; పిక్కల మొక్కలంబునన్ = క్రింది వెనుక కాళ్ల బలముతో; చప్పరించియున్ = అణఁచియును; ఉప్పరించియున్ = పైకెత్తియును; జానువు+ఆనువునన్ = మోకాలియొక్క ఆనికతో (అదుముటతో) శ.ర, అదిమియున్ = నొక్కియును, కదిమియున్ = ఆక్రమించియును; తొడలన్ = తొడలతో; ఒడలు = శరీరమును; అరికట్టియున్ = అడ్డగించియును చుట్టియున్; చేతులన్; వాతులు = నోళ్లు; అడిచియున్ = మర్దించియును; విడిచియున్ = వదలిపెట్టియును; మనికట్లన్ = ముంజేతి భాగములను; విఱిచియున్; చఱిచియున్ = తట్టియును; కొప్పరంబుల దెప్పరంబులన్ = మూపుల యొక్క ఆధిక్యములను (దుస్సహత్వంబును); తెలిపియున్; నిలిపియున్= గట్టిగా పట్టుకొని నిలఁబెట్టియు; సందుల బొందులన్ = ఎడములలో (జంట పదము); కలయన్ = అంతటను; ఒత్తియున్ = అదిమియును; హత్తియున్ = కౌఁగిటిలో చేర్చి నొక్కియును; కారించియున్ = బాధించియును; సారించియున్ = విసరియును;తూలించియున్ = కలఁత నొందించియును; సోలించియున్ = మూర్ఛను కలిగించియును; ఆ యదు కుంజరు సన్నిధికిన్ = యదువంశములో శ్రేష్ఠుఁడైన కృష్ణుని యొద్దకు తెచ్చి; పెచ్చు పెరిగి = మిక్కిలి పొంగి; మెచ్చింపన్ + తలంచి = ప్రీతిని కలుగఁజేయుటకు ఉద్దేశించి, ఇట్లు + అనియెన్.

తా. ఈ రీతిగా మదముతో చెలరేఁగిన శివ విష్ణుజ్వరములు, బలహీనులుగాక, మల్ల యుద్ధము సిద్ధమై మొదలు కాఁగా, అగ్నిజ్వాలలు రూపు ధరించిన తీరును చూచువారు పొగడునట్లు పంతములు పలుకుచుండఁగ విష్ణు జ్వరము కోపముతో శివ జ్వరమును

పట్టుకొని, యౌవనగర్వముతో తన్నుచు, మడమలను త్రిప్పుచు, పిక్క బలముతో అణఁచియు, మోకాలి ఊనికతో అదిమియు, తొడలతో మేనును అడ్డగించియు, చేతులతో నోళ్లను మర్దించియు, ముంజేతి భాగములను విఱిచియు, మూపుల అతిశయమును తెలియఁజేసియు, అంతటను నొక్కియు, పీడించియు, మూర్ఛను కలిగించి శ్రీకృష్ణుని సమక్షమునకు తెచ్చి ఆతని మెప్పును పొందుటకై ఇట్లు పలికెను.

అలం : 1. స్వభావోక్తి వర్ణన సహజ సుందరముగా నున్నది.

2. ఉత్ప్రేక్ష.మహాజ్వరంబులు జ్వలన జ్వాలా కలాపంబులు రూపంబులు కైకొన్న విన్నునువున.

3. వృత్త్యనుప్రాసము. వేర్వేఱు, వర్ణముల ఆవృత్తి.

వ్యా. జానువు + అనువు > జానువు నానువు. నుగాగమ సంధి. సంధి, బాల - 34

వ్యు. ఖండపరశువు- ఖండించెడి గండ్ర గొడ్డలి కలవాఁడు. శివుఁడు.

కం. విఱుతునొ మ్రింగుదునో తల
దఱుగుదునో యేను జ్వరుఁడఁ దానున్ జ్వరుఁ డా
కఱకంఠు నేయ విల్లగు
చెఱకుం జెఱ కైన, వంట చెఱకుం జెఱకే. 109

తా : "శివజ్వరుని విఱుతునా? మ్రింగుదునా? తలను తెగఁగొట్టనా? నా పేరు జ్వరుఁడు. అతని పేరు జ్వరుఁడే! ఆ శివునిపై మదనుఁడు ప్రయోగించిన వింటి బద్ద చెఱకే అగును. కాని 'వంట చెఱకు'నకు చెఱకు గుణము కలుగునా? (చెఱకునకు, వంట చెఱకున భేదమున్న దనుట).

వివ : చెఱకులో, బెల్లము తయారు చేయుటకు తియ్యని రసముండును. రసమును తీసిన చెఱకు పిప్పి వంట చేయుటకు వస్తువగును. వంట చెఱకులో తీపిలేదు. అట్లే, జ్వర నామ సామ్యమున్నను, శివజ్వరునకు, తనకును విశేషమైన వ్యత్యాసమున్నది అని భావము.

అలం : నిదర్శనము.

వ్యా. కఱకంఠుఁడు. చిన్నయ సూరి గ్రామ్యమని, పేర్కొనుచు గ్రాహ్యమనిరి. (అనింద్య గ్రామ్యము). సీతారామాచార్యులు గరళ కంఠభవమనియు, బహువ్రీహి అనియు చెప్పిరి. తద్భవములందు, సంస్కృత వర్ణ ముండుటచే సూరి మతమే సమ్మతింపఁ దగినది. అహోబల పండితుఁడు మిశ్ర బహువ్రీహి అనెను. చూడు, 5 ఆ. పద్య - 72

వ. అనుచుఁ గేశవజ్వరంబు సింహనాదంబుఁ జేసి విజృంభించిన. 110

తా : (అట్లు) పలుకుచు కేశవజ్వరము, సింహనాదము చేసి, ఉద్రేకము చూపఁగా.

మ. పరసే నావన దావ పావకుఁడు సంబ ద్ధాధిక క్రోధుఁ డు
త్కర వా తోద్ధుర భూషణుండు విలస త్కాలాంత కాకారుఁ డ
య్యుర గారాతి పతాకుఁ డుజ్జ్వల జవాత్యుగ్రుండు మాహేశ్వర
జ్వరముం బట్టి వధింపఁ జూడ సుమన స్సంభావనా ప్రాప్తయై. 111

ప్రతి : పరసేనా వన దావ పావకుఁడు = శత్రుసైన్యము అనెడి కానకు కార్చిచ్చు అయినవాఁడును; సంబద్ధ+అధికక్రోధుఁడు = దృఢమైన ఎక్కువ కోపము కలవాఁడును; ఉత్కరవాత + ఉద్ధుర భూషణుండు = దట్టమైన వాయు సమూహము యొక్క గట్టిదైన అలంకారమును కలవాఁడును; విలసత్ కాల+అంతక+ఆకారుఁడును = ప్రకాశించు చున్న ప్రళయకాల శివుని (యముని) ఆకృతి కలవాఁడును; ఆ ఉరగ+అరాతి పతాకుఁడు = ఆ పాములకు వైరి అయిన గరుడుని పతాకమందు కలవాఁడు (శ్రీకృష్ణుఁడు); ఉజ్జ్వల జవ + అతి +ఉగ్రుండు = ప్రకాశించు వేగముచే మిక్కిలి భయమును కల్గించు వాఁడు; మాహేశ్వర జ్వరమున్ +పట్టి; వధింపన్ చూడన్ = చంపుటకు ప్రయత్నింపఁగా; సుమనస్+సంభావనా ప్రాప్తయై = దేవతల చక్కని ఆలోచన మేరకు వచ్చినదై.

తా : శత్రుసైన్య మనెడి అడవికి కార్చిచ్చు అయినవాఁడును, మిక్కిలి కోపము కలవాఁడును, దట్టమైన వాయు సమూహమే గట్టిదైన అలంకారముగా కలవాఁడును, ప్రళయకాల రుద్రుని (యముని) ఆకారము కలవాఁడును, ప్రకాశించు వేగముచే, మిక్కిలి భయమును కలిగించు వాఁడును అగు, శ్రీకృష్ణుఁడు శాంకర జ్వరమును చంపుటకు యత్నింపఁగా దేవతల ఆలోచన మేరకు వచ్చినదై. (మీఁది పద్యముతో).

అలం : 1. రూపకము.పరసేనా వన దావపావకుఁడు, ఉత్కరవాతోద్ధుర భూషణుండు.

2. ఉపమ, విలసత్కాలాంత కాకారుఁడు.

వ్యు. కాలాంతకుఁడు_ కాలుని (యముని) అంతము చేసిన వాఁడు, శివుఁడు.

నానా. సుమనస్సు = పువ్వు, విద్వాంసుఁడు, వేల్పు.

చం. ఒక యశరీరి యి ట్లను 'మహోదయమూర్తి! మురారి! దేవదే
వ! కుటిల దైత్య దానవనివారణ కారణ శాంభవ జ్వరం

బకట వినాశ మందఁ దగు నయ్య! తగం బ్రతి పాలనంబుచే
వికలము గాక యుండ యదు వీరవరాగ్రణి కావు' నావుడున్. 112

అర్థ : అకట = అయ్యో! దుఃఖసూచకము; ప్రతిపాలనంబుచేన్ = రక్షణముచే; వికలముగాక ఉండన్ = నాశము చెందక ఉండునట్లు; కావు=కావుము.

తా : ఒక ఆకాశవాణి ఇట్లనెను "మహోన్నత మూర్తి; మురవైరీ, దేవతలకు దేవుఁడా! దుష్టులైన దానవులను నివారించుటకు (వధించుటకు) హేతువైన వాఁడా! యదువీరులలో అగ్రేసరుఁడా! అయ్యో! శివజ్వరము, నాశమగుట తగునా? (తగదు). అయ్యా! (పితృభావ సూచక సంబోధనము), శివజ్వరుని యెడ కృపవహించి, నాశము చేయక కాపాడుము" అన్నంతనే (మీఁది పద్యముతో).

వ్యా. తగున్+అయ్య > తగునయ్య?

సూ. ఒక్కొక్కచో తద్ధర్మ క్రియ ఆర్యాద్యర్థ పరకంబయి వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకంబగు. క్రియ, ప్రౌఢ - 4 'తగదు' అని.

శా. సంతోషించి మురాతంకుండు విడువన్ శంభుజ్వరం బప్పు డా
పంతం బప్రతిగణ్యరూప మగుచుం బాదప్రణామ క్రియా
త్యంతం బైన సపర్య శ్రీవిభునిఁగా నాత్మం దలం పొందఁగా
శాంతిం బొంది నుతి ప్రకార విలస త్సాంద్రోక్తి సంభావనన్. 113

ప్రతి : ముర+అంతకుండు = శ్రీకృష్ణుఁడు; సంతోషించి విడువన్ = విడిచిపెట్టఁగా; శంభుజ్వరంబు; ఆ పంతంబు = ఆ విధము (శ.ర); అప్రతిగణ్యరూపము +అగుచున్ = సాటిలేక లెక్కించుటకు (పొగడుటకు) వీలుకాని రూపము కలదై, పాద ప్రణామ క్రియా+ అత్యంతంబైన సపర్యన్ = పాదములకు నమస్కరించు అధికమైన సేవచేత; శ్రీవిభునిన్ +కాన్ = మహాలక్ష్మీపతిగా; ఆత్మన్ తలంపు+ ఒందఁగాన్= మనస్సులో (శ్రీకృష్ణుఁడే విష్ణువని) తలంచి; శాంతిన్+పొంది = నిలుకడను పొంది (ఎట్టి భ్రమలు లేనిదై, నిశ్చలమైన పవిత్ర భావముతో, విష్ణువే పరమోత్కృష్ట దైవమని గ్రహించినదై); నుతి ప్రకార విలసత్ సాంద్ర+ఉక్తి సంభావనన్= స్తోత్ర రీతిచే (క్రమముచే) విలసిల్లు, మృదువైనదియును సమృద్ధమైనదియు నైన మాటల యొక్క చక్కని అభిప్రాయములతో.

తా : శ్రీకృష్ణుఁడు, సంతోషముతో, విడిచిపెట్టెను. శివ జ్వరము తేజోవంతమైన, వర్ణించుటకు అలవి కాని రూపము కలదై నమస్కారాది క్రియలచే గొప్ప సేవచేసి,

జ్ఞానోదయ మగుటచే శ్రీకృష్ణుఁడే మహాలక్ష్మీపతి అయిన మహావిష్ణువని అతఁడే పరమోత్కృష్ట దైవమని శాంతిని పొంది, నుతుల రీతిచే, వికసించు మాటల చక్కని అభిప్రాయములతో (మీఁది వచనముతో).

వ. ఇట్లు స్తుతియించె. 114

తా : ఈక్రింది విధముగా (విష్ణు పారమ్యమును) స్తుతించెను.

శా. "కృష్ణాంగాయ నమో నమోమురభిదే కేశిప్రహర్త్రే నమో
నిష్ణాతాయ నమో నమో బలిజితే *నిస్వాపభర్త్రే నమోః
కృష్ణేష్టాయ నమో నమో మధుభిదే క్లేశానుశాస్త్రే నమో
ధృష్ణోక్తాయ నమో" యనంగ శుభముల్ దీపించు మా కెప్పుడున్. 115

ఇందు పదములలో చతుర్థీ విభక్తి ప్రత్యయములు అంతమందున్నవి.

నమోః నమః నమస్కారము, అన్నింటికి అన్వయించుకొనవలెను.

ప్రతి : కృష్ణ+అంగాయ = నల్లని శరీరముకల వాఁడును; మురభిదే = మురుని చీల్చిన వాఁడును; కేశిప్రహర్త్రే = కేశిని వధించిన వాఁడును; నిష్ణాతాయ = నిపుణుఁడును; బలిజితే = బలిని జయించిన వాఁడును; నిస్వాప భర్త్రే = జాగరూకుఁడైన నాయకుఁడును; పాఠాం. నిష్పాప పాత్రే = పాపదూరుఁడైన, యోగ్యుఁడును; కృష్ణ + ఇష్టాయ = అర్జునునకు ఇష్టుఁడును; మధుభిదే = మధువును చీల్చిన వాఁడును; క్లేశ+అనుశాస్త్రే = కష్టములను అను శాసించిన వాఁడును; ధృష్ణ+ఉక్తాయ = ధీరులచే (విశ్వాసము కలవారిచే) చెప్పఁబడు వాఁడును అయిన వానికొఱకు; నమః అనంగన్; మాకు+ఎప్పుడున్; శుభముల్; దీపించున్ = ప్రకాశించును.

వ్యా. నమః + అనంగన్ > నమో యనంగన్. ఇట విసర్గలోపము, అత్వమునకు ఓత్వము, యడాగమము. సంధి, బాల - 50, 51, 4.

### మత్తకోకిల

"ఈశ్వరాయ మహాత్మనే దనుజేశ పంక వివస్వతే
శాశ్వతాయ ధరాధృతేంబుజ చక్ర శార్ఙ్గ గదాధరా
యాశ్వమేధ ఫలైక సంస్తు తిహారి వాఙ్మని రక్షిణే
విశ్వరక్షణ హేతవే ప్రభవిష్ణ వేఽస్తు నమో" యనున్. 116

* నిష్పాపపాత్రే

ఈ పద్యమందును, పదములలో చతుర్థీ విభక్తి ప్రత్యయములు అంతమందున్నవి.

ప్రతి : ఈశ్వరాయ = ఐశ్వర్యము కలవాఁడును; మహా+ఆత్మనే = గొప్ప ఆత్మ కలవాఁడును. దనుజేశ పంక వివస్వతే = రాక్షసరాజనెడి బురదకు సూర్యుఁడును; శాశ్వతాయ = నిత్యుడును; ధరా ధృతే = భూమిని ధరించిన వాఁడును; అంబుజ, చక్ర శార్‌ఙ్గ గదా ధరాయ = శంఖము, చక్రము, శార్‌ఙ్గ మను పేరు కల విల్లు, గదను ధరించిన వాఁడును; అశ్వమేధ ఫల+ఏక సంస్తుతి హారి వాక్+ముని రక్షిణే = అశ్వమేధయాగ ఫలముగా ప్రధానమైన స్తోత్రము యొక్క మనోహరమైన వాక్కులు గల మునులను రక్షించువాఁడును; విశ్వరక్షణ హేతవే = లోక రక్షణమునకు కారణమైనవాఁడును; ప్రభ విష్ణవే = జ్యోతి సర్వత్ర వ్యాపించు వాఁడును అయినవానికొఱకు;అస్తు, నమః = నమస్కారము.

వ్యా. 1 : ధృతే + అంబుజ > ధరాధృతేఽంబుజ
విష్ణవే+అస్తు > విష్ణవేఽస్తు. పూర్వరూపసంధి
2. వాక్ +ముని > వాఙ్మని. అనునాసిక సంధి.

ఛం. మత్తకోకిల పాదమునకు ర, స, జ, జ, భ, ర (గణములు), యతి పదునొకండవ అక్షరము.

మ. సుర మర్త్యోరగ విష్టప త్రితయ సంక్షోభంబు గావించుచున్
విర సాధిక్య విశేష పోషణ మిళ ద్వీర ప్రలాపంబులన్
సరి లే రంచుఁ జెలంగు దైత్య విభునిన్ స్తంభంబులోఁ బుట్టి శ్రీ
నరసిం హాకృతితో వధించిన నిను న్సంభావనన్ మ్రొక్కెదన్. 117

ప్రతి : సురమర్త్య +ఉరగ = దేవతల యొక్కయు; మానవుల యొక్కయు; నాగుల యొక్కయు; విష్టప్రత్రితయ = మూడులోకములకును; సంక్షోభంబు కావించుచున్ = కలఁత కలిగించుచు; విరస+ఆధిక్య విశేష పోషణ మిళత్ వీర ప్రలాపంబులన్ = ద్వేషము యొక్క ఆధిక్యమును, ఎక్కువ పెంపుతో కూడిన వీరత్వము యొక్క పలుకులతో; సరి లేరు+అంచున్ = సాటి లేరనుచు; చెలంగు = ఒప్పు; దైత్య విభునిన్ = రాక్షస రాజగు హిరణ్యాకశిపుని; స్తంభములోన్ పుట్టి; శ్రీనరసింహ+ఆకృతితోన్ = శోభాయుతమైన నరసింహుని రూపముతో; వధించిన నినున్ చంపిన నిన్ను; సంభావనన్ = గొప్పభక్తితో; మ్రొక్కెదన్.

తా : సుర నర నాగ లోకములకు, ముప్పు కలిగించుచు సురలను నరులను నాగులను బాధించుచు ద్వేషాతిశయ పోషణముతో కూడిన వీరవచనములతో నాకు ఎవ్వరును సాటిలేరు, అని ప్రవర్తించుచున్న హిరణ్యకశిపుని, స్తంభము నుండి

నరసింహుని ఆకారముతో అవతరించి, హరించిన ఓ దేవదేవ! భక్తితో నీకు నమస్కరించుచున్నాను.

ఈ స్తుతి మూలములో లేదు. సోమరాజు పల్లె సమీపమున వెలసి యుండు సింగరాయకొండ నృసింహ దేవుని స్తుతిగా కన్పట్టుచున్నది. (ప్రవచనము ఉత్తర హరివంశము - 1996).

సీ. 'తాటకా జీవన స్థైర్యంబు శరభాను
సంచయ ప్రభలకుఁ జవులు చూపి
ఖరదూష ణానీక వరపత్త్ర నివహంబు
నాశుగపఙ్క్తిఁజీకాకు పఱచి
రాజత్తర కబంధ రాక్షసు జంఘాల
పత్త్రి సంఘంబుల పాలు చేసి
పౌలస్త్య వరశిరః పద్మ సందోహంబు
దన శిలీముఖములఁ దవులఁ జేసి

ఆ.వె. రాఘవత్వమందు రణ సరోలీలలఁ
గ్రాలు చున్న నిన్నుఁ గన్నులార
జూడఁ గంటి జన్మ సుఖ మెల్లఁ బొడగంటి
ముదముతోడఁ జేరి మ్రొక్కఁగంటి." 118

ప్రతి : తాటకా జీవన స్థైర్యంబున్ = తాటక అనెడి రాక్షస స్త్రీయొక్క బ్రతుకు అనెడి నీటి యొక్క నిలుకడను; శర భాను సంచయ ప్రభలకున్ = బాణములు అనెడి సూర్యుల సమూహము యొక్క కాంతులకు; చవులు చూపి = రుచి చూపి; ఖర దూషణ + అనేక వర పత్త్ర నివహంబున్ = ఖరుఁడు దూషణుఁడు అనెడి రాక్షసులయొక్క సేనలు అనెడి ఆకుల సమూహమును; ఆశుగ పంక్తిన్ = బాణములు అనెడి వాయువుల వరుసతో; చీకాకు పఱచి = ఎగురఁజేసి, కలచి వైచి; రాజత్ తర కబంధ రాక్షసున్ = మిక్కిలి ప్రకాశించు కబంధుఁడు అనెడి రాక్షసుని (మొండెమును); జంఘాల పత్త్రి సంఘంబుల పాలుచేసి = వేగముగా పోవునట్టి బాణములు అనెడి పక్షుల సమూహములకు వశముచేసి; పౌలస్త్యవర శిరః పద్మ సందోహంబున్ = రావణుని యొక్క శ్రేష్ఠములైన తలలు అనెడి కమలముల సమూహమును; తన శిలీముఖములన్ = బాణములు అనెడి తుమ్మెదలతో; తవులన్+చేసి = నాశము చేసి; రాఘవత్వమందున్ =

రఘువంశము అనెడి సముద్రమందు; రణసరస్+లీలల న్ = యుద్ధ మనెడి కొలనిలో విలాసములతో; క్రాలుచున్ + ఉన్న = శోభించుచున్న, మెఱయుచున్న; నిన్నున్; కన్నులారన్ = కన్నులకు తృప్తిగా; చూడన్ + కంటిన్ = చూడఁగలితిని; జన్మ సుఖము + ఎల్లన్ = ఈ పుట్టుకలో కోరఁదగిన సుఖములను అన్నింటిని; పడగంటిన్ = పొందితిని; ముదము తోడన్ = సంతోషముతో; చేరి = సమీపించి; మ్రొక్కన్ +కంటిన్ = నమస్కరింపఁగల్గితిని.

తా : తాటక బ్రదుకు అనెడి నీటి యొక్క నిలుకడను నీ బాణములు అనెడి సూర్యుల సమూహముల కాంతులు హరించినవి. ఖరదూషణుల సేనలు అనెడి ఆకుల మొత్తమును నీ బాణములు అనెడి వాయువుల వరుసలు ఎగురఁగొట్టినవి. కబంధ రాక్షసుని, వేగముగా బోవు బాణములు అనెడి పక్షుల మొత్తము వశపఱచినవి (తలయును కాళ్లు లేని అతని మొండెము . పక్షులకు ఎర అయినది). రావణుని శిరస్సులు అనెడి కమలములసమూహమును బాణములు అనెడి తుమ్మెదలు నాశము చేసినవి, అట్లు రఘువంశము అనెడి సముద్రములో యుద్ధ మనెడి కొలనిలో క్రీడలతో ఒప్పుచున్న నిన్ను కన్నులకు తృప్తిగా చూచితిని. ఈ జన్మ సుఖములను అంతటిని పొందితిని. నిన్ను చేరి నమస్కరింపఁగలిగితిని.

అలం : శ్లిష్ట రూపకము. 1. తాటకాజీవన 2.ఆశుగ పంక్తి 3. పత్త్రి సంఘంబులు. 4. శిలీముఖములు.

తాటక : భర్త సునందుఁడు, మారీచ సుబాహువులు సుతులు. ఆ రాక్షసి అగస్త్యుని శాపముచే వికృతరూపమును పొంది, శ్రీరామునిచే మరణమును పొందెను.

ఖర దూషణులు : అన్నదమ్ములు. రావణునికి పినతల్లి కుమారులు. శూర్పణఖకు సాయపడుటకై ప్రయత్నించి శ్రీరామునిచే ప్రాణములను కొల్పోయిరి.

కబంధుఁడు : తలయును, కాళ్లను లేవు. చేతులు చాల పొడవైనవి. రామ లక్ష్మణులు ఇతని చేతికి చిక్కిరి. శ్రీరాముఁడు ఇతని చంపెను.

పౌలస్త్యుడు : పులస్త్యుని వంశము వాఁడు రావణుఁడు. విశ్రవసునకు కైకసికి జన్మించెను. చెల్లెలు శూర్పణఖ. శ్రీరామచంద్రుఁడు రావణుని వధించెను.

రఘుమహారాజు : దిలీపుని పుత్రుఁడు రఘుమహారాజు. రఘువు యొక్క పుత్రుడు అజుఁడు. అజుని పుత్రుడు దశరథుఁడు. దశరథుని సుతులు శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు, వీరందఱు రఘువంశమునకు చెందినవారు.

మూలములో శ్రీరామావతార స్తుతి లేదు. సోమన కావించిన స్తుతి, సోమరాజుపల్లికి నాతి దూరములో నుండు చదలువాడలోని రఘునాయకుఁడనవచ్చును. ఆ కాలములో అదొక ప్రసిద్ధమైన ప్రాచీనాలయము. నెల్లూరు మండలమునుండి వచ్చిన రెడ్లు నెలకొల్పిన నెయ్యంపు దేవుఁ డతఁడు. ఆ చదలు వాడలో నివసించి శంభుదాసుఁడు 'హరివంశమును' రచించి వేమారెడ్డికి అంకితమిచ్చెను.

సోమరాజుపల్లెయే సోమన తొలి నివాసదేశ మనుటకు నృసింహదేవుని స్తుతియు రఘునాయకుని స్తుతియు ఆంతరంగిక సాక్ష్యములుగ నున్నవి.

వ. అనుచు బహుప్రకారంబుల వినుతించి సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి
శాంకరజ్వరంబు నారాయణున కి ట్లనియె. 119

తా : అని కృష్ణుని పెక్కు విధముల శివజ్వరము స్తోత్రము చేసి తన ఎనిమిది అవయవములను, నేలను తాఁకించి సాగిల పడి నమస్కరించి, ఇట్లనెను.

కం. 'దనుజాధీశ వినాశన!
వనజాక్ష! భవజ్జ్వరంబు వారించి మహి
న్ననుఁ గరుణతోడఁ జూడుము
వినుతించి నమస్కరింతు వీరవరేణ్యా? 120

తా : "రాక్షస రాజ వినాశకా! కమలనయనా వీరులలో శ్రేష్ఠుఁడా! కృష్ణా! నీవు నియోగించిన జ్వరమును నిరోధింపుము. ఈ లోకములో నన్ను దయతో రక్షింపుము. నిన్ను నుతించుచు నమస్కరించుచున్నాను".

వ్యా. భవత్+జ్వరంబు > భవజ్జ్వరంబు, శ్చుత్వసంధి.

ఆ.వె. అనుడుఁ గైటభారి యతి తుష్ట హృదయుఁ డై
'యట్ల కాక మజ్జ్వరాధివిభుఁడు
నిదె యడంగు మీర లిద్దఱు లోకంబుఁ
బీడ సేయఁ జంపఁ బెంపు గలిగి. 121

తా : శివజ్వరుని ప్రార్థనను విని శ్రీకృష్ణుఁడు సంతోషించి, మిక్కిలి తృప్తి చెందిన హృదయము కలవాఁడై కరుణతో అట్లే అగుఁగాక నా ఆనతి ప్రకారము, నా జ్వరరాజు

ఇప్పుడే శమించును. మీరు ఇరువురును, లోకమును బాధించుటకు, కరుణించుటకు నాశము చేయుటకు మహత్వము కలిగి (మీఁది పద్యముతో).

వ్యా. మత్ + జ్వరము > మజ్జ్వరము శ్చుత్వసంధి.

నానా : పీడ = బాధ, కరుణ, సిగదండ, సరళ వృక్షము.

కం. 'నీవు మదీయ జ్వరమును
ద్యావాపృథివీ ప్రసిద్ధతా వైభవ నా
నావిధ చరిత్రములతో
నీ వసుధం బరఁగుఁ' డనుడు నెంతయు నెమ్మిన్. 122

అర్థ : ద్యావా పృథివీ ప్రసిద్ధతా వైభవ = దివియందు, భూమియందు, కీర్తి, ఐశ్వర్యము; నెమ్మిన్ = ప్రేమతో.

తా : "నీవును నా జ్వరమును, దివియందు, భువియందు, ప్రసిద్ధియు, వైభవమును కలిగి, పలువిధములైన క్రొత్త చరిత్రలతో ఈ ధరణిలో జీవింపుఁడు" అని మిక్కిలి ప్రేమతో ఆశీర్వదింపఁగా (మీఁది వచనముతో).

నానా : నెమ్మి = ప్రేమము, నెమ్మది, సంతోషము, క్షేమము, నెమిలి.

వ. శాంకర జ్వరంబు జనార్దనున కి ట్లనియె. 123

తా : శ్రీకృష్ణుని ఆనతిని, విని శివజ్వరము, ఇట్లు విన్నవించెను.

**మత్తకోకిల.**

'నేను దైత్య నిషూదనుం డగు నీలకంఠ కృతుండ నై
యే నయంబును లేక మర్త్యుల యేపు మాపి చరించి దు
ర్మాని నై పిదపన్ భవ జ్జ్వర రాజ నిర్మథన స్ఫుర
త్తానవ వ్యథ నొంది కింకరదైన్య మొందితి' నావుడున్. 124

ప్రతి : నేను; దైత్య నిషూదనుండు = రాక్షసుల వధించు వాఁడు; అగు; నీలకంఠ కృతుండనై = శివునిచే సృజింపఁబడినవాఁడనై; ఏ నయంబును = ఏ నీతియును లేక; మర్త్యుల = మానవుల; ఏపు = వృద్ధి; మాపి = చెఱిపి; చరించి = తిరిగి; దుర్మానినై = దుష్టమైన గర్వము కలవాఁడనై; పిదపన్; భవత్ + జ్వర రాజ నిర్మథన స్ఫురత్ + తానవ వ్యథన్ = నీ జ్వరరాజు వలన హింసచే

తోఁచు (కలుగు) సన్నగిల్లు బాధను (కృశించి) ఒంది; కింకర దైన్యము = సేవకుని హీనదశ; ఒందితిన్; నావుడున్.

తా : 'నేను రాక్షసాంతకుఁడను, ఆ పరమ శివునిచే జన్మను పొంది, ఎట్టి నీతిని పాటింపక మానవుల పెంపును చెఱిచితిని. పెద్దగర్వమును కలిగి ప్రవర్తించితిని. ఇప్పుడు మీరు నియోగించిన విష్ణు జ్వరరాజు హింసించుటచే కృశించి తీవ్ర బాధకు వశమై, దీనుండనై మీసేవకుఁడగు భాగ్యము కలిగినది. (ఈ వినతిలో విష్ణు పారమ్యము ధ్వనించుచున్నది.)

విశే. తానవము, తనుత్వము, తనుభావము, సమానార్థకములు.

కం. హరియును ముదమున 'గిరిశ
జ్వర రచిత మదీయ వినుతి వచన వ్రజమున్
నరుఁడు పఠించినఁ దలఁచిన
జ్వర రహితుం' డనుడు జ్వరుఁడు సంతస మొదవన్. 125

తా : శ్రీకృష్ణుఁడు సంతసముతో, "శంకర జ్వర రచితమైన నా స్తుతి వ్రాతమును నరుఁడు పఠించినను తలఁచినను జ్వరము లేని వాఁడగును" అని వచింపఁగా (మీఁది వచనముతో).

వ. నారాయణునకుఁ బునఃప్రణామం బాచరించి సంగరంబు వెడలెఁ దదనంతరంబ సంరంభ విజృంభితుం డై పీతాంబరుండు నీలాంబరప్రద్యుమ్ను లిరుదెసల బలసి నడువ నసురబలంబులఁ గదిసిన. 126

తా : పిమ్మట శివజ్వరుఁడు శ్రీకృష్ణునకు మరల నమస్కరించి యుద్ధమునుండి తొలఁగెను. పచ్చఁబట్టవాఁడు, (శ్రీకృష్ణుఁడు), వెంటనే కోపముతో, వేగిరపాటు ఉత్సాహము ఉప్పొంగుచుండఁగా ఇరుప్రక్కలందు, నల్ల బట్టవాఁడు (బలరాముఁడు), ప్రద్యుమ్నుఁడు నడచుచుండఁగా రాక్షససేనను సమీపింపఁగా(మీఁది పద్యముతో).

వ్యా. సంగరంబు వలన నుండి వెడలె. సంగరంబు నుండి వెడలె. "ఉండి" లోపము కారక, ప్రౌఢ, 9, 10, 11

## - : శ్రీకృష్ణ బలభద్ర ప్రద్యుమ్నులు రాక్షస వీరులతోఁ బోరాడుట : -

మ. గరుడస్యందను లైన మూవురకు రక్షశ్శూరసైన్యంబుతో
సుర సంఘా వృతజంభశాత్రవ సభాశోభాఢ్య రంభాంగనా
వర ముఖ్యామర భీరుభాసుర మనోవైదగ్ధ్య రోధోత్సు కో
ద్ధురతా లాలిత యోధ విక్రమ మిళ ద్యుద్ధంబు సిద్ధించినన్. 127

ప్రతి : గరుడ స్యందనులైన = గరుడుఁడు రథమైన (వాహనమైన); మూవురకు; రక్షస్ శూర సైన్యంబుతో=శూరులైన రాక్షస సేనతొ; సుర సంఘ+ఆవృత = దేవతల సమూహముచే చుట్టఁబడి యున్న (నిండిన); జంభ శాత్రవ సభా = జంభుని విరోధి అయిన, మహేంద్రుని సభయందు; శోభా+ఆఢ్య = అలంకారముల జిగిబిగి ఉన్న; రంభా+అంగనా వరముఖ్య + అమర = రంభ మొదలగు గొప్పవారును ముఖ్యమైన వారును అయినట్టి దేవకాంతల యొక్క; భీరు భాసుర మనస్ +వైదగ్ధ్య = (నాట్య ప్రక్రియల యందు) మనస్సులలో, ఆందోళన ప్రకటితమగు ప్రావీణ్యమునకు కారణమైన; రోధ +ఉత్సుక ఉద్ధురతా లాలిత = అడ్డగింపఁబడుచున్న (అల్పమైన) ప్రయత్నము, పటుత్వము, సౌకుమార్యము (నిపుణత కలిగినట్టిదియు; యోధ విక్రమ మిళత్ = యుద్ధ వీరుల బలిమి లేనట్టిదియును కూడిన); యుద్ధంబు, సిద్ధించినన్ = కలుగఁగా,

తా : పిమ్మట గరుడ వాహనులైన బలరామ, కృష్ణ ప్రద్యుమ్నులకు రాక్షస సేనతో యుద్ధము జరిగినది. ఆ సమయమున దేవతలతో నిండిన మహేంద్రుని సభలో అలంకారములతో ఒప్పుచున్న రంభాది అమరకాంతల నాట్య భంగిమలలో ప్రావీణ్యము లోపించినది. దానికి కారణము రాక్షస సేనయందు, యాదవ త్రయముతో, యుద్ధము చేయుటకు ప్రయత్నము పటుత్వము సౌకుమార్యము మందగించినది. వారు పిఱికివారై ప్రవర్తించుచుండిరి. అప్పుడు నాట్యమందు ప్రవర్తించుచు, మహావీరుల మరణమును ఎదురు చూచు అంగనల మనస్సులలో అట్టి వారితో కామ సుఖము లభింపదు అనెడి ఆందోళన ఉత్పత్తి యైనది. కనుకనే వారి నర్తనమందు నైపుణ్యము లోపించినదనుట. యాదవ త్రయము కావించు సమరములో రాక్షస సేన భయముచే కంపించెనని భావము. అంగిరసుని మరణము, శివ జ్వరము యొక్క ఓటమి రెండును, కలిసి, రాక్షసుల చిత్త వృత్తిని చెదర గొట్టుటకు ముఖ్య కారణము లైనవి. ప్రాణ భీతిచే, వీరులు శౌర్యమును ప్రదర్శింప లేకపోయిరి. పిఱికి వారై మరణించిన యోధులను రంభాదులు, ఆదరింపఁ జాలరు. మహావీరులు మరణించుట లేదని వారిలో చిత్తవృత్తి చెడినది

కం. కరులను హరులను దేరుల
నరులఁ దెరలఁ బోర శౌరి నలఁచుం గలఁచుం
గరములు నురములు శిరములు
సరములుగాఁ గ్రుచ్చు మెచ్చు జరగుం బరఁగున్. 128

తా: శ్రీకృష్ణుఁడు, యుద్ధములో, ఏనుఁగులను, గుఱ్ఱములను, తేరులను, బంటులను, తొలఁగించుచు నలఁగ గొట్టి, కలఁతను కలిగించెను. చేతులు, ఱొమ్ములు, తలలు, దండలుగా గ్రుచ్చునట్టి నేర్పును కన్పట్టఁజేయుచు విహరించెను.

వ. ఇట్లు బడబానల కీలాకలాప సదృశంబు లగు శరంబులం బరబలంబులం బఱపి తత్సైన్యంబు దైన్యంబు నొందించి సింధు కన్యాధవుండు పాంచజన్యం బొత్తె.-రోహిణీ నందనుండు సనందనుం డై శంఖంబు పూరించె, నప్పుడు రమావల్లభ భల్ల ప్రహతంబు లై డొల్లుభటుల తలలు తాల ఫలంబులంబోలం దదుపరిన్నృత్యమాన కంక గృధ్ర పర్ణంబులు పర్ణపుటంబుల ననుకరింప మధుమథన ప్రదరదళితంబు లగు మకుట మాణిక్యంబుల మెఱుంగుల గములు నిజ జయలక్ష్మి నీరాజన దీప ప్రభారాజులుగాఁ దదనురూపంబులయి ధరం దొరుఁగు సితాతపత్రంబులు, రజత భాజనంబులు గాఁ బీతాంబ రాంబక భీత నిశ్వస త్కరి కర శీక రాసారంబు గగన మందాకినీ బిందుసందోహంబులం దనకు శిశి రోపచారంబులు చేసిన చందంబుఁ దెగడఁ, దదుచితంబు లయి మీఁదికి నెగయు కుంభి కుంభ ముక్తాఫలంబులు సుర ముక్త సుమనో వర్ష శోభాకర్షణంబు చేయ, నన్యోన్య బాణఘట్టనంబున నెగసి మింట నంటు మంటలు సురనారీ వీరకర గ్రహణ హోమంబు విడంబింప, నివ్విధంబునం బ్రధన కుశలుం డై సమంగళుం డైన యనంగ జనకుం జూచి, మనంబున మెచ్చు పెచ్చు పెరిఁగి, బలభద్రుండు రౌద్రాకారుం డై సహోదరసహాయుం డై లాంగలంబున మతంగజంబులం బడఁ దిగిచి సూత రథ్యసహితంబుగా రథంబులు చదిసినఁ గదిసిన కడంకతోఁ, బ్రధనప్రవీణ రథికులు

పలుగాఁడి బ్రద్దసందుల డిగ నుఱికి చింత విడిచి పంతంబులు కలిగి వఠారితనంబునం గఠారువు వెఱికికొని యెదిర్చినం జూచి, కసిమసంగి ముసలంబునం గైదువులు విఱుగ వ్రేసినం దునుకలు దమయంగంబులు నాటిన సొలసి తెలిసి, విబుధ వధూటీ కర గ్రహణ నిషేధ క్రోధంబునం దనకట్టెదుర నిలిచిన సుర నగరంబున కరుగంజేసి, తత్పర్యంత యుధ్యమాన హయారోహకులు తనపైఁ దఱిమి వఱలిన నీసున వ్రేసి గాసిలం జేసి మొదలం దనచేతం దెగిన స్యంద నారోహకులకు విందులు సందడించునట్లుగా వ్రమందించి చిందఱవందఱ చేసి సానందుం డైన కందర్పపాలుం జూచి, యతనికి బాసట యై ప్రద్యుమ్నుండు చాపంబు గుడుసు పడం దిగిచి, పరివేష భాను మండల చండఖద్యోత ద్యోతమాన సముద్యద్దేహుం డై కాలాంతకునకు వింత యగు పంతంబు గఱపువాఁడునుం బోలెఁ, బుర దహనంబునాఁటి రుద్రునకు భద్ర రౌద్రంబు నేర్పరింప నేర్పు గలిగి, కౌశిక జాజ్వల్యమాన జ్యాజ్వాలా మయూఖ రేఖా నర్గళ ప్రేంఖోళన భాసురుం డయి యసుర బలంబునకుం జలంబునం బ్రదరంబుల దరంబులు పుట్టించియుఁ, గరంబుల దట్టించియు రూపు మాపియు నేపుఁ జూపియుఁ గరంబులు ఖండించియు శిరంబులు తుండించియు గజంబులం బఱపియు ధ్వజంబులం జెఱపియు సంభ్రమంబున విజృంభించు నవసరంబున. 129

ప్రతి : ఇట్లు, బడబా+అనల -కీలాకలాప - సదృశంబులు + అగు = బడబాగ్ని జ్వాలల సమూహముతో సమానములైన (సముద్రమధ్యస్థాగ్నికి బడబ) అని పేరు. బడబ అనఁగా ఆఁడు గుఱ్ఱము వలె ఉండు అగ్ని; శరంబులన్ = బాణములతో; పర-బలంబులన్ = శత్రుసేనలను; పఱపి = బాధించి; తద్+సైన్యంబున్ = వారి సేనను; దైన్యంబున్ + ఒందించి = దీనత నొందఁజేసి; సింధు కన్యాధవుండు = సముద్రపుత్రిక (లక్ష్మి) యొక్క భర్త విష్ణువు (కృష్ణుఁడు); పాంచజన్యంబు = ఆపేరుగల తన శంఖమును; ఒత్తెన్ = పూరించెను; రోహిణీ నందనుండు = రోహిణీదేవి కుమారుఁడు, బలరాముఁడు; సనందనుండు+ఐ = సంతోషముతో; కూడిన వాఁడయి; శంఖంబు పూరించెన్; అప్పుడు రమా వల్లభల్ల-ప్రహతంబులు +ఐ = లక్ష్మీ భర్తయైన

విష్ణుని (కృష్ణుని యొక్క) బల్లెములచే మిక్కిలి కొట్టఁబడిన వయి; డొల్లు = రాలునట్టి; భటుల తలలు = శూరుల శిరస్సులు; తాల ఫలంబులన్ = తాటి పండ్లను; పోలన్ = ప్రోలఁగా; తద్ + ఉపరి +నృత్యమాన+కంక+గృధ్ర+పర్ణంబులు = వాని మీఁద నాట్యము చేయుచున్న రాపులుఁగులయు (రాబందులయు), గ్రద్దలయు, ఱెక్కలు; పర్ణ+పుటంబులన్ = ఆకు దొప్పలను; అనుకరింపన్ = పోలఁగా; మధు+మథన+ప్రదర+దళితంబులు+అగు = శ్రీకృష్ణుని యొక్క (మధు అనెడి రాక్షసుని జంపినవాఁడు) బాణములచే చీల్పఁబడిన వగు; మకుట+మాణిక్యంబుల = కిరీటము లందలి మణుల యొక్క; మెఱుంగుల+గములు = కాంతుల సమూహములు; నిజ+జయ+లక్ష్మీ+నీరాజన+దీప+ప్రభా+రాజులు+కాన్ = తన దైన జయలక్ష్మి యొక్క హారతి దీపముల కాంతుల వరుసలు కాఁగా; తద్ + అనురూపంబులు + అయి = వానికి తగినవయి; ధరన్ = నేలపై; తొరుఁగు = పడు; సిత+ఆతపత్రంబులు = వెల్ల గొడుగులు; రజత+ భాజనంబులు +కాన్ = వెండి పాత్రములు కాఁగా; పీత + అంబర + అంబక + భీత + నిశ్వసత్ + కరి + కర + శీకర + ఆసారంబులు = శ్రీకృష్ణుని బాణములవలన భయపడినవై నిట్టూర్చుచున్న ఏనుఁగుల తొండములయొక్క, తుంపర లనెడి జడివాన; గగన+మందాకినీ+బిందు+సందోహంబులన్ = ఆకాశగంగా జలబిందువుల సమూహములచే; తనకున్; శిశిర+ఉపచారంబులు = శీతలోపచారములు (చల్లఁదనము కొఱకుఁజేయు సేవలు); చేసిన చందంబున్ = చేసిన విధమును; తెగడన్ = నిరసింపఁగా; తద్+ఉచితంబులు+అయి = వానికి తగినవయి; మీఁదికిన్ = పైకి; ఎగయు = ఎగురునట్టి; కుంభి+కుంభ+ముక్తాఫలంబులు = ఏనుఁగుల కుంభస్థలములందలి ముత్యములు; సుర+ముక్త +సుమనస్+వర్ష+శోభా+ఆకర్షణంబు చేయన్ = దేవతలచే విడువఁబడిన పూలవాన అందము యొక్క ఆకర్షణమును (లాగుటను) చేయఁగా (తొలఁగింపఁగా) అన్యోన్య+బాణ+ఘట్టనంబునన్ = ఒండొరుల బాణముల రాపిడి చేత; ఎగసి = ఎగిరి; మింటన్ = ఆకాశమునందు; అంటు మంటలు; సుర+నారీ+వీర+కరగ్రహణ హోమంబున్ = దేవతాస్త్రీలయొక్క వీరుల పాణిగ్రహణ హోమమును; విడంబింపన్ = అనుకరింపఁగా; ఈ+విధంబునన్ = ఈ రీతిగా; ప్రధన కుశలుండు +ఐ = యుద్ధ నిపుణుఁడయి; సమంగళుండు +ఐన = శుభములతో కూడిన; అనంగ జనకున్ = మన్మథుని తండ్రిని, శ్రీకృష్ణుని చూచి; మనంబునన్ = మనస్సునందు; మెచ్చి; పెచ్చు పెరిఁగి; బలభద్రుండు = బల రాముఁడు; రౌద్ర + ఆకారుండు +ఐ= కోపము తోడి రూపము గలవాఁడయి; సహోదర+సహాయుండు+ఐ = సోదరుల సాయము గలవాఁడయి; లాంగలంబునన్ = నాఁగటితో; మతంగజంబులన్ = ఏనుఁగులను; పడన్+తిగిచి = పడునట్లు లాగి; సూత+రథ్య+సహితంబుగాన్ = సారథితోను; గుఱ్ఱములతోను; రథంబులు; చదిసినన్ = నలఁగ గొట్టఁగా; కదిసిన కడంకతోన్ = కలిగిన పూనికతో; ప్రధన+ప్రవీణ+రథికులు = యుద్ధ నిపుణులైన రథవీరులు; పలుగాఁడి బ్రద్ద సందులన్ = శకటావయవముల బ్రద్దల

సందులనుండి; డిగన్+ఉఱికి= దిగుటకు ఉఱికి; చింత+విడిచి; పంతంబులు కలిగి = పట్టుదలలు కలిగి; వఠారితనంబునన్=నేర్పుతో; కఠారువు = పెద్దకత్తిని; పెఱికికొని+లాగికొని; ఎదిర్చినన్ = తాఁకఁగా చూచి; కసిమసంగి = పొంగి; ముసలంబునన్ + రోఁకలి వంటి ఆయుధములతో; కైదువులు = కత్తులు, విఱుగన్ +వ్రేసినన్ = విఱుగునట్లు కొట్టఁగా; తునుకలు = ముక్కలు; తమ+అంగంబులు = తమ అవయవములందు; నాటినన్ = గ్రుచ్చుకొనఁగా, సొలసి = మూర్ఛ పోయి; తెలిసి = తెప్పరిల్లి; విబుధ-వధూటీ -కరగ్రహణ - నిషేధ-క్రోధంబున = దేవతాస్త్రీల (రంభాద్యప్సరసల) పాణిగ్రహణమున కైన అడ్డు వలన కోపముతో, (యుద్ధమున వీర మరణమునందిన వారికి రంభాద్యప్సరసల ఆలింగనము లభించును. అది లేకపోవు ననుకోపముతో); తన కడు+ఎదురన్ = తన ఎట్టయెదుట; నిలిచినన్ = నిలువఁగా; సుర+నగ రంబునకున్ = స్వర్గమునకు, అరుగన్ +చేసి = వెడలునట్లు చేసి; తద్+పర్యంత + యుధ్యమాన+హయ+ఆరోహకులు = అంతవఱకును యుద్ధము చేయుచున్న ఆశ్వికులు; తన్పైన్; తఱిమి+అఱిమినన్ = పోవునట్లు చేసి, ఎదుర్కొనఁగా; ఈసునన్= కోపముతో; వ్రేసి = కొట్టి; గాసిలన్ + చేసి = బాధించి, మొదలనే = ముందర; తనచేతన్, తెగిన = చచ్చిన; స్యందన+ఆరోహకులకున్ = రథికులకు; విందులు; సందడించునట్లుగాన్ = అధికమగు విధమున; వ్రమందించి = చంపి; చిందఱవందఱ చేసి = చెల్లాచెదరు చేసి; స+ఆనందుండు+ఐన = ఆనందముతో కూడిన; కందర్పపాలున్ = మన్మథుని పాలించినవానిని శ్రీకృష్ణుని; చూచి; అతనికిన్; బాసట+ఐ = తోడయి; ప్రద్యుమ్నుండు; చాపంబు = విల్లు; గుడుసు పడన్ + తిగిచి = గుండ్ర మగునట్లు లాగి; పరివేష+అభిమండల+చండ+ఖద్యోత+ద్యోతమాన+సముద్యత్+దేహుండు+ఐ = కాంతి వలయము తోడి, తీవ్రమగు సూర్యునివలె ప్రకాశించుచు ప్రయత్నించుచున్న శరీరము కలవాఁడయి; కాలాంతకునకున్ = రుద్రునకు; వింత+అగు-పంతంబు = అచ్చెరువు కొలుపు పట్టుదల; కఱపు వాఁడునున్ + పోలెన్ = బోధించువానివలె; పుర+దహనంబు+నాఁటి = త్రిపురములను దహించునప్పటి; రుద్రునకున్; భద్ర+రౌద్రంబున్ = గొప్ప కోపమును ఏర్పరింపన్ = వివరించి చెప్పుటకు; నేర్పు + కలిగి; కౌశిక-జాజ్వల్యమాన + జ్యా + జ్వాలా + మయూఖ+రేఖా = ఇంద్రునియొక్క, మిక్కిలి ప్రకాశించుచున్న వింటినారియొక్క, కాంతి కిరణములయొక్క రేఖల వలన; అనర్గళ = అడ్డులేని; ప్రేంఖోళన = డోలనము (ఊగుట) చే; భాసురుండు + అయి = ప్రకాశించు వాఁడయి; అసుర-బలంబునకున్ = రాక్షస సేనకు; చలంబునన్ = పంతముతో ప్రదరంబులన్ = బాణములతో; దరంబులు = భయములు; పుట్టించియున్ = కలిగించియును; కరంబులు = చేతులు; దట్టించియున్ = అదలించియును; రూపు మాపియున్ = నశింపఁ జేసియును; ఏపున్ = పెంపును; చూపియును; కరంబులు = తొండములు; ఖండించియున్ = తెగఁగొట్టియును; శిరంబులు = తలలు; తుండించియున్

= నఱకియును; గజంబులన్ = ఏనుఁగులను; పఱపియున్ = పడఁగొట్టియును; ధ్వజంబులన్ = టెక్కెములను; చెఱపియున్ = పాడుచేసియును; సంభ్రమంబునన్ = వేగిర పాటుతో; విజృంభించు+అవసరంబునన్ = చెలరేఁగు సమయమందు.

తా : శ్రీకృష్ణుఁడు, బడబాగ్ని జ్వాలలవలె తన బాణములచే మంటలను వెల్వడఁజేసి వానిచే శత్రువులను బాధించి బలహీనపఱచి, తన శంఖమును పూరించెను. బలరాముఁడును సంతోషించి తన శంఖమును ఊదెను. అప్పుడు శ్రీకృష్ణుని బల్లెములచే కొట్టఁబడి రాలిన భటుల తలలు, తాటిపండ్లవలెను, వానిపై నృత్యము చేయు రాబందుల యొక్కయు, గ్రద్దల యొక్కయు, విప్పారిన ఱెక్కలు, పెద్ద ఆకు దొప్పల వలెనుండెను. శ్రీకృష్ణుని బాణములచే చీల్పఁబడిన సైనికుల కిరీటములందలి మణుల కాంతి పుంజము, తనదైన విజయలక్ష్మి జయ సూచకముగా అర్పించు హారతి దీపముల వెలుఁగులవలె నుండెను. నేలపై పడిన తెల్లని గొడుగులు వెండి పళ్లెముల వలెనుండెను. ఆ సమయమందు, శ్రీకృష్ణుని బాణ ప్రయోగముల ప్రహారములకు భయపడిన ఏనుఁగుల నిట్టూర్పుల వలన వాని తొండముల యొక్క నీటి తుంపురుల జడివాన, శ్రీకృష్ణునకు ఆకాశ గంగానది జలబిందువుల యొక్క శీతలోపచారముల తీరును తిరస్కరించునదిగ నుండెను. (ఏనుగుల తొండములనుండి వెల్వడిన నీటి బిందువులు గంగానదీ జలముల కంటె ఎక్కువ శైత్యమును, ఇచ్చినవనుట). మఱియును తగినవై, ఏనుఁగుల చెక్కిళ్ల నుండి పైకి ఎగురు ముత్యములు, దేవతలు వర్షించు పూవుల సొగసుతో శోభించెను. పరస్పర బాణముల రాపిడి వలన ఆకసమును అంటు మంటలు దేవకాంతలు, వీర మరణమును పొందు యోధులను పరిణయమాడుటకై, కావించు హోమాగ్ని జ్వాలలను అనుకరించెను.

ఇట్లు యుద్ధమందు నేర్పరియై శుభములను కాంచిన కృష్ణుని చూచి బలరాముఁడు, భయంకరమైన రూపమును పొంది సోదరుఁడు సాయపడుచుండఁగా నాఁగటితో ఏనుఁగులు పడునట్లు లాగి వేయుచు రథములను, గుఱ్ఱములతోను సారథులతోను చిదుగఁగొట్టెను. అప్పుడు ప్రయత్నముతో యుద్ధ నిపుణులైన రథికులు, తేరుల కాఁడి కమ్ముల సందులనుండి దిగుటకు ఉఱికి చింతలు వీడి పంతముపూని, సమర్థతతో కత్తులు దూసి, ఎదుర్కొనఁగా, వారిని చూచి, పొంగి, తన ముసలాయుధముతో (రోకలితో) వారి కత్తులను విఱుగఁగొట్టెను. ఆ కత్తుల ముక్కలు, వారి అవయవములలో గ్రుచ్చుకొనఁగా వారు మూర్ఛను పొంది, కొంత సేపటికి తెలివిని పొంది (తేరుకొని),

దేవతా స్త్రీల పాణిగ్రహణమునకు, స్వర్గ సుఖములకు, అడ్డుపడెనను కోపముతో అతని ఎట్ట ఎదుట నిలబడి సమరమునకు సిద్ధ పడిరి. వారిని వెంటనే అవలీలగా అమరావతికి పంపెను. అంతవఱకు గుఱ్ఱము పైనుండి యుద్ధము చేయుచున్న యోధులు తనపై కవియగా ముందు తనచే తెగిన రథికులకు విందులు చేయు విధమున వారిని తాడించి, చంపి, చెల్లాచెదరు చేసెను. ఆ చర్యలకు సంతుష్టుఁడైన శ్రీకృష్ణుని చూచి అతనికి సహాయుఁడైన ప్రద్యుమ్నుఁడు వింటిని వలయాకారముగా లాగి పరివేషముతో కూడిన తీవ్రమైన సూర్యుని వలె ప్రకాశించు శరీరము కలవాఁడై, ప్రళయకాల యమునకు వింతయైన పంతమును నేర్పువానివలె, త్రిపురాసుర దహనుఁడైన శివునకు రౌద్రమును బోధించు నేర్పు కలవానివలె, ఇంద్రుని వింటినారి నుండి వెల్వడు కాంతి కిరణములయొక్క డోలనములచే ప్రకాశించు వాఁడయి, రాక్షస సేనకు పంతముతో బాణములచే భయము పుట్టించియు వారిని రూపుమాపియు ఏనుఁగులను పడఁగొట్టియు టెక్కెములను పాడు చేసియు చెలరేఁగు సమయమున.

సీ. యంత్రకుఁ డాడించి యవనిఁ ద్రోచిన వ్రాలు
బొమ్మలగతి రథ పూగములును
నిర్ఘాతహతిచేత నెఱి దప్పి కూలిన
కుధరాళి చాడ్పునఁ గుంజరములు
సెలయేటి రయమున నిలమీఁదఁ బడ్డ గం
డ శిలలభంగి ఘోటవ్రజంబు
*ధాతృశిల్పాగార పాతభిన్నాంగులై
పడియున్న రూపుల పగిది భటులు

గీ. వికటముగఁ ద్రెళ్ల నొరగెను విచ్చి పఱచెఁ
దొరఁగెఁ బృథ్వీతలంబునఁ దునుక లయ్యెఁ
జండ శార్ఙ్గ శరాసన శాత విశిఖ
జాలముల నేయఁ జలమునఁ జక్రధరుఁడు. 130

అర్థ : చలమునన్ = పంతముతో, చండ = శార్ఙ్గ శరాసన శాత విశిఖ జాలములన్ =

* ధాతుశిలాగార

క్రూరమైన శార్ఙ్గ మను వింటినుండి (వెల్వడిన) వాఁడియైన బాణముల యొక్క మొత్తములతో, వికటముగా = వికృతముగా; నిర్ఘాత హతి చేతన్ = వజ్రాయుధము (పిడుగుల) దెబ్బచే; కుధర+ఆళి = పర్వతముల వరుస; ఇల మీఁదన్ = నేలమీఁద, గండ శిలల భంగిన్ = పెద్ద బండలవలె; ఘోట వ్రజంబున్ = గుఱ్ఱముల గుంపును; ధాతృ శిల్ప+అగార పాత భిన్న+అంగులై = బ్రహ్మయొక్క శిల్ప. ఆలయము పడుటచే విఱిగిన అవయవములు కల; రూపుల పగిదిన్ = చిత్తరువుల వలె, వస్తువులవలె.

తా : శ్రీకృష్ణుఁడు క్రూరమైన శార్ఙ్గమను వింటినుండి వెల్వడు వాఁడియైన బాణములను, శత్రువులపై పట్టుదలతో ప్రయోగింపఁగా, యంత్రకుఁడు ఆడించి నేలపై నెట్టిన పడిపోవు బొమ్మలవలె, తేరుల ప్రోవులు వికృతముగా కూలినవి. వజ్రాయుధపు (పిడుగుల) దెబ్బలచే చీలిపోయి అందము (క్రమము) తొలఁగిన కొండల వరుసలవలె, ఏనుఁగులు విడిపోయి పాఱినవి. సెలయేటి నీటి వేగముచే దొర్లుచు పుడమిపై పడిన పెద్ద బండల వలె, గుఱ్ఱముల గుంపు, నేలపై జాఱినది. బ్రహ్మ శిల్పాలయము, కూలి పడుటచే ముక్కలైన అవయవములు గల వస్తువుల వలె బంటులు, తునుకలై పడిరి.

అలం. 1. ఉపమ, సీసపద్యమున ప్రతి పాదమందున్నది. 2. యథాసంఖ్యము, సీసపద్యమందలి ప్రతిపాదము, తేటగీతి యందలి క్రియలతో వరుసగా అన్వయము కలిగి యున్నది. తేరులు, ఏనుఁగులు, గుఱ్ఱములు, బంటులు నేలపై క్రమముగా ఒరగెన్, పఱచెన్, తొరిఁగెన్, తునుకలయ్యెన్.

ఉ. లోఁగక సంగరస్థలములోనఁ బరాక్రమకేళి చూపుచున్
మూఁగిన దైత్యదానవుల మొక్కల ముక్కునఁ జక్కుచేసి తా
నీఁగల తిండిగాఁ జదిపె నేపున నచ్యుత పూర్వజుండు పై
నాఁగలి సాఁచి రాఁ దిగిచి నాగరథాశ్వ పదాతి సంహతిన్. 131

అర్థ : పూర్వజుఁడు = ముందు పుట్టినవాఁడు అన్న; లోఁగక = లొంగక; తిగిచి = లాగి; మొక్కలము = శౌర్యము; ఉక్కునన్ = దృఢముగా, బలముతో; చక్కు+చేసి = నఱకి; తొలఁగించి.

తా : బలరాముఁడు, లొంగక, యుద్ధ రంగమందు, పరాక్రమ క్రీడయందు కౌశలమును ప్రదర్శించుచు, నాఁగేటిని పైకి చాఁచి, సైన్యమును లాగుచు, దితి సంతతి యొక్కయు దనువు సంతతియొక్కయు శౌర్యమును అణఁచివేసి వారిని అందఱిని ఈఁగలకు తిండిగాఁ జేసెను.

అలం : స్వభావోక్తి.

శా. ప్రద్యుమ్నుండు పయోధి నిమ్నుఁడు మహారావంబు సంధిల్లగా
నుద్య ద్బాణపరంప రానవర తోద్ద్యో తాతివర్షంబుచే
విద్యుత్వ త్ప్ర తిమాన మూర్తి యగుచున్ వీరాద్రులం గప్పఁగా
నుద్యోగింతురు దివ్యకాంతలు వివాహోత్సాహ సంభావనన్. 132

ప్రతి : పయోధి నిమ్నుఁడు = సముద్రమువలె గంభీరుఁడు; (అగు) ప్రద్యుమ్నుండు; మహా+ఆరావంబు సంధిల్లన్ + కాన్ = గొప్ప ధ్వని కలుగఁగా; ఉద్యత్ బాణ పరంపరా+అనవరత+ఉద్యోత+అతివర్షంబుచేన్ = ఉద్యమించుచున్న బాణముల వరుస అనెడి, ఎడతెగని ప్రకాశముతో కూడిన గొప్ప వర్షముచే; విద్యుత్వత్+ప్రతిమానమూర్తి = (మెఱుములతో కూడిన) మేఘముతో సాటియైన ఆకారము కలవాఁడు; అగుచున్; వీర+అద్రులన్ = వీరులు అనెడి కొండలను; కప్పఁగాన్; దివ్య కాంతలు; వివాహ+ఉత్సాహ సంభావనన్ = వారిని పెండ్లావలెనను కోరికలు మొలకెత్తు తలఁపులతో; ఉద్యోగింతురు = ప్రయత్నింతురు.

తా : ప్రద్యుమ్నుఁడు సముద్రము వలె గంభీరుఁడై, గొప్ప ధ్వనితో బాణముల పరంపర అనెడి జడివానతో, మెఱుముల కాంతితో నిండినట్టి మేఘము వలె, శారీరకమైన దృఢత్వముతోను దీప్తితోను, వీరులు అనెడి కొండలను కలియఁగా దేవకాంతలు వారికొఱకై, పరిణయమాడు తలంపులతో, ప్రయత్నింతురు.

అలం : రూపకము

ఉపమేయములు : ప్రద్యుమ్నుఁడు, బాణ పరంపరలు, వీరులు.

ఉపమానములు : పయోధి, అతివర్షము, అద్రులు.

ఛం : దుష్కర ప్రాసము, దకార యకార సంయుక్తాక్షరము.

శా. కాష్ఠాలిన్ శిఖి ముట్టికొన్న కరణిం గాముండు బాహు స్ఫుర
న్నైష్ఠు ర్యాతిశయంబునం బరబలౌన్నత్యం బనిత్యంబుగా
శ్రేష్ఠాస్త్రంబులనేసి వారల సురస్త్రీరత్న కామ్య త్సుధా
గోష్ఠీ తత్పరతా సమంచితులఁగాఁ గోపించి యేసెన్ వెసన్. 133

ప్రతి : కాష్ఠ+ఆలిన్ = కట్టెల వరుసను; ముట్టికొన్న కరణిన్ = నిప్పు అంటుకొన్న విధమున; కాముండు = ప్రద్యుమ్నుఁడు; బాహు స్ఫురత్ = భుజములందు, తోఁచుచున్న; (ప్రకాశించుచున్న); నైష్ఠుర్య + అతిశయంబునన్ = కాఠిన్యము యొక్క అతిశయముచే; పరబల+ఔన్నత్యంబు = పగవారిసేనల ఆధిక్యంబు; అనిత్యంబు + కాన్ = నాశమగునట్లు; శ్రేష్ఠ + అస్త్రంబులన్ =

మేలైన బాణములను ; ఏసి; వారలన్; సురస్త్రీ కామ్యత్ = రంభాది దేవకాంతలచే కోరఁబడుచున్న; సుధా గోష్ఠీ తత్పరతా = అమృత పానము కల మధుర శృంగార చర్చల యందు పాల్గొను కోరికతో; సమంచితులన్ +కాన్ = చక్కగా ప్రవర్తించు వారగునట్లు; కోపించి; వెసన్ = శీఘ్రముగా; ఏసెన్ = పడఁగొట్టెను.

తా : కట్టెల కట్టలలో నిప్పు అంటుకొన్నట్లు, ప్రద్యుమ్నుఁడు, భుజబలాధిక్యముచే, శత్రుసేనల బలాధిక్యము తొలఁగించి బలిష్ఠములైన ఆయుధములను ప్రయోగించి, దేకాంతలు కోరుచున్న అమృతపానముతో కూడిన మధుర శృంగార చర్చలలో ప్రవర్తించుటుకై శీఘ్రముగ వారిని పడఁగొట్టెను.

అలం : ఉపమ : కాష్ఠాలిన్ శిఖి ముట్టుకొన్న కరణిన్.

వ్యు. శిఖి - శిఖలు కలది, అగ్ని.

నానా : శిఖి = నెమిలి, బాణము కోడి, చెట్టు.

కాష్ఠ (ప్ర), కట్టె (వి)

వ. మఱియు ననేకసాయకంబులు పరఁగించిన నసుర సేన చెనకం
జాలక మొనలకుం దలంగియుం గలంగియు నరదంబులలో
దాఁగియుం దూఁగియు ద్విరదంబులలోఁ జిక్కియుం జొక్కియుఁ
దెరువునఁ బో వెఱచియుం బఱచియుం దరువులలోఁ దూఱియుం
బాఱియుఁ బోటువడి పొరలియుం గెరలియు వాటుపడి తెరలియు మరలియు
బహుప్రకారంబులం బఱవం దొడంగె నయ్యవసరంబున. 134

ప్రతి : మఱియున్, అనేక సాయకంబులు = పెక్కు బాణములను; పరఁగించినన్ = వేయఁగా; అసురసేన = రాక్షససైన్యము; చెనకన్ +చాలక = ఎదుర్కొనలేక; మొనలకున్ = సేనల నుండి; తలంగియున్ = తొలఁగియును; కలంగియున్ = కలఁత చెందియును, అరదంబులలోన్ = తేరులో; దాఁగియున్ = దాఁగుకొనియును; తూఁగియున్ = చలించియును; ద్విరదంబులలోన్ = ఏనుఁగులకు; చిక్కియున్ = వశపడియు; చొక్కియున్ = మూర్ఛిల్లియును; తెరువునన్ పోన్ = దారులలో పోవుటకు; వెఱచియున్ = భయపడియును; పఱచియున్ = పరువెత్తియును; తరువులతోన్ = చెట్లలో; తూఱియున్ = ప్రవేశించియును, పాఱియున్ = పరుగిడియును; పోటు+పడి = దెబ్బతిని; పొరలియున్ = దొర్లియును; కెరలియున్ = తొట్రుపాటు చెందియును; వాటుపడి = దెబ్బలచే వాలిపోయియును; తెరలియున్ = బయలు దేఱియును; మరలియున్ = వెనుదిరిగియును; బహుప్రకారంబులన్; పఱవన్ + తొడంగెన్ = పాఱిపోవుటకు మొదలిడెను; ఆ+అవసరంబునన్ = అప్పుడు.

తా : ప్రద్యుమ్నుఁడు పెక్కు బాణములను వేయఁగా రాక్షస సైన్యము తొలఁగియు కలఁతచెందియు, తేరులతో దాఁగుకొనియు, చలించియు, ఏనుగులకు వశపడియు, మూర్ఛను పొందియు, దారిని పోవుటకు భయపడియు చెట్లలో ఇఱుకుకొనియు పరువెత్తియు దెబ్బతినియు దొరలియు తొట్రుపాటు చెందియు దెబ్బలచే వాలిపోయియు, బయలు దేఱియును వెను దిరిగియును, పెక్కు రీతులుగా తప్పించుకొని పాఱిపోవుటకు ప్రయత్నించెను. ఆ సమయమున. (మీఁది పద్యముతో).

నానా : సాయకము = బాణము, కత్తి.

నానా : మొన = కొన, వ్యూహము, సైన్యము, ముందు.

మహాస్రగ్ధర.

శతసాహస్రాశ్వపంక్తుల్ సమయఁగ దశలక్షల్ భటుల్ ద్రెళ్లఁదేరుల్,
క్షితిఁ గూలం గోటిసంఖ్యల్ గెడయఁ గరివ రాశీతి సాహస్రసంఖ్యల్
హత శేషానీక మాజిన్ వ్యథఁబడ మొన లాద్యాయుధంబుల్ ధరన్ వై,
చి తొలంగం బాఱఁ బోరం జిడిముడి వడుచుం జిక్కుచుం బాఱి పోఁగాన్.135

అర్థ : శతసాహస్ర+అశ్వపంక్తుల్ = లక్షగుఱ్ఱముల వరుసలు; సమయఁగన్ = చావఁగా; త్రెళ్లన్ = నశింపఁగా; కూలన్ = పడిపోఁగా; కెడయన్ = మృతి చెందఁగా; కరివర + అశీతి సాహస్ర సంఖ్యల్ = మేలైన ఏనుఁగులు, ఎనిమిది వేల సంఖ్య కలవి; చిడిముడి + పడుచున్ = కలఁత చెందుచు; చిక్కుచున్ = కృశించుచు.

తా : యుద్ధమందు, లక్ష గుఱ్ఱములు, పదిలక్షల బంటులు, కోటి (పెక్కు) రథములు; ఎనుబదివేల ఏనుఁగులు నేలపై పడిపోయినవి. మృతి చెందఁగా, మిగిలిన సేన దిగులు చెంది, ఆయుధములను విడిచి, పోరుటకు తొట్రుపాటు చెందుచు, కృశించుచు పరుగిడిపోవు చుండఁగా (మీఁది వచనముతో).

ఛం. మహాస్రగ్ధర. స త త న స ర ర గురువు - గణములు. 22 అక్షరములు యతిస్థానములు - 9, 16. ప్రాస నియమున్నది.

వ. బాణుండు వారలతో నిట్లనియె. 136

తా : రాక్షసరాజు బాణాసురుఁడు పరుగిడిపోవుచున్న సేనలతో ఇట్లు పలికెను.

ఉ. మానిత మాన [1]ధైత్యకుల మందిర సుందర కీర్తి విస్ఫుర
ద్దానవ వంశజాతు [2]లయి దారుణ శాత మహాస్త్ర సంహతిన్
స్థానముఁ గీర్తియుం గిరిశ సంగతియుం బెడఁబాసి పోదు రే
మానముకంటెఁ బ్రాణములు మంచివియే తలఁపంగ నక్కటా ! 137

తా : అయ్యో! మీరు, మన్నింపఁబడిన ఆత్మ గౌరవము, (ధైర్యకుల) వెఱపులేమి అనువాని తెగకు, నెలవైనట్టియు, నిర్మలమైనట్టియు కీర్తిచేత, విశేషముగా ప్రకాశించుచున్నట్టియును, రాక్షసవంశమునందు పుట్టినవారు. భయంకరములు, పదునైనవియునైన గొప్ప ఆయుధముల సమూహమును, మీరు పొందియున్న గౌరవ ప్రదమైన స్థానమును, శూరులు అనెడి మంచి పేరును, శివునితోడి చెలిమియును, దిగ విడిచి పోవుదురా! తలఁపఁగా ఆత్మ గౌరవముకంటె ప్రాణములు మేలైనవియా? (గొప్పవా)?

అలం : అర్థాంతరన్యాసము.

బాణుఁడు "ప్రాణానపి పరిత్యజ్య, మాన మే వాభిరక్షతు, ప్రాణా స్తరజ్జ చపలాః మాన మాచన్ద్రతారకమ్" అని ప్రాణముల కంటె మానము మిన్న అని ప్రబోధించెను. (డా. జొన్నల గడ్డ)

నానా : కులము=వంశము, తెగ, ఇల్లు, ఊరు, శరీరము, చేదుపాట్ల.

సీ. అని మొనఁ బావకు నైన నాహుతి చేయఁ
దివి రెడు మదిలోని ధీరగుణము
తమ లావు కొలఁదులు దా రెఱుంగర యంచు
జను లెల్ల మిముఁ జేయు సంస్తవంబు
మిన్ను పైఁ బడినను మెలుపుతో నఱ చేతు
లొగ్గఁ జాలుటకు నై యోర్చు లావు
మానిసి గందంబు మాఱు వల్చె నటంచు
నాజిలో వైరుల నడఁచు లాగు

1. ధైర్య 2. లరు.

ఆ.వె. పాఱ విడిచి మీకుఁ బాఱంగ నగు నయ్య
వితత శౌర్యులార వీరులార!
సతత నిశిత శస్త్రసందోహ ధరులార!
దళిత విమతు లార దనుజు లార! 138

అర్థ : అని మొనన్ = యుద్ధ రంగమందు, ముందుభాగమున; పావకునైనన్ = అగ్నిని సైతము; తివిరెడు = ఎదుర్కొనుటకు ప్రయత్నించు నట్టి; లావు కొలఁదులు. బలము యొక్క పరిమితులు, ప్రమాణములు; మెలువుతోన్ = నేర్పుతో; ఒగ్గన్+చాలుటకునై = అడ్డుకొనఁ గలుగుటకై; లావు = (మానసిక మైన) బలము; మానిసి + గందంబు = మనుష్యుని వాసన; మాఱు = పలుమాఱు; వల్చెన్ + అటంచున్ = వాసన కొట్టుచున్నది అని; ఆజిలో = యుద్ధమందు; పాఱన్ + విడిచి= వదలిపెట్టి; పాఱంగ నగున్+అయ్య = (పిఱికి పందలవలె) పరుగిడిపోవుట తగునా?

తా : మహాశూరులారా! వీరులారా! నిరంతరము వాఁడియైన,వివి ధాయుధములను ధరించువారలారా! చీల్పఁబడిన శత్రువులు కలవారా! రాక్షసులారా! యుద్ధమందు, అగ్నినైనను దహించుటకు ప్రయత్నించు మనో ధైర్యము, తమ బలము యొక్క పరిమితి తమకు తెలియదని జనులు అందఱు మిమ్ము చేయు సంస్తుతులను, మిన్ను విఱిగి మీఁద పడినను, నేర్పుతో అఱచేతులతో అడ్డగించు మానసిక స్థైర్యము, మనుష్యుల వాసన వేయుచున్నదని సమరములో వారిని అణఁచు కౌశలము, మొదలగు గుణములను విడిచిపెట్టి మీరు,పిఱికి పందలై పాఱిపోవుట తగునా అయ్యలారా! (ఈ సంబోధనము వాత్సల్యమును ప్రకటించుచున్నది.)

సీ. వేలుపు జడదారి విం దారగించుచో
నానంద బాష్పంబు లడ్డపడును
రక్త నిమ్నగ ననురాగంబు సంధిల్ల
నుబ్బి భూతావళు లోలలాడు
నిర్జర కామినీ నిలయాంగణంబులఁ
బచ్చ తోరణములు పరఁగుచుండు
స్యందన కుంజర హయ భటవ్రజములు
తునుక లై ధరమీఁదఁ దొరుఁగుచుండు

ఆ.వె. మొదల మీరు గెల్చు కదనంబులం దెల్ల
ని త్తెఱంగులావు రిత్త వుచ్చి
తిరుగఁ దగునె మీకు ధీరతఁ బెడఁబాసి
వినుత శౌర్యులార *దనుజులార! 139

తా : విశేషముగా స్తుతింపఁబడునట్టి పరాక్రమము గల రాక్షసులారా! వీరులారా! మునుపు, మీరు గెల్చునట్టి సమరములలో దేవతల జటాధారి (ముని) కలహమును కల్పించి పసందైన విందు భోజనము చేయుచుండఁగా అతనికి సంతసముతో వచ్చు కన్నీరు అడ్డుపడును. (రాక్షసుల విజయము అతనికి సమ్మతము కాదనుట). మరణించిన వారి నెత్తుటి ఏటిలో ప్రీతితో, పిశాచముల పిండు పొంగి పొరలును. రంభాది రమణీమణులు, వీర మరణమును పొందినవారిని వివాహమాడుటకై తమ యిండ్ల ముంగిళ్లను శుభసూచకముగా పచ్చ తోరణములతో అలంకరింతురు. రథ గజ తురగ పదాతుల మొత్తములు ముక్కలు ముక్కలై పుడమిపై పడుచుచుండును. ఈ విధమైన సామర్థ్యమును విడిచి పెట్టి, ధైర్యము తొలఁగి మీరు వెనుకకు మరలుట తగిన పనియా?

వ్యా. అడ్డము + పడును > అడ్డపడును. సూ. పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణ బిందువులు విభాషనగు. సంధి, బాల - 46

సీ. సంగరం బనిన నుత్సవము కే గిన క్రియ
సొలవక చనియెడి శూరులార!
శంకరుఁ డెప్పుడు సంభావనలు చేయ
నుల్లసిల్లుచు నుండు యోధులార!
గాత్రఖండములు ధరిత్రిపైఁ దొరుగంగ
శత్రుల గెలిచెడి జైత్రులార!
సమితిలో సేనాని శౌర్యంబు మెచ్చక
మిన్నక తిరిగెడు మేటులార!

ఆ.వె. ప్రకటులార మాన్య బలులార! విశ్రుత
విక్రమ ప్రభావ వితతులార!

---

* వీరులార

ప్రమథులార దైత్యపతులార! మీకును
బాఱు టర్హ మయ్యె బవరమందు. 140

తా : యుద్ధము అనఁగా పండుగలో పాల్గొనుటకు ఉత్సాహముతో, వెడలు వారి విధమున, వెనుదీయక ముందునకు పోవుటకు సిద్ధపడెడు శూరులారా! శంకరుఁడు ఎల్లప్పుడు ఆదరించుచుండఁగా సంతసముతో ప్రవర్తించు యోధులారా! మేని కండలు తెగి నేలపై పడుచున్నను, జంకక పగవారిని జయించుటయందే మనస్సు గల ధీరులారా! యుద్ధములో కుమారస్వామి పరాక్రమమును కూడ మెచ్చక తాము అట్టి వారమనెడి గర్వముతో (ఎవరిని లక్ష్యము చేయక) ఊరక తిరుగు శ్రేష్ఠులారా! కీర్తిమంతులారా! గౌరవింపఁదగిన బలీయులారా! విశేషముగా వినఁబడిన, (నుతింపఁబడిన) పరాక్రమము యొక్క మహిమచే, అధికులారా! ప్రమథులారా! రాక్షస నాయకులారా! సమర మందు, పిఱికివారై పరుగెత్తిపోవుట తగునా? అయ్యలారా!

వ్యా. 1. ఉత్సవమునకు + ఏ గిన క్రియ > ఉత్సవము కేఁగిన క్రియ, కువర్ణకము పరమైనపుడు నగాగములోపము. శబ్ద, ప్రౌఢ - 19.

2. అర్హమయ్యె! 'అయ్యె' వ్యతిరేక వ్యంజక ప్రశార్థకము.

వ. అట్లు గాక. 141

తా : సులభము.

కం. ఏ నుండఁగ నీలోపల
మానవుల జయించు టెంత మానము మీకున్
మానుఁడు పలాయన క్రియ
దానవవరులార! యనినఁ దదనీకంబున్. 142

అర్థ : ఎంతమానము = ఎంత మాత్రమది (ఎంతపని? మిక్కిలి తేలికయైన పని అనుట); పలాయన క్రియన్ = పాఱిపోవు పనిని; తద్+అనీకంబున్ = ఆ సేనయును.

తా : 'ఓ రాక్షసులారా! మీకు నేను ప్రభువుగా నుండఁగా, త్వరలో మానవులను జయించుట, ఎంతపని? అది సులభము. పాఱి పోవలదు' అని బాణుఁడు, ఆ సేనను, కోరఁగా.

చం. విడువక పాఱి పారిషద వీరులుఁ గొందఱు యాతుధానులుం
దడఁబడుచిత్తములే రయముదక్కిన బీరము వియ్య మందఁగాఁ
జిడిముడి పాటు పాదములఁ జెందఁగ మోముల దైన్య మొందఁగాఁ,
జెడియును జెడ్క కయ్యమునఁ జేరఁగఁ జిత్తము నిల్పి రయ్యెడన్. 143

అర్థ : విడువక పాఱి = విరామము లేక పరుగిడుటచే; క్త్వార్థకము, హేత్వర్థకమున నున్నది; పారిషద వీరులు = ప్రమథభటులు; యాతుధానులున్ = రాక్షసులును; తక్కిన బీరమున్ = విడిచిన వీరమును; వియ్యము+అందగాన్ = కూడఁగా.

తా : విడుపు లేక పరుగిడుటచే శివభటులును, కొందఱు రాక్షసులును, కళవళమొందు మనస్సులతో, వడి తగ్గిన వీరము కలియఁగా; పాదములు, తొట్రుపాటును, ముఖములు దీనతయును, పొందఁగా (దిగులు కన్పట్టఁగా) గర్వము తొలఁగి కృశించియును, బాణుని కోరిక మేరకు వెనుదీయుటను విరమించుకొని యుద్ధము చేయుటకు మనస్సును గట్టి చేసికొనిరి.

వ్యా. చెడక > చెడ్క. పదమధ్యమందు అత్వలోపము, సూ. లాతి (ఉకారేతరమైన) అచ్చునకు సహితము ఒకానొకచో నుడి నడుమ లోపంబు కానంబడియెడి. ప్రకీర్ణ, బాల -18.

వ. కుంభాండుం డారూఢ స్యందనుం డై బలంబులతో నిట్లనియె.144

తా : బాణుని మంత్రియైన కుంభాండుఁడు రథమును ఎక్కి సైనికులతో ఇట్లు పలికెను.

ఉ. బాణుఁడు వీఁడె మంత్రయుత బాణుఁడు దాననశూర సైనిక
త్రాణుఁడు శంకర స్తుతిపరాయణుఁ డుజ్జ్వల రోష దీప్త దృ
క్కోణుఁడు సంగర స్ఫురిత కోప పరాబ్ధి ఘటావళీ జగ
త్ప్రాణుఁడు యుద్ధ విశ్రుత పరాక్రమ రౌద్రరసప్రమాణుఁడున్.145

అర్థ : అబ్ది ఘటా+ఆవళీ = మేఘముల సమూహముల వరుసలకు.

తా : ఈతఁడే సుమా! మంత్రములతో ప్రయోగించు వివిధములైన ఆయుధములు కలవాఁడు. శూరులైన రాక్షసులను సంరక్షించువాఁడు. శివస్తుతియందు ఆసక్తిగల మహాభక్తుఁడు. మహాకోపముచే వెలుఁగొందు కన్నుల కడలు (కడకన్నులు) కలవాఁడు.

యుద్ధమందు ప్రకాశించు కోపము వహించి శత్రువులు అనెడి మేఘ సమూహముల వరుసలకు, వాయువైనవాఁడు. యుద్ధమందు, ప్రసిద్ధమైన పరాక్రమమును, రౌద్ర రసమును ప్రకటించువాఁడు (ఉన్నతములైన పరాక్రమ రౌద్రములు రెండిటికి గొప్ప నెలవై ఎఱుఁగఁ దగినవాఁడు).

అలం : 1 అంత్యానుప్రాసము, బాణుఁడు, (యుత) బాణుఁడు, త్రాణుఁడు, పరాయణుఁడు, (దృక్) కోణుఁడు, (జగత్) ప్రాణుఁడు, (ప్ర) మాణుఁడున్.

2. రూపకము, సంగర స్ఫురిత కోప పరాబ్ధి ఘటావళీ

నానా : ఆవళి (రూ) ఆవడి, ఆవలి, హావళి, హావడి.

(దే) ఉపద్రవము, (ఇ.స్త్రీ.) వరుస.

బాణుఁడు, వివిధాస్త్రధారి, రాక్షస సంరక్షకుఁడు, శివ భక్తుఁడు, రోష దీప్త నేత్రుఁడు, శత్రువులను జయించువాఁడు, పరాక్రమవంతుఁడు, రౌద్రమూర్తి అని మంత్రి సైనికులను యుద్ధమునకు ప్రోత్సహించెను.

కం. గిరితన యాధిప షాణ్మా
తుర ముఖ్య బలంబు లివి యె*దుర్కొన్నవి కే
తు రజో విస రాంతర్హిత
హరిదశ్వ సురాయనంబు లై క్రొ వ్వలరన్. 146

ప్రతి : గిరితనయా+అధిప = గిరిపుత్రి అగు పార్వతి పతియైన శివుని యొక్కయు; షాణ్మాతుర = కుమార స్వామియొక్కయు; ముఖ్యబలంబులు = (ఈ ఇరువురును) ప్రధానులుగాఁ గల సేనలు; కేతు రజస్ + విసర = పతాకముల దుమ్ము యొక్క మొత్తముచే. అంతర్హిత హరిదశ్వ సుర+అయనంబులై = కప్పఁబడిన సూర్యుని యొక్క ఆకాశమార్గము కలవై; క్రొవ్వు+అలరన్ = మద మొప్పఁగా; ఎదుర్కొన్నవి = ఎదుట నిలిచినవి.

తా : శివుని యొక్కయు, కుమార స్వామి యొక్కయు నాయకత్వమున గల సేనలు, సూర్యుని ఆకాశ మార్గములను తమ పతాకముల దుమ్ముచే కప్పుచు, మదముతో యుద్ధమునకు ఎదురుగా వచ్చి నిలిచియున్నవి.

అలం : అతిశయోక్తి. కేతు రజోవిసర అంతర్హిత హరిదశ్వసురాయనములు - సూర్యుఁడు పయనించు ఆకాశ గమనుల మార్గములు కనఁబడకపోవుట అసంభవము. కనుక అతిశయోక్తి. అలంకార ప్రయోజనము సైన్య గమన వేగమును ధ్వనింపఁజేయుట.

* దూరోన్నతకే.

వ్యు. హరిదశ్వుఁడు- పచ్చని కాంతి గల గుఱ్ఱములు కలవాఁడు, సూర్యుడ

కుమారస్వామి : ఎల్లప్పుడును బాలుఁడుగా నుండువాఁడు. కుత్సి సంహరించువాఁడు. భూమియందు మన్మథునివలె అందగాఁడు.

షాణ్మాతురుఁడు : ఆర్గురు తల్లులు కలవాఁడు.

షణ్ముఖుఁడు : ఆఱు ముఖములు కలవాఁడు.

శరవనభవుఁడు : శివ పార్వతుల కారణముగా జనించి, గంగ, అగ్ని, ము ఱెల్లుగడ్డి ఉండు అడవిలో విడువబడెను. కనుక శరవనభవుఁడు.

కార్తికేయుఁడు : ముని పత్నులు ఆర్గురు (అరుంధతి తప్ప) పాలిచ్చి పెంచిరి కృత్తికలని పేరు. వారు తల్లులగుటచే కార్తికేయుఁడని పేరు.

స్కందుఁడు (కందుఁడు) : శివుని రేతః స్కందముచే ప్రభవించెను. స్కందుఁడని పేరు.

మహాసేనుఁడు : గొప్ప సేన కలవాఁడు దేవతల సేనకు నాయకుఁడు.

వ. మీ రింక సాధ్వస గ్రస్తు లైన నగునె! ధీరమనస్కు లై సమరం నమరుం డను నవసరంబున సర్వజ్ఞుం డఖర్వ సమరగర్వ పర్వతా నిర్వక్ర సర్వనిర్వాహక నిర్వేదన పారిషద వీర పరివృతు నమందానంద కందళిత వందారు బృందారక బృంద స సందీయమాన మానసుండును, సమర జయ జయ మనోహరుండును, రణశ్రమనివారణ కారణ శ్వే తాతపత్రాయ శర్వరీనాథ శంకాసముత్పాది జటాజూట తట తటినీ త సురభిసరస వాత్యా సహాయ సముత్థిత పరాగ విస్తార విభాసితుండును, నందీశ సందానిత స్యందన వందన సందోహ సర్వతః ప్రసర్యమాణ త్రిశూల విశాల మరీచి ద్వి తరణి కిరణుండును, వితత భుజబలయుత సకలగణ భట సమ విలస దసి రుచిర రుచి విరాజిత మయూర రాజ విచిత్ర గతి చతుర సమ్మద సేనానీ సైన్య సేవ్యమానుండును, నై జనార్దను నిలు నిలు మని యదల్చి మఱియును.

ప్రతి : మీరు ఇంకన్ సాధ్వస-గ్రస్తులు +ఐనన్ = భయముచే ఆక్రాంతులయినచో; అగునె = పని జరుగునా? ధీర+మనస్కులు+ఐ = ధీరమైన మనస్సులు గలవారయి; సమరంబునకున్ = యుద్ధమునకు; అమరుండు = సిద్ధము కండు; అను+అవసరంబునన్ = అను నప్పుడు; సర్వజ్ఞుండు = ఈశ్వరుఁడు; అఖర్వ =అధమము కాని, అధికమైన; సమర+గర్వ = యుద్ధగర్వము కలట్టియు; పర్వత+ఆరోహణ = కొండలను అధిరోహించుటయందు; నిర్వక్ర=వక్రము కాని, బాగయిన; సర్వ నిర్వాహక = అంతయు నిర్వహించువారును; నిర్వేదన = బాధలేని వారును అగు; పారిషద+వీర = ప్రమథ వీరులచే; పరివృతుండును = చుట్టఁబడిన వాఁడును; అమంద = తక్కువకాని అధికమైన; ఆనంద = సంతోషముచే; కందళిత = వికసించిన; వందారు = స్తోత్రముచేయునట్టి; బృందారక+బృంద+సందోహ = దేవతల మూఁకల సమూహములచే; సందీయమాన = బాగుగా ఇయ్యఁబడు చున్న (సంతసింపఁ జేయబడుచున్న); మానసుండును = మనస్సులు గలవాఁడును, దేవతలు సంతోషాతిశయముతో స్తుతించుచు తమ మనస్సులను శివునియం దుంచినారనుట; సమర జయ జయ+ఆరావ = యుద్ధమునందలి జయ జయ ధ్వనులచే; మనోహరుండును = చక్కని వాఁడును; రణశ్రమ = యుద్ధమువలని ఆయాసము యొక్క; నివారణ కారణ = పోఁగొట్టుటకు హేతువును; శ్వేత + ఆతపత్రాయమాణ = వెల్లగొడుగు అనెడి; శర్వరీ+నాథ శంకా+సముత్పాది = చంద్రునిచే సందేహమును పుట్టించు వాఁడును; జటా+జూట + తట+తటినీ = జడల ముడి ప్రదేశమునందలి (గంగా)నది యందలి; తామరస = తామర పువ్వులచే; సురభి = పరిమళించు; సరస+వాత్యా = నీటి తుంపురుల చల్లని వాయువుచే (మాంద్యమును, శైత్యమును పరిమళమును); విహాయస్ +సముత్థిత = మింటి కెగసిన; పరాగ + విస్తార = ధూళి విస్తృతి యొక్క; ప్రభా = కాంతిచే; విభాసితుండును = ప్రకాశించువాఁడును; నందీ+ఈశ = నందీశ్వరుని చేత; సందానిత = త్రాటితో కట్టఁబడిన; స్యందన = రథమునందలి, వందన -మాలికా = పూజార్థమైన పుష్పమాలలయొక్క; సందోహ = సమూహముచేతను; సర్వతః = అంతటను; ప్రసర్ప్యమాణ = వ్యాపించుచున్న; త్రిశూల = త్రిశూలముయొక్క; విశాల = విస్తృతమైన; మరీచి = కిరణములచే (కాంతులచే); ద్విగుణిత = ఇనుమడింప జేయఁబడిన; తరణి కిరణుండును = సూర్యకిరణములు గలవాఁడును; వితత = అధికమైన; భుజబలయుత = బాహు పరాక్రమముతో కూడిన; సకల గణ భట = ఎల్ల ప్రమథగణము యొక్కయు, వీరుల యొక్కయు, సముదయ = సమూహము యొక్క; విలసత్ = ప్రకాశించుచ్ను; అసి = కత్తులయొక్క; రుచిర మనోహరమైన; రుచి = కాంతులచే; విరాజిత = ప్రకాశించునట్టియు; మయూరరాజ = శ్రేష్ఠ మయిన నెమిలి యొక్క; విచిత్ర - గతిచాతురీ = వింత గమనముల నైపుణ్యముచే; చతుర = నేర్పు గలట్టియు; సమ్మద = సంతోషముతో కూడినట్టియు; సేనానీ = కుమార స్వామియొక్క సైన్య = సేనచే; సేవ్యమానుండును +ఐ = సేవింపఁబడుచున్నవాఁడును; అయి; జనార్దనున్ = శ్రీకృష్ణుని; తాఁకి = ఎదుర్కొని; నిలు-నిలుము+అని; అదల్చి = గద్దించి; మఱియును = ఇంకను.

తా : "మీరు భయపడినచో శత్రువులను జయించుట సాధ్యమగునా? ధైర్యముగల మనస్సులతో యుద్ధమునకు సిద్ధ పడుఁడు" అని సైన్యమును కుంభాండుఁడు ప్రోత్సహించుచుండఁగా, సర్వజ్ఞుడైన పరమశివుఁడు, అధికమైన యుద్ధ గర్వము కలిగినట్టియును, కొండలను ఎక్కుటలో సర్వమును, నిర్వహించుచు, బాధపడని సమర్థులైన ప్రమథవీరులచే చుట్టఁబడినవాఁడును, అధికానందముతో ఉప్పొంగుచు స్తుతించుచున్న దేవతల సమూహముచే పొందఁబడిన అనుగ్రహముతో కూడిన మనస్సు కలవాఁడును, (దేవతలను అనుగ్రహముతో వీక్షించువాఁడును), జయ జయ ధ్వనులచే హరింపఁబడిన మనస్సు కలవాఁడును (సంతసించినవాఁడును) యుద్ధశ్రమను నివారించుటకు కారణమైన తెల్లని గొడు గనెడి భ్రాంతిని కల్గించు బాలచంద్రునితోను, జడలముడి సమీపమందు గల గంగానది యందలి పద్మముల పరిమళమును, నీటి తుంపురుల చల్లఁదనమును, వాయు సహాయమున రేఁగిన విరివియైన పుప్పొడి కాంతులతో ప్రకాశించు వాఁడును, నందీశ్వరునిచే సిద్ధము చేయఁబడిన రథమందు, పూజార్థమైన పూలమాలలు కలవాఁడును, అంతటను వ్యాపించుచున్న తన త్రిశూల కాంతులచే రెట్టింపు చేయఁబడిన సూర్య కిరణములు కలవాఁడును, బలీయులైన ప్రమథులయు భటులయు కత్తుల కాంతులచే ప్రకాశించు, నెమిలి వాహనము యొక్క చిత్రగతుల నైపుణ్యముతో నేర్పరియై, సంతసించు కుమార స్వామిచే సేవింపఁబడు వాఁడును అయి, (శివుఁడు), శ్రీకృష్ణుని ఎదుర్కొని 'నిలు నిలుము' అని అదల్చి, మఱియును (మీఁది పద్యముతో).

అలం : వృత్త్యను ప్రాసము.

వ్యు. శర్వరీ నాథుఁడు, రాత్రికి ప్రభువు, చంద్రుఁడు.

మ. చతురంభోనిధి మేఖలావలయ భూచక్రంబు గంపింపఁగా
శితికంఠుండు విశేషరోషవిలస త్సింహా రవోద్యుక్తుఁడై
శత నారాచము లేసినన్ హరియుఁ బర్జన్యాస్త్రమేసె న్వేసన్
శతరూపం బయి తచ్ఛరంబు శివునిన్ సైన్యంబులం గప్పఁగన్.148

ప్రతి : శితికంఠుండు = నల్లని కంఠము గలవాఁడు, శివుఁడు; చతుస్+అంభోనిధి మేఖలా వలయ భూ చక్రంబు = నాలుగు సముద్రములు అనెడి మొల నూలు చుట్టు నున్న భూవలయము; కంపింపఁగాన్ = చలింపఁగా; విశేష రోష విలసత్ సింహ+ఆరవ +ఉద్యుక్తుఁడై = అధికమైన కోపముచే ప్రకాశించుచున్న సింహధ్వనితో కూడిన వాఁడయి; శత నారాచములు

= నూఱు బాణములు; ఏసినన్ ; ప్రయోగింపఁగా; హరియున్ = శ్రీకృష్ణుఁడును; వెసన్ = శీఘ్రముగా; పర్జన్య +అస్త్రము +ఏసెన్ = (వర్షాధిదేవత, ఇంద్రుడు) ఇంద్రాస్త్రమును ప్రయోగించెను; తద్+శరంబు = ఆ బాణము; శత రూపంబు+అయి = నూఱు రూపములు గలదై; శివునిన్ = శివుని; సైన్యంబులన్ = (అతని) సేనలను; కప్పఁగన్.

తా : ఈశ్వరుఁడు, నాలుగు సముద్రములు అనెడి మొలనూలు గల భూవలయము కంపింపఁగా, కోపాతిశయముచే సింహధ్వని చేయుచు, నూఱు బాణములను ప్రయోగించెను.

వెంటనే శ్రీకృష్ణుఁడు ఇంద్రాస్త్రమును వేసెను. అది నూఱు రూపములు కలదై శివుని, అతని సైన్యమును, కప్పఁగా, (మీఁది పద్యముతో).

వ్యా. తద్ +శరము > తత్+శరము > తత్+ఛరము.

తచ్ఛరము > తచ్ఛరము, శ్చుత్వ ఛత్వాదేశసంధి.

గీ. అట్లు పొదివినఁ గుపితుఁ డై యంధకారి
యగ్ని దైవత్యశరమున నసురవైరి
నేసె నేసిన నాయస్త్ర మెల్లకడల
మంట మొత్తంబుతో దివి మాఱు మలసె. 149

అర్థ : అంధక+అరి = అంధకాసురుని శత్రువు, శివుఁడు; అగ్నిదైవత్య శరమునన్ = ఆగ్నేయాస్త్రముచే; అసురవైరిన్ = రాక్షసుల శత్రువును, శ్రీకృష్ణుని; దివి = ఆకాశము ; మాఱు మలసెన్ = మఱొక రూపమును పొందెను.

తా : ఆ విధముగా ఇంద్రాస్త్రము కప్పఁగా, శివుఁడు కోపించి ఆగ్నేయాస్త్రమును రాక్షసవైరి అగు శ్రీకృష్ణునిపై ప్రయోగించెను. అది మంటల మొత్తముతో ఆకాశమందు వ్యాపించి, ఆకాశమును మఱొక రూపము కలదిగా చేసెను.

శా. ఆయస్త్రం బతిఘోర మై పొదువ దైత్యారాతియున్ రాముఁడున్
మాయావల్లభుఁడుం బతత్రివిభుఁడు న్నాకీక్షణాగమ్యులై
ఛాయాహీనత నొంది రగ్ని విశిఖా జాజ్వల్య మానాంగులై
పోయెంబో! యదువంశ మంచుఁ *గలఁ గన్ భూతావలుల్ భీతితోన్. 150

* జెలఁగెన్ భూతావళుల్ ప్రీతితోన్

ప్రతి : ఆ+అస్త్రంబు = ఆ ఆగ్నేయాస్త్రము; అతి ఘోరమై = మిక్కిలి భయంకరమై; పొదువన్ = ఆక్రమింపఁగా; దైత్య + అరాతియున్ = శ్రీకృష్ణుఁడును; రాముడున్ = బలరాముఁడు; మాయా వల్లభుఁడున్ = మాయావతీ ప్రియుఁడును, ప్రద్యుమ్నుఁడును; పతత్రి విభుఁడున్ = పక్షిరాజు, గరుడుఁడును; నాకి +ఈక్షణ +అగమ్యులై = దేవతల చూపులకు అందని వారై; అగ్ని విశిఖ +ఆ జాజ్వల్యమాన + అంగులై = ఆగ్నేయాస్త్రముచే అంతట కాలుచున్న అవయవములు కలవారయి; యదువంశము; పోయెన్+పో= నిశ్చయముగా నశించెను; అంచున్; భూత+ఆవలుల్ = ప్రాణికోటి; భీతితోన్ = భయముతో; కలఁగన్ = కలఁత చెందఁగా; ఛాయా హీనతన్+ఒందిరి = కాంతి హీనులైరి (శరీరవర్ణమును కోల్పోయిరి).

తా : ఆ ఆగ్నేయాస్త్రము మిక్కిలి క్రూరమైనదై ఆక్రమింపఁగా, శ్రీకృష్ణ బలరామ ప్రద్యుమ్న గరుత్మంతులు దేవతలకు కానరాని వారయిరి. ఆగ్నేయాస్త్ర జ్వాలలచే వారి అంగములు మండుచుండఁగా 'యాదవవంశము నిశ్చయముగా నశించె' ననుచు ప్రాణికోటి భయముతో కలఁత చెందెను. కాంతి హీనులై వారు, శరీర వర్ణమును కోల్పోయిరి.

వ్యు. నాకి - నాకమును వాసముగా కలవాఁడు, దేవత.

నానా. మాయ = అజ్ఞానము, రతీదేవి, లక్ష్మి, పార్వతి, మోసము, భ్రమ.

నానా : భూతము = ప్రాణి, పిశాచము, పృథివ్యాదులు, కడచినది (కాలము), భస్మము, వెలసినది.

గీ. అట్లవస్థాంతర ప్రాప్తు లైన వారిఁ
జేరి దనుజులు చేసిరి సింహనాద
మగ్ని బాణ శిఖావృతుం డైన వానిఁ
బొలిసె నని యెంచి మాధవుఁ బొదివె హరుఁడు. 151

అర్థ : అవస్థ+అంతర ప్రాప్తులు = మఱొక రూపమును పొందినవారు; ఆవృతుండు = చుట్టఁబడినవాఁడు.

తా : ఆ విధముగా రూపములందు మార్పు పొందిన ఆ వీరులను సమీపించి, రాక్షసులు సింహనాదములు కావించిరి. అగ్నికి చెందిన బాణము యొక్క సెగలచే ఆవరింపఁబడిన శ్రీకృష్ణుఁడు చెడెనని తలంచి, శివుఁడు అతని పైకి ఎగసెను.

ఉ. అంతట నంబుజోదరుఁడు నబ్ధిపదైవతశస్త్ర మేసినన్
సంతత వారిధారలను జారుతటిల్లతికా వితాన మ

త్యంత మహానినాద సతతాద్భుత భీషణగర్జితంబులన్
సంతస మందఁ జేసె సురసంఘములన్ దనుజుల్ చలింపఁగన్. 152

ప్రతి : అంతటన్ = పిమ్మట; అంబుజ+ఉదరుఁడు = (పద్మమును ఉదరమందు కలవాఁడు), శ్రీకృష్ణుఁడు; అబ్ధిప దైవత శస్త్రము = వారుణాస్త్రము; ఏసినన్ = ప్రయోగింపఁగా; చారు తటిత్+లతికా వితానము = మనోహరమైన మెఱపు తీఁగల సమూహము; సంతత వారి ధారలను = ఎడతెగని జలధారల చేతను; అత్యంత మహా నినాద సతత+అద్భుత భీషణ గర్జితంబులన్ = మిక్కిలి గొప్ప ధ్వనుల తోడి, ఎల్లప్పుడు ఆశ్చర్యకరమును, భయంకరమును అయిన ఉఱుములతో; దనుజుల్ = రాక్షసులు; చలింపఁగన్ = భయముతో (కంపింపఁగా); సుర సంఘములన్ = దేవతల బృందములను; సంతసము +అందన్ చేసెన్ = సంతోష పడు నట్లు చేసెను.

తా : వెంటనే హరి సాగ రాస్త్రమును వేసెను. అది అందమైన మెఱుములతోను జలధారలతోను గొప్పధ్వనులు గల ఆశ్చర్యకరములును, భయంకరములు అయిన ఉఱుములతో, రాక్షసులను కంపించునట్లు చేసి, దేవతలను సంతోషపెట్టెను.

వ్యు. అబ్ధిపుఁడు. సముద్రమునకు ప్రభువు, వరుణుఁడు.

కం. ఆశస్త్రదహనుఁ డాఱిన
నీశానుఁడు రోషవహ్ని నేసెఁ గ్రమమునం
బైశాచము రాక్షసమును
నైశం బాంగిరస మను మహాస్త్రముల హరిన్. 153

తా : శివుఁడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రము యొక్క అగ్ని, వారుణాస్త్రముచే సమసినది. ముక్కంటి (కోపమనెడి నిప్పుతో) కోపముతో మండిపడుచు, వరుసగా, పైశాచము, రాక్షసము, ఐశము, ఆంగిరసము అనెడి పేర్లుగల గొప్ప అస్త్రములను శ్రీకృష్ణునిపై వేసెను.

అలం : రూపకము, రోష వహ్ని.

వ. వాసుదేవుండునుం దదస్త్రనివారణంబు చేయం దలంచి. 154

తా : శ్రీకృష్ణుఁడు శివుఁడు వేసిన నాలుగు అస్త్రములను అడ్డుకొనుటకు నిర్ణయించుకొన్నవాఁడై, (మీఁది పద్యముతో).

సీ. వాయవ్య సావిత్ర వాసవ మోహన
ముఖ్యాస్త్రముల నేసి మురవిరోధి
యాత్మాస్త్ర మేసిన నాయస్త్ర దీప్తిచే
నసుర ప్రమథ భూత యక్షగణము
బాణునితోఁ గూడఁ బాఱె నల్గడలకు
నంధకారం బయ్యె నఖిల జగతి
విశ్వేశుఁ డప్పుడు వెలుఁగుచు నుండెను
నంది మహాదేవు స్యందనంబుఁ

ఆ.వె. గానఁ డయ్యె, శివుఁడు గైశవాస్త్రం బేయ
నాత్మబాణ మగుట నచ్యుతుండుఁ
దూణమందుఁ బెట్టఁ దొడి యేసె రుద్రుండు
పాశుపతము, నదియ కేశవుండు. 155

తా : శ్రీకృష్ణుఁడు, వాయవ్యము (వాయుదేవుని), సావిత్రము (సూర్యునిది), వాసవము (ఇంద్రునిది), మోహనము (మన్మథునిది), అనెడి బాణములను వేసి, తనదైన కేశ వాస్త్రమును ప్రయోగించెను. ఆ బాణముల జ్యోతులచే బాణునితో కూడ, రాక్షసులు ప్రమథులు, భూతములు, యక్షులు, ఎల్లరు అన్ని దిక్కులకును పాఱిపోయిరి. అపుడు జగత్తంతయు, చీఁకటితో నిండెను. అపుడు శ్రీకృష్ణుఁడు ఒక్కడే అక్కడ దివ్య తేజస్సుతో వెలుఁగుచుండెను. నందీశ్వరుఁడు శివుని తేరును కానఁడయ్యెను. శివుఁడు కేశ వాస్త్రమును ప్రయోగించెను. అది శ్రీకృష్ణునిదే అగుటచే దానిని అతఁడు గ్రహించి తన అమ్ముల పొదిలో చేర్చెను. శివుఁడు తనదైన పాశుపతాస్త్రమును వింటిలో తొడిగి వేయఁగా శ్రీకృష్ణుఁడు దానినే (మీఁది వచనముతో).

వ్యు. అది + అ > అదియ = దానినే. ద్వితీయార్థమున 'అది' (ప్రథమ).

వ. ప్రయోగించిన నయ్యస్త్రంబులు గగన మధ్య భాసురంబు లై చండమరీచి సంశ్రితంబు లై తరణిమండలంబు ననుకరించి, చిత్ర భానుత్వంబునను, శిఖావత్త్వంబునను హవ్యవాహన సమానం బయి,

యుగ్రప్రకటితత్వంబునను జ్యోతిర్మయత్వంబునను గైలాసోపమానంబయి, క్రూరసత్త్వసమగ్రత్వంబునను మహారావత్వంబునను బారావార ప్రతిమానం బయి, సుమనః ప్రియత్వంబునను సూర్యమండలాశ్ర యత్వంబునను సువర్ణ ధరణీధరసంకాశం బయి యివ్విధంబునుం గాక యొక్కొక్క యెడల నెగసి మింట నంటు మంట లంటిన వేఁడిమికి సైరింపం జాలక ప్రభాకరుండు త్వరితంబున రథంబు నడుపు మని జంకించిన శంకించి యనూరుండు రయంబున నుంకించియు హయంబుల నంకించియుఁ, బగ్గంబులు నడల విడిచిన ననున్యూత లాలాజలంబు లగువక్త్రగహ్వరంబులు గలుగు హరిదశ్వంబుల జవంబులకు నోర్వక యిక్క డక్కడ వడిన చుక్కలును, దిరుగుడు వడిన దివ్యవిమానంబుల పయిం బొల్చు పతాకాపట సముదయంబులం జూచి విహాయస కూలంక షానుమానంబునన్ సలిల వినోదాగత సురముగ్ధ వరవర్ణినీ శరీర విరాజమాన వరవర్ణినీ వైభవంబు ననుకరించు సర్వతః ప్రసరన్మయూఖ శిఖాజాలంబునను సకల మహీధరంబులును సువర్ణాచలంబు లయినం, దదీయ కనక లతా కుంజంబుల విహరించు సురకామిని ప్రేమానుభావంబు లగు శయ్యాతలంబులం బరఁగు పుండరీకంబులకు సువర్ణత్వం బాపాదించి జాజ్వల్యమానంబై శైవాస్త్రంబు నిగిడె నట్టియెడ. 156

ప్రతి : ప్రయోగించినన్; ఆ + అస్త్రంబులు = ఆ పాశుపతాస్త్రంబులు; గగన మధ్య భాసురంబులై = నడుమ ఆకాశమున ప్రకాశించినవై; చండ మరీచి సంశ్రితంబులై = మిక్కిలి వాఁడిమి, వేఁడిమిగల కిరణములను ఆశ్రయించినవై (పొందినవై); తరణి మండలంబున్ = సూర్యమండలమును; అనుకరించి = పోల్చి; చిత్ర భానుత్వంబునను = వింతలగు కిరణములు కలిగి యుండుట చేతను; శిఖావత్త్వంబునను = సెగలు (జ్వాలలు) ఉండుటచేతను; హవ్య వాహన సమానంబై = అగ్నితో సాటియై; ఉగ్ర ప్రకటిత్వంబునను = భయంకరమైన రౌద్రమును వెల్లడించుటచేతను; జ్యోతిస్ + మయత్వంబునను = వెలుఁగులతో నిండుటచేతను; కైలాస+ఉపమానంబై = శివుని నివాసపర్వతమగు కైలాసముతో సరియై; క్రూర సత్త్వ సమగ్రత్వంబునను = నిష్ఠురమైన (అతికఠినమైన) బలసమృద్ధి చేతను; మహారావత్వంబునను = గొప్పధ్వనులను కలవగుటచేతను; పారావార ప్రతి మానంబై = సముద్రముతో సమమై; సుమనః ప్రియత్వంబునను = దేవతలకు ప్రియమగుట చేతను; సూర్యమండల

+ఆశ్రయత్వంబునను = ఆదిత్యమండలమును ఆశ్రయించుట చేతను; సువర్ణ ధరణీధర సంకాశంబై = బంగారు కొండతో (మేరుపర్వతముతో) తుల్యమై; ఈ+విధంబునన్ కాక = ఈ మాదిరియే కాక; ఒక్క+ఒక్క ఎడలన్ = ఒక్కొక సారి; ఎగసి మింటన్ +అంటు మంటలు + అంటిన వేఁడిమికిన్ = పైకి లేచి, ఆకసమును, రాచుకొన్న మంటల వేఁడికి (వేఁడిని); సైరింపన్ +చాలక = ఓర్చుకొనలేక; ప్రభాకరుండు = రవి; త్వరితంబునన్ = త్వరగా; రథంబు నడుపుము అని; జంకించినన్ = బెదరింపఁగా; శంకించి = (కీడును) సందేహించి; అనూరుండు = రథసారథి; రయంబునన్ ఉంకించియున్ = వేగముగా ప్రయత్నించియు; హయంబులన్ +అంకించియున్ = గుఱ్ఱములను అదలించియు; పగ్గంబులు = పట్టుకొనుటకు కట్టిన త్రాళ్లను; సడలన్ విడిచినన్ = బిగువు తక్కువగునట్లు వదలగా; అనుస్యూత లాలాజలంబులు +అగుః ఎడతెగక వెలువడు, ఉమ్మి నీరు కల; వక్త్ర గహ్వరంబులు కలుగు హరిదశ్వంబుల = గుహలవంటి నోటి లోపలి భాగములున్న పచ్చని గుఱ్ఱముల యొక్క (సూర్యుని రథాశ్వముల); జవంబులకు = వేగములకు; ఓర్వక = తాళలేక; ఇక్కడ +అక్కడ పడిన; చుక్కలును = నక్షత్రములును; తిరుగుడు+పడిన దివ్య విమానంబుల పయిన్ = తలక్రిందులైన దేవతల విమానముల మీద; పొల్చు పతాకా పట సముదయంబులన్ = ఉన్న టెక్కెముల గుడ్డల నెల్లను; చూచి; విహాయస కూలంకషా+అనుమానంబునన్ = ఆకాశగంగ అనెడి సందేహముతో; సలిల వినోద +ఆగత సురముగ్ధ వరవర్ణినీ = జలక్రీడకుగాను, ఏతెంచిన (పదియాఱు సంవత్సరముల వయసు గలిగిన) క్రొత్త వారైన దేవలోక కన్యల యొక్క; శరీర రాజమాన వర వర్ణినీ వైభవంబున్ + అనుకరించు = అందమైన అవయవములలో వెలుఁగు పసుపు వన్నె సంపదను (బంగారు పసిమిని) పోలినవై; సర్వతః ప్రసరత్ = అన్నిచోట్ల యందును ప్రవర్తించుచున్న; మయూఖ శిఖా జాలంబునను = కిరణముల యొక్క మంటల వరుసలచేతను; సకల మహీధరంబులును = అన్ని కొండలును; సువర్ణ + అచలంబులు + అయినన్ = బంగారు వర్ణము కల కొండలు కాఁగా; తదీయ కనక లతా కుంజంబులన్ విహరించు = ఆ కొండల యందు సంపెంగ తీఁగెలు కల పొదరిండ్లలో వినోదమునకై తిరుగు; సురకామినీ ప్రేమ +అనుభావంబులు +అగు, శయ్యా తలంబులన్ = దేవకాంతల ప్రేమయొక్క అనుభవములు కల పాన్పుల యొక్క నెలవులందు; పరఁగు పుండరీకంబులకున్ = నెలకొని యున్న తెల్లతామర పూలకు; సువర్ణత్వంబు + ఆపాదించి = బంగారు వర్ణమును కూర్చి; జాజ్వల్యమానంబై = అతిశయమైన దీప్తి కలవై శైవ+అస్త్రంబు(లు); నిగిడెన్ = విజృంభించెను; అట్టి +ఎడ= ఆ సమయమున.

తా : మింటి నడుమ శివుఁడును, కేశవుఁడును ప్రయోగించిన పాశుపతాస్త్రములు తేజస్సు, తాపము, కల కిరణములతో సూర్య మండలమును పోలినవి. చిత్రములైన వింతలగు కిరణములతో, మంటలతో కలిసి, అగ్నితో సాటి అయినవి. అతిశయించిన భయమును కల్గించుటచేతను, వెలుఁగులను చిమ్ముట చేతను కైలాస పర్వతముతో

సరియైనవి. అధికమైన బలసమృద్ధితో గొప్పధ్వనులతోను, సాగరముతో సమమైనవి. దేవతలకు ప్రియము లగుటచేతను (రాక్షసులను వధించుటచే), సూర్యమండలమును ఆశ్రయించుచున్న దగుట చేతను, మేరు పర్వతము వలె నుండెను. ఈ విధముగా కాక, అప్పుడు, అతిశయించి ఆకాశమును తాఁకు మంటలు సోకుటచే ఆ సెగల వాఁడిమిని వేఁడిమిని ఓర్వలేక, సూర్యుఁడు, రథ సారథియైన అసూరుని తేరును త్వరగా 'నడుపుము' అని కోరఁగా; అతఁడు గుఱ్ఱములను అదలించుచు వానికి కట్టిన త్రాళ్లను సడలించి, వానిని వేగముగా నడపెను. అట్లు కావించుటచే గుఱ్ఱముల నోళ్లనుండి లాలాజలము ఎడతెగక స్రవించినది. వాని గమన వేగమునకు చుక్కలు రాలినవి. విమానములు తలక్రిందు లైనవి. తేరులకు కట్టిన టెక్కెముల తెల్లని గుడ్డలు తాఱు మాఱైనవి. ఆ గుడ్డలను చూచి దేవలోకమునకు చెందిన ముద్దరాండ్రు ఆకాశగంగ అనెడి భ్రాంతి చెంది నీటిలో మునుఁగుటకు వచ్చిరి. ఆ కన్నెల మేని పసుపు వన్నెను పోలిన ,అంతటను ప్రసరించు సెగల మొత్తముచే, అన్నియును, బంగారు కొండలైనవి. అచట సంపెంగ తీఁగెల పొదరిళ్లలో విహరించు దేవకామినుల ప్రేమానుభూతులకు చెందిన ఆ పాన్పు నెలవులందు అమరియున్న తెల్లదామరలకు ఆ సెగలు, చక్కని బంగరు వన్నెను సమకూర్చుచు ప్రకాశించినవి,అట్లు, మహాదీప్తితో శైవాస్త్రములు రెండును విజృంభించినవి. ఆ సమయమందు, (మీఁదిపద్యముతో).

అలం : కావ్యలింగము, అతిశయోక్తి, భ్రాంతిమంతము, తద్గుణము.

విశే. పాశుపతాస్త్ర విజృంభణ వర్ణనము పసందైన పదాలతో పరిక్రమించుచు ప్రవర్తిల్లు చున్నది. అస్త్రముల జ్వాలలు, చండకిరణుని, దహనుని, హేమాద్రిని పోలినవి. రవియే చలించెను. విమానములు చెదరినవి. టెక్కెముల పటములు, గంగానది అనెడి భ్రాంతిని కలిగించినవి. పొదరిండ్ల తెల్లదామరలు, బంగారు కాంతులకు నిలయములైనవి. సోమన గద్య శైలిలో ఇదియొక చక్కని చిక్కని చిత్రణము.

వ్యు. హవ్య వాహనుఁడు: హవ్యమును మోసికొనుపోవువాఁడు, అగ్ని -

ధరణీధరము: భూమిని ధరించునది, కొండ

కూలంకష-ఒడ్డును ఒరయునది, నది.

గీ. తోఁచె నల్గడ ధూమ కేతువ్రజంబు,
వడె నకాలపుఁబిడుగులు పుడమిమీఁద

మూఁగు వాఱెను మార్తాండ మండలంబుఁ
బరఁగెఁ జుక్కలు దివమున బయలు మెఱసి. 157

తా : తోక చుక్కల గుంపు నాలుగు దిక్కు లందును గోచరించెను. కాలము కాకపోయినను, పిడుగులు పుడమిపై పడినవి. సూర్యమండలము మాసి, నల్లఁ దనము పర్విన్నది. పగటి యందే చుక్కలు బయల్పడి ఒప్పినవి.

వ్యా. అకాలము +పిడుగు. పుంప్వాదేశ నుగాగమసంధి, సంధి, బాల - 32, 25

కం. ప్రమద ముడిగి దిక్స్తంబే
రమ సంఘము, బృంహితములు ప్రకటితములుగాఁ
దమ దెసలు విడిచి పాఱెను
దమయంతన దానవారి *ధారలు దొరుఁగన్. 158

అర్థ : దిక్స్తంబేరమ సంఘము = దిగ్గజముల మొత్తము; దాన వారిధారలు = మద జల బిందువులు;

తా : ఎనిమిది దిక్కులలో నుండు ఏనుఁగులు భయమును చెంది గర్వమును (సంతోషమును) వీడి ఘీంకారములు చేయఁదొడఁగినవి. మద జలము వాని నుండి వెలువడినది. అవి తమ దిక్కులను వదలి పరుగిడి పోయినవి.

వ్యు. స్తంబేరమము-స్తంబముల యందు (పొదలయందు) రమించునది.

విశే. 1. ఏనుఁగు చెక్కిళ్ళలో, దానము 2. కన్నులలో సీధువు 3. చెవులలో, సాగరము 4. తొండములో శీకరము, 5. చనుమొనలలో శిక్యము, 6. మేహనమున మదము, 7 ఎదలో ఘర్మము, 8. చరణములందు, మేఘము. ఇట్లు మొత్తము ఎనిమిది చోట్లలో మదజలము పుట్టును.

కం. అవ్విబుధ జగతిలోపలఁ
గ్రొవ్వు దఱిఁగి సురగణంబు క్షోభము నొందెన్
ఇవ్విధమున నుత్పాతము
నివ్వటిలం దొడఁగుటయును నిష్కరుణతతోన్. 159

---

* తరువులు తిరిగెన్ (విఱిగెన్).

తా : దయలేనివై, ప్రకృతిలో ఉపద్రవ సూచనలు కన్పట్టుటకు మొదలిడినవి. దేవలోక మందున్న సురసమూహము గర్వమును వీడి కలఁత నొందినది.

కం. అవియును నొకటొకటికి నె
త్తు వోవక పెనఁగిన గని మధు త్రిపుర హరుల్
సవరణతో మగుడంగాఁ
దివిచిరి ఖేచరగణంబు దివిరి నుతింపన్. 160

అర్థ : ఎత్తు+పోవక = తగ్గక; మధు త్రిపుర హరుల్ = మధువును వధించినవాఁడు, శ్రీకృష్ణుఁడు, త్రిపురాసురులను హరించిన వాఁడు శివుఁడును; సవరణతోడన్ = సౌమ్యముతో.

తా : ఆ పాశుపతాస్త్రములు రెండును వెనుదీయక పోరుటను చూచి, కేశవుఁడు శివుఁడును ఉదాత్తులై తమ అస్త్రములను ఉపసంహరించుకొనిరి. దేవతలు ఎల్లరు వారిని సంతసముతో నుతించిరి.

గాథ : త్రిపురహరుఁడు; శివుఁడు. త్రిపురములను పాలించు దుష్ట రాక్షసులైన, విద్యున్మాలి, తారకాక్షుఁడు, కమలాక్షుఁడు అను వారిని చంపుటకు వారి పురములను ఒక్క చోటచేర్చి పాశుపతాస్త్రముచే, ముగ్గురిని సంహరించెను.

కం. దహ నానిల విధు మాధవ
మహస్సముద్భవము ద్రిపుర మథనాస్త్రముఁ గా
మహరుండు ప్రయోగించెను
నహితునిపై సురలు దలఁక నసురలు చెలఁగన్. 161

అర్థ : మహస్ సముద్భవము = తేజస్సునుండి పుట్టినది.

తా : మదనుని మర్దించిన రుద్రుఁడు - అగ్ని (దహన), వాయు (అనిల), చంద్ర (విధు), మాధవ (విష్ణు) తేజస్సు నుండి పుట్టినదియును, పురత్రయమును నాశనము చేసినదియునైన త్రిపుర మథనాస్త్రమును, దేవతలు కలఁత చెందఁగా, రాక్షసులు పొంగఁగా శత్రువైన శ్రీకృష్ణునిపై వేసెను.

అలం : పరికరాంకురము. కామహరుఁడు, సాభిప్రాయ సూచకము, శ్రీకృష్ణుని తనయుని కాల్చిన ముక్కంటి, అతనిని కూడ నాశము చేయుటకు వెనుదీయఁడని ధ్వని.

వ్యా. సురలు అసురలు : సుర శబ్దంబు నిత్యంబుగా, అసుర శబ్దము వైకల్పికముగా స్త్రీ తుల్యంబులగు సంస్కృత సమాసంబునంగావు. తత్సమ, బాల - 60.

సుర (ఏక) సురలు (బహు), అసుర (ఏక) అసురలు, అసురులు (బహు)

శా. ఔన్నత్య స్ఫుర దంశుదీప్త మగు నాయస్త్రంబు వీక్షింపుచున్
వెన్నుం డాత్మఁ దలంచె నీశరముచే విశ్వేశుఁ డుత్కోపుఁడై
తన్నుం జంపఁ దలంచె నంచు మహి తౌదార్యం బవార్యంబుగా
నున్నిద్రాబ్జదళాక్షుఁ డుండె సమరోద్యో గానవ ద్యాకృతిన్. 162

ప్రతి : వెన్నుండు = శ్రీకృష్ణుఁడు; ఔన్నత్య స్ఫురత్ +అంశు దీప్తమగు = మిగుల గొప్పదై ప్రకాశించు కిరణములచే వెలుఁగుచున్న దగు; ఆ అస్త్రంబును; వీక్షింపుచున్ = చూచుచు; ఆత్మన్ తలంచెన్ = తన మనస్సులో తలంచెను; ఈ శరముచే శివుఁడు; ఉత్కోపుఁడై = ఉప్పొంగు కోపముచే; తన్నున్; చంపన్ + తలంచెన్ +అంచున్; మహిత+ఔదార్యంబు = మహనీయమైన (విశాలమైన), ఉదార భావము, అనివార్యంబు +కాన్ = వారింపరాని దగుటచే; ఉన్నిద్ర +అబ్జదళ+అక్షుఁడు = వికసించిన కమల దళముల వంటి నేత్రములు కలవాఁడు, శ్రీకృష్ణుఁడు; సమర + ఉద్యోగ+ అనవద్య+ఆకృతిన్ = యుద్ధ ప్రయత్నమందు, దోషములేని రూపముతో (అనింద్యమైన); ఉండెన్.

తా : శ్రీకృష్ణుఁడు, శివుఁడు ప్రయోగించిన అస్త్రము గొప్ప ప్రకాశముతో అన్ని వైపుల వ్యాపించుచుండఁగా దానిని చూచుచు, "శివుఁడు మహాకోపముతో నన్ను ఈ బాణముతో చంపనున్నాఁడు కదా" అని తన మనస్సులో తలంచినవాఁడై, తా మిరువురును ఒకే తత్త్వము కలవారగుటచే, తన మహనీయమైన ఉదార భావము, తప్పని సరి అగుటవలన, వికసించిన కమలదళముల వంటి కన్నులతో, యుద్ధమునకు ఉచితమైన ప్రయత్నముతో దోషములేని రూపము కలవాఁడై యుండెను.

వ్యా. వీక్షించుచున్ > వీక్షింపుచున్.

సూ. పకారంబు కొన్ని యెడల శత్రర్థపరక్త్వచు వర్ణంబునకుం గానంబడియెడి, క్రియ, ప్రౌఢ - 17.

కం. అంభోజనాభుఁ డహిత
స్తంభ విరచన ప్రవీణతా వైభవుఁ డై

జృంభణ శర మేసిన సం
రంభ విజృంభణము దక్కి ప్రమథాధిపుఁడున్. 163

అర్థ : అహిత స్తంభ విరచన ప్రవీణతా వైభవుఁడై = శత్రువులను కదలనేరక నిలువఁ బెట్టునట్టి, నేర్పు యొక్క సంపదతో (అతిశయముతో); సంరంభ విజృంభణము తక్కి = వేగిరపాటుతో కూడిన ఉద్వేగమును వదలి పెట్టి (కోపాతిశయమును పొంది).

తా : శ్రీకృష్ణుఁడు శత్రువును కదలకుండఁ జేయుటకు జృంభణాస్త్రమును ప్రయోగించెను శివుఁడు. తన వేగిరపాటు, ఉద్వేగము, కోపము విడిచిన వాఁడై (మీఁది పద్యముతో).

కం. తడఁబడుచు నొడలు *నలుముచు
వడిఁ దూఁగుచు నావులించ వచ్చిన సొలయున్
బుడివడు గాళులు నిలువక
పడఁ బోవుం బడగకామపైఁ బడి యొఱగున్. 164

తా : ఆ జృంభణాస్త్రము యొక్క తాఁకున తొట్రుపాటు చెందుచు శరీరమును విఱుచుకొనుచు (నలుపుకొనుచు) త్వరగా, అరకంటి నిద్రతో ఆవులింతలతో శివుఁడు మూర్చిల్లెను. ఇటునటు కదలుచు, కాళ్లు నిలువక పోవుటచే పడఁబోయెను. టెక్కెము యొక్క కఱ్ఱపై (కంబముపై) వాలెను.

వ్యా. కాలు+లు > కాళులు.ఆచ్ఛిక, బాల -13.

వ. ఇవ్విధంబున 165

తా : సులభము.

చం. మనుజ వరాగ్రణీ మహిత మార్గణ జృంభణ సార భీతుఁడై
ధనద సఖుండు వాలిన నుదార మణి శ్రిత వక్షుఁ డుల్లస
ద్వనజ దళాక్షుఁ డొత్తె రవధన్యముఁ బౌర సమూహ మాన్యమున్
దనుజ చమూ మనోరచిత దారుణ దైన్యముఁ బాంచజన్యమున్. 166

* మలుచుచు

ప్రతి : మనుజవర + అగ్రణీ = శ్రేష్ఠులైన మనుజులలో మొదటి వాఁడైన కృష్ణుని యొక్క; మహిత = గొప్ప దైన; మార్గణ జృంభణ సార భీతుఁడై = శరము యొక్క అతిశయమైన శక్తిచే భయమును పొంది; ధనదసఖుండు = కుబేరుని చెలికాఁడు శివుఁడు; వాలినన్ = వాలి పోయి పడఁగా; ఉదార మణి శ్రిత వక్షుఁడు = దొడ్డ దైన కౌస్తుభ మణితో కూడిన ఱొమ్ము కలవాఁడు; ఉల్లసత్ = వికసించుచున్న; వనజదళ + అక్షుఁడు = కమల దళములవంటి కన్నులు కలవాఁడు, కృష్ణుఁడు; రవ ధన్యమున్ = శబ్దముచే ధన్యమైనదియును; పౌర సమూహ మాన్యమున్ = పురజనులచే ఆదరింపఁ బడునదియును; దనుజ చమూ = రాక్షస సేనల; మనస్ + రచిత దారుణ దైన్యమున్ = మనస్సులందు, కావింపఁబడిన భయంకరమగు దీనత కలదియును అయిన; పాంచజన్యమున్ = ఆ పేరు గల శంఖమును;ఒత్తెన్ = పూరించెను.

తా : మానవేంద్రులలో, (నృపాలురలో) ప్రథముఁడగు కృష్ణుని దొడ్డ దైన జృంభణ శరముయొక్క అతి శయమైన శక్తికి భయపడిన వాఁడై, శివుఁడు ఒఱగఁగా గొప్ప దైన కౌస్తుభ మణిని వక్షమందు కల వాఁడును, వికసించిన కమలముల వంటి కన్నులు కలవాఁడును అయిన కృష్ణుఁడు, గొప్ప శబ్దాడంబరము కలదియును, పౌరు లెల్లరును పూజించు నదియును. రాక్షస సేనల మనస్సులందు భయంకరమైన దీనతను కలిగించు నదియునైన పాంచజన్య మనెడి శంఖమును పూరించెను.

శా. ఆయంభోజదళాక్షుఁ డుగ్రతర పంచాస్యారవం బొప్పఁగా
మ్రోయించె న్విశిఖాసనంబు హృద యామోదంబు నిండార ర
క్షో యక్ష ప్రమథేశ సైన్యములు సంక్షోభంబు నొందంగ బా
ణాయ త్యుద్భట శక్తిబాణుఁడు గతాహ్లాదంబుతోఁ బాఱఁగన్. 167

ప్రతి : ఆ + అంభోజదళ + అక్షుఁడు = ఆ కమల పత్ర నేత్రుఁడు; ఉగ్రతర పంచాస్య+ఆరవంబు = మిగుల భయంకరమైన సింహనాదము; ఒప్పఁగాన్ (చేసి); హృదయ+ఆమోదంబు నిండారన్ = తన మనస్సు సంతోషముతో నిండఁగా; రక్షస్ +యక్ష ప్రమథేశ సైన్యములు, సంక్షోభంబున్ + ఒందంగన్ = రాక్షసుల యొక్కయు; యక్షుల యొక్కయు, శివునియొక్కయు (ప్రమథగణములు) సైన్యములు, మిక్కిలి కలఁత చెందునట్లును; బాణ + ఆయతి +ఉద్భట శక్తి బాణుడు = బాణముల యొక్క ప్రభావముచే, అతిశయించిన శక్తి గల బాణాసురుఁడు; గత + ఆహ్లాదంబుతోన్ = పోయిన సంతసముతో; పాఱఁగన్= పరుగిడి పోవుచుండఁగా; విశిఖ + ఆసనంబున్ = వింటిని; మ్రోయించెన్ = ధ్వనింపఁజేసెను.

తా : ఆ కృష్ణుఁడు, మిక్కిలి భయంకరమైన సింహనాదము ఒప్పునట్లు (చేసి) తన

మనస్సు సంతోషముతో నిండఁగా రాక్షసుల యక్షుల, శివభటుల సైన్యములు. మిక్కిలి కలఁత చెందునట్లును, బాణముల యొక్క ప్రభావముచే, అతి సమర్థుఁడైన బాణుండు (దివ్యాస్త్రసంపద కలవాఁడు) సంతోషమును వీడి పాఱిపోఁగా వింటిని ధ్వనింపఁజేసెను.

కం. తక్కిన సైన్యము లనిలోఁ
జిక్కి పరాఙ్ముఖతఁ దొలఁగె, శివుఁడును భీతిం
బొక్కుచు నలసత మెయి న
ల్దిక్కుఁ దిరిగి నిలిచి యావులించుచు నుండెన్. 168

అర్థ : అనిలోన్ = యుద్ధములో; పరాక్ +ముఖతన్ = (వెనుకకు మరల్చిన) పెడ మొగముతో; పొక్కుచున్ = విచారముతో; అలసతమెయిన్ = అలసటతో.

తా : మిగిలిన సైన్యములు యుద్ధములో సంకటపడి వెనుకకు మరల్చిన ముఖములతో యుద్ధమును చేయుటకు ఇష్టములేనివారై దూరముగా తొలఁగిరి. శివుఁడును భయముతో విచారించుచు, అలసటతో నాలుగు దిక్కులు తిరిగి అంతటిని సమీక్షించుచు ఆవులించుచుండెను.

వ్యా. నాలుగు +దిక్కు > నలుదిక్కులు > నల్దిక్కు.

సూ. ద్విగునకు ఏకవచనంబు ప్రాయికంబుగానగు. మిశ్రంబునకు కాదు. సమాస, బాల - 18. ఇది మిశ్ర సమాసము. అపవాదము. ఏకవచనాంతము. సమాస, ప్రౌఢ - 20 దీనిని సమర్థించినది.

వ. తదనంతరంబ. 169

తా: పిమ్మట.

మ. నియ తామర్షముతోడ బాణ సచివానీకంబు నుద్యన్మహా
హయ సంబంధము జైత్రమంత్ర వివిధాయ త్నాస్త్ర సంఘోద్భవ
స్మయ సైన్యావృత మైన స్యందనముఁ గ్రౌంచ ద్వేషి యెక్కె న్వెసన్
లయకాలాంతక సన్నిభుండయి రణోన్మాదంబు సంధిల్లఁగన్. 170

ప్రతి : క్రౌంచ - ద్వేషి = క్రౌంచ పర్వత శత్రువు - కుమార స్వామి; లయ కాలాంతక సన్నిభుండు+ అయి = ప్రళయకాల రుద్రునితో సమానుఁడయి; రణ+ఉన్మాదంబు = యుద్ధ

గర్వము; సంధిల్లఁగన్ = కలుగఁగా; నియత+అమర్షముతోడన్; (దిట్టమైన) = తప్పని కోపముతో; బాణ సచివ+అనీకంబున్ = బాణుని మంత్రుల సేనలు కలదియును; ఉద్యత్ + మహా+హయ సంబంధమున్ = ఉద్యమించుచున్న గొప్ప గుఱ్ఱములయొక్క సంబంధము (కట్టుఁబాటు) కలదియును; జైత్ర = జయశీలములైన; మంత్ర = మంత్రములతోను; వివిధ = అనేక విధములైన; ఆయత్త = సిద్ధములైన; అస్త్ర = బాణములయొక్క; సంఘ = సమూహము వలన; ఉద్భవ = పుట్టుక గల (పుట్టిన); స్మయ = గర్వముతోడి; సైన్య = సేనతో; ఆవృతము = ఆవరింపఁబడి నదియును; ఐన, స్యందనమున్ = రథమును; వెసన్ = శీఘ్రముగా, ఎక్కెను.

తా : క్రౌంచ భేది అగు, కుమారస్వామి ప్రళయ కాల రుద్రునితో సమానుఁడయి యుద్ధ గర్వము కలుగఁగా, నియతమైన కోపముతో బాణుని మంత్రుల సేనలతో కూడినట్టియును, ఉద్యమించు గొప్ప గుఱ్ఱములు కలదియును, జయశీలములైన మంత్రముల మహిమగల వివిధాస్త్ర సమూహముల వలన పుట్టిన గర్వముతోడి సేనతో ఆవరింపఁబడినదియు నైన, రథమును శీఘ్రముగా ఎక్కెను.

## - : కుమార స్వామి కృష్ణ బలభద్ర ప్రద్యుమ్నులతోఁ దలబడుట : -

ఉ. కయ్యములోని దైత్యులు వికార వపుః ప్రమథ వ్రజంబు 'లా
యయ్యకు నెక్కు డీతని మహాద్భుతవిక్రమ' మన్నఁ బొంగి తా
నయ్యెడఁ బార్వతీసుతుఁ డహంకృతితో శతముల్ సహస్రముల్,
చయ్యన నేసె బాణములఁ జక్రధరున్ బలభద్రుఁ దత్సుతున్. 171

ప్రతి : కయ్యములోని దైత్యులు = యుద్ధమునందలి రాక్షసులు; వికార వపుస్(:) + ప్రమథ వ్రజంబులు = వికృత శరీరములుగల ప్రమథుల సమూహములు; ఈతని మహా + అద్భుత - విక్రమము = ఈ కుమార స్వామి యొక్క మిక్కిలి ఆశ్చర్యకర పరాక్రమము, ఆ + అయ్యకున్ = ఆ శ్రీకృష్ణునకు; ఎక్కుడు = ఎక్కువ; అన్నన్ = అనఁగా; తాను, పొంగి = ఉబ్బి, ఆ +ఎడన్ = ఆ సమయమున; పార్వతీ సుతుఁడు = కుమారస్వామి; అహంకృతితోన్ = గర్వము తో; చయ్యనన్ = శీఘ్రముగా; శతముల్ = నూఱులు; సహస్రముల్ = వేలు; బాణములన్ = బాణములతో; చక్రధరున్ = శ్రీకృష్ణుని; బలభద్రున్ = బలరాముని; తద్+సుతున్ = ఆతని కుమారుని (ప్రద్యుమ్నుని); ఏసెన్ = కొట్టెను.

తా : యుద్ధ రంగమందున్న రాక్షసులును, వక్రములైన శరీరములును గల ప్రమథుల సమూహములును, "ఈ కుమారస్వామి యొక్క ఆశ్చర్యకరమైన పరాక్రమము, ఆ

కృష్ణుని కంటె మించినది" అనఁగా అతఁడు పొంగి గర్వముతో నూర్లు, వేలు సంఖ్యగల బాణములతో, శీఘ్రముగా, శ్రీకృష్ణబలరామ ప్రద్యుమ్నులను కొట్టెను.

వ్యా. 'శతముల్, సహస్రముల్ బాణములన్' బాణములన్ విశేష్యము. తృతీయార్థమున నున్నది. 'శతముల్, సహస్రముల్' అనునవి ప్రథమాంతములుగా నున్నవి. సూ. కారక, బాల - 26. ఇట్లు ద్వితీయాదులకు ప్రథమ బహుళముగా వచ్చును.

శా. నిమ్నుం డై శరజుండు సంగర మిళన్ని ష్కంప రోషంబుతో
నామ్నాయాత్ముని వేయిబాణములచే హాలాప్రియున్ నూఱిటన్
ద్యుమ్న క్ష్మాధరవాసు లచ్చెరువునం దూఁగాడ నిశ్శంకుఁ బ్ర
ద్యుమ్నుం బెక్కుసహస్రబాణములచేఁ దూలించి మించె న్వెసన్. 172

అర్థ : నిమ్నుండై = గంభీరుఁడై; శరజుండు = ఱెల్లు వన మందు జన్మించినవాఁడు, కుమారస్వామి; సంగర మిళత్ నిష్కంప రోషంబుతోన్ = యుద్ధమందు కలిగిన చలింపని కినుకతో; ఆమ్నాయ+ఆత్మునిన్ = వేద స్వరూపుని; హాలా ప్రియున్ = మద్యమందు ప్రీతి కల బలరాముని; ద్యుమ్న క్ష్మాధర వాసులు = బంగారు కొండపై (మేరు పర్వత వాసులు) నివసించువారు, దేవతలు; నిశ్శంకున్ = జంకులేని; తూలించి = చలింపఁజేసి.

తా : గంభీరుఁడైన కుమారస్వామి, యుద్ధమందు నిశ్చలమైన కోపముతో, వేద స్వరూపుఁడైన శ్రీకృష్ణుని వేయి బాణములతో, మద్య ప్రియుఁడైన బలరాముని నూఱు బాణములతో, జంకు లేని ప్రద్యుముని పెక్కు వేల బాణములతో చలింపఁ జేసి మేరు పర్వతవాసులైన దేవతలు అచ్చెరువుతో భయపడునట్లు చేసెను.

ఛం. మకార నకార సంయుక్తాక్షరము, ప్రాసము.

వ. ఆసమయంబున. 173

తా : అప్పుడు

ఉ. అంచిత రక్త దేహులు మహాయుధ భీషణు ల య్యదూద్వహుల్
నొంచిరి వాయు వహ్ని ఘన నూత్న మహాస్త్రములం, బ్రకోపులై
సంచిత కోపదారుణ విశంకట బాణ కృతారి మారణున్
గ్రౌంచ విదారణుం బ్రమద కారణు నుజ్జ్వల శక్తి ధారణున్. 174

అర్థ : ప్రకోపులై = అధికమైన కోపము కలవారై; ఆ+యదు+ఉద్వహుల్ = ఆ యాదవ వంశ శ్రేష్ఠులు; సంచిత = నిండిన (కలిగిన); దారుణ విశంకట బాణకృత + అరి మారణున్ = భయంకరములును, విరివియును అయిన బాణములతో చేయఁబడిన శత్రువుల మరణమును కలిగిన వానిని; క్రౌంచ విదారణున్ = క్రౌంచ పర్వతమును పగులఁగొట్టిన వానిని; వాయు = వాయవ్యము; వహ్ని = ఆగ్నేయము; ఘన = మేఘము (పర్జన్యము);

తా : ఒడలంతయు రక్తము క్రమ్ముకొని కాఱుచుండఁగా గొప్ప ఆయుధములతో భయంకరులైన ఆ యదువీరులు ముగ్గురు, మిక్కిలి కోపము కలవారై, వాయవ్యము ఆగ్నేయము, పర్జన్యము అనెడి క్రొత్త వైనవియును, భయంకరములైనవియును బలమైనవియును (విరివియైనవి), అయిన బాణములచే, కోపముతో శత్రువులను సంహరించు వాఁడును, క్రౌంచ పర్వతమును పగులఁగొట్టిన వాఁడును, తమ సేనలకు సంతోషమునకు కారణమైన వాఁడును, ప్రకాశించు "శక్తి" అనెడి ఆయుధమును ధరించిన వాఁడును అగు కుమారస్వామిని బాధించిరి.

అలం : అంత్యానుప్రాసము, మారణున్, విదారణున్, కారణున్, ధారణున్.

కం. ఆ నలినాయత నేత్రుఁడు
నా నీలాంబరుఁడు మరుఁడు నధికముదముతో
నానామంత్ర సమన్విత
సేనానీ శరగణంబు చేసిరి మాయన్. 175

తా : ఆ కమలముల వలె విశాలములైన కన్నులుగల వాఁడు, శ్రీకృష్ణుఁడును, ఆ నల్లని వస్త్రము కలవాఁడు, బలరాముఁడును, ప్రద్యుమ్నుఁడును, మిక్కిలి సంతోషముతో; వివిధములగు పెక్కు మంత్రముల మహిమతో కూడిన కుమారస్వామి బాణముల సమూహమును నాశము చేసిరి.

వ. అట్టి యెడ. 176

తా : ఆ సమయమందు;

ఉ. దేవగణంబు డెందముల ధీరత దక్కె, విమాన పంక్తి నా
నా విధపద్యలం దొలఁగె, నాకనివాసి వనో ల్లస న్మహీ
జావళి గూలె, విద్రుతము లయ్యె దిశాకరు, లుగ్ర భంగి నీ
భావ భవారి నందనుఁడు బ్రహ్మశిరం బను నస్త్ర మేసినన్. 177

అర్థ : ఈ భావ భవ + అరి నందనుఁడు = ఈ (మనసున జన్మించిన) మన్మథునికి శత్రువైన శివుని కుమారుఁడు కుమారస్వామి; ఉగ్రభంగిన్ = భయంకర రీతిలో; డెందములన్ = హృదయములందు; ధీరత తక్కెన్ = ధైర్యమును కోల్పోయెను; పంక్తి = వరుస; పద్యలన్ = మార్గములందు; నాక నివాసి = దేవతల; వన+ఉల్లసత్ మహీజ+ఆవళి = నందన వన మందు ప్రకాశించు చెట్ల సమూహము; [illegible]యుతములు + అయ్యెన్ = పాఱి పోయెను.

తా : శివుని సుతుఁడు కుమారస్వామి, భయంకర రీతిలో 'బ్రహ్మశిరము' అనెడి అస్త్రమును యాదవులపై వేయఁగా దేవతలు ధైర్యమును కోల్పోయిరి. విమానముల వరుసలు వేర్వేఱు మార్గములలో పోయినవి. (మార్గములను తప్పినవి) స్వర్గమందు, నందన వనమందలి కల్పతరువులు అన్నియును కూలినవి. దిగ్గజములు పాఱిపోయినవి. ఇట్లు దేవతలు తల్లడపడిరి.

అలం : అసంబంధాతిశయోక్తి.

కం. ఆదిత్య శతద్యుతి దా
మోదరుఁడు సుదర్శనముఁ బ్రయోగించి తద
స్త్రాదృతదీప్తిం జెఱిచెను
గాదంబిని తపను కాంతిఁ గప్పిన పగిదిన్. 178

ప్రతి : దామోదరుఁడు = ఉదర మందు తులసి మాలిక కలవాఁడు; యశోదచే పలుపున ఉదరమందు కట్టఁబడినవాఁడు, శ్రీకృష్ణుఁడు; ఆదిత్య శత ద్యుతిన్ = నూర్వురు సూర్యుల తేజమును కలిగినట్టి; సుదర్శనమున్ ప్రయోగించి; తద్ + అస్త్ర ఆదృత దీప్తిన్ = ఆ బ్రహ్మశిరము అనెడి అస్త్రముచే ఆదరింపఁబడిన (వెల్వరించు చున్న) గొప్పకాంతిని; తపను కాంతిన్ = సూర్యుని కాంతిని; కాదంబిని = మేఘమాల; కప్పిన పగిదిన్ = కప్పినట్లు; చెఱిచెను.

తా : శ్రీకృష్ణుఁడు నూఱు సూర్యుల తేజముగల తన సుదర్శన చక్రమును ప్రయోగించి మేఘమాల సూర్యుని కాంతిని కప్పి వేసినట్లు ఆకుమారస్వామి అస్త్ర ప్రకాశమును పాడు చేసెను.

అలం : ఉపమ, "కాదంబిని... పగిదిన్".

వ. తదనంతరంబ తదస్త్రంబు తిరస్కృతౌఘం బగుటయుం బటు చటుల భ్రుకుటి కుటిల విశంకట లలాట తట నికట వికట పటీయ స్స్వేదోద బిందు సమభివ్యక్తీకృత రోషావేశుం డై విశాఖుండు సంబద్ధ

ఘంటాసమూహ దీర్ఘ ఘర్ఘరీ నిర్ఘోషంబును, వితత సువర్ణ
ప్రభాశిఖాజాలంబును, జయలక్ష్మి వినిర్మిత నారాయణ నీరాజనక్రియ
ననుకరించు హేమమయం బగు శక్తిం బ్రయోగించిన. 179

ప్రతి : తద్+అనంతరంబు+అ= తర్వాత; తద్+అస్త్రంబు = ఆ బ్రహ్మ శిరస్సు అనెడి బాణము; తిరస్కృత + ఓఘంబు = కోల్పోయిన వడి కలది; అగుటయున్; పటు చటుల భ్రుకుటి = గట్టిదైనట్టియు చంచలములగు, బొమముడిచే; కుటిల విశంకటలలాట తట నికట = వంకర యైనదియు, విస్తరించినదియు నైన నొసటి ప్రదేశము యొక్క సమీపమందలి; వికట ఘటీయః = అధికమైనదియును పెద్దవైనదియును అగు; స్వేద +ఉద బిందు = చెమటనీటి చుక్కలచే; సమభివ్యక్తీకృత = చక్కగా వెల్లడి చేయఁబడిన; రోష+ఆవేశుండై = క్రోధము యొక్క ఉద్రేకము కలవాఁడై; విశాఖుండు = కుమార స్వామి, విశాఖ నక్షత్రమున పుట్టిన వాఁడు; సంబద్ధ ఘంటా సమూహ దీర్ఘ ఘర్జర నిర్ఘోషంబును = బాగుగా కట్టఁబడిన గంటల గుత్తముచే నిడివియైనదియును ఘర్జర మనెడి గొప్పధ్వని కలదియును; వితత సువర్ణ ప్రభా శిఖా జాలంబును = అతిశయించిన బంగారు కాంతుల యొక్క సెగల (మంటల) సమూహము కలదియును, అయి; జయలక్ష్మి వినిర్మిత= జయమును కూర్చు మంగళ దేవత చక్కగా సిద్ధము చేసిన; నారాయణ నీరాజన క్రియన్ = శ్రీకృష్ణునకై సమర్పించు కర్పూర హారతిని; అనుకరించు = పోలిన; హేఁగు మయంబు+అగు = అంతయును బంగారయిన (బంగారుతో చేయఁబడిన), శక్తిన్ = "శక్తి" అనెడి గొప్ప ఆయుధమును; ప్రయోగించినన్ = వేయఁగా.

తా : పిమ్మట బ్రహ్మశిరము అనెడి అస్త్రము తన వడిని కోల్పోయినది. గట్టిదై చలించు బొమముడితో మిక్కిలి వక్రించినదియును, విస్తరించినదియు నైన నొసటి యందలి చెమటనీటి బిందువులచే, చక్కగా కన్పట్టు కోపముయొక్క ఉద్రేకముతో, గంటలు కలదియును, ఘర్జర ధ్వని కలదియును, బంగరు వెలుఁగుల సెగలు కలదియును, జయలక్ష్మి (మంగళదేవత) నారాయణునకు ఇచ్చు కర్పూర హారతియో అనునట్లు గోచరించునదియును అయిన, బంగారుతో చేయఁబడిన శక్తి అనెడి ఆయుధమును వేయఁగా.

అలం : ఉపమ, "జయలక్ష్మి నీరాజన క్రియను అనుకరించు" అనుటచే కుమారస్వామి ఆయుధము కృష్ణుని ఎదుర్కొనుటలో దుర్బల మని ధ్వని.

శా. శంకాకీర్ణ మనస్కు దానవరిపుల్ చక్రాయుధుం డింతతోఁ
గ్రుంకెం బో! యని భీతులైరి యచటం గ్రోధాప్త దీప్తిన్ మహా

హుంకారంబున శక్తిఁ గూల్చె విమత వ్యూహంబు భీతిల్ల నా
తంకంబుం బెడఁబాసి విష్ణుఁడు జగత్ప్రఖ్యాత చారిత్రుఁడై. 180

ప్రతి : శంకా+ఆకీర్ణ మనస్క దానవ రిపుల్ = సంశయముతో నిండిన మనస్సు కలవారైన, దానవుల శత్రువులు (దేవతలు); చక్ర+ఆయుధుండు = కృష్ణుఁడు; ఇంతలోన్ = ఈ శక్తిచే క్రుంకెన్ పో = తప్పక అడఁగిపోయెను; అని భీతులు +ఐరి; అచటన్ = అచ్చట; క్రోధ +ఆప్త దీప్తిన్ = కోపముచే పొందిన తేజముతో, మహా హుంకారంబునన్ = గొప్ప దైన "హుం" అనెడి ధ్వనితో; విమత వ్యూహంబు = శత్రువుల సేనలు; భీతిల్లన్ = భయము చెందునట్లు; ఆతంకంబు = వెఱపు; ఎడఁబాసి = వీడినవాఁడై; విష్ణుఁడు = కృష్ణుఁడు; జగత్ ప్రఖ్యాత చారిత్రుఁడై = లోకమందు, బాగుగా తెలియునట్టి నడవడిక కలవాఁడై; శక్తిన్ = ఆ కుమారుఁడు ప్రయోగించిన శక్తిని; కూల్చెన్ = క్రింద పడునట్లు చేసెను.

తా : వెంటనే దేవతలు 'ఈ శక్తిచే, చక్రాయుధుఁడు శ్రీకృష్ణుఁడు తప్పక అడఁగును' అని భయపడిరి. శత్రువులు భయపడుచుండగా నిలుకడ చెంది క్రోధావేశముతో హుంకార ధ్వనిని చేయుచు, లోకమందు గొప్ప చరిత్ర కలవాఁడగుచు శ్రీకృష్ణుఁడు, ఆ శక్తిని పడఁగొట్టెను.

ఛం. బిందుపూర్వక 'క' కారము, ప్రాసాక్షరము,హుంకార ధ్వనికి పోషకముగానున్నది.

ఆ.వె. అంతఁ బోక శౌరి యగ్రజుండును దాను
జక్రమును హలంబుఁ జటులగదయు
భుజములందుఁ దాల్పఁ బొరిఁ బొరిఁ గదిరెడు
భీతి మానసమునఁ బిచ్చలింప. 181

తా : అంతటితో ఊరక యుండక, శ్రీకృష్ణుఁడును, అతని అన్నయగు బలరాముఁడును, చక్రాయుధమును, నాఁగటిని, బలమైన గదను, భుజములందు ధరించి (ప్రవర్తింపఁగా), కుమారస్వామి మనస్సులో క్రమక్రమముగా భయము మొలకెత్తి ఎక్కువ కాఁగా.

వ. గుహుండు చేయునది లేక తిరుగంబడినం, బూర్వజయుతుం డై (పూర్వగీర్వాణుం డగు బాణు నజేయు) హృషీకేశుండు సమయింపం దలంచి వెంటం దగులు నవసరంబునం గోటవి యన నొక్క యుచ్చ మల్లి వచ్చి యడ్డపడిన నగ్నికం జూచి నారాయణుండు మాఱు

మొగంబు వెట్టికొని యప్పుడు ద్వాదశవర్షంబులు నన్నుం గొలిచిన
ఫలంబు నిన్నొక మరి చూచినం జెడు నని శపించె నది మొదలుగా నా
నగ్నిక దిగంబర యై యుండె నివ్విధంబున. 182

అర్థ : తిరుగం బడినన్ = మరలఁగా; పూర్వజ యుతుఁడై = అన్నతో కూడినవాఁడై; పూర్వ గీర్వాణుండు + అగు = రాక్షసుఁడైన బాణుని; అజేయున్ = జయించుటకు శక్యము కాని వానిని; హృషీకేశుండు = ఇంద్రియములకు (హృషీకములకు) ఈశ్వరుఁడు, శ్రీకృష్ణుఁడు; తగులు +అవసరంబునన్=వెంబడించు నపుడు; ఉచ్చమల్లి=దిగంబర(శ.ర. ఉదాహరించినది); నగ్నికన్ = కన్యను.

తా : కుమారస్వామి ఇంక తాను ఏమి చేయుటకును వీలుకాక, వెనుదిరిగి పోయెను. పిమ్మట శ్రీకృష్ణుడు తన అన్న అయిన బలరామునితో కూడ, జయించుటకు సులభ సాధ్యుఁడు కాని, రాక్షసుఁడైన బాణుని చంపం దలంచి అతనిని వెంబడించు చుండఁగా దిగంబరయైన కన్యక "కోటవి" అను పేరు కలది, వచ్చి ఎదురైనది. ఆ కన్యకను చూచి అతఁడు, మొగమును త్రిప్పుకొని "పంద్రెండు ఏళ్లు నన్ను సేవింపఁగా వచ్చు పుణ్య ఫలము నిన్ను ఒక్క సారి చూచిన నశించును" అని శాపమిచ్చెను. అప్పటినుండి ఆ కన్యక నగ్నయై (దిగంబరయై) ఉండెను. ఈ విధముగా (మీఁది పద్యముతో).

మ. జ్వరుఁడున్ శంకరుఁడుం గుమారుఁడు మహా సైన్యంబు సన్నాహ సు
స్థిర లీలం డిగఁ ద్రావి దానవ విభు శ్రేయో విశేషాదిక
స్ఫురిత శ్రీఁ బెడఁబాసి సంతత మహాశూరాగ్రణీ సద్యశ
స్సరణుల్ బెండువడం దొలంగిరి మహా సంగ్రామ రంగంబునన్. 183

ప్రతి : జ్వరుఁడున్=శివజ్వరుఁడును, శంకరుఁడున్; కుమారుఁడున్=కుమారస్వామియును; మహా సైన్యంబున్ = గొప్ప సేనయును; సన్నాహ సుస్థిర లీలన్ = యుద్ధ ప్రయత్నము యొక్క నిశ్చలత్వమును (దృఢమైన సంకల్పమును); దిగఁద్రావి = పూర్తిగా విడిచిపెట్టి; దానవ విభు శ్రేయస్ + విశేష + ఆదిక స్ఫురిత శ్రీన్ = రాక్షసరాజు యొక్క శత్రువులను జయించుట అనెడి క్షేమము ప్రకాశింపఁజేయు శోభను (సంపదను); పెడఁబాసి = వదలి వేసి; సంతత మహా శూర + అగ్రణీ సత్ యశస్ సరణుల్ = ఎడతెగని గొప్ప శూరులతో ఉన్నతులును; మేలైన కీర్తిని కల్గించు విధానములు; బెండు వడన్ = సడలిపోవుటచే; మహాసంగ్రామ రంగంబునన్ = గొప్పయుద్ధ రంగమునుండి; తొలంగిరి.

తా : శివజ్వరుఁడు, శివుఁడు, కుమారుఁడు, గొప్పవీరులును యుద్ధము చేయు మనస్సు లేక, బాణుని క్షేమమును ప్రకాశింపఁజేయు సత్పద్ధతియైన యుద్ధమును కొనసాగింపక, అతని శోభ నశించు విధమున, ఎల్లప్పుడును, ఎడతెగని గొప్ప మేధావులైన వీరుల యొక్క శ్రేష్ఠములగు కీర్తిని పెంపొందింపఁ జేయు పద్ధతులు సడలిపోవునట్లు, ఆ గొప్ప యుద్ధ రంగమునుండి సారహీనులై, ధీరతలేక తొలఁగిపోయిరి.

వ. ఇవ్విధంబున సగుహజ్వరుం డై ఖండపరశుండు పాఱిన సుర పద్యా విరాజమా నామర నిర్ఝరిణీ ప్రవాహ శంకా సంపాదన నిదాన నిరంతర వైజయంతీ సంతానంబును, ననవద్య విద్యోతిత వివర్ధిత తర తరణి కిరణ సర్వతో జాజ్వల్య మా నాఖర్వ నిర్వక్ర సర్వతః ప్రసర్వ్యమాణ యుద్ధవిలోక నాగత దర్వీకర సార్వభౌమ ఫణామండల మాణిక్య మరీచి విడంబ నా పండిత తేజః కృపాణ ప్రముఖ శస్త్రాస్త్రంబులం గలుగు స్యందనంబులునుఁ, బరాభూత భేరీ భాంకార భయానక ఘంటాపటల గ్రైవేయక బృంహితా రావంబులును, నధఃకృత ఘనాఘన కళేబర చ్ఛాయాచ్ఛాదిత దిగంతరాళంబును, గర వినిర్గత శీక రాసార కృత దుర్దినంబును, నవిరత గళన్మదోదకధారా పటల చటుల కటంకటీయ ద్విరేఫ రాజావరోధ వధూ మాధుర్య ధుర్య ధ్వాన సమాకర్ణ నానందంబును నవ్విధంబును గాక నభోవీధియుం బోలె నక్షత్రమా లాలంకృతంబై, పారావారంబును బోలె మహాసత్త్వసమగ్రంబై, త్యాగి గృహాంగణంబునుం బోలె దాన ధారామనోహరంబై, ధారాగృహంబును బోలెఁ జారు ఘటాంకితం బై, మలయ శైలంబునుం బోలె విషధర ప్రకాశం బై, త్రిలోచనాస్థానంబునుం బోలె శక్తిధరాధిష్ఠితం బై, చతురాననముఖ పంక్తియుం బోలె సామోద్భవస్థానం బై, శరీరంబునం బొల్చు సిందూరంబును ధారాధర సమయ సాయంతన సంధ్యా సందేహ సంపాదన కారణం బగు మతంగజ పంక్తియు, నతిత్వరిత గమన వేగ తిరస్కృత సమీరణంబులును, ఖురదళిత ధరాధూళిపాళీ విరచి తాపర సర్వంసహంబులును, చరణ జనిత పవనంబులును,

వదన గహ్వర నిష్ఠ్యూత లాలాజలంబులును, పల్యాణ ఖచిత నూత్న రత్న తేజో వికాసంబులును, బాద మధ్యవిలీన గగనంబులు నై పంచ త్మకత్వంబునను, హరినామధే యానుగుణ గుణంబులును శక్ర తురగ విలోకన కౌతూహలంబునం బోలె నభంబు నాక్రమించి శ్రుత తదీయ జలధి సంభవ పాదంబులం బోలె నర్ధాక్రమణ నివృత్తంబులై, ప్రభాకర హయంబు లసహాయంబు లై జరగం జాల వని జనంబు లాడు వచనంబులు విని స్వకీయ వినయ జనిత లజ్జాయుతంబులుం బోలె నమితాననంబు లై గమన విస్తారిత చామరంబులై పునస్సంజనిత పక్షంబులుం బోలె మనోజ్ఞంబు లై, యివ్విధంబునుం గాక కైలాసనగరంబునుం బోలె నీశ్వరప్రియంబు లయ్యును దుర్వర్ణ మంజులంబులై, మేరుగిరి నితంబంబునుంబోలె దేవమణినివాసంబు లయ్యును నసురాధిష్ఠితంబు లై, సాగరంబునుం బోలెఁ బ్రకటిత నిఖిలావర్తంబు లయ్యును జడమయంబు లై, యక్షర చయంబు నుం బోలె దీర్ఘప్లుతప్రచారంబు లయ్యును హ్రస్వంబు లయి విలసిల్లు ఘోటకంబులును, నఖిలరత్న ఖచిత మకుటకోటి ప్రభా ప్రహసిత తరణిమండలంబులును, గోపావేశ విశంకట భ్రుకుటి చటుల లలాట దేశంబులునుం, బరస్పర కృపాణ ఘట్టన ప్రభా విహాయ స్సముత్థిత స్ఫులింగ ధూమ కేతు సముపలక్షితా నిమిత్తంబులును, శింజినీ టంకారపాద స్థిత బిరుద కటకధ్వాన సింహనాద విడంబిత నిస్సాణ నిస్వనంబులును, మఱియునుం గోదండంబు లుద్దండులై ధరియించియుం జరియించియు, గదలు ప్రాదలు చెలంగం బట్టియుం దట్టియు, శరంబులు గరంబుల నమర్చియుం జెమర్చియు, శక్తులు శక్తులకు నిచ్చియుం బుచ్చియుఁ, గఠారంబులు గుఠారంబుల కొసంగియుఁ నెసంగియుఁ, బట్టసంబు లట్టహాసంబులతోఁ గదలించియు ముదలించియు, బల్లెమ్ములు బల్లెమ్ముల విఱువ

సవరించియు వివరించియుఁ, జంద్రహాసంబులు మందహాసంబులతో జళిపించియు దళిపించియుఁ, దోమరంబులు చామరంబులతో నొనర్చియుం దన ర్చియుఁ, బ్రాసంబులు రోసంబులతో సారించియుఁ గారించియు, సబళంబులు సుబలంబులుగా నొత్తియు నెత్తియు, శల్యంబులు తుల్యంబులుగా ధరించియు భరించియు, నారసంబులు సారసంబులతో దిట్టలు గొనం గూల్చియు నేర్చియుఁ, బలకలు పులకలు నెగయఁ బాటించియుఁ దాటించియుఁ, గంకటంబులు సంకటంబు లని తమయేలికల నడిగియుం దొడిగియు, నలుదెసలం బరఁగు కాలు బలంబులును గూడం జనుదేర, విమత పతాకినీ ప్రతిభయమూర్తి యగు బాణాసురుండు బాహు సహస్ర ధృత నిఖిలశస్త్రాస్త్ర సందోహుం డై నారాయణుం దాఁకె, మఱియును. 184

**రథములు:**

ప్రతి : ఈ + విధంబునన్ = ఈ రీతిగా; ఖండపరశుండు = ఖండించెడు పరశువు గలవాఁడు. పరశువనెడు రాక్షసుని ఖండించినప్పుడు ఖండితమైన పరశువు గలవాడు శివుఁడు; స గుహ జ్వరుండు+ఐ = కుమారునితోను, జ్వరునితోను కూడిన వాఁడయి; పాఱినన్ = పాఱిపోఁగా;

సురపద్యా = దేవతల మార్గమున; విరాజమాన = ప్రకాశించుచున్న; అమర = నిర్ఝరిణీ ప్రవాహ = దేవనదియగు మందాకినీ జల ప్రవాహము యొక్క; శంకా సంపాదన = సంశయమును సంపాదించుటకు; నిదాన = ఆది కారణమైన; నిరంతర = దట్టమైన; వైజయంతీ సంతానంబును = టెక్కెముల మీది కలువల మొత్తమును; తెల్లని జెండాలు ఆకాశగంగా ప్రవాహ భ్రాంతిని గలిగించుచున్న వనుట.

అనవద్య= అనింద్యముగా, చక్కఁగా; విద్యోతిత = ప్రకాశించుటచే; వివర్ధిత తర = మిక్కిలి పెంపొందిన; తరణి కిరణ = సూర్య కిరణములచే; సర్వతః = అంతటను; జాజ్వల్యమాన = ప్రకాశించుచున్న; అఖర్వ = అధికమై; నిర్వక్ర = చక్కనై; సర్వతః = అన్ని దెసలకును; ప్రసర్పమాణ = వ్యాపించుచున్న; యుద్ధ విలోకన + ఆగత = యుద్ధమును చూచుటకు వచ్చిన, దర్వీకర + సార్వభౌమ = పాఁప ఱేని యొక్క, ఆదిశేషుని యొక్క (దర్వి తెడ్డువంటి ఆకారముగలది పడగ. అది కరముగా, హస్తముగాగలది పాము); ఫణా మండల = పడగల

మొత్తముయొక్క; మాణిక్య = మణుల; మరీచి = కాంతులను; విడంబనా = అనుకరించుట యందు; పండిత = సమర్థమైన; తేజస్ = కాంతులు కల; కృపాణ ప్రముఖ + శస్త్ర + అస్త్రంబులన్ = ఖడ్గములు మున్నగు శస్త్రములును; అస్త్రములును (శస్త్రములు అమంత్రకములు అస్త్రములు సమంత్రకములు); కలుగు = అమరియున్న; స్యందనంబులును = తేరులును.

**గజములు :**

పరాభూత = ఓడిన వారియొక్క; భేరీ భాంకార = నగారా ధ్వనులయొక్కయు; భయానక = భయంకరములును; ఘంటా పటల = గంటల సమూహము; గ్రైవేయక = కంఠహారముల యొక్కయు; బృంహిత = ఘీంకారములయొక్కయు; ఆరావంబులును = ధ్వనులును;

అధఃకృత = క్రిందు చేయఁబడిన; ఘనా ఘన = వర్షాకాలపు మేఘముల వలె నున్న; కళేబర + ఛాయా + ఆచ్ఛాదిత + దిగంతరాళంబును = శరీరములయొక్క నల్లని కాంతులతో కప్పఁబడిన, దిక్కుల నడిమి ప్రదేశమును; కర వినిర్గత = తొండములనుండి వెలువడుచున్న; శీకర+ఆసార = తుంపురుల (జలబిందువుల) జడులచే; కృత = చేయఁబడిన; దుర్దినంబును = మబ్బులతో నిండిన సూర్యుఁడు కాన రానిదినయును (ఏనుగుల తుంపురులు ఆకాశమును కప్పుటచే అవి మబ్బుల వలె నున్నవనుట); అవిరళ గళత్ = ఎల్లప్పుడును; గళత్ = కాఱుచున్న; మద+ఉదక ధారా పటల = మదజల ధారల సమూహము కల; చటుల కటంకటీయ = బలిష్ఠములైన చెక్కిళ్లపై (విహరించు); ద్విరేఫరాజ = తుమ్మెద రాజుల; అవరోధ వధూ = (అంతఃపుర కాంతల) పట్టపు రాణుల; మాధుర్య ధుర్య ధ్వానంబును =(రమింపఁ జేయు) తియ్యఁదనమును వహించు సుస్వనములను సమాకర్ణన = వినుట వలన; ఆనందంబును;

ఆవిధంబునఁగాక = ఆ రీతియేగాక;

1. నభస్ + వీధియున్ + పోలెన్ = ఆకాశమార్గము వలె; నక్షత్ర మాలా + అలంకృతంబై = (ఆకాశము); నక్షత్రముల వరుసలచే అలంకరింపఁ బడినది;

(గజములు): ఇరువది ఏడు మణులుండు, హారములను మెడలో ధరించియున్నవి ;

2. పారావారంబునున్+పోలెన్ = సముద్రమువలె; మహా సత్త్వ సమగ్రంబై = (సముద్రము) గొప్ప జల జంతువులతో నిండినది;

(గజములు) అధికమైన బలముతో సంపూర్ణమై;

3. త్యాగి గృహ+అంగణంబునున్+పోలెన్ = దాత యొక్క ఇంటి ముంగిలి వలె; దానధారామనోహరంబై = (త్యాగి); గోవు, హిరణ్యము, భూమి మొదలగువానిని ఇచ్చునప్పుడు విడుచు నీటి బిందువుల ధారలు మనస్సును హరించునట్లు;

(గజములు) మద జల బిందువుల ధారలు మనస్సును హరించునవై;

4. ధారా గృహంబునున్+పోలెన్ = ఎల్లప్పుడును నీటిని ఎగఁజిమ్ము నట్టి ఇంటివలె; చారు ఘట + అంకితంబై = (ధారాగృహము) అందమైన కడవల యొక్క ఉనికి కలది. పెద్ద పెద్ద కడవలు అమర్చుటచే అందుండి, నీరు సన్నని రంధ్రములనుండి ఎడతెగక వెలువడు చుండును;

(గజములు): అందమైన కుంభములతో గుర్తింపఁబడినవై; వాని తొండములు నీటిని ఎగఁజల్లుచున్నవి.

5. మలయశైలంబునున్ పోలెన్ = చందనవృక్షములు సమృద్ధిగా కల గంధపు కొండవలె; విషధర ప్రకాశంబై = (మలయశైలము); విషధరముల ప్రకాశము కలది. విషధరము లనఁగా పాములు. వాని పడగలపై మణుల వెలుఁగులు కలది. చందనవృక్షములను పాములు ఆశ్రయించుటచే వాని నుండి వెలుఁగులు ఎక్కువగా ప్రసరించినవి.

(గజములు) ఏనుఁగులును విషధర ప్రకాశము కలవై (ఉన్నవి). విషమును ధరించినవాఁడు, శివుఁడు, అతఁడు సర్పములను అలంకారముగ కలవాఁడు ఆ పాముల పడగలపై నుండు మణులు వెలుఁగులను వెదఁజల్లుచున్నవి. శివుఁడు, బాణుని సేనలో నుండుటచే, అతని నుండి వెలుఁగులు ప్రసరించినవి.

6. త్రిలోచన+ఆస్థానంబునున్+ పోలెన్ = ముక్కంటి (శివుని) కొలువు కూటమువలె; శక్తి ధర అధిష్ఠితంబై = కుమార స్వామి యొక్క ఉనికి కలదై;

(గజములు) శక్తి అనెడి ఆయుధధారులచే కూడినవై;

7. చతురానన = నాలుగు మోములు గలవాఁడు, బ్రహ్మయొక్క; ముఖ పంక్తియున్ +పోలెన్ = ముఖముల వరుసవలె; సామ+ఉద్భవ స్థానంబై = సామవేదము యొక్క పుట్టుకకు నెలవై.ఒక ముఖమునుండి సామ వేదము వెలువడినది.

(గజములు): సామ వేదము వలనపుట్టినవై; (ఏనుఁగులకు సామజములని పేరు);

పై వర్ణనలో అర్థ శ్లేషయందు ఉపమానపరమైన అర్థ మొకటి, ఉపమేయపరమైన అర్థము వేఱొకటి స్ఫురించును).

శరీరంబునన్+ పొల్చు సిందూరంబును = మేనులయందు మినమిన లాడు (ఒప్పు) ఎఱ్ఱని వన్నె; ధారాధర సమయ = వర్షా కాలపు; సాయంతన సంధ్యా = సాయంకాలపు సంధ్యా సమయమా అనెడి; సందేహ = సంశయమును కలిగించుటకు కారణమైన; మతంగజ పంక్తియున్ = (మతంగ పర్వతమున పుట్టినవి); ఏనుఁగుల వరుసలును (మదించిన ఏనుఁగులు,

గాఢమైన నీలవర్ణము కలవి. ఎఱ్ఱని మేనితో, వర్షాకాలపు సాయంసంధ్య వలె, చీఁకట్లను ప్రసరింపఁజేసిన వనెడి భ్రాంతి కలిగినది).

సాయం సంధ్యయందు, ఎఱ్ఱని సూర్యబింబము, అస్తమించుచుండఁగా; నల్లని చీఁకట్లు అలము కొనును. అప్పుడు ఎఱ్ఱని వర్ణము నల్లని చీఁకట్లలో రమ్యముగా గోచరించును. ఏనుఁగులు, కుంకుమ పాడిచే అలంకరింపఁబడియున్నవి. అవి నీలి వన్నెగల శరీరము కలవగుటచే, సాయంకాలపు సంజవేళ, అనెడి భ్రాంతి కలిగినది.

## తురగములు

అతిత్వరిత = మిక్కిలి త్వరగల; గమన-వేగ = నడకయొక్క వడిచే; తిరస్కృత = తెగడఁబడిన సమీరణంబులును = వాయువులు గలవియును;

ఖుర = గిట్టలచే; దళిత = రేఁపఁబడిన; ధరా ధూళి పాళీ = నేల దుమ్మొయొక్క మొత్తముచే; విరచిత = చేయఁబడిన; అపర సర్వంసహంబులును = మఱియొక భూమి గలవియును (గుఱ్ఱముల గిట్టలచే లేచిన ధూళి మఱియొక నేలను గలిగించు చున్న వనుట);

చరణ - పాదములనుండి; జనిత = (ఒరపిడిచే) పుట్టిన; పవనంబులును = వాయువులు గలవియును;

వదన-గహ్వర నిష్ఠ్యూత లాలాజలంబులును = గుహలవంటి ముఖముల నుండి ఉమియఁబడిన = ఉమ్మినీరు కలవియును;

పల్యాణ ఖచిత నూత్న రత్న తేజస్(ః) +వికాసంబులును = గుఱ్ఱపు వాగెలందు; తాఁపఁబడిన క్రొత్త, మణులయొక్క, తేజస్సుల (కాంతుల) వికాసముచే రమ్య మైనవియును;

పాద - మధ్య - విలీన - గగనంబులున్ + ఐ = నాలుగు కాళ్ల నడుమ అడఁగిన ఆకాశము గలవి అయి, పంచభూతాత్మకంబునను = పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము గలవగుట చేతను; (ఆ గుఱ్ఱముల గిట్టల ధూళి; మఱొక భూమిని విరచించినవి. వాని కాళ్లనుండి వాయువు జనించినది. ముఖ గహ్వరములనుండి లాలా జలము క్రక్కఁబడినది, వాగెలందుఁ దాఁపఁబడిన రత్నములు, తేజస్సు చిమ్మినవి. పాదముల నడుమ నాకాశము విలీనమయినది. ఇట్లు ఆ గుఱ్ఱములు పంచ భూతాత్మకము లయినవి.)

హరినామధేయ+అనుగుణగుణంబులను = 'హరి' అనఁగా ఇంద్రుఁడు కనుక ఆ పేరునకు తగినట్లు గుణములు కలవగుటచే; హరి అనఁగా పెక్కు అర్థములున్నవి. పచ్చనిది అను అర్థముండుటచే, మేలైన వన్నెగల గుఱ్ఱములనియు, ఇంద్రుఁడని అర్థముచే, అతని గుఱ్ఱమైన ఉచ్చైఃశ్రవము యొక్క గొప్పగుణ గణములు కలవనియును తలంపవచ్చును.

శక్రతురగ విలోకన కౌతూహలంబునన్ + పోలెన్ = ఇంద్రుని గుఱ్ఱమైన ఉచ్చైఃశ్రవమును చూడఁదలచిన వేడుక కలవో అన్నట్లు; నభంబున్ = ఆకాశమును తాఁకుటకు ఎగిరినవై; శ్రుత తదీయ జలధి సంభవ పాదంబులన్ + పోలెన్ = ఇంద్రుని గుఱ్ఱము సముద్రములో పుట్టినదని వినియుండుటచే, ఆ గుఱ్ఱము యొక్క సముద్రములో, పుట్టిన పాదములు ఏమో అనునట్లు; అర్థ + ఆక్రమణ నివృత్తంబులై = సగము భాగము, ఆకాశమును ఆక్రమించి, మరలినవై (గుఱ్ఱములు ఉత్సాహముతో, ముందటి కాళ్లను పైకెత్తుచు క్రిందికి దించుచున్న వనుట); ప్రభాకర హయంబులు = సూర్యుని గుఱ్ఱములు, అసహాయంబులై = (ఆతని ఏడుగుఱ్ఱములు, ఒకదానికొకటి) సాయములేక; జరగన్ + చాలవు +అని = కదల నేరవని; జనంబులు; ఆడు వచనంబులు = తమలో తాము చెప్పుకొను మాటలను; విని = విన్నవై; స్వకీయ వినయ జనిత లజ్జా యుతంబులున్ + పోలెన్ = తమదైన అడఁకువ వలన కలిగిన సిగ్గుతో కూడినవా అనునట్లు; నమిత+ఆననంబులై = వంపఁబడిన ముఖములు కలవై; గమనవిస్తారిత చామరంబులై = తమపై అమర్చిన చామరములు గమన వేగముచే, విస్తరింపఁబడినవై; పునః సంజనిత పక్షంబులున్ + పోలెన్ = మరల, మొలిచిన ఱెక్కల వలె;

పూర్వము గుఱ్ఱములకు ఱెక్కలు ఉండినవి. అవి మునిశాపముచే తొలఁగినవని యొక గాథ. ప్రస్తుతము బాణుని సైన్యములోని గుఱ్ఱముల గమన విలాసములను చూచు వారికి, వానిపై అమర్చిన వెల్ల చామరములు విప్పారుటచే ఱెక్కలు వచ్చినవై అవి చాల పైకి సులభముగా ఎగుర చున్నవను అభిప్రాయమును కలిగించుచు చాల ముచ్చటగా నున్నవి.

ఈ విధంబునున్ +కాక = ఈ రీతియేగాక; కైలాస నగంబునున్ + పోలెన్ = కైలాస పర్వతమువలె; ఈశ్వర ప్రియంబులయ్యును = శివునకు (బాణునకును) ఇష్టము లైనవి అయినను; దుర్వర్ణమంజులంబులై = చెడ్డ వన్నెలతో ఒప్పిదములై (విరోధము); దుర్వర్ణమనఁగా వెండి. **వెండి కొండ** అగుటచే, రజత కాంతులతో ఒప్పుచున్నవి. (విరోధము తొలఁగినది). మేరుగిరి నితంబంబునున్ +పోలెన్ = బంగారు కొండ యొక్క నడిమి ప్రదేశములవలె; దేవమణి నివాసంబులు+అయ్యును = దేవతలకును, మణులకును నెలవులు అయినను; అసుర+అధిష్ఠితంబులై = రాక్షసులచే ఆశ్రయింపఁబడినవై (విరోధము); అసుర + అధిష్ఠితంబులై = దేవవేశ్యలచే ఆశ్రయింపఁబడినవై;(విరోధము తొలగినవి) బాణుని సైన్యములో గుఱ్ఱములు రాక్షసులచే ఎక్కఁబడి యున్నవి. సాగరంబునున్ + పోలెన్ = సముద్రమువలె; ప్రకటిత నిఖిల + ఆవర్తంబులు + అయ్యును = కన్పట్టు చున్న సుడులు పెక్కు కలవయ్యును; (సుడులు గుఱ్ఱములకునను ఉండును); జడ మయంబులై = చేష్టలు లేనివై (విరోధము); జడమనఁగా నీళ్లు, (క్రమక విరోధము తొలఁగినది.) బాణుని గుఱ్ఱములు చేష్టలు ఉడిగి, మౌనముగా యుద్ధమునకు అపుడు సంసిద్ధముగా నున్నవి. కనుక, మాంద్యము కలవనుట తగును.

అక్షర చయంబునున్ +పోలెన్ = అక్షరముల సమూహము వలె; దీర్ఘ ప్లుత ప్రచారంబులు అయ్యును = రెండు మాత్రల కాలము మూడు మాత్రల కాలము నడకలు కలవయ్యును; హ్రస్వంబులయి = కుఱచవై(విరోధము)

దీర్ఘము ప్లుతము అనెడి అశ్వగతి విశేషములు కలవైనను ప్రస్తుతము హ్రస్వమైన గమనము కలవై యుద్ధముచేయుటకు సిద్ధమై మెల్లగా నడచుచున్నది. (విరోధములేదు) అక్షరమాలలో హస్వములును ఉన్నవి. అవి ఏకమాత్రకాలము కలవి. ఘోటకంబులు = ఈ విధముగా ప్రవర్తించుచున్న గుఱ్ఱములును;

**కాల్బంటులు :**

అఖిల రత్న ఖచిత మకుట కోటి = అనేకములైన మణులతో పొదిగిన కోట్ల కొలది కిరీటముల కాంతులతో; ప్రహసిత తరణి మండలంబులును =హేళన చేయఁబడిన సూర్య బింబములు కలవియును; కోప+ఆవేశ వికంకట భ్రుకుటి చటుల లలాట దేశంబులునున్ = కోపము యొక్క అతిశయముచే పెద్దవైన వంకరలైన కనుబొమల చంచలములగు నొసటి చోట్లు కలవియును; పరస్పర = ఒండొరుల యొక్క కృపాణ ఘట్టన = కత్తుల ఒరపిడులయొక్క ప్రభా విహాయస్ + సముత్థిత = కాంతులు అనెడి, ఆకాశమందు లేచినట్టి; స్ఫులింగ ధూమకేతు సముపలక్షితా నిమిత్తంబులును = మిడుగుఱులు అనెడి తోక చుక్కలచే (దుశ్శకునములచే) చూడఁబడునట్టి శకునములు కలవియును; శింజినీ టంకార = వింటి నారుల టమ్ టమ్ అనెడి ధ్వనులును; పాదస్థిత బిరుద కటక ధ్వాన = కాళ్ల యందు అమర్చియున్న బిరుదములను (నేర్పును) ప్రకటించు, కడియముల యొక్క ధ్వనులును; సింహనాద విడంబిత = సింహగర్జనలు పోలియున్న; నిస్సాణ నిస్వనంబులును = భేరుల యొక్క మ్రోఁతలును (నిస్సాణము, నిస్సానము, నిస్సహణము వేర్వేఱు రూపములు);

మఱియునున్, కోదండంబులు = దొడ్డవైన విండ్లు; ఉద్దండులై = అతిశయించినవారై; ధరించియున్; చరియించియున్ = కదలియును; గదలు; పాదలు = రొదలు; చెలంగన్ = రేఁగునట్లు; పట్టియున్; తట్టియున్ = చఱచియును; శరంబులు = అమ్ములు, కరంబులన్ = చేతులందు; అమర్చియున్ = పెట్టియును; చెమర్చియున్ = చెమ్మగిల్లియును; శక్తులు = శక్త్యాయుధములు; శక్తులకున్ = సమర్థులకు; ఇచ్చియున్; పుచ్చియున్ = పంపియును; కఠారంబులు = ఖడ్గములు; కుఠారంబులకున్ = గండ్రగొడ్డళ్లు (కలవారికి); ఒసంగియున్ = ఇచ్చియు; ఎసంగియున్= ఒప్పియును; పట్టసంబులు = శస్త్ర విశేషములు; అట్టహాసంబులతోన్ = పెద్దనవ్వులతో; కదలించియున్ = త్రిప్పియును; ముదలించియున్ = ప్రయోగించియును; బల్లెమ్ములు; బల్లెమ్ములన్ = బల్లెములతో; విఱువన్ = విఱుచునట్లు; సవరించియున్ = సిద్ధము చేసియు; వివరించియున్; చంద్రహాసంబులు = ఖడ్గములు; మందహాసంబులతో

చిఱునవ్వులతో; జళిపించియున్ = త్రిప్పియును; దళిపించియున్ = విఱుచునట్లును, వికసింపఁ జేసియును; తోమరంబులు = ఆయుధ విశేషములు, చామరంబులతోన్ = వింజామరలతో; ఒనర్చియున్ = కూర్చియు; తనర్చియున్ = ఒప్పియును; ప్రాసంబులు = ఈఁటెలు; రోసంబులతో = కోపములతో; సారించియున్ = విసరుచును; కారించియున్ = ఒరపిడిని కలుగఁ జేసియును; సబళంబులు = ఆయుధ విశేషములు; సుబలంబులు + కాన్ = మంచి బలము గలవిగా; ఒత్తియున్; ఎత్తియున్; శల్యంబులు = చిన్న ఈఁటెలు; తుల్యంబులు గాన్ (పై వానితో) సమానములుగా, ధరించియున్, భరించియున్ = మోసియును; నారసంబులు = ఇనుప బాణములు; సారసంబులతోన్ = తామరలతో (వేడుకకై) తిట్టలు+కొనన్ = రాశులుగా కూర్చియున్, ఏర్చియున్; పలకలు = డాలులు; పులకలున్ = గగురులు; నెగయన్ = పుట్టునట్లు; పాటించియున్ = ఆదరించియును; తాఁటించియున్ = తాడించియును; కంకటంబులు = కవచములు; సంకటంబులు + అని = ఇఱుకయిన వని; తమ + ఏలికులన్ = తమ ప్రభువులను; అడిగియున్; తొడిగియున్; నలుదెసలన్ = నాలుగు దిక్కులందును; పరఁగు = ఒప్పునట్టి; కాలుబలంబులును = పదాతులును; కూడన్ = కలిసి; చనుదేరన్ = రాఁగా; విమత + పతాకినీ+ ప్రతిభయ+మూర్తి = శత్రుసేనలకు భయము కలిగించు ఆకారము గలవాఁడు, అగు, బాణ+అసురుండు- బాహు సహస్ర ధృత+నిఖిల+శస్త్ర + అస్త్ర సందోహుండు + ఐ = వేయి చేతులచే ధరింపఁబడిన ఎల్ల శస్త్రములయు, అస్త్రములయు సమూహము గలవాఁడయి; నారాయణున్ = శ్రీకృష్ణుని; తాఁకెన్ = మార్కొనెను; మఱియును.

**రథములు :**

తా : ఈ విధముగా శివుఁడు కుమారస్వామితోను, జ్వరునితోను కూడి, యుద్ధరంగమునుండి పాఱిపోయెను. అప్పుడు ఆకాశమార్గమందు రథములపైనున్న పతాకములకు అమర్చిన వస్త్రముల వరుసలు, దట్టముగా నుండుటచే దేవనదియైన గంగా నది అనెడి భ్రాంతిని కలిగించినవి. అప్పుడప్పుడే, సూర్యుడు తన కిరణములతో వృద్ధి పొందుచు తన కిరణములను అన్ని వైపుల యందు చక్కగా ప్రసరింపఁజేయుచు, యుద్ధక్రమమును వీక్షింపఁదలచి పైకి వచ్చినట్టి ఆది శేషుని పడగల మొత్తము మీఁద నుండు మణుల కాంతులను అధికతరముగా ప్రకాశింపఁజేసెను. అట్టి సూర్యకిరణముల తేజస్సును అనుకరించుటకు సమర్థములగు, ఆయుధములున్ను దివ్యమైన బాణములును అమరియున్న తేరులు వరుసలుగా అమరినవి.

**గజములు :**

మ్రోగుచున్న భేరుల (నగారాల) భాంకారములను ఓటమి పాలు చేయుచున్న

(వానికి మించినట్టి) భయంకరములైన గంటల మొత్తము యొక్క ధ్వనులు కల కంఠ హారములును, ఘీంకారములును కలవై, వర్షాకాలపు మబ్బుల వంటి శరీరకాంతులచే కప్పఁబడిన ఆకాశమందలి రోదసిని (నడిమి ప్రదేశము) కలవై, తొండములచే ఎడతెగక వెల్వడఁజేయు చున్న నీటి తుంపురులచే, సూర్యుని కాన రానీయక, మబ్బులతో నిండిన ఆకాశమును కలవై, చెక్కిళ్లనుండి మదజల ధారల మొత్తములు స్రవించుచుండఁగా అందు విహరించు తుమ్మెద రాజులయొక్క అంతఃపుర మదవతుల మధుర స్వనములను ఆలకించుచున్న ఆనందమును కలవై; మఱియును;

1. ఆ విధమును గాక, ఆకాశమును అలంకరించు నక్షత్రముల వరుసలవలె, ఇరువదేడు మణుల హారములు కలవై,

2. సముద్రము గొప్ప జలజంతువులతో ఒప్పారు విధమున అత్యధికమైన శారీరకమైన బలము కలవై,

3. దాత యొక్క ఇంటి ముంగిలి యందు దానమిచ్చునపుడు కన్పట్టు నీటి బిందువుల ధారలవలె, చెక్కిళ్ల నుండి స్రవించు మదజల ధారలు కలవై,

4. నీటిని నలువైపుల చిమ్మునట్టి గృహములయందు అమర్చిన పెద్ద కడవల ఉనికిచే గుర్తింపఁబడినట్లు, అందమైన కుంభ స్థలములతో, తొండములనుండి, వెదఁజల్లు నీటి తుంపురుల సమూహముచే, గుర్తింపఁబడినవై.

5. పడగలపై నుండు మణుల కాంతులను చిమ్ము పాములతో కూడిన చందన వృక్షములున్న గందపు కొండవలె, (విషధరుఁడైన) శివుని ఉనికితో అతని అలంకారములైన పడగల మణులకాంతుల ప్రకాశము కలవై.

6. ముక్కంటి కొలువును అలంకరించి యున్న (శక్తిధరుఁడు) కుమార స్వామివలె, 'శక్తి' అనెడి ఆయుధములను కలవారిచే ఎక్కఁబడినవై;

7. బ్రహ్మముఖమునుండి సామవేదము జనించినట్లు సామవేదమే తమ పుట్టుకకు నెలవులుగా కలవై, శరీరమందు పూయఁబడిన కుంకుమ పొడి చేతను తమ మేసి నీలి వన్నెతోను, సాయంకాలపు సంజ వేళయా అను సంశయమును కలిగించునవై, ఏనుఁగుల గుంపులు బారులుగా నిలిచినవి.

**తురగములు :**

గుఱ్ఱములు అతి త్వరితమైన గమనవేగముచే వాయువేగమును తెగడు చున్నవి.

పరుగిడునప్పుడు గిట్టలచే రేపఁబడిన పుడమిపై గల దుమ్ము అంతయు కలిసి మఱొక నేలయా, అనునట్లుండెను. గుఱ్ఱముల పాదముల ఒరపిడి, వాయువులను రేఁపినవి. ముఖములనెడి గుహలనుండి, లాలా జలము స్రవించినది. జీనీలయందు, అమర్చఁబడిన క్రొత్త మణులు రమ్యముగా ప్రకాశించినవి. పరుగిడు నప్పుడు నాలుగు కాళ్లు కలియు చుండుటచే వాని నడుమ ఆకాశము కలిగినది. ఇట్లు కాళ్లనడుమ ఆకాశము, ధూళిచే పృథివి (భూమి) చరణవేగముచే వాయువు, నోటినుండి వెలువడు ఉమ్మినీటిచే, జలము, జీనీలయందు వెలుఁగు ఎఱ్ఱని కాంతులచే తేజస్సు అనునవి కూడి పంచ భూతములు కలవైనవి. గుఱ్ఱమునకు 'హరి' అను పేరున్నది. (హరి = ఇంద్రుఁడు, పచ్చనిది). ఆ గుఱ్ఱములు ఆ అర్థములకు తగినట్లు మేలైన గుణముల ప్రోవై విలసిల్లుచున్నవి. అవి ఇంద్రుని గుఱ్ఱమును చూడఁదలచి వేడుకతో ఆకాశమునకు ఎగిరినవై, ఉచ్చైఃశ్రవము, సముద్రమునందు పుట్టినదని వినియుండుటచే దానివలె తమ ముందటికాళ్లను పైకెత్తి ఆకాశమును ఆక్రమించి, మరలుచున్నవి. సూర్యుని గుఱ్ఱములు ఏడును, ఒక దాని కొకటి సాయము చేసికొనక వేగముగా పరుగిడఁజాలవని జనులు సంభాషించుకొనుటను విన్నవగుటచే అవి తమ కంటె తక్కువ శక్తి గలవని ఎంచి సహజమైన (అణఁకువ) వినయమును, సిగ్గును, కన్పింపఁజేయుటకై తమ ముఖములను వంచినవి.

గుఱ్ఱములకు అమర్చఁబడిన చామరములు ప్రయాణ వేగముచే బాగుగా విప్పారినవి. అట్లు విస్తరింపఁబడిన చామరములు పూర్వ ముండి, తొలఁగిపోయిన ఱెక్కలు మరల మొలిచినవా అనునట్లు చూపఱుల మనస్సులకు ఆహ్లాదకరములైనవి.

ఈరీతియేగాక, కైలాస పర్వతమువలె, శివునకును, బాణునకును, ఇష్టములై వెండి వన్నెతో ఒప్పుచున్నవి. మేరు పర్వతము యొక్క బంగారు వన్నెగల చరియల వలె దేవతలకును మణులకును ఉనికి పట్టులై, వేశ్యలను కలిగి సైన్యమందుఁగల రాక్షసులచే అధిష్ఠింపఁబడి ఉన్నవి.

సముద్రము వలె కన్పట్టుచున్న పెక్కు సుడులను, (సముద్రమున నీటి సుడులు - గుఱ్ఱములపై వెంద్రుకల సుడులు) కలవై, యుద్ధమునకు సిద్ధమై, చేష్టలు ఉడిగి మౌనముగా నున్నవి.

గుఱ్ఱములు : అక్షర సముదాయమువలె, దీర్ఘములు, ప్లుతములు (రెండు మూడు మాత్రల కాలము కలవై) నడికలు దీర్ఘము లు, ప్లుతములు అనెడి గతి విశేషములు కలిగి ఉన్నవి. వానివలె హ్రస్వములై (ఏక మాత్రకాలము కలవై) హ్రస్వమైన(గతి)మందగమనముతో ఒప్పారుచున్నవి.

**కాల్బంటులు :**

కాల్బంటులు పెక్కు మణులను పొదిగిన కిరీటములను ధరించియున్నారు. వానినుండు వెలువడు వెలుఁగులు సూర్య బింబ ప్రభల ప్రకాశమును హేళన చేయుచున్నవి. కోపావేశముచే వారి కనుబొమలు విప్పారి వక్రములైనవి. వారి నొసళ్లు కంపించుచున్నవి. ఒండొరులు ధరించిన కత్తుల రాపిడుల వలన రేఁగిన నిప్పు సెగలు (మిడుగుఱులు) తోక చుక్కలై శత్రువులకు అపశకునములైనవి. వింటినారుల మ్రోఁతలును, కాళ్లయందు ధరించియున్న పౌరుష సూచకములైన అందెల చప్పుళ్లును సింహ నాదములను పోలి ఉన్న భేరుల భాంకారములును అంతటను నిండినవి.

వారు, దొడ్డవైన పెద్ద విండ్లను అతిశయించి ధరించి, వర్తించుచున్నారు. గదలు రొదలు చేయునట్లు చఱచుచున్నారు. బాణములను చేతులలో అమర్చుకొనుచు, చెమట బిందువులు కాఱుచున్నను శక్త్యాయుధములను యోధులకు సమకూర్చుచు పంపుచున్నారు. పెద్ద కత్తులను, గొడ్డళ్లు కలవారికి ఇచ్చుచు ఒప్పుచు ఆయుధ విశేషములను పెద్ద నవ్వులతో త్రిప్పుచు ప్రయోగించుచున్నారు. బల్లెములు, బల్లెములను విఱుచునట్లు సిద్ధపఱచి వానిని వివరించుచున్నారు. చంద్రహాసములను (కత్తులను) చిఱునవ్వులతో ఇటునటు త్రిప్పుచు వాని విలాసములను ప్రదర్శించుచున్నారు. వేర్వేఱు ఆయుధములను చామరములతో కూర్చి అతిశయించుచున్నారు.

ఈఁటెలను రోషములతో, విసరుచు ఒరపిడిని కలుగఁజేయుచున్నారు. ఆయుధ విశేషములను మంచి బలము కలవిగా తీర్చి ఎత్తి పరిశీలించుచున్నారు. చిన్న ఈఁటెలను కూడ, పెద్ద వానితో సమానముగా ఆదరించుచు, వానిని ధరించుచున్నారు.

ఇనుప బాణములను తామరలతో వేడుకకై అలంకరించి రాశులుగా చేసి ఏర్పఱచు చున్నారు. డాలులు గగుర్పాటు పుట్టునట్లు ఆదరించుచు, తాడించుచున్నారు. కవచములు తమకు సరిపడక, శ్రమను కలిగించినచో తమ నాయకులకు తెల్పి, తగిన వానిని ధరించుచున్నారు. నాలుగు వైపులనుండి గుమిగూడి వీరభటులు నడచుచుండఁగా శత్రుసేనలకు భయమును కలిగించు ఆకారము కలవాడై, బాణాసురుఁడు వేయి చేతులలో వేర్వేరు శస్త్రములను అస్త్రములను పెక్కింటిని ధరించి శ్రీకృష్ణుని మార్కొనెను. మఱియును (మీఁది పద్యముతో).

శా. ఆరూ ఢోరగవైరి యైన శతవక్త్రాక్షుం బ్రవీక్షించి దు
ర్వార క్రూర మదాభిమాన విలస ద్వైషమ్య సంపాదనో

దార స్ఫార భుజాబ లాతిశయితా తారుణ్య భాస్వద్యశ
స్ఫార వ్యాప్త చతుః పయోనిధి వృతక్ష్మామండ లాభోగుఁడై. 185

ప్రతి : ఆరూఢ+ఉరగ వైరియైన = ఎక్కఁబడి యున్న సర్పములకు విరోధియైన, గరుత్మంతుని ఎక్కివచ్చిన; శతపత్ర + అక్షున్ = (నూఱుదళములు కల పద్మము వంటి కన్నులు వానిని) శ్రీకృష్ణుని; ప్రవీక్షించి = పరిశీలించి చూచి; దుర్వార = తొలఁగింపరాని; క్రూర = కఠినమైన, కనికరములేని; మద+అభిమాన విలసత్ = మదముతో కూడిన గర్వముతో ప్రకాశించుచున్న; వైషమ్య సంపాదన = అసమత్వమును పొందుటచే; ఉదార స్ఫార = మేలైన గుణములచే, ప్రకాశించు; భుజా = బాహువుల యొక్క; బల+అతిశయితా = బలము యొక్క ఆధిక్యముతోను; తారుణ్యా = క్రొత్తదనముతోను (జవ్వనముతో); భాస్వత్ +యశస్ + సార = ప్రకాశించు కీర్తియొక్క నిగ్గుచే; వ్యాప్త = వ్యాపించిన; చతుఃపయోనిధి = నాలుగు సముద్రములచే; వృత = ఆవరింపఁబడిన; చుట్టఁబడిన; క్ష్మామండల + ఆభోగుఁడై = భూ వలయము యొక్క (గుండ్రని భూమి) యొక్క పరిపూర్ణత కలవాఁడై.

తా : బాణుఁడు గరుడుని ఎక్కి వచ్చిన శ్రీకృష్ణుని పరిశీలించి చూచి ఉద్రేకమును పొందెను. విరోధి ఎనిమిది చేతులవాఁడు (చూడు, పద్య -8) తాను వేయి చేతులవాఁడు . ఆ అసమానత కారణముగా వారింప రానిదియును క్రూరమైనదియు నైన మదముతో కూడిన గర్వము ప్రకాశించుచుండఁగా, ప్రకృష్ట గుణములతో నిండియున్న భుజ బలాతి శయముతోను, వాని క్రొత్తఁదనముతోను కూడిన వికాసము కల కీర్తియొక్క నిగ్గు నాలుగు సముద్రములు ఆవరించిన భూమండల మందు ఎల్లెడలను పూర్తిగా ప్రసరింపఁగా (అతని వేయి చేతుల కీర్తిసారము పరిపూర్ణమై భూవలయము నంతటిని ఆక్రమించినది) (మీఁదిపద్యముతో).

విశే : వేయి చేతులలో దివ్య బాణముల సమృద్ధి, ఇతరులకంటె తన ఆధిక్యమునకు ముఖ్య కారణమని బాణుఁడు తలంచి గర్వితుఁడయ్యెను. ఈ విధముగానే పౌండ్రుఁడు (తృతీయాశ్వాసము), అతి భారమైన తన చక్రమే సుదర్శనచక్రము కంటె గొప్పదని భావించెను. కేవలము సంఖ్యను బట్టి,, బరువును బట్టి ఆధిక్యము కలుగదు. వివేకవిహీనతతో, చేవ ఎక్కువైనను, బాణుఁడు, పౌండ్రుఁడు చెడిరి.

బాణుని పరాక్రమ పటిమ - అతి దీర్ఘ సమాసమందు, మూడుఁపాదములలో శార్దూల వృత్తమున వర్ణితమైనది. సోమన దీర్ఘ సమాస రచనా ప్రవీణతకు ఇదియొక మచ్చు తునుక.

## - : బాణుఁడు కృష్ణునితో బ్రతా పోక్తులు పలుకుట : -

కం. బాణుం డిట్లను 'నిన్నుం
బ్రాణముతో మగుడ నీను పట్టణమునకున్,
రేణూకృత తనుఁజేసి ప్ర
వీణత మైఁ బరఁగువాఁడ వేయును నేలా. 186

అర్థ : రేణూకృత తనున్ = అణువులుగా; (ధూళిగా) చేయఁబడిన శరీరము కలవాఁడుగా.

తా : బాణుఁడు ఇట్లనెను; "నిన్ను నీ పట్టణమునకు ప్రాణములతో మరలి పోనియ్యను. నీ శరీరమును సన్నని పొడిగా చేసి నా ప్రావీణ్యమును చూపి, అతిశయించెదను. ఇంక వేయి మాటలు (పెక్కు) ఏల?"

కం. 'తూణోద్ధృతశిత విలస
ద్బాణపరంపరలు వొదువ ధారాస్యూతో
చ్ఛోణిత వాహినిఁ దేలుచు
శోణితనగరమున మడియఁ జొప్పడె నీకున్. 187

ప్రతి : నీకున్, తూణ+ఉద్ధృత = అమ్ములపొది నుండి పైకి తీయఁబడిన; శిత = వాఁడియైన; విలసత్ బాణ పరంపరలు = ప్రకాశించు బాణముల వరుసలు; పొదువన్; ధారా స్యూత ఉత్ + శోణిత వాహినిన్ = ధారలుగా (బిందువులుగా) స్రవించుచున్న నెత్తుటి ఏటిలో; తేలుచున్; శోణిత నగరమునన్; మడియన్ + చొప్పడెన్ = మరణము సమీపించినది.

తా : నా అమ్ముల పొది నుండి వెలువడు బాణముల వరుసలు నిన్ను క్రమ్మి అవి నీ శరరమందు నాటగా ఎగసి చిమ్మఁబడిన నెత్తుటి ఏటిలో తేలుచు, ఈ శోణిత నగరమందు నీకు చావ వలసిన దుర్గతి కలిగినది.

కం. 'ద్వారక లోపలి చుట్టలు
సూరెల నినుఁ గొలిచినట్లు సుమనో నగరీ
సూరిజనంబులు గొలిచెడి
చారు క్రియ చేయువాఁడ జలజ దళాక్షా! 188

అర్థ : సూరెలన్ = ప్రక్కలందు; సుమనస్ +నగర సూరి జనములు = దేవతల నగరమందలి పండితులైన జనులు.

తా : కమలములవంటి కన్నులు కలవాఁడా! ఓయీ కృష్ణా! ద్వారకలో, నీ బంధువర్గములు నిన్ను ఇరు ప్రక్కలనుండి సేవించినట్లు దేవతల నగరమైన అమరావతిలో పండిత బృందములు నిన్ను కొలుచునట్లు చక్కని పని చేయుదును, (నిన్ను చంపి, స్వర్గమునకు పంపఁగలను అని బాణుఁడు విశ్వాసమును ప్రకటించు చున్నాఁడు).

ఉ. 'నీ విపు డష్ట బాహుఁడవు నేను గఠోర సమస్త శస్త్ర సం
భావిత దోస్సహస్ర రుచిభాసుర దేహుఁడ నాకు సాటి యీ
భూవలయంబునం బొడమఁ బోలదు నీవట నాకు సాటియే!
యీ వియ దున్నతిం బులుఁగు నెక్కిన యంతనె యింత నేమగున్! 189

తా : ఓయీ! నీవు ఇప్పుడు ఎనిమిది చేతులవాఁడవు. నేను పరుషములైన అనేకములైన ఆయుధములను ధరించియున్న వేయి చేతుల కాంతులచే ప్రకాశించు శరీరము కలవాఁడను. నాతో సాటి అయిన వాఁడు ఈ భూమండలములో ఉండుట కలుగదు. ఆకాశమందు, ఎత్తున నున్న ఈ పక్షిని ఎక్కినంత మాత్రమున నీ వేమి సాధింపఁగలవు?

వ్యా. దోస్ + సహస్రము = వేయి బాహువులు. విసర్గ సంధి.

వ. 'అట్లుం గాక. 190

తా : అంతేగాక

కం. 'నీనిశిత బాణతతికిని
మానసములు దల్లడిల్ల మగిడి చనంగా
నేను జ్వరుండను హరుఁడను
సేనానిని గాను నన్నుఁ జెనయఁగ వశమే. 191

తా : "నీ వాఁడియైన బాణముల మొత్తమునకు మనస్సులు కలఁత చెందఁగా మరలిపోవుటకు నేను జ్వరుఁడను, శివుఁడను, కుమార స్వామిని, కాను. (వారు పిఱికివారు తాను అట్టి వాఁడను కా నసుట) నన్ను ఎదిరించుటకు నీకు శక్యమా?"

కం. 'నిన్ను సువర్ణాచలమున
సన్నుత మగు వనములోన సరసిజనేత్రల్

మన్నింప నొదవు వేడుక
మన్ని శితశరాగ్ని చేత మరిగింతుఁ జుమీ. 192

తా : నిన్ను బంగారు కొండయందు (మేరు పర్వతము) సత్పురుషులు నుతించు అందమైన ఉద్యానవనములో, కమలములవంటి కన్నులుగల అందగత్తెలు, ఆదరించు వేడుకను, నా వాఁడియైన బాణములనుండి వెలువడు మంటలచే, ఆశించునట్లు చేయుదును చూడుమా! (నిన్ను తప్పక - పరలోకమునకు పంపఁగల ననుట)

అలం : వ్యాజస్తుతి.

కం. 'నా వేయి కరంబులుఁ గడుఁ
జేవ మిగిలి కోటిసంఖ్యఁ జెన్నెసలారన్
నీ వసమె నన్ను గెలువను
దేవతలకుఁ జూడరాదు తిరమై నన్నున్.' 193

తా : "నా వేయి చేతులును, గట్టివై బలముతో అతిశయించి, నూఱు లక్షల చేతుల సొంపుతో శోభిల్లు చుండఁగా నన్ను గెలుచుటకు నీకు తరమా? నన్ను గెలుచుటకు దేవతలు కూడ నా ఎదుట నిలుకడతో నిలిచి నన్ను చూడలేరు సుమా!

అలం: కావ్యార్థాపత్తి. (యాదవుఁడవైన నీ వెంత? అని భావము)

వ. అని యప్పుడు. 194

తా : సులభము

కం. దనుజుం దాడెడు వచనము
లనేకప కరాగ్ర *శీకరావళిఁ బోలెన్
ఘనవాత తరంగముల జ
ల నిధి నడుమ నుండు నేఱులం బోలె వెసన్. 195

తా : యుద్ధమునకు ఆతురముతో నుండు బాణుఁడు, తన వేయి చేతుల బలాతిశయమును వర్ణించు పలుకులు, ఏనుఁగు తొండము చివర నుండి వెలువడు నీటి

* శీకరాకృతి

తుంపురుల వరుసలను, సముద్ర మధ్యమందు, పెను గాలులవలన ఏర్పడిన అలల నడుమ కన్పట్టు, నదులను, పోలెను.

అలం : ఉపమ. నీటి తుంపురులు సార హీనములగుటచే తమ రూపమును త్వరలో కోల్పోవును. అట్లే అలల నడుమ నుండు నదులైన జలప్రవాహములును చంచలములు. త్వరలో వాని ఉనికి తొలఁగును. ఈ పోలికలచే బాణుని చేతులన్నియు (రెండు తప్ప) తమ రూపును కోల్పోవు నని ధ్వని.ఆతని మాటలు నీటి మూటలని ఆతని చేతులచే సాధింపఁదగిన సామర్థ్యము,లేదనియు స్ఫురించును.

కం. అప్పుడు జగములు గాల్పఁగ
నుప్పొంగుచు నున్న నిర్జ రోత్తమ బింబం
బొప్పు వెసఁ దాల్చె దనుజుం
డప్పరుసున నాడుచుండ నతని నయనముల్. 196

అర్థ : వెసన్ = శీఘ్రముగా ఆ+ పరుసునన్ = ఆ విధముగా; నిర్జర + ఉత్తమబింబము = దేవతలలో శ్రేష్ఠుఁడైన సూర్యుని బింబము.

తా : ఆ విధముగా బాణుఁడు వచించు చుండఁగా, అతని కన్నులు, జగము లన్నింటిని కాల్చుటకు విజృంభించుచున్న సూర్యుని బింబమువలె, ఎఱ్ఱఁదనమును వహించెను.

అలం : ఉపమ. బాణుడు శీకృష్ణునితో సమరముచేయుట అనుచిత ప్రయత్నము. ఉచి తానుచితములను తెలియక, శివుని సాయమున్నదని లోకస్థితిని నిర్వహించు జగన్నాయకుని అంతము చేయుటకు సంకల్పించుట లోకములను దహించు ప్రయత్నమన నొప్పును. అది అసాధ్యము.

వ్యా. బింబంబు+ఒప్పు. ఇది షష్ఠీ సమాసము. బింబము యొక్క ఒప్పు అని అర్థము. ఇచ్చట షష్ఠీ సమాసంబునందు ఉకార ఋకారములకు అచ్చు పరంబగునపుడు నుగాగమంబగు, అను సూత్రముచే నుగామము ప్రాప్తి కలుగ లేదు. సంధి, బాల - 34.

సూ. 'కొన్ని చోట్ల షష్ఠీ సమాసంబునందు, ఉకారమునకు అచ్చు పరంబగునపుడు నుగాగమంబునకు లోపంబునగు'. సంధి, ప్రౌఢ - 10.

వ. తదనంతరంబ సరోష సంభ్ర మోత్సాహ దీపితుం డై నారాయణుం డతని కిట్లనియె. 197

తా : పిమ్మట శ్రీకృష్ణుఁడు కోపము, వేగిరపాటు, ఉత్సాహముతోను ప్రకాశించు చున్న వాఁడై బాణునితో ఇట్లు పలికెను.

ఉ. 'ఏమిర బాణ! వ్రీడ నవహీన! భయోద్ధుత మానసుండ వై
యే మని పెక్కు లాడెద విదేటికి మాటలచేత నిప్డు సం
గ్రామము గెల్వ వచ్చునె వికారపుమాట జయంబ *యేని నీ
కీమెయి నేల భాషితము లెక్కుడుగాఁ బచరింపు మాజిలోన్. 198

అర్థ : (పాఠాం. ఈడన్ = ఈ చోటున) వ్రీడన్+ అవహీన = సిగ్గును లేనివాఁడా! భయ = భయముచే; ఉత్+హుత > ఉద్ధుత = వ్రేల్వఁబడిన, అడఁచిన; మానసుండవై = (ఆత్మ గౌరవము) మనస్సు కలవాఁడవై; వికారపు మాటలు = వంకర మాటలు, యుద్ధరంగమున, తగనిమాటలు;

తా : ఏమిరా! ఓ బాణా! సిగ్గులేనివాఁడా! ఈ చోటున వీరునకు తగని భయముతో నీ ఆత్మాభిమానమును అడఁచుకొన్న మనస్సుతో, ఏమేమో పెక్కు మాటలు పలుకు చున్నావు! ఇప్పుడు ప్రేలుటచే ప్రయోజనమేమి? వంకరమాటలు (డాంబిక వచనములు) జయ మగునా? మాటలచే యుద్ధమును గెల్వ గలవా? అయినప్పటికిని నీవు ఈ విధముగా మాటలాడుట ఎందులకో? యుద్ధరంగములో నీ పరాక్రమమును అధికముగా ప్రదర్శింపుము.

కం. ఈచంద మైన విజయమ
నీచే నగుఁ గాక యున్న నిక్కపు జయముం
జూచెద వైనను నోరీ
నాచే జితుఁ డగుము గెలువు నన్నును నీవున్. 199

తా : ఈ డాంబిక వచనములచే విజయము నీకు సిద్ధించును. (నీ మాటలు, నీ శక్తిహీనతను, సూచించుచున్నవి). అట్లుకాక నాకు సిద్ధించు నిక్కమైన గెలుపును చూచెదవు. అది సరియే! ఓరీ! యుద్ధముచేసి నాచే ఓటమిని పొందుము లేదా నీవు నన్ను యుద్ధములో గెలుపుము.

వ్యా. జితుఁడవు+అగుము > జితుఁడు + అగుము.

---

* యైననిం, కేమియుసల.

సూ. ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణములకు, ఏకత్వంబున 'వును' లును, బహుత్వంబున 'రుము' లు, అంతాగమంబులు ప్రాయికంబుగనగు. వీని ఉత్వమునకు, అత్వము. కారక బాల - 33, 34. ఈ సూత్రములు ఇచట ప్రవర్తింపలేదు. ఆగమము అనిత్యమని ఎఱుఁగవలెను.

## - : కృష్ణ బాణాసురుల యుద్ధము : -

కం. అనుచు నిశాతాశుగములు
దనుజునిపై నేయ నతఁడుఁ దచ్ఛరములకున్
మనమున విస్మయ మందుచు
ననేక బాణముల నేసె నంభోజాక్షున్. 200

అర్థ : నిశాత +ఆశుగములు = వాఁడి అయిన బాణములు; తద్ + శరములకున్ = ఆతని బాణములకు,

తా : అని పలుకుచు శ్రీకృష్ణుఁడు వాఁడియైన బాణములను బాణునిపై ప్రయోగించెను. ఆ రాక్షసుఁడు ఆ బాణముల ప్రయోగ విశేషమును గుర్తించి ఆశ్చర్య పడుచు, పెక్కు బాణములను కమల నయనుని పై వేసెను.

అష్టభుజుఁడు, సహస్ర భుజుఁడైన తనకు కలఁతను కల్గించుటచే బాణుఁడు తన శత్రువు యొక్క నేర్పునకు అచ్చెరు వొందెను.

వ్యా. తద్+శరము>తత్+ శరము >తచ్+ శరము >తచ్ఛరము. శ్చుత్వ ఛత్వాదేశ సంధి.

వ. మఱియు ననేకాయుధంబులం బొదివి యెనిమిది చేతులతో సహస్రబాహు వగు తనతో సరిసరిగాఁ బోరినం జూచి విస్మయాకులితచిత్తుం డై బాణుండు కోపించి తొల్లి హిరణ్యకశిపుండు బలి కిచ్చిన యాగ్నేయబాణంబుం బ్రయోగించిన సకలదిశా జాజ్వల్యమానం బయి విజృంభించిన దామోదరుండు. 201

అర్థ : విస్మయ +ఆకులిత చిత్తుండై = ఆశ్చర్యముచే కలఁగిన మనస్సు కలవాఁడై; సకల దిశా జాజ్వల్యమానంబై = ఎల్లదిక్కులందు జ్వలించు చున్నదై.

తా : కృష్ణుఁడు, ఎనిమిది, చేతులతో, పెక్కు ఆయుధములను ప్రయోగించెను. బాణుఁడు తనతో (వేయి చేతుల వానితో) అతఁడు సమానముగా పోరుటను చూచి ఆశ్చర్యముచే కలఁత చెంది, హిరణ్యకశిపుఁడు, మనుమఁడైన (తనతండ్రికి) బలిచక్రవర్తికి ఇచ్చిన ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. అది ఎల్ల దిక్కులందును, మండుచున్నదై అతిశయింపఁగా, శ్రీకృష్ణుఁడు (మీఁది పద్యముతో).

కం. పర్జన్యబాణ మేసిన
నూర్జితవర్షంబుతోడ నున్నత తర ధా
రార్జవము గాఁగ నప్పుడు
నిర్జించెను దనుజాశరము నిఖిల విబుధులున్. 202

అర్థ : పర్జన్య బాణము = ఇంద్రాస్త్రము (మేఘాస్త్రము); ఊర్జిత వర్షంబుతోడన్ = గొప్ప వానతో; ఉన్నత తరధారా + ఆర్జవము కాఁగా = మిక్కిలి పొడవులైన జడులచే ఒప్పఁగా; నిర్జించెను = జయించెను.

తా : శ్రీకృష్ణుఁడు మేఘాస్త్రమును వేయఁగా అది పెను గాలులతో పొడవైన నీటి ధారలతో చక్కగా గోచరించుచు బాణుని ఆగ్నేయాస్త్రమును చల్లార్చెను. ఎల్ల దేవతలు సంతోషించిరి.

కం. కొనియాడిరి నారాయణు
వినుతించిరి; ముదముతోడ వేడ్కలు దొలఁకన్
మనమున నప్పటి కప్పటి
కనూనవాక్యములఁ బొగడి రంభోజాక్షున్. 203

తా : (ఎల్లదేవతలు) మహావిష్ణువైన శ్రీకృష్ణుని ఆదరించుచు విశేషముగా నుతించిరి. మనస్సులలో సంతోషము, ఉత్సాహము, ఉప్పొంగుచుండఁగా ఆ కమలనయనుని అప్పటికి అప్పుడే పెక్కు గొప్ప మాటలతో పొగడిరి.

వ. తదవసరంబున గరుడమయూరంబులు సమరకాంక్ష మానసంబులతోడం దలపడిన నప్పుడు గరుడండు దక్షిణ పక్షంబున వ్రేయం బూనిన సంకుచిత శరీరం బై మయూరంబు సవ్య భాగంబునకు నెగసి ముక్కునం బొడిచి ఱెక్కల నడిచి త దుపరిభాగంబునకు

నెగసినం జూచి తానునుం దోడన యెగసి తదీయ దేహంబు చరణంబుల నిఱికియు మఱియు గగనంబునకు నుఱికియు దిరుగంబడి నీలకంఠశిరంబు చంచుపుటంబునం గీలించి తదీయపక్షంబు గోళ్ళ గీఱియుఁ జాళ్ళు వాఱియు న య్యాయోధన శిక్షితుం డగు పతత్త్రిపతి తన దక్షిణ పక్షంబున నడిచి మహిం బడ విడిచిన నా మయూర రాజర్ధపద పాత జనితజ్ఞానుం డై క్రమ్మఱ నెగిరి యురవున నూఁకియు వెరవునం దాఁకియుఁ దుండంబు సారించియుఁ బ్రచండంబుగాఁ గారించియు ఱెక్కల వ్రేయం బూఁచియుఁ బ్రక్కలు డాయు నఖంబులఁ జాఁచియు బహుప్రకారంబుల గారించినం గనుంగొని సుపర్ణుండు విజృంభించి సువర్ణ పర్ణ సంకీర్ణ కిరణ సముదాయ వ్యాప్త నభోమండలుం డై పత్త్రంబులం జిత్రంబులుగా మయూరంబు వ్రేసియు నీసునం బో నీక గాసి చేసియు మఱియునుం దనుపు లేక లేఖలోకంబు వెక్కసం బంద నక్కాకోదరవిదారి యగు వైన తేయుండు తదీయోదరంబు వ్రచ్చి రణభూమికి బలి చేసిన. 204

ప్రతి : తద్+అవసరంబునన్ = ఆ సమయమున; గరుడ మయూరంబులు = గరుడుఁడును నెమిలియును; సమర కాంక్షా మానసంబులతోడన్ = యుద్ధమునందలి కోరికతోడి మనస్సులతో తల పడినన్ = ఎదురుకొనఁగా; అప్పుడు, గరుడండు, దక్షిణ + పక్షంబునన్ = కుడిఱెక్కతో; వ్రేయన్ + పూనినన్ = కొట్ట యత్నింపఁగా; మయూరంబు = నెమిలి; సంకుచిత - శరీరంబు +ఐ = ముడుచుకొనిన శరీరము గలదయి; సవ్య - భాగంబునకున్ = ఎడమవైపునకు; (ఎ) నెగసి = ఎగిరి; ముక్కునన్ = ముక్కుతో; పొడిచి; ఱెక్కలన్ = ఱెక్కలతో; అడిచి = కొట్టి; తద్ + ఉపరి భాగంబునకున్ = దాని (గరుడని) పై భాగమునకు; (ఎ) నెగసినన్ = ఎగురఁగా; చూచి; తానునున్; తోడన్+అ =వెంటనే; తదీయ దేహంబు = దాని (నెమిలియొక్క) శరీరమును; చరణంబులన్ = పాదములందు; ఇఱికియున్ = ఇమిడ్చియు; మఱియున్ గగనంబునకున్ = ఆకాశమునకు; ఉఱికియున్ = దుమికియును; తిరుగంబడి = తిరుగఁబడి; నీలకంఠ శరీరంబు = నెమిలి మేను; చంచు - పుటంబునన్ = దొప్పవంటి ముక్కుతో; కీలించి = పట్టుకొని, తదీయ పక్షంబున్ = దాని ఱెక్కను; గోళ్లన్ = గోళ్లతో; గీఱియున్ = గోఁకియును; చాళ్లు పాఱియున్ = వరుసలు (గీతలు) కలిగించియు; ఆయోధన శిక్షితుండు + అగు = యుద్ధము నందు చక్కని శిక్షణ పొందిన (నేర్పరియైన); పతత్త్రి పతి = పక్షిరాజు, గరుడుఁడు; తన దక్షిణ పక్షంబునన్ = తన కుడి ఱెక్కచే; అడిచి = కొట్టి; మహిన్ = నేలపై; పడన్ విడిచినన్;

ఆ మయూర రాజు = ఆ నెమిలి ఱేఁడు; అర్థపాత జనిత జ్ఞానుండై = పడునప్పుడు, నడుమనే పొందిన తెలివికల వాఁడై (పూర్తిగా నేలపై పడకముందే తెలివిని పొంది); క్రమ్మఱన్ = మరల, ఎగిరి; ఉరవునన్ = తగినట్లు నూకియున్ = త్రోసియును; వెరవునన్ = ఉపాయముతో; తాఁకియున్ = ఎదిరించియు; తుండంబు = ముక్కు; సారించియున్ = ముందునకు చాఁచియును; ప్రచండంబుగాన్ = తీవ్రముగా; కారించియున్ = బాధించియును; ఱెక్కలన్ = ఱెక్కలతో; వ్రేయన్ = కొట్టుటకు; పూఁచియున్ = పూనియును; ప్రక్కలు డాయు నఖంబులన్ = ప్రక్కలను సమీపించు గోరులతో; చాఁచియున్ = దండాకారముగా చేసియు; బహు-ప్రకారంబులన్ = అనేక విధములుగా; కారించినన్ = బాధింపఁగా, కనుంగొని, సుపర్ణుండు = గరుత్మంతుఁడు; విజృంభించి; సువర్ణ - పర్ణ = బంగారు వన్నె కల ఱెక్కల యొక్క; సంకీర్ణ = దట్టమైన; కిరణ సముదాయ = కిరణముల సమూహములతో; వ్యాప్త = వ్యాపించిన; నభస్ + మండలుండు+ఐ = ఆకాశ మండలము గలవాఁడయి; పత్త్రంబులన్ = ఱెక్కలతో; చిత్రంబులు గాన్ = వింతగా; మయూరంబున్ = నెమిలిని; వ్రేసియున్ = కొట్టియును; ఈసునన్ = కోపముతో; పోనీక = వెడలనీక, గాసి చేసియున్ = బాధ పెట్టియు; మఱియునున్ = ఇంకను; తనుపు లేక = తృప్తి లేక; లేఖలోకంబు = దేవతల సమూహము; వెక్కసంబు + అందన్ = ఆశ్చర్య పడఁగా; ఆ+కాకోదర - విదారి = పాములను చీల్చువాఁడు అగు; వైనతేయుండు = గరుత్మంతుఁడు; (వినత కొడుకు); తదీయ+ఉదరంబు = దానిదైన పొట్టను; వ్రచ్చి = చీల్చి; రణ-భూమికిన్ = యుద్ధ భూమికి; బలి చేసినన్ = బలి చేయఁగా.

తా : ఆ సమయమున శ్రీకృష్ణుని వాహనమగు గరుడుఁడును, కుమారస్వామి వాహనమగు నెమిలియును, కయ్యము చేయు కోరికతో ఎదుర్కొన్నవి. గరుడుఁడు తన కుడి ఱెక్కలతో నెమిలిని కొట్టఁబోయెను. నెమిలి, శరీరమును కుదించుకొని ఎడమ వైపునకు ఎగిరి గరుడుని ముక్కుతో పొడిచి ఱెక్కలతో కొట్టుచు దాని పైకి దుమికెను. వెంటనే గరుడుఁడు తానును పైకి ఎగిరి దాని శరీరమును పాదములందు ఇముడ్చుకొని బాగుగా నొక్కెను. అప్పుడు నెమిలి తప్పించుకొని నింగికి ఎగురఁగా, దానిని వెంబడించి, దాని తలను తన దొప్పవంటి ముక్కులతో పొడిచి, పట్టుకొని దాని ఱెక్కలను తన గోళ్లతో గోఁకి, దాని మేనిపై గీఱలు కావించెను. యుద్ధమందు నేర్పుగల పక్షిరాజు గరుడుఁడు అతిశయించి, తన కుడి ఱెక్కలచే నెమిలిని కొట్టి నేలపై పడునట్లు విడిచెను. అది నేలపై పడుటకు ముందే సగము దారిలోనే తాను పడ నున్నానని తెలిసికొని పైకి ఎగిరి పోయి తగినట్లు గరుడుని త్రోసి, నేర్పుతో ఎదిరించి తన ముక్కును ముందునకు చాఁచుచు, తీవ్రముగా బాధించి, ఱెక్కలతో కొట్టుటకు ప్రయత్నించుచు, ప్రక్కలను

సమీపించు గోళ్లతో దండాకారముగా వ్రాలుచు, అనేక విధములుగా బాధింపఁగా చూచి గరుడుఁడు ఉద్రేకముతో, బంగారు వన్నె గల ఱెక్కల దట్టమైన కాంతి పుంజము గగన మండల మందు ప్రసరింపు చుండఁగా; తన ఱెక్కలతో నెమిలిని వింతగా కొట్టుచు కోపముతో దానిని తప్పించుకొని పోనియ్యక హింసించెను. అంతటితో, తృప్తి చెందక, దేవతల మొత్తము ఆశ్చర్యపడుచుండఁగా వినత పుత్రుడు, గరుడుఁడు నెమిలి పొట్టను చీల్చి రణ భూమికి బలియియ్యఁగా (మీఁది పద్యముతో).

అలం : స్వభావోక్తి. పక్షుల యుద్ధము సహజ సుందరముగా నున్నది.

కం. అప్పుడు బర్హిణ మోడిన
నుప్పొంగెను *దివ్యవినుతు లుడు గణ వీధి
నప్పరుసున బాణాసురుఁ
డప్పటి కప్పటికిఁ దలఁకె నధిక భయమునన్. 205

అర్థ : బర్హిణము = నెమిలి; ఉడు వీధి = ఆకాశ వీధి; ఆ+పరుసు = ఆ విధము; పరుసు శబ్దము, ఆ, ఈ, ఏ, పూర్వకముగానే ప్రయోగములతో కానంబడుచున్నది.

తా : నెమిలి ఓడిపోయినది. ఆకాశమందు దేవతల ప్రశంసలు పొంగినవి. వెంటనే ఆ తీరును చూచి బాణుఁడు మిక్కిలి భయపడి చలించెను.

ఉ. పుట్టెను దైత్యసేనల నపూర్వతరం బగు శోకభారముం
గట్టిరి దేవసంఘములు కాంచన తోరణపంక్తు లెల్లెడం
బట్టణవీధి నయ్యెడరు బాణుఁడు చూచుచు భీతి నొందఁగా
నట్టియెడన్ గిరీశ వచనాజ్ఞను నంది రథంబు దెచ్చినన్. 206

అర్థ : ఆ+ఎడరున్ = ఆ ఆపదను, భంగపాటును.

తా : (ఆ సమయమందు) రాక్షసుల సైన్యములో అత్యధికమైన శోకము కలిగినది. దేవతల సమూహములు తమ పట్టణమందు, అన్ని త్రోవలందు ఇంటి వాకిళ్లలో బంగారు పూల మాలలను, కట్టిరి. అట్టి భంగపాటుచే ఆపద కలుగునని బాణుఁడు వెఱపు చెందెను. శివుని ఆనయైన వాక్కుచే నంది, అప్పుడు ఒక తేరును తెచ్చెను.

---

* దివ్య గణములుడు వీధిన్ దా,

కం. ఆయరద మెక్కి బాణుం
డాయుధ చయ వితత దోస్సహస్ర రుచిరుఁ డై
తోయజలోచనుఁ దాఁకెను
నాయత శరవర్ష మొప్ప నతివేగమునన్. 207

అర్థ : చయ = సమూహముచే; వితత = విస్తరించిన; దోస్ +సహస్ర రుచిరుఁడై = వేయి చేతులచే మనస్సును హరించు వాఁడై, ఆయత = అధికమైన.

తా : ఆ తేరును ఎక్కి బాణుఁడు వివిధములైన ఆయుధముల మొత్తమును తన పొడవైన చేతులలో ధరించి చూపఱులకు ఆహ్లాదకరముగా బాణములను వర్షించుచు, కమలముల వంటి కన్నులు కల శ్రీకృష్ణుని అతివేగముగా ఎదుర్కొనెను.

శా. జ్వాలాంతం బగుబ్రహ్మ శీర్షకమహాస్త్రం బేసినం గేశవుం
డాలోనన్ భ్రుకుటీ విశంకట లలా టాభోగుఁ డై సంచర
ల్లీలా పాటిత దైత్యచక్రము లసత్తేజశ్చ యావక్రముం
గాలత్రాస విభాస దైత్య ఝుష రేఖానక్రముం జక్రమున్. 208

ప్రతి : జ్వాలా+అంతంబగు = అగ్ని జ్వాలలు చివర లందు కలదైనదియును; బ్రహ్మ శీర్షక మహా + అస్త్రంబు +ఏసినన్; కేశవుండు; ఆలోనన్ = అంతలో; భ్రుకుటీ = కుటిలమగు కను బొమలతో (భ్రూవు, భ్రూకుటి రూపాం.); విశంకట లలాట + ఆభోగుఁడై = పెద్దదైన నొసటి యొక్క నిండుఁదనము కలవాఁడై; సంచరత్ + లీలా = చక్కగా తిరుగుచు, విలాసముతో, (ఆట్లాడు విధమున); పాటిత దైత్య చక్రమున్ = చీల్పఁబడిన (చంపఁబడిన) రాక్షస సమూహము కలదియును; లసత్ తేజస్ +చయ అవక్రమున్ = ప్రకాశించు కాంతుల సమూహముచే వంకరకానిదియు (అడ్డు లేనిదియును, అపజయమెఱుఁగనిదియు) కాల త్రాస విభాస= యముని వలన (తమకు చావు కలుగునని) భయముచే కాంతి లేని; దైత్య ఝుష రేఖా నక్రమున్ = రక్కసులు అనెడి మీనముల వరుసలకు మొసలి అయినదియును అగు చక్రమున్ = సుదర్శన చక్రాయుధమును.

తా : బాణాసురుఁడు అగ్ని జ్వాలలు చిమ్ము 'బహ్మ శీర్షకము అనెడి గొప్ప అస్త్రమును శ్రీకృష్ణునిపై ప్రయోగించెను. అప్పుడు వంకరయైన కనుబొమలతో విస్తరించిన నొసటితో (కినుకతో) రాక్షససేనలను చీల్చునదియును, తేజోవంతమై అడ్డులేనిదై విలాసముగా సంచరించునదియును, అంత్యకాలము ఆసన్న మైన దని

భయపడు రక్కసులు అనెడి మీనములకు మొసలి అయినదియును, అగు, సుదర్శన మనెడి చక్రాయుధమును శ్రీకృష్ణుఁడు బాణునిపై ప్రయోగించెను.

అలం : 1. రూపకము. దైత్య ఝష రేఖా నక్రమున్.

2. అంత్యానుప్రాసము, "క్రము" ఆవృత్తమైనది.

గీ. అటు ప్రయోగించి యాయస్త్ర మంతఁ జెఱిచి
పుష్పకారూఢ హరిహయ పూర్వ విబుధ
సంస్తవాధిక వర్ధిత సమ్మదుండు
కృష్ణుఁ డిట్లను సంగర తృష్ణుతోడ. 209

ప్రతి : అటు = ఆవిధముగా (సుదర్శన చక్రమును) ప్రయోగించి; ఆ+అస్త్రము+అంతన్ = ఆ బ్రహ్మ శీర్షక మను పేరుగల దివ్య బాణమును, పూర్తిగా, చెఱిచి,; పుష్పక+ఆరూఢ = పుష్పక మనెడి విమానమును ఎక్కిన; హరిహయ పూర్వ = ఇంద్రుఁడు మున్నుగాఁ గల; విబుధ = దేవతల సంస్తవ+అధిక వర్ధిత = చక్కని స్తుతులచే పెంపొందిన; సమ్మదుండు = సంతసము కలవాఁడు, కృష్ణుఁడు; సంగర తృష్ణుతోడ = యుద్ధము కొఱకు మిగుల అనురక్తుఁడగు (దప్పి కల) బాణునితో; ఇట్లు + అనున్.

తా : శ్రీకృష్ణుఁడు ఆ విధముగా చక్రాయుధమును ప్రయోగించి బ్రహ్మశిర మను అస్త్రమును, తునుమాడి, పుష్పక విమానము నెక్కి ఇంద్రుఁడు మొదలుగాఁ గల దేవతలు తన్ను చక్కఁగా స్తుతించు చుండఁగా, వృద్ధి పొందిన సంతసము కలవాఁడై, యుద్ధము చేయుటకు ఉవ్విళ్లూరు చున్న బాణునితో ఇట్లనెను.

వ్యు హరిహయుఁడు : పచ్చని గుఱ్ఱములు కలవాఁడు, ఇంద్రుడు.

శా. ఓరీ దానవధూర్త! నీదువచనోద్యోగంబు లె ట్లేగె రా
రారా యింకిట నేమి చేసెదవురా క్రౌర్యంబు శౌర్యంబు స
ద్వీరత్వంబును గల్గె నేని దనుజా తెల్లంబుగాఁ జూపు మం
చారాజీవ విలోచనుండు వచన వ్యాపార పారీణతన్. 210

అర్థ : దానవ ధూర్త = రాక్షసులలో వంచకుఁడా!; వచన + ఉద్యోగంబులు = మాటలతో మాత్రమే చేయు ప్రయత్నములు; రాజీవ లోచనుండు = కమల నేత్రుఁడు; వచన వ్యాపార పారీణతన్ = మాట్లాడు పనియందు నేర్పుతో.

తా : "ఓరీ! దానవులలో వంచకుఁడా! నీ మాటలతో కావించు ప్రయత్నములు ఏమైనవి? (ఎక్కడికి పోయినవి?) రా, రా. ఇంక, చేయుటకు ఏమియు లేదు కదా! నీ క్రూరత్వము, శూరత్వము, సత్పౌరుషము నీలో ఉన్నచో ఓ రాక్షసా! వెంటనే చక్కగా చూపుము" అనుచు కమల నేత్రుఁడు, శ్రీకృష్ణుఁడు మాటల కూర్పు నేర్పుతో (మీఁది వచనముతో).

వ. మఱియును. 211

తా : సులభము

ఉ. తొల్లి సహస్రబాహువులతోఁ గృతవీర్య తనూభవుండు గ
ర్వోల్లసమాన మానసహితోదయ మానసుఁడై దశాస్య హృ
త్ఫుల్లసరోజసోముఁ డయి భూరిమఖ ప్రథితాభిమానుఁడై
చెల్లియు రేణుకాతనయుచేఁ జెడఁడే మదిలోఁ దలంపవే. 212

ప్రతి : తొల్లి; కృతవీర్య తనూభవుండు = కృతవీర్యుని సుతుఁడైన కార్త వీర్యార్జునుఁడు; సహస్ర బాహువులతోన్ = వేయి చేతులతో; గర్వ+ఉత్+ లసమాన = మిక్కిలి ప్రకాశించు; మాన సహిత + ఉదయుఁడై = ఆత్మాభిమానముతో కూడి, ప్రకటితమగుచున్న (అహంకారము) కల; మానసుండై = మనస్సు కలవాఁడై; దశ+ఆస్య = పదిముఖములు కల రావణుని యొక్క; హృద్+ఫుల్ల సరోజ సోముఁడు = హృదయ మనెడి వికసించిన కమలమునకు చంద్రుఁడై (రావణుని హృదయమును బాధించిన వాఁడై); భూరి మఖ ప్రథిత అభిమానుఁడై = గొప్ప యజ్ఞములచే పేరు కలిగిన (కీర్తినిపొందిన) గర్వము కలవాఁడై; చెల్లియున్ = ప్రవర్తించియును; రేణుకా తనయుచేన్ = రేణుక తనయుడైన పరశురామునిచే; చెడఁడే = నశింపఁడా? మదిలోన్ = మనస్సులో; (దానిని) తలంపవు+ఏ = ఆలోచింపవా ఏమి?

తా : పూర్వము కార్తవీర్యార్జునుఁడు వేయి చేతులతో, గర్వముతో ప్రకటితమగుచున్న ఆత్మాభిమానము కల మనస్సు కలవాఁడు. (అహంకారము కలిగి, రావణుని హృదయ పద్మములకు చంద్రుడైన వాడు (అతనిని బాధించిన వాఁడు) గొప్ప యజ్ఞములచే కీర్తిని పొంది గర్వితుఁడయ్యును, పరశురామునిచే, నశించెనుకదా! ఆ చరిత్రను స్మరింపుమా!

అలం : 1. యమకము గర్వోల్లసమాన, మాన సహితోదయ మానసుఁడై;

2. రూపకము. దశాస్య హృత్ఫుల్ల సరోజ సోముఁడు.

కార్త వీర్యార్జునుఁడు: దత్తాత్రేయుని భక్తుఁడు. అతనిని సేవించి, వేయి బాహువులు కలుగునట్లు వరమును పొందెను. యుద్ధములో రావణుని ఓడించెను. ఆతని పుత్రులు జమదగ్ని ఆశ్రమములోని, కామధేనువును, దూఢను అపహరించిరి. ఆ కారణముచే పరశురాముఁడు కార్తవీర్యుని చంపెను.

ఉ. నిన్నును నత్తెఱంగుననె నేఁడు కరద్వయయుక్తుఁ జేసి ద
ర్పోన్నతి మాన్చి నీదు సుహృదుద్ధతి గీటడఁగింతుఁ బాఱ కి
ట్లున్నగతిం జెలంగు మని యుద్ధవిశారదుఁ డై మురారి తాఁ
జెన్నొదవన్ సుదర్శనముఁ జేత నమర్చెఁ బ్రయోగకాంక్షతోన్. 213

ప్రతి : నిన్నునున్; ఆ +తెఱంగుననె = ఆ విధముగనే; నేఁడు; కరద్వయ యుక్తున్=రెండు చేతులు మాత్రము కలవానిఁగా; చేసి; దర్ప+ఉన్నతి = పొగరు పెంపును; మాన్చి; నీదు; సుహృత్ = మిత్రుల; ఉద్ధతి=పెంపును; కీటడఁగింతున్ = నాశము చేయుదును; పాఱకు = (గర్వముతో) ప్రవర్తింప వలదు; ఇట్లు +ఉన్న గతిన్ = (యుద్ధమును, మానుకొని) ఇప్పుడున్న వేయి చేతులతో; చెలంగుము = సంతోషింపుము; అని; యుద్ధ విశారదుఁడై యుద్ధమందు; దిట్ట తనము కలవాడై; మురారి = కృష్ణుఁడు, ప్రయోగ కాంక్షతోన్ = వేయుటకు కోరిక కలవాఁడై; చెన్ను+ఒదవన్ = సొంపారఁగ; తాను సుదర్శనమున్ = ఆ పేరుగల చక్రాయుధమును; చేతన్ = చేతియందు; అమర్చెన్ = ధరించెను.

తా : నిన్ను కూడ, ఆ విధముగా ఈదినమ్ము రెండు చేతులు మాత్రము మిగిల్చి నీ పొగరు పొంగును అణఁచి నీ మిత్రులను పెంపును కూడ నాశము చేసెదను. ఆలోచన లేక మిడిసి పడకుము. యుద్ధమును మానుకొని ఇప్పు డున్నట్లు జీవింపుము" అని యుద్ధమందు దిట్టతనము కల కృష్ణుఁడు సుదర్శనచక్రమును ప్రయోగించుకోరికతో చక్కగా దానిని చేతిలో ధరించెను.

వ. అట్టి యెడ. 214

తా : ఆ సమయమందు.

కం. శశి సూర్య శక్ర హర పా
శి శమన సద్దీప్తితతి వసించెం జక్రా
కృశమూర్తి లోన నప్పుడు
విశాల లోచనుఁడు సకలవిస్మయ కరుఁడై. 215

ప్రతి : అప్పుడు; చక్ర+అక్కృశ మూర్తిలోనన్ = చక్రము యొక్క చిక్కని (బలిష్ఠమైన) రూపములో; శశి = చంద్ర; సూర్య; శక్ర = ఇంద్ర; హర=శివ; పాశి = వరుణ; శమన = యమ మొదలగువారి; సత్+దీప్తి = గొప్ప తేజస్సుల మొత్తము; వసించెను = వచ్చి చేరెను; విశాల లోచనుఁడు; సకల విస్మయకరుఁడై = ఎల్లవారికి అచ్చెరువును కలిగించు వాఁడై,

తా : ఆ సమయమందు చంద్ర సూర్య ఇంద్ర శివ వరుణ యముల యొక్క మేలైన తేజఃపుంజము, సుదర్శన చక్రములో కలిసెను. ఎల్ల వారికి ఆశ్చర్యము కలుగునట్లు శ్రీకృష్ణుఁడు (మీఁది పద్యముతో).

కం. చక్రము వైవఁగ బూన్ప న
వక్రముగాఁ జెలఁగె విబుధ వరముని వినుతుల్
శక్రుండు వినుతి జేసెఁ ద్రి
విక్రమునిం ద్రిదివవీధి వివిధక్రియలన్. 216

తా : శ్రీకృష్ణుఁడు సుదర్శన చక్రమును ప్రయోగించుటకు ఉద్యమింపఁగా శ్రేష్ఠులైన దేవతలయు, మునులయు గొప్ప స్తోత్రములు స్పష్టముగా ఉచ్చరింపఁబడినవి. మహేంద్రుఁడు, ఆకాశ వీధిలో త్రివిక్రముఁడైన హరియొక్క ప్రశంసనీయము లైన వివిధములైన ఆశ్చర్యకరములైన అవతార క్రియలను అధికముగా పొగడెను.

విశే. త్రివిక్రముని ప్రస్తావముచే, బలిచక్రవర్తి వలె, అతని సుతుడైన బాణుఁడును భంగపాటును పొందు నని ధ్వని.

## - : చక్ర ప్రయోగము చేయఁ దివురు కృష్ణుని యెదుట నగ్నిక నిలుచుట : -

కం. అత్తెఱఁ గంతయు నగ్నిక
చిత్తమునం దెలిసి విష్ణుసేవాపర యై
'యిత్తఱి బాణాసురునిం
దత్తఱపడ కుండఁ గావఁ దగదే' యనుచున్. 217

తా : ఆ విధముగా శ్రీకృష్ణుఁడు, బాణుని వధింప నున్నాఁడని ఎఱిఁగి, అగ్నిక అనెడి దిగంబర పిశాచిని, విష్ణు సేవయందు ఆసక్తితో "ఈ సమయమందు తొట్రుపాటు చెందక, బాణాసురుని రక్షించుట తగదా? (కర్తవ్యము గదా!)" అనుచున్ (మీఁది పద్యముతో).

గీ. 'దేవ దేవ! జగన్నాథ! దివ్యమూర్తి!
కావవే దనుజేశ్వరుఁ గరుణతోడ'
ననుచుఁ గోటవి యెదురుగా నరుగు దేర
మోము చూడక కన్నులు మూసికొనుచు. 218

తా : "దేవుల కెల్ల దేవా! జగములకు నాథుఁడా! తేజస్సుతో కూడిన స్వరూపము కలవాఁడా! రాక్షస రాజును కృపతో రక్షింపవా?" అనుచు కోటవి (ఉచ్చమిల్లి) ఎదురుగా రాఁగా, శ్రీకృష్ణుఁడు ఆమె ముఖమును చూడక కన్నులను మూసి కొనుచు (మీఁది పద్యముతో).

కం. దనుజాధీశుని చేతులు
తునుకలు గా నఱక దలఁచి తోయజ నయనుం
డనవరత నిశిత ధారా
జనిత విమత చిత్తభయముఁ జక్రము వైచెన్. 219

తా : కమలనయనుఁడు శ్రీకృష్ణుఁడు, కోపముతో దానవ నాయకుని చేతులు తునుకలు అగునట్లు, ఎల్లప్పుడును వాఁడియైన అంచులచే పగవారికి వెఱపు పుట్టించు, చక్రమును ప్రయోగించెను.

వ. ఆ సుదర్శనంబు. 220

తా : సులభము.

కం. సమసెను బాణాసురుఁ డని
యమరులు సంతోష మొంద నఖిలోజ్జ్వల మై
యమరారిభుజము లన్నియుఁ
గొమరారఁగ నఱకి కుప్పలు పెట్టెన్. 221

తా : "ఆ చక్రాయుధముచే బాణాసురుఁడు చచ్చెను" అని దేవతలు సంతసమును పొందుచుండఁగా అది అధికముగా వెలుఁగుచు దేవతల విరోధి అగు బాణుని భుజములను అన్నింటిని చక్కఁగా వరుసగా నఱికి వేసి కుప్పలుగా పెట్టెను.

శా. మేదోలిప్తశరీర మై ఘన మహో మిశ్రంబు చక్రాయుధం
బాదైత్యాహితుఁ జేర వచ్చి త్రిజగత్యాధారకీర్తీ శిర
శ్ఛేదానుజ్ఞకు నానతి మ్మన యదుశ్రేష్ఠుండు రాజ న్మనో
మోదం బారఁగ నట్లచేయఁదలఁపన్ భూతేశ్వరుం డంతలోన్. 222

ప్రతి : మేదస్ + లిప్త శరీరమై = (వప) క్రొవ్వుచే నిండిన (పూయఁబడిన) రూపముకలదై; ఘన మహస్ + మిశ్రంబు= గొప్ప తేజస్సుతో కూడినది అగు; చక్ర+ఆయుధంబు; దైత్య+అహితున్ = రాక్షస శత్రువును, శ్రీకృష్ణుని; చేరవచ్చి త్రిజగతీ+ఆధార కీర్తీ = ముల్లోకములకు ఆధారమైన మంచిపేరు కలవాఁడా! శిరస్+ఛేద+అనుజ్ఞకున్= తలను నఱుకుటకు అనుమతిని (సమ్మతిని); ఆనతి + ఇమ్ము +అనన్; యదు శ్రేష్ఠుఁడు; రాజత్ +మనస్ + మోదంబు + ఆరఁగన్ = వికసించుచున్న మనస్సునందు సంతోషము నిండఁగా, అట్లు+అ = ఆవిధముగనే చేయన్ + తలఁపన్; అంతలోన్; భూత + ఈశ్వరుఁడు = ప్రమథులకు ప్రభువు

తా : క్రొవ్వుతో ఆవరింపఁబడిన శరీరము కలదై, గొప్ప తేజస్సుతో, సుదర్శన చక్రము శ్రీకృష్ణుని సమీపించి, "ఓ దేవరా! మూడు లోకములకు ఆధారమైన కీర్తి కలవాఁడా! శ్రీకృష్ణా! "రాక్షసుని తలను తఱుగుటకు ఆనతిమ్ము" అని కోరఁగా, యాదవులలో ఉన్నతుఁడు సంతోషముతో "అట్లు చేయుము" అని సంకల్పించి అనుమతి ఇచ్చుటకు సిద్ధ పడఁగా, వెంటనే ఆ భూతనాథుఁడు పరమశివుఁడు (మీఁది పద్యముతో).

శా. వైరూపాక్షి ధరాత్మజా జ్వరగణవ్రాతంబు లం తంతటం
జేరంగాఁ జను దేరఁ గోటవి పిశాచీశాకినీ నాయకుల్
ప్రారబ్ధస్థితితోఁ జెలంగి చన నత్యాశ్చర్య సంపాది యై
యారాజీవదళాక్షు ముందఱ మనోహారిస్తవం బొప్పఁగా. 223

అర్థ : వైరూపాక్షి = విరూపాక్షుని సుతుఁడు,కుమారస్వామియును; ధర (పుం) +ఆత్మజా = పర్వతపుత్రి, పార్వతియును; జ్వర = శివజ్వరమును; గణ వ్రాతంబున్ = ప్రమథుల సమూహమును; కోటవి పిశాచీ శాకినీ = కోటవియును (దిగంబరకాంత), పిశాచ కాంతలును, శాకినీ పిశాచ వనితలును; నాయకుల్ = వారి నాయకులును; ప్రారబ్ధ స్థితిలోన్ = వారు కావించిన పాపకర్మలను అనుభవించుటకై (కలిగిన) మొదలైన ఉనికితో; చెలంగి చనన్ = ప్రవర్తించుచు దూరముగా తొలఁగిపోఁగా; అతి+ఆశ్చర్య సంపాదియై = మిక్కిలి అచ్చెరువును పొందించు వాఁడై (శివుఁడు); ఆ రాజీవ దళ+అక్షు ముందఱన్ = ఆకమల నయనుని ఎదుట.

తా : కుమార స్వామి, పార్వతి, శివజ్వరము, ప్రమథుల సమూహము, క్రమక్రమముగా కూడి రాఁగా, కోటవియును పిశాచకాంతలును శాకినులును వారి నాయకులును, పూర్వ కర్మలచే మొదలైన ఆ యా ఆకృతులతో, దూరముగా తొలఁగి పోఁగా ఆ కమల నయనుఁడైన శ్రీకృష్ణుని ఎదుట, మిక్కిలి ఆశ్చర్యమును కలిగించు వాఁడై, శివుఁడు, మనస్సును హరించు స్తుతిని కావించుచు (మీఁది పద్యముతో).

విశే. ఈ ఘట్టమందు వైష్ణవ తత్త్వ మధిక మను సిద్ధాంతము ధ్రువ పడుచున్నది.

ఉ. దేవుని చెట్ట వట్టికొని 'దేవ! యదూద్వహ! సర్వలోక సం
భావితకీర్తిమూర్తి యుత! భానుసహస్ర సమ ప్రకాశ! నా
నావిధ విక్రమాధిక! వినాయక నాయక! పారికాంక్షి సం
సేవిత! వైరిరా ణ్మథన సిద్ధవినోదన! బాణుఁ గావవే.' 224

అర్థ : చెట్టన్ = చేతిని; యదు+ఉద్వహ = యదు వంశమును ఉద్ధరించువాఁడా! సంభావిత = గౌరవింపఁబడిన; మూర్తి యుత! = రూపుతో కూడుకొన్నవాఁడా!; భాను సహస్ర = వేయి సూర్యులతో; వి = పక్షులకు; నాయక = నాయకుఁడైన (గరుడుని); నాయక = నడపువాఁడా! నాయకుఁడా!; పారికాంక్షి = మునులచే; వైరి రాట్ మథన సిద్ధ వినోదన = శత్రురాజులను అణఁచుటచే కలిగిన వేడుక కలవాఁడా!

తా : శివుఁడు, శ్రీకృష్ణుని చేతిని పట్టుకొని "ప్రభూ! యదువంశ ఉద్ధారకా! ఎల్ల లోకముల వారిచే గౌరవింపఁబడు కీర్తిగల రూపుతో వెలయువాఁడా! వేయి సూర్యుల తేజము కలవాఁడా! పలువిధములైన పరాక్రమ క్రియలచే అధికుఁడా! గరుత్మంతునికి నాయకుఁడా! మునులచే బాగుగా సేవింపఁబడువాఁడా! శత్రురాజులను అణఁచు వేడుక కలవాఁడా, బాణుని రక్షింపుమా!".

విశే : శివుఁడు పుత్ర తుల్యుఁడైన బాణుని రక్షణ విషయమున శ్రీకృష్ణుని ప్రార్థించెను. మఱియును "నానావిధ విక్రమాధిక" అని సంబోధించెను. అట్లగుటచే, శ్రీకృష్ణుఁడే పరమోత్కృష్ట దైవ మను సిద్ధాంతము విశదమగుచున్నది.

చం. అనుడు మురాంతకుండు 'ప్రమథాధిప బాణసురారి నీవు గా
చినక్రియ నేనుఁ గాచితిని సిద్ధము నావచనంబు దీని కిం
తనఁ బని లేదు మీఁదటి ప్రధానపుఁ గార్యము దీర్ప నీ యను
జ్ఞను విలసిల్లఁ బోయెద విశంకట సత్కరుణార్ద్ర శంకరా.' 225

అర్థ : విశంకట సత్ కరుణ+ఆర్ద్ర = విరివియైన, మహనీయమైన కృపచే నిండిన వాఁడా! (తడిసినవాఁడా!); కాచితిని = రక్షించితిని;

తా : శివుఁడు అట్లు "బాణుని కావవే", అని శ్రీకృష్ణుని అర్థించిన వెంటనే ఆతఁడు "ఓ ప్రమథనాథా! విరివియైన మహనీయమైన కరుణతో మృదువైన హృదయము కలవాఁడా! బాణాసురుని నీవు రక్షించిన తీరున, నేనును కాపాడితిని. నామాట సత్యము. దీని విషయమై ఇంతటితో నేను చేయవలసినది ఏదియును లేదు. ఇంక మీఁదట చేయవలసిన ముఖ్యమైన కార్యమంతయు, నీ అనుమతితోనే రూపొందఁగలదు. నేను పోయెదను"

విశే. శివభక్తుఁడును, విష్ణుభక్తుఁడే కనుక శ్రీకృష్ణుఁడు ఔదార్యమును ప్రకటించెను.

మ. అనుచుఁ గృష్ణుఁడువోయినం బిదప బాణామర్త్య వైరీశ్వరున్
ఘనచక్రాయుధ నిష్ఠుర క్షత గళ ద్రక్తార్ద్ర సర్వాంగు న
భ్యనుభూతా ప్రతిమ ప్రగల్భ పరివా దాంతర్హి తోద్విక్రమున్
జనితాస్త్రాధిక వేదనా ప్రకట మూర్ఛా పారవశ్యాత్మనిన్. 226

ప్రతి : అనుచున్; కృష్ణుఁడు పోయినన్; పిదపన్; ఘన చక్ర + ఆయుధ = గొప్పదైన, సుదర్శన చక్రముచే; నిష్ఠుర = కఠినమైన, పరుషమైన, (దుస్సహమైన); క్షత = గాయములనుండి; గళత్ = కాఱుచున్న రక్త+ఆర్ద్ర సర్వ+అంగున్ = రక్తముచే తడిసిన ఎల్ల అవయవములను కలవాఁడును; అభి+అనుభూత = అనుభవింపఁబడిన; అప్రతిమ = సాటిలేని; ప్రగల్భ = ప్రౌఢ (నేర్పుతో కూడిన); పరివాద = నిందా వాక్యములతో; అంతర్హిత = నశించిన; ఉత్+విక్రమున్ = గొప్ప పరాక్రమము కలవాఁడును; జనిత+అస్త్ర+అధిక = పుట్టిన, బాణముల యొక్క ఎక్కువైన; వేదనా = తీవ్రమైన బాధచే; ప్రకటమూర్ఛా = తెలియుచున్న మఱపుచే; పారవశ్య+ఆత్మనిన్ = పారవశ్య వశముతప్పిన మనస్సు కలవాఁడును, అయిన; బాణ +అమర్త్యవైరి ఈశ్వరున్ = బాణుఁడనెడి రాక్షస ప్రభువుతో.

తా : అట్లు వచించి శ్రీకృష్ణుఁడు వెడలిపోయెను. పిమ్మట సుదర్శనాయుధమువలన కలిగిన తీవ్రమైన గాయములనుండి కాఱుచున్న రక్తము బాణుని శరీరమును అంతటిని తడిపి వేసినది. ప్రౌఢ వాక్యములతో నిందించు ఉద్వేగము పరాక్రమము యొక్క పొంగు నశించినవి. బాణముల తాకిడి వలన కలిగిన బాధ ఎక్కువై, తెలివి తప్పినది. మఱపుచే, మనసు వశము తొలఁగినది. అట్టి ఆ రాక్షస శ్రేష్ఠుఁడైన బాణునితో (మీఁది పద్యముతో).

విశే. మాటల మూటలను ప్రదర్శించిన బాణుని ప్రౌఢ నిందా వాక్యరచన, పరాక్రమ ప్రదర్శనా సక్తి, మాయమైనది. ఇది అంతయు అనుభూతమై, వేదనతో మూర్ఛ వచ్చినది.

వ్యా. (ముద్రిత ప్రతిలో) (మ) - సర్వాంగున (ద్వితీయపాదాంతము)

భ్యనుభూతా (తృతీయ పాదాది)

సర్వాంగున్ + అభ్యనుభూతా. ఇచ్చట ద్రుతమునకు సంధిరాదు. సంధి, బాల - 9. కనుక "సర్వాంగు న భ్యనుభూతా" అని శబ్ద స్వరూపము.

పాఠాంతరము (మ) - సర్వాంగుని (ద్వితీయపాదాంతము)

న్ననుభూతా... (తృతీయ పాదాది).

సర్వాంగునిన్ + అనుభూతా .. సర్వాంగునిన్ +న్+అను భూతా .. సర్వాంగుని న్ననుభూతా. ద్రుతమునకు సంధిలో, ద్విత్వము వచ్చినది.

సూ. కొన్ని యెడల ప్రామాణిక ప్రయోగంబులందు ద్రుతమునకు అచ్చు పరమగుచో ద్విత్వంబు చూపట్టెడి. సంధి, ప్రౌఢ - 3.

ఈ పాఠాంతరము, సోమన ప్రయోగమేమో!

ఛం. మత్తేభము

(ముద్రితప్రతిలో) ద్వితీయపాదము.

ఘన చక్రాయుధ నిష్ఠుర క్షత గళ ద్రక్తార్ద్ర.... 'ఘ' కును 'ద్ర'కును, యతి మైత్రి లేదు క్రింది సవరణ చేయఁబడినది (ఆం. సా. అకాడమీ ప్రతిలో)

ప్రథమ పాదాంతము : బాణామర్త్య వైరీశును

ద్వితీయపాదారంభము ద్ఘన చక్రాయుధ... ద్రక్తార్ద్ర

సవరణచే "ద్ఘ" కును 'ద్ర'కును మైత్రి కలిగినది యతి దోషము తొలఁగినది.

కం. నందీశ్వరుఁ డిట్లను నా
నంద మొదవ నసురనాథునకు సమ్మోహా
స్పందిత మానసునకు దో
స్పందోహ విహీన దేహసర దస్రునకున్. 227

ప్రతి : నందీశ్వరుఁడు, ఆనందము+ఒదవన్=సంతసము కలుగఁగా; సమ్మోహ+స్పందిత మానసునకున్ = మూర్ఛచే చలించిన మనస్సు కల వాఁడును; దోస్ + సందోహ = చేతుల సమూహముతో;విహీన = విశేషముగా తగ్గిన; దేహ = శరీరమునుండి; సరత్ = స్రవించు చున్న; అస్రునకున్ = రక్తము కలవాఁడును (అగు); అసుర నాథునకున్ = రాక్షస ప్రభువైన బాణునకు; ఇట్లు+ అనున్.

తా : నందీశ్వరుఁడు మూర్ఛచే చలించిన మనస్సుకల వాఁడును, (తెగిన వేయి) చేతులతో ఎక్కువగా తగ్గినట్టి శరీరమునుండి స్రవించుచున్న రక్తము కల వాఁడును అగు బాణునితో, సంతసము కలుగునట్లు,క్రింది విధముగా పలికెను.

వ్యా. "ఇట్లనున్" ఇట్లనెను. భూతార్థమునకు, తద్ధర్మక్రియ ఉన్నది. వచ్యర్థంబులకు ఒకానొకచో భూతంబున లాట్టు కానంబడియెడును". క్రియ, బాల - 22 (వివరణలో).

శా. 'పోయెన్ విష్ణుఁడు లెమ్మ౦లె' మ్మనుడు నుద్భూతాధిక ప్రజ్ఞుఁడై
యాయుగ్రాక్ష పదాబ్జసేవకుఁడు బాణామర్త్య వైరీశ్వరుం
డాయాసాంగుఁడు మాధ వాస్త్ర వినిఘా తాస్రాక్త సర్వాంగుఁ డై,
మాయా త్యక్త మనస్కుఁడై గతరణోన్మాదంబుతో లేచినన్. 228

అర్థ : ఆ ఉగ్రాక్ష పదాబ్జ సేవకుఁడు = ఆ అగ్ని నేత్రము కల పద్మములవంటి పాదములను సేవించు వాఁడు; బాణ+అమర్త్యవైరి = బాణ రాక్షస శ్రేష్ఠుఁడు; ఆయాస + అంగుఁడు = శ్రమతో కూడిన శరీరము కలవాఁడు; ఉద్భూత+అధిక ప్రజ్ఞుడై = కలిగిన ఎక్కువైన తెలివితో; మాధవ + అస్త్ర వినిఘాత +అస్ర + అక్త సర్వ + అంగుఁడై = శ్రీకృష్ణుని యొక్క అస్త్రముల వలన కలిగిన గాయముల(నుండి స్రవించిన) రక్తముచే తడిసిన అన్ని అవయవములు కలవాఁడై; మాయా త్యక్త మనస్కుఁడై = అజ్ఞానము వీడిన మనస్సుతో; గత రణ + ఉన్మాదంబుతోన్ = పోయిన యుద్ధ సంబంధమైన వెఱ్ఱితనముతో (అవివేకమును వీడినవాఁడై).

తా : "శ్రీకృష్ణుఁడు వెడలిపోయెను. లేలెమ్ము" అని నందీశ్వరుఁడు వచించి నంతనే ఆశివుని భక్తుఁడు, బాణాసుర శ్రేష్ఠుఁడు తెలివిని పొంది, అలసటతో కూడిన శరీరముతో, విష్ణువు యొక్క ఆయుధము వలన కలిగిన గాయముల నుండి వెల్వడిన రక్తము, అన్ని అవయవములను చేరుచుండఁగా, అజ్ఞానమును వదలిన మనస్సుతో (వివేకవంతుఁడై) యుద్ధము చేయవలయు ననెడి వెఱ్ఱి తలంపును వదలి, లేవఁగా, (మీఁది వచనముతో).

వ. నందికేశ్వరుండు పురారిముందట నృత్యంబు చేయ నియోగించిన. 229

తా : నందికేశ్వరుఁడు, శివుని ఎదుట నృత్యము చేయుమని నియోగింపఁగా (మీఁది పద్యముతో).

కం. తాండవము చేసె బాణుఁడు
ఖండసుధాకిరణ మకుట కరుణాపరుఁడై
చండ హరిశస్త్ర నివ హో
ద్దండ క్షతగళిత శోణితము తొడవులు గాన్. 230

అర్థ : ఖండ సుధా కిరణ మకుట కరుణాపరుఁడై = అర్ధ చంద్రుని కిరణములు కిరీటముగా కలవాఁడైన శివుని దయ కల వాఁడై; చండ = తీవ్రమైన, హరి శస్త్ర; నివహ = శ్రీకృష్ణుని ఆయుధ సముహము వలన, కలిగిన; ఉద్దండ క్షత = పెద్దవి అగు గాయముల నుండి; తొడవులు = ఆభరణములు.

తా : బాణుఁడు శివుని దయను పొందుటచే తీవ్రమైన శ్రీకృష్ణుని ఆయుధ సమూహమువలన కలిగిన గాయములనుండి వెల్వడు రక్తము, ఆభరణములు (అలంకారములు) అగు చుండఁగా, తాండవ నృత్యము చేసెను.

విశే. తాండవము, తండువను ఋషిచే చెప్పఁబడినది.

కం. జనిత వరకాంక్ష బాణుం
డు నర్తనము చేయ హృత్పటుతర ప్రియుఁడై
త్రినయనుఁడు 'వరము వేఁడుము
దనుజాధిప' యనుడు నతఁడు దద్దయు నెమ్మిన్. 231

తా : బాణుఁడు, శివుని వలన వరములను పొందవలెనను కోరికతో నృత్యము చేయఁగా హృదయ మందు అధికమైన ప్రీతి కలవాఁడై, ముక్కంటి, 'ఓయీ! రాక్షసరాజా! వరము కోరుకొనుము'' అనఁగా మిక్కిలి సంతోషముతో (మీఁది పద్యముతో).

సీ. అజరుండు నమరుండు నగువర మడుగంగ
హరుఁడును నవ్వర మతని కిచ్చి

'క్రమ్మఱ నడుగు వర' మ్మన్న నతఁడు నా
దేవర ముందటఁ దివిరి నాదు
కరణి నృత్యము చేయఁ గల్గినవారికి
నిమ్ము పుత్త్రుల నన్న నిచ్చె హరుఁడు
సత్య క్షమార్జవాచారు లై వర్జితా
హారులై మద్భక్తి యతిశయిల్ల

ఆ.వె. నాకు నెదుర నాడు నరులు పుత్త్రులఁ గాంతు
రింక నడుగు వరము శంక దక్కి
యనిన విష్ణు చక్ర హతి జాతనిష్ఠుర
బాధ మాన వరముఁ బడసె నతఁడు. 232

తా : బాణుఁడు, ముసలి తనము, మరణము లేకుండు నట్లు వరమును కోరెను. హరుఁడు ఆ వరమును అతనికి ఇచ్చెను. "మరల వరమును కోరుము" అని శివుఁడు ఆనతియ్యఁగా బాణుఁడు, "(తమ) స్వామి ఎదుట నావలె, నృత్యము చేయువారికి పుత్రులను ఇమ్ము" అని అర్థించెను. "సత్యము, క్షమ, ఋజు వర్తనమును గల నడవడిక కలవారై, ఆహారము వదలి నా ఎడ మిక్కిలి భక్తితో నాట్యమాడు నరులు, పుత్రులను పొందెదరు" అని వరమిచ్చి, శివుఁడు, 'ఇంకను శంక విడిచి వరము అడుగు' మనఁగా బాణుఁడు, "విష్ణుచక్రముచే కలిగిన తీవ్రమైన బాధను తొలఁగింపుము" అనెను.

కం. 'క్రమ్మఱ నడుగుము వర' మన
సమ్మదమునఁ బ్రమథ నాథ సైన్యాధ్యుం డై
నెమ్మి మహాకాళుం డన
సమ్మదుఁ డయి యుండఁ బడసె జగములలోనన్. 233

తా: "మరల మఱొక వరమును అడుగుము" అనఁగా, సంతోషముతో ప్రమథనాథుడగు శివుని సేనలో, ప్రీతితో ఒక గొప్పనాయకుఁడుగా నుండి లోకములలో "మహాకాళుఁడు' ' అను పేరుతో జనుల కెల్ల సంతసమును కూర్చుచు ఉండునట్లు, మఱొక వరమును శివుని అనుగ్రహముతో పొందెను.

వ. మఱియును. 234

తా : సులభము

కం. తనయొడలు రెండు చేతుల
మును పొందిన యొప్పుతోడఁ బురడించెడు స
జ్జనమత శోభను వెలుఁగఁగ
ననూనవర మీశువలన నసురుఁడు పొందెన్. 235

అర్థ : పురడించెడు = పోలెడి; అనూన = తక్కువ కాని , అధికమైన.

తా : బాణుఁడు, తన మేను, రెండు చేతులును ముందున్నట్లు, సజ్జనులు పొగడు సొంపుతో, ప్రకాశించునట్లు గొప్పవరమును శివునివలన పొంది ధన్యుఁడయ్యెను.

వ. ఇత్తెఱంగున. 236

తా : ఈ విధముగా.

ఉ. పంచవరప్రదానమున భర్గుఁడు బాణకృత ప్రమోదుఁడై
సంచిత నూత్న పారిషద సౌరసమూహకృత స్తవక్రియో
దంచిత కీర్తిపూరిత దిగంతరుఁడై నికట ప్రవర్తన
క్రౌంచ మహీధ్ర వైరి గిరిరాజ సుతాభజ నాతి మోదుఁ డై. 237

అర్థ : బాణ కృత ప్రమోదుఁడై = బాణునకు తనచే చేయఁబడిన సంతసము కలవాఁడై; సంచిత నూత్న = క్రొత్తగా, అప్పుడప్పుడే కూడిన; పారిషద = ప్రమథుల యొక్కయును; సౌర సమూహ = దేవతల మొత్తము యొక్కయు, కృత = కావింపఁబడిన; స్తవ క్రియా + ఉదంచిత కీర్తి పూరిత దిగంతరుఁడై = పొగడ్తలకు చెందిన పనులచే (గానము నృత్యము) బాగుగా ఎల్లెడల ప్రసరించుచున్న కీర్తిచే నిండిన దిక్కుల నడిమిభాగము కలవాఁడై; నికట ప్రవర్తన = సమీపమున కావింపఁబడుచున్న;భజన+అతిమోదుఁడై = సేవలచేత మిక్కిలి ప్రీతితో,

తా : శివుఁడు అయిదు వరములను ఇచ్చి బాణునకు సంతసమును కలిగించెను. అప్పుడప్పుడే నూతనముగా అనేకులు ప్రమథులు, దేవతల సమూహములు,అచ్చటికి వచ్చి చేరిరి. వారెల్లరు స్తుతిపూర్వకమైన గానము నృత్యము మొదలైన పనులను చేసిరి. వారు కావించిన స్తోత్రాదుల ధ్వనులచే, శివుని కీర్తి, దిక్కుల మధ్య భాగములందు

ఎల్లెడల ప్రతిధ్వనించెను. అప్పుడు సమీపమందున్న క్రౌంచపర్వత వైరి కుమారస్వామియు హిమవంతుని తనయ, పార్వతియు, శివుని, భజించిరి. అట్లు ప్రమథులయు, దేవతలయు, కుమార స్వామియు, పార్వతియు సేవల చేత అధికమైన సంతోషము కలవాఁడై (మీఁది పద్యముతో).

వ్యు. మహీధ్రము - భూమిని భరించునది, పర్వతము.

వ. అంతర్ధానంబు చేసె నంతట. 238

తా: పిమ్మట శివుఁడు మఱుఁగు పడెను.

## - : శ్రీకృష్ణుఁ డనిరుద్ధుని విడిపించుకొని పోవుట : -

చం. గరుడని నెక్కి కేశవుఁడు గ్రక్కున బాణ [1]గృహంబు చేరఁగా
నరిగినఁ, బక్షిరాజుఁ గని యచ్యుత పౌత్త్రునిఁ జుట్టికొన్న య
య్యురగము లెల్ల నల్దెసల నూడనిఁ బాడినఁ జూచి సంతత
స్ఫురిత సుఖాతి కంటకిత సుస్థిర మానసుఁడై ప్రియంబునన్. 239

అర్థ : ఊడనిఁ బాడు = తొలఁగు; కంటకిత = గగుర్పాటు పొందిన.

తా : గరుడుని ఎక్కి శ్రీకృష్ణుఁడు బాణుని భవనమును చేరెను. గరుడుని చూచి అనిరుద్ధుని చుట్టియున్న పాము లన్నియును, భయపడి అన్నివైపులకు తొలఁగి పాఱిపోయినవి. అట్లు మనుమఁడు పాములనుండి విముక్తుఁడు కాఁగా, చూచి, శ్రీకృష్ణుఁడు ఎప్పటివలె, ప్రకాశించు సుఖాతి శయముతోను, వికాసముతోను (కంటకిత) నిలుకడయైన మనస్సు కలవాడై ఆదరముతో.

వ్యా. నలు+దెసలు > నల్దెసలు, ద్విగు సమాసము, ప్రకీర్ణ, బాల - 16 సూత్రముచే ఉత్వలోపము, సాధారణముగా ఆచ్ఛిక ద్విగువు ఏకవచనాంతముగా నుండును.

సమాస, బాల - 18 సూత్రమున, ప్రాయిక శబ్దమున్నది. కాన, ఏక వచనము రాని రూపములు కలుగునని తెలియవలెను.

కం. అనిరుద్ధుమేను దన చే
[2]త నిమిరెను మురాంతకుండు దర్పవిరాజ

1. గృహాంతరంబుకై, యరిగినఁ 2. తనునిమిరె.

ద్దనుజ వినాశన పటు తర
సునిశిత చక్రాయు ధాతిశోభిత కరుఁడై. 240

ప్రతి : మురాంతకుండు = మురుని వధించినవాఁడు; శ్రీకృష్ణుడు; దర్ప = గర్వముచే; విరాజత్ = విశేషముగా ప్రకాశించుచున్న; దనుజ వినాశన = రాక్షసుఁడైన బాణుని యొక్క, నాశము చేయుటయందు; పటుతర సునిశిత = బలిష్ఠమైనదియును వాఁడిమి కలదియును అగు; చక్ర+ఆయుధ+అతి శోభిత కరుఁడై = సుదర్శన చక్రముచే మిక్కిలి శోభించు చున్న చేయి కలవాఁడై; అనిరుద్ధు మేనున్; తన చేతన్, నిమిరెన్.

తా : శ్రీకృష్ణుఁడు, గర్వముచే ప్రవర్తించిన బాణుని వధించుటయందు, మిక్కిలి బలిష్ఠమైన, వాఁడియైన సుదర్శన చక్రము చేతిలో శోభించుచుండఁగా ఆ చేతితో, తన మనుమఁడైన అనిరుద్ధుని శరీరమును తడవెను.

మ. అనిరుద్ధుండుఁ బితామహ స్తుతివచో వ్యాపార పారీణుఁ డై
తనుఁ బక్షీంద్రుని నెక్కు మన్న నతఁడున్ దైత్యేంద్ర కన్యా సఖుల్
దనతోఁ గూడ సుపర్ణు నెక్కఁ బిదపన్ దామోదరుం డెక్క నా
యన యేఁగె న్వివిధప్రచారముల నత్యాశ్చర్య యానంబునన్. 241

తా : అనిరుద్ధుఁడును, తండ్రి తండ్రియైన శ్రీకృష్ణుని పొగడు వాక్యములను వచించుటయందు నేర్పు కలవాఁడై, తాత, తన్ను గరుడుని ఎక్కుమని చెప్పఁగా, అతఁడును, రాక్షసరాజు యొక్క కుమార్తెయును, ఆమె చెలికత్తెలును తనతో కూడి రాఁగా, (అందఱును) గరుత్మంతుని అధిరోహించిరి. పిమ్మట శ్రీకృష్ణుఁడు ఎక్కెను. తర్వాత, గరుత్మంతుఁడు, వివిధములైన గమనములతో, వింత గొల్పు ప్రయాణమున వారిని కొనిపోయెను.

కం. గరుడఁడు నడువఁగ దూరము
జరగి హరియు సలిల పాలుసన్నిధి బాణా
సుర గోగణముల యునికియు
స్థిరముగ విని యతనిదిక్కు చేరు తలఁపునన్. 242

అర్థ : సలిల పాలు సన్నిధిన్ = జలమునకు అధిపతి అగు వరుణుని దగ్గఱ; స్థిరముగన్ = నిశ్చయముగా.

తా : గరుడుఁడు కొనిపోవుచుండఁగా హరియు అందఱును చాల దూరము పయనించిరి. ఆవల శ్రీకృష్ణుఁడు వరుణుని దగ్గఱ, బాణుని ఆలమందలు ఉండుటను, నిశ్చయముగా తెలిసికొని ఆతని పడమటి దిక్కును చేరు ఆలోచనతో (మీఁది పద్యముతో).

వ. సుపర్ణున కిట్లనియె. 243

తా : చక్కని ఱెక్కలు గల గరుత్మంతునితో ఇట్లు పలికెను.

కం. దనుజుని యావుల వరుణుఁడు
తనదిక్కున నునిచినాఁడు తత్కార్యముకై
మనకుం బో వలె నద్దెస
కనఘా చనఁ దీఱునేని యరుగు మచటికిన్. 244

తా : 'పుణ్యాత్మా! బాణుని ఆవులను, వరుణుఁడు తన పడమటి దిక్కునందు ఉంచినాఁడు. ఆ పనికై మనము, ఆ దిక్కునకు పోవలసి యున్నది. పోవుటకు అవకాశము ఉన్నచో అచ్చటికి పొమ్ము.

వ. అనుడు మురాంతకునకు నాగాంతకుం డిట్లనియె. 245

తా : అనఁగా, పాములను నాశము చేయువాఁడు, గరుడుఁడు, మురుని వధించిన శ్రీకృష్ణునితో ఇట్లు పలికెను.

కం. నాకును గార్యం బేలా
నీకుం బని చేయఁ గలుగ నీరజ నాభా!
యేకడకు నైనఁ జనియెదఁ
బ్రాకట విజ యాభిరామ! పాప విరామా! 246

తా : ప్రసిద్ధమైన జయముచే మనో హరుఁడా! పాప హరా! కమలమును నాభియందు గలవాఁడా! శ్రీ కృష్ణా! నాకు చేయుటకు వేఱేది యున్నది? నీవు చెప్పిన పని చేయుటయే కదా! (నీవు ఆజ్ఞాపించినచో) ఎచ్చటికైనను పోయెదను.

కం. అనుచుం బశ్చిమవేలా
వనమునకుం బక్షి విభుఁడు వరుణుని పురికిం

గొనిపోయె సమ్మదించుచు
వననిధి మధ్యంబు చొచ్చి వనజదళాక్షున్. 247

అర్థ : పశ్చిమ వేలా వనమునకున్ = పడమటి తీరమందుఁగల అడవికి; వననిధి = జలనిధి, సముద్రము.

తా : అనుచు పక్షిరాజు సముద్ర మధ్య భాగమును చొచ్చి, పడమటి ఒడ్డున ఉన్న వరుణుని నగరమునకు సంతోషముతో కమల నయనుఁడైన శ్రీకృష్ణుని కొనిపోయెను.

వ. గోగణంబుఁ జేరఁ జను నవసరంబున. 248

తా : (ఆ విధముగా) వరుణుని నగరములో నున్న ఆవుల మందలను చేరు నప్పుడు.

ఉ. అక్కడ నున్న వారుణ భటాళులు మొక్కలు లై రణంబులో
నుక్కున నొండొరుం బిలిచి యుగ్రత రాగ్రహ విగ్రహేచ్ఛ నల్
దిక్కులకుం జెలంగు దృఢధీరరవంబులు నింగి ముట్టఁగా
నెక్కడ యెక్క డంచు విహగేశ్వర వాహనుఁ దాఁకి రయ్యెడన్. 249

అర్థ : వారుణ భట +ఆవళులు = వరుణుని భటుల సమూహములు; మొక్కలులై = సాహసము కలవారై; ఉగ్రతర + ఆగ్రహ + విగ్రహ+ఇచ్ఛన్ = మిక్కిలి భయంకరమైన కోపముతో యుద్ధము చేయవలయు ననెడి కోరికతో; విహగ+ఈశ్వర వాహనున్ = పక్షి రాజు వాహనముగా కల శ్రీకృష్ణుని.

తా : వరుణుని నగరమందున్న వీరభటుల సమూహములు ధీరులై యుద్ధమందు నిలుకడతో (బలముతో) ఒకరినొకరు పిలుచుచు, మిక్కిలి భయంకరమైన కోపముతో, యుద్ధము చేయు తలంపుతో, నాలుగు దిక్కులందు, ప్రవర్తించుచు, స్పష్టమైనదియును, ధీరత్వముతో కూడినదియును (వీరవచనముల) ధ్వనులు ఆకాశమును అంటుచు వ్యాపించు చుండఁగా "ఎక్కడ ఉన్నాడు? ఎక్కడ ఉన్నాఁడు" అనుచు గరుడ వాహనుఁడైన శ్రీకృష్ణుని ఎదిరించిరి.

కం. మదమునఁ దన్నుం జెనయఁగఁ
బదిలముతోఁ జేరినట్టి ప్రాచేతస సై
న్య దృఢ భటాలి దవాగ్నులఁ
బ్రదరంబుల జల్లు గురిసి పాఱఁగఁ దోలెన్. 250

అర్థ : దృఢ భట+ఆళి దవాగ్నులన్ = బలిష్ఠులైన భటుల వరుసలు అనెడి కార్చిచ్చులను; ప్రదరంబుల జల్లు = బాణములు అనెడి జడులచే.

తా : గర్వముతో తన్ను ఎదిరించుటకు నిలుకడతో చేరిన ప్రాచేతసుని (వరుణుని) బలవంతులైన బంటుల వరుసలు అనెడి కార్చిచ్చులను; బాణములు అనెడి, జడులచే, పాఱఁద్రోలెను.

అలం : రూపకము.

వ. తదనంతరంబ. 251

తా : సులభము.

సీ. నిస్సాణరావంబు నింగి ముట్టి భటాళి
శంఖనాదంబుల సవదరింపఁ
గరి కర శీకరకణములు విక్రాంత
మకుట ముక్తారుచి మక్కళింపఁ
దురగ హేషా రవోద్ధురత యోధ వ్రాత
సింహనాదంబుతోఁ జెలిమి సేయ
శకట నేమి విభిన్న సర్వంసహా ధూళి
భట భూషణరజంబు బాదరింప

గీ. సకలదిశలును నిండి సైనికులు గొలువఁ
దన్నుఁ గొనియాడ నమర గంధర్వ గణము
ప్రకట రుచితోడ ధవళాతపత్ర మొప్ప
వరుణుఁ డరుదెంచె విక్ర మోద్ధురత మెఱయ. 252

ప్రతి : నిస్సాణ రావంబు = నగారా మొదలగు చర్మ వాద్యముల ధ్వనులు; నింగిన్ = ఆకాశమును అంటి; భట+ఆళి = కాల్బంటుల వరుసల యొక్క; శంఖ-నాదంబున్ = శంఖముల ధ్వనిని; సవదరింపన్=వహింపఁగా; కరి+కర+శీకర + కణములు = ఏనుఁగుల తొండముల నీటి తుంపురుల బిందువులు; విక్రాంత = పరాక్రమించు సైనికుల యొక్క; మకుట = కిరీటములందలి; ముక్తా = ముత్యాల యొక్క; రుచిన్ = కాంతిని; మక్కళింపన్ =

పెంపొందింపఁగా (సరిపోలఁగా); తురగ-హేషా రవ + ఉద్ధురత = గుఱ్ఱముల సకిలింతల ధ్వనులయొక్క ఆధిక్యము; యోధ + వ్రాత = యోధుల సమూహము యొక్క; సింహనాదంబుతోన్ = సింహగర్జతో; చెలిమి + చేయన్ = కూడఁగా; శకటనేమి విభిన్న సర్వంసహా ధూళి = రథ చక్రముల చుట్టు కమ్ములచే రేఁపఁబడిన భూ పరాగము; భట భూషణ రజంబున్ = భటుల అలంకారముల ధూళిని; బాదరింపన్ = ప్రతిఘటింపఁగా (ఔపమ్య ద్యోతకము) పోలఁగా;

సకల దిశలును = ఎల్ల దిక్కులును; నిండి సైనికులు; కొలువన్ = సేవింపఁగా; తన్నున్ అమర గంధర్వగణము = దేవతలయు, గంధర్వులయు, సమూహము; కొని యాడన్ = స్తుతింపఁగా; ప్రకట+రుచితోడన్ = స్పష్టమైన కాంతితో; ధవళ+ఆతపత్రము = వెల్లగొడుగు; ఒప్పన్ = ఒప్పఁగా; విక్రమ + ఉద్ధురత = పరాక్ర మాతిశయము; మెఱయన్ = ప్రకాశింపఁగా; వరుణుఁడు; అరుదెంచెన్ = వచ్చెను.

తా : చర్మవాద్య విశేషముల ధ్వని ఆకసమంటి, వీరభటుల శంఖ ధ్వనులతో కూడఁగా; ఏనుఁగుల తొండములు చిమ్ము నీటి తుంపురులు పరాక్రమించు వీరుల కిరీటములందలి ముత్యాల కాంతిని పెంపొందింపఁగా, గుఱ్ఱముల సకిలింతల ఆధిక్యము జోదుల సమూహముల సింహ గర్జలతో కూడఁగా, రథచక్రముల కమ్ములు రేఁపిన భూపరాగము కాల్బంటుల అలంకారముల ధూళిని పోలఁగా; సైనికులు దిక్కులనెల్ల వ్యాపించి తన్ను కొలిచి కొనియాడుచుండఁగా, దేవతలును, గంధర్వులును పొగడఁగా. స్పష్టమైన కాంతితో వెల్లగొడుగు ఒప్పఁగా పరాక్ర మాతిశయము ప్రకాశించుచుండగా వరుణుఁడు అరుదెంచెను.

అలం : ఉపమ. ఇందు సవదరించు, మక్కళించు,చెలిమిసేయు, బాదరించు అను క్రియలన్నియు, ఔపమ్య ద్యోతకములు.

కం. కొడుకులు మనుమలుఁ గొలువఁగ
విడు విడు మని శూరగణము వేగిరపడఁగా
గొడగులు గగనము గప్పఁగ
జడనిధిపతి వచ్చి నిలిచె సమరతలమునన్. 253

తా : కొడుకులును, మనుమలును, సేవించు చుండఁగా శూరులందఱును "మమ్ము విడువుఁడు, మమ్ము విడువఁడు" అని యుద్ధమునకు అనుజ్ఞ ఇమ్మని ఉత్సాహముతో వేగిరపాటు చెందఁగా, ఆకాశమంతయును ఆయా వీరుల గొడుగులు కప్పి వేయు చుండఁగా, జలాధిపతి వరుణుఁడు యుద్ధ రంగమునకు వచ్చి నిలిచెను.

వ్యా. 1. విడువుము > విడుము.

సూ. పిలుచు మొదలగు వానికి ముత్తు పరంబగునపుడు కడ(వ్రాయి బహుళంబుగ లోపించు, క్రియ, బాల - 101 'వు' వర్ణలోపము.

2. విడుము > విడు. ఆమ్రేడితము పరమగుటచే మధ్యమ మువర్ణక లోపము. సంధి, బాల 6, 49.

వ. ఇట్లు నిలిచి దివ్యనివహ జేగీయమా నానూన చారిత్రుం డై వరుణుండు బహు శరంబులఁ బొదవినం గైట భాంతకుండు స్వకీయ ధనుర్విద్యా కౌశలంబునఁ దదీయ సాయకంబులు ఖండించి మఱియును వైష్ణవాస్త్రంబు ప్రయోగించినం దదీ యానుస్యూత జలధారా సమూహంబు వైష్ణవాస్త్రంబు నుపశమింపం జేసె నట్టియెడ. 254

ప్రతి : ఇట్లు నిలిచి; దివ్య నివహ = దేవతల చేత; జేగీయమాన + అనూన చారిత్రుఁడై = గానము చేయఁబడుచున్న తక్కువ కాని (గొప్పదైన) చరిత్ర కలవాఁడయి; బహు శరంబులన్ పొదివినన్ = పెక్కు బాణములతో ముట్టడింపఁగా; కైటభ+ అంతకుండు = కైటభుని వధించిన శ్రీకృష్ణుఁడు; స్వకీయ ధనుస్ + విద్యా కౌశలంబునన్ = తనదైన విలువిద్య యందలి నేర్పుతో; తదీయ సాయకంబులు = ఆతని బాణములను; ఖండించి = విఱుఁగ గొట్టి; మఱియును; వైష్ణవ + అస్త్రంబు ప్రయోగించినన్; తదీయ అనుస్యూత జలధారా సమూహంబు = ఆతని దైన ఎడతెగక వెలువడు నీటి ధారల మొత్తము; వైష్ణవ + అస్త్రంబున్; ఉపశమింపన్ + చేసెను = అణఁచివేసెను; అట్టి+ఎడ = అప్పుడు.

తా : దేవతలు వరుణుని చరిత్రను గానము చేయుచుండఁగా అతఁడు యుద్ధమునకు వచ్చి పెక్కు బాణములను ప్రయోగించెను. శ్రీకృష్ణుఁడు, నేర్పుతో, వాని బాణములను ముక్కలు చేసెను. వెంటనే వైష్ణవము అను పేరుగల అస్త్రమును అతనిపై వేయఁగా, వరుణుఁడు ఎడతెగని నీటి జడులచే దానిని అణఁచివేసెను. ఆసమయమందు (మీఁది పద్యముతో).

మహాస్రగ్ధర.

జలజాక్షుం డంత రోష జ్వలిత హృదయుఁ డైసంచి తౌదార్య తేజో
బల విస్తా రోద్ధతారి ప్రకర గజ ఘటా ప్రఖ్య జీమూత రాజీ

కలి తోద్య త్క్రౌర్య ధైర్య క్షయ భయద మహా కార్య వాతోరు మూర్తిన్
విల స ద్దిక్పూర్ణకీర్తిన్ విస్ఫుమర మహి తో ద్వృత్తి విద్విట్కృతార్తిన్. 255

ప్రతి : అంతన్ = తరువాత; జలజ+అక్షుండు = తామరలవంటి కన్నులు గలవాఁడు (శ్రీకృష్ణుడు); జ్వలిత+హృదయుఁడు+ఐ = కోపముచే మండిన డెందము గలవాఁడయి; సంచిత = కూడిన, ఔదార్య = మహత్త్వము గల; తేజస్ = తేజస్సు యొక్కయు, బల = పరాక్రమముయొక్కయు; విస్తార = విరివిచే; ఉద్ధత = గర్వించిన; అరి+ ప్రకర = శత్రుసమూహము యొక్క; గజ ఘటా = ఏనుఁగుల సమూహముతో; ప్రఖ్య = పోలికగల; జీమూతరాజీ = మేఘముల వరుసతో; కలిత = ఒప్పిన, ఉద్యత్ = ఉద్యమించుచున్న; క్రౌర్య = క్రూరత్వముతో; ధైర్య = ధీరత్వముతో; క్షయ-భయద = నాశనము వలని భయమును కల్గించు; మహాకార్య = గొప్పపని గల; వాత = వాయువుయొక్క; మూర్తిన్ = ఆకారము గల దానిని; విలసత్ + పూర్ణ కీర్తిన్ = ప్రకాశించుచున్న సంపూర్ణమైన కీర్తిగల దానిని; విస్ఫుమర = వ్యాపించునట్టి; మహిత = గొప్పదియగు, ఉద్వృత్తి = గర్వము, (పొగరుకల); విద్విట్ = శత్రువులకు; కృత = చేయఁబడిన; ఆర్తిన్ = శోకము గల దానిని (తరువాతి పద్యములోని 'చక్ర' మునకు విశేషణములు).

తా : పిమ్మట, కమలనయనుఁడు, శ్రీకృష్ణుఁడు, కోపముచే మండుచున్న చిత్తము కలవాఁడై, మహత్త్వము, తేజస్సు పరాక్రమము యొక్కయు, విరివిచే అధికమై గర్వించిన శత్రు సమూహముల యొక్క ఏనుఁగుల గుంపులు అనెడి (సమానములైన) మేఘముల వరుసలకు, క్రూరత్వముతో (గట్టిగా నొప్పించునది) ధీరత్వముతో (నిలుకడ కలది), వినాశముచే, భయమును కల్గించు మహాకార్యమున ప్రవర్తించునట్టి వాయువు యొక్క గొప్ప ఆకారము కలదియును, ప్రకాశించుచు దిక్కులయందు అంతటను నింపు నట్టి కీర్తి కలదియును అతిశయించుచున్న, అధికమైన గర్వముతో శత్రువులకు శోకమును కలిగించు నట్టిదియు నైన (మీఁది పద్యముతో).

అలం : రూపకము : ఉపమేయములు : గజసమూహము, చక్రము

ఉపమానములు: మేఘముల వరుసలు, వాయువు

వాయువునకు అతి బలుఁడు, ప్రకంపనుఁడనియు పేర్లు ఇవి సార్థకములు.

ఛం. మహాస్రగ్ధర, స, త, త, న, స, ర, ర, గురువు. 22 అక్షరములు యతి స్థానములు - 9, 16. ప్రాస నియమున్నది,

మొదటి రెండు లఘువులను గురువుగా మార్చినచో "స్రగ్ధర" అగును.

విశే. సోమన చక్ర మహత్త్వమును వర్ణించుటకు మహాస్రగ్ధరా వృత్తమును ఎన్ను కొనుట గుర్తింపఁదగినది.

సుదీర్ఘములును క్లిష్టములును అయిన సమాసములచే చక్రము యొక్క భయంకరత్వము చక్కగా పోషింపఁబడినది.

కం. చక్రము వైవఁగఁ బూన్పఁగ
విక్రమ కేళికిఁ దొలంగి విస్మయభీతి ని
ర్వక్ర వ్యాపృత చేతో
పక్రాంతానందుఁ డైన పాశాయుధుఁడున్. 256

అర్థ : వైవఁగన్ = వేయుటకు, పూన్పఁగన్ = ప్రయత్నింపఁగా; విక్రమ కేళికిన్ = పరాక్రమ క్రీడకు, యుద్ధము చేయు పనికి; విస్మయ = ఆశ్చర్యము; భీ = భయము; నిర్వక్ర = చక్కఁగా; వ్యాపృత = నిండుటచే; చేతస్ + అపక్రాంత + ఆనందుఁడైన = మనస్సునుండి తొలఁగిన ఆనందము కలవాఁడైన; పాశ+ఆయుధుఁడున్ = పాశమును ఆయుధముగా గలవాఁడు, వరుణుఁడును.

తా : శ్రీకృష్ణుఁడు చక్రమును వరుణునిపై వేయుటకు పూనెను. వెంటనే యుద్ధము చేయుటకు ఇష్టపడక, ఆశ్చర్యము భయము చక్కగా నిండుటచే సంతోషమును వీడి, వరుణుఁడు (మీఁది పద్యముతో).

ఉ. దేవుని ముందట న్నిలిచి 'దేవ! యదూద్వహ! నీదు దాస కృ
త్యావహన ప్రవణమతి నక్షయకీర్తి సమృద్ధి నొందితిన్
దేవర! యింత చేసిన విధేయులకుం జొర నెద్ది చో టటం
చా వరుణుండు వచ్చి వినయంబున మ్రొక్కుచుఁ బల్కె గ్రమ్మఱన్. 257

అర్థ : యదు+ఉద్వహ = యదువంశ శ్రేష్ఠుఁడా! నీదు దాస కృత్య+ఆవహన ప్రవణ మతిన్ = నీకు సేవచేయు కార్యమును వహించుటకై శ్రద్ధగల మనస్సుతో; అక్షయ కీర్తి సమృద్ధిన్ = నశింపని (శాశ్వతమైన) కీర్తియొక్క పరిపూర్ణతను; ఒందితిన్ = పొందఁగలిగితిని పాఠాం. ప్రవీణ మతిన్.

తా : 'వరుణుఁడు శ్రీకృష్ణుని ఎదుట నిలిచి "దేవా యదు వంశ శ్రేష్ఠుఁడా! నీకు సేవ చేయుటకై శ్రద్ధ గల మనస్సుతో ఇప్పుడు శాశ్వతమైన పరిపూర్ణమైన కీర్తిని పొందితిని.

"ఇట్లు త్రికరణ శుద్ధితో పశ్చాత్తాపము చెందిన, భక్తులకు రక్షణకై పోవుటకు వేఱొక చోటు (నీవు తప్ప) ఎక్కడ ఉన్నది?" (ప్రాణ భయార్తుఁడైన నన్ను నీవే రక్షింప వలెను. ఇదియే పరమధర్మము) అనుచు వినయముతో మ్రొక్కుచు పలికెను. మఱియును.

కం. 'తామస రాజస గుణములు
నీమనమునఁ బొందఁ దగునె నీ వాద్యుఁడవున్
మేము వికారగుణంబులు
సేమంబునఁ గన్న మమ్ము శిక్షింపఁ దగున్. 258

ప్రతి : నీవు+ఆద్యుఁడవున్ = నీవే మొదటి వాఁడవును. అన్ని దేవతలలో ప్రథముఁడవు, శ్రేష్ఠుఁడవును; నీ మనమునన్; తామస రాజసగుణములు = తమస్సు, రజస్సు, అనువానికి చెందిన గుణములను, తమోగుణము (హింసాత్మకము), రజోగుణముఁ (సుఖ దుఃఖాత్మకము); పొందన్ + తగునె? = పొందుట తగునా? (నీవు మా ఎడ కినుక వహింపరాదనుట); మేము; వికార గుణంబులు = (పరిశుద్ధ సత్త్వ స్వరూపుఁడవైన నీ నుండి ఉద్భవించిన) మార్పాటు పొందిన గుణములు (నీ యొక్క అంశములే అనుట); సేమంబునన్ = మేలు చేయు తలంపుతో; కన్నన్ = చూచినచో; శిక్షింపఁదగున్ = (భక్తుఁడు కావించు దోషములకు) శిక్ష విధింపవచ్చును. నీ మనస్సు నందు, తమో గణమును రజోగుణమును నీవు నిల్పు కొనుట తగునా?

తా : నీవు దేవతలలో మొదటి వాఁడవు. (శుద్ధ సత్త్వస్వరూపుఁడవు.) నీ నుండి జనించి మార్పాటు చెందిన గుణములే మేము. మా మేలుకోరి మమ్ము, నీవు చూచినచో, తప్పక మా యందు ఏవైన దోషమున్న శిక్షింపవచ్చును.

కం. 'నీకు వికారము దగునే
మా కెల్లను బుద్ధి చెప్పి మముఁ బ్రోవంగాఁ
జేకొని యున్నాఁడ' వనుచు
నా కృష్ణుని నాదిమూల మని జగ మెఱుఁగన్. 259

తా : "నీకు మార్పు తగునా? (ఇప్పుడు కామక్రోధాది రాజస తామస గుణములను పొందకుమా!) మాలోఁగల రాజస తామస గుణములను గుర్తించి, సత్ప్రవర్తనను నేర్పి, మమ్ము రక్షించు ధర్మమును (కర్తవ్యమును) కల వాఁడవు కదా!" అనుచు, ఆతఁడే విశ్వమునకు ప్రధానమైన మూలమని లోకము లన్నియు ఎఱుఁగునట్లు (మీఁది పద్యముతో).

కం. వరుణుఁడు గొనియాడిన విని
సరసిజనేత్రుండు మెచ్చి సమ్మదమునఁ ద
త్కరములు మోడ్చిన నప్పుడు
సుర రిపు గోగణముఁ దెచ్చి చూపు మనవుడున్. 260

తా : వరుణుఁడు కొనియాడఁగా విని పద్మ నయనుఁడు, అతనిని మెచ్చుకొని సంతోషముతో అతఁడు చేతులను ముడుచుకొనునప్పుడు దేవతలకు విరోధియగు బాణుని ఆల మందలను చూపుమని కోరెను. పిమ్మట (మీఁది పద్యముతో).

కం. ఆసాగరవిభుఁ డిట్లను
బాస వలికినాఁడ నేను బాణునితోడన్
నీసురభుల నే నసువులఁ
బాసినపుడు గాని యొరుల పాలికఁ బోవన్. 261

అర్థ : బాస పలికినాడన్ = ప్రమాణము చేసితిని; సురభులన్ = ఆవులను; అసువులన్ = ప్రాణములను; పాసిన + అపుడు+కాని = వీడినప్పుడే; ఒరుల పాలికి పోవన్ = ఇతరుల పాలికి పోవుటకు;

కం. ఈ నంటిఁ గాన నను నను
మానము లేకుఁడఁ జంపి మఱి గోగణమున్
నీ నేర్చునట్లు గొనిపో
మ్మో నలినదళాక్ష! త్రిభువ నోత్తమ మూర్తీ!' 262

అర్థ : ఈన్ = ఇయ్యను; అంటిన్ = (అని ప్రమాణముచేసి) చెప్పినాను.

తా : ఆ సముద్ర రాజు, ఇట్లనెను "పద్మనయనా! ముల్లోకములందు ఉత్తమమైన రూపము కలవాఁడా! నేను, బాణునికి, నా ప్రాణములను వీడినప్పుడే అతని ఆలమందలను ఇతరుల చెంతకు పోనిత్తునని, అంతవఱకు నా యొద్దనే ఉండఁగలవని ప్రమాణము చేసి పల్కితిని. కనుక అనుమానములేక నన్ను చంపి నీకు ఇచ్చ వచ్చిన విధమున, గో గణమును తీసికొనిపొమ్ము".

కం. అనుడుం గరుణారసమున
మన మభిషేకంబు చేయఁ బాశధరునికిన్

దనుజుని యావుల నిచ్చెను
జనియెఁ బురికి వరుణుఁ డంత సంతస మెసఁగన్. 263

తా : వరుణుఁడు తన నిర్ణయమును తెల్పఁగా శ్రీకృష్ణుఁడు కరుణతో తన మనస్సు నిండుటచే ఆ రాక్షసుని ఆవులను అతనికే ఇచ్చెను. వరుణుఁడు సంతసముతో తన పురమునకు వెడలి పోయెను.

వ. ఇవ్విధంబునం బురంబు చేరం జనునప్పుడు. 264

తా : ఈ విధముగా (బాణాసుర గర్వభంగమైన పిదప), శ్రీకృష్ణుఁడు ద్వారకను సమీపించునపుడు.

సీ. గంధర్వ జయ జయ గాన నాదంబులు
శంఖా రవంబులు సాము చేయ
ముత్యాల సేసల మొల్లంబుతోఁ గూడ
సురపుష్ప వృష్టులు సొబగు మీఱ
ద్వార భాసుర మణి తోరణ పంక్తితో
విబుధ జూట ప్రభ వియ్యమంద
బర్హి ర్ముఖారూఢ భద్రసామజములు
కేళి శైలంబుల గేలి సేయ

గీ. సురభి యుక్తధార సుకుమార మకరంద
సక్తి యుక్త చిత్త షట్పదాళి
మధుర నినద కలిత మాన్య తరూద్యాన
మైన పురము చొచ్చె నచ్యుతుండు. 265

ప్రతి : గంధర్వ -జయ-జయ-గాన నాదంబులు = గంధర్వుల యొక్క జయ జయ శబ్దములు; శంఖ+ఆరవంబులు = శంఖ ధ్వనులు; సాము చేయన్ = కలిసికొనఁగా; ముత్యాల సేసల - మొల్లంబుతోన్+కూడన్ = ముత్యాల అక్షతల మొత్తముతో కూడి; సుర-పుష్ప వృష్టులు = దేవతల పూలవానలు; సొబగు + మీఱన్ = అంద మతిశయింపఁగా;

ద్వార - భాసుర మణి తోరణ పంక్తితోన్ = ద్వారమునందు ప్రకాశించు మణుల

తోరణముల వరుసతో; విబుధ జూట ప్రభ = దేవతల జడ ముడుల కాంతి; వియ్యము + అందన్ = చక్కఁగా కలియఁగా;

బర్హిర్ముఖ + ఆరూఢ భద్ర సామజములు = దేవతలు అధిరోహించిన భద్ర గజములు; కేళి శైలంబులన్ = క్రీడా పర్వతములను, గేలి+చేయన్ = పరిహసింపఁగా;

సురభి-యుక్త ధార = పరిమళముతోఁగూడిన ధారలు గల; సుకుమార+మకరంద = చక్కనైన పూఁదేనెయందు, సక్తి = కోరికతో; యుక్త = కూడిన; చిత్త = మనస్సులు కల, షట్పద +అళి = తుమ్మెదల వరుసల యొక్క; మధుర = తీయనైన, నినద = ధ్వనితో; కలిత = కూడిన; మాన్య = మన్నింపఁదగిన; తరు = చెట్లతో; ఉద్యానమైన = ఉప వనములు గల; పుర మున్; అచ్యుతుండు = శ్రీకృష్ణుఁడు; చొచ్చెన్ = ప్రవేశించెను.

తా : గంధర్వుల "జయ జయ" శబ్దములు, శంఖ ధ్వనులును కూడినవి. ముత్యాల అక్షతల మొత్తముతో, దేవతల పూలవాన సొంపు వహించినది. వాకిళ్లయందు ప్రకాశించు మణితోరణముల వరుసతో దేవతల జడ ముడుల యందున్న రత్నకాంతి చక్కఁగా కలిసినది. (బంధుత్వమును కూర్చుకొన్నది). దేవతలు ఎక్కిన మేలైన ఏనుఁగులు క్రీడలకై ఏర్పాటు చేసియున్న చిన్న కొండలను, తాము వాని కంటె ధృఢములని గర్వించి వానిని గేలి చేసినవి. పరిమళించుచు, ధారలుగా స్రవించుచున్న మృదువైన పూవుఁ దేనియందు, ప్రీతితో తుమ్మెదల వరుసల యొక్క మధుర స్వనములు కూడుటచే ఆదరింపఁ బడునట్టి, వినోదము కొఱకు ఏర్పడియున్న ఉపవనములు కల ద్వారకాపురిని, శ్రీకృష్ణుఁడు ప్రవేశించెను.

వ్యు. బర్హిర్ముఖుఁడు - అగ్నియే ముఖముగా కలవాఁడు; హోమము చేయఁబడిన హవిస్సులను అగ్నినుండి పొందువాడు, దేవత. (బర్హి = అగ్ని, నెమలి).

వ్యు. సామజము - సామవేదమువలన పుట్టినది, ఏనుఁగు.

వ్యు. షట్పదము - ఆఱు పాదములు కలది, తుమ్మెద.

సీ. మానినీ మంజుల మంజీరకర రవ
కేళీ సరో హంస కీలితంబు
కామినీ కాముక కలహ ప్రసాదన
పండిత శారికా భాసురంబు
సరస కథాలాప సంగీత సాహిత్య
చతుర శుకస్తోమ సంచితంబు

అంగనా గండూష హాలా లసద్గంధ
వకుళ పుష్పావళీ ప్రకటితంబు

ఆ.వె. విలస దగరు గంధ విస్ఫుటతర గంధ
మైన వివిధ మంది రాంగణంబు
చూచి నెమ్మనమున సుడివడ నానంద
మంత కంత కుబ్బె నచ్యుతుండు. 266

ప్రతి : మానినీ = స్త్రీల యొక్క; మంజుల = మనోహరమైన; మంజీర కర రవ = అందెలు జేయు ధ్వనులు గల; కేళీ -సరస్ +హంస కీలితంబు = క్రీడా సరస్సులందలి హంసలతో కూడినట్టిదియును; కామినీ కాముక = ప్రేయసీ ప్రియులయొక్క; కలహ = పాల యలుక లందును; ప్రసాదన =పరస్పరానురాగమునందును: పండిత = నేర్పు కల; శారికా = గోరు వంకలచే; భాసురంబు = ప్రకాశించునదియును; సరస = రసవంతములైన, కథా+ఆలాప = కథలను జెప్పుట యందును; సంగీత = గానమునందును; సాహిత్య = సాహిత్యమునందును; చతుర = నేర్పుకల, శుక స్తోమ = చిలుకల దండుతో; సంచితంబు = కూడుకొన్నదియును; అంగనా = స్త్రీల; గండూష = పుక్కిటి; హాలా = మద్యము యొక్క; లసత్ = ఒప్పుచున్న; గంధ = పరిమళము గల; వకుళ - పుష్ప +ఆవళీ = పొగడపూల గుత్తులతో; ప్రకటితంబు = ప్రసిద్ధమైనదియు; (వకుళములకు స్త్రీల పుక్కిలింతలలో గల కల్లు, దోహద క్రియకు తోడ్పడును); విలసత్ + అగరు గంధ విస్ఫుటతర గంధమైన = ప్రకాశించుచున్న; చందన విశేషము యొక్క బాగుగా తెలియునట్టి (విరివియైన) సువాసనలు గలిగిన; వివిధ మందిర+అంగణంబున్ = పెక్కు రీతులగు ఇండ్ల ముంగిళ్లను చూచి; నెఱ+మనమునన్ = నిండు మనస్సునందు; ఆనందము; సుడి వడన్ = పెనఁగొనఁగా, అతిశయింపఁగా; అంతకున్ + అంతకున్ = క్రమక్రముగా; అచ్యుతుండు = శ్రీకృష్ణుఁడు; ఉబ్బెన్ = అధికముగా సంతోషించెను.

తా : వనితల మనోహరములైన అందెలు చేయు మధుర ధ్వనులును, క్రీడా సరస్సుల గల హంస ధ్వనులు కూడినట్టిదియును, ప్రేయసీ ప్రియుల ప్రణయ కలహములందును వారి ప్రసన్నతయందును (అనురాగమందును), పాల్గొనునట్టి నేర్పు కల గోరువంకలచే ప్రకాశించు నట్టిదియును, రసవంతములైన కథలను పలుకుట యందును, సంగీత సాహిత్యములందు, నేర్పు కల చిలుకల మొత్తముతో కూడినదియును, మదవతుల పుక్కిలింతల మద్యముతో (కల్లుతో) ఒప్పుచున్న పరిమళము గల పొగడ

ల మొత్తముతో కన్పట్టునదియును, ప్రకాశించుచున్న చందన విశేషము యొక్క విర్తైన సువాసనలతో నుండు పెక్కు ఇండ్ల ముంగిళ్లను తనివితీర చూచి, నిండు రంబునందు, ఆనందము అతిశయింపఁగా శ్రీకృష్ణుఁడు క్రమక్రమముగా మిక్కిలి తోషించెను.

వ్యా. నెఱ+మనము > నెమ్మనము.ప్రాతాది సమాస సంధి, సంధి, బాల - 39.
అంతకున్ + అంతకున్ > అంతకునంతకున్ ఆమ్రేడిత సంధి. విభక్తి లోపము రాని సంధి. సంధి, బాల - 41, 10.

. ద్వారావతీ పురంబున
శౌరిఁ గొలిచి వచ్చునట్టి సౌరగణము త
త్ప్రేరిత సుమనోవర్ష మ
పారము గా మోదఁ జేసి ప్రస్తుతి తోడన్. 267

అర్థ : సౌర గణము = సురల సమూహము; తద్+ప్రేరిత = వారి కోరికచే చిమ్మఁబడిన; మనస్ + వర్షము = పూలవాన, మోదన్ +చేసి = మిక్కిలి వర్షించి.

తా : ద్వారవతికి, శ్రీకృష్ణుని సేవించుచు వచ్చిన దేవతల సమూహము,వారి కోరికచే, రికముగా పూలవానను, గొప్ప పొగడ్తలతో, అతిశయముగా కురిపించి (మీఁది నముతో).

నానా : సుమనస్సు = పూవు, వేల్పు, విద్వాంసుఁడు.

నారాయణునకుం బ్రణామం బాచరించి షమ్మ దాక్రాంత మానసు లై
తొలంగి చూచుచుండిరి తదనంతరంబ. 268

తా : శ్రీకృష్ణునకు నమస్కరించి, సంతోషముతో నిండిన మనస్సు కలవారై, క్కలకు తొలంగి ఆ దేవుని చూచుచుండిరి. పిదప.

గళిత మదోదక గండ స్థలీ సంగి
మధుప ఝుంకారాత్త మత్తగజము
హేషా రవోద్ధతి పోషిత నిస్సాణ
పటహ భేరీ ధ్వాన బహుళ హయము

ప్రాకార చిత రత్న బహు విధతర ధామ
లిప్త సౌధ సమూహ దీప్తతలము
ఫాల స్థలీకృత ప్రకటి తాంజలి పుట
పరిచారి కావళీ భాసురంబు

ఆ.వె. ద్వార ఖచిత రత్న తోర ణోపాం తావ
లంబి మౌక్తి కోపలసిత మైన
నగరి చొచ్చె శౌరి నానావి ధానూన
వినుతి లసిత హృద్వివేకుఁ డగుచు. 269

ప్రతి : గళిత = జాఱిన (స్రవించిన); మద + ఉదక = మదజలము గల, గండ - స్థలీ = చెక్కిళ్లతో; సంగి సక్తి కల = కూడిక గల; మధుప = తుమ్మెదలయొక్క; ఝంకార = ఝంకృతిచే; ఆత్త = పొందఁబడిన; మత్త-గజము = మదించిన ఏనుఁగులు గలదియును; హేషా = సకిలింతల; రవ = ధ్వనులయొక్క; ఉద్ధతి = ఆధిక్యముచే; పోషిత = పోషింపఁబడిన - నిస్సాణ పటహ భేరీ = చర్మ వాద్య విశేషముల; ధ్వాన = భాంకార ధ్వనులతోడి; బహుళ - హయము = పెక్కు గుఱ్ఱములు గలదియును; ప్రాకార = ప్రహరులందు; చిత = (ఖచితమైన) చెక్కఁబడిన; (పాఠాం. పాక+ఆరచిత = ప్రశస్యముగా చేయఁబడిన); రత్న = మణులయొక్క బహు-విధ తర = పెక్కురీతులగు బలమైన; ధామ = కాంతులచే; లిప్త = పూయఁబడిన; సౌధ- సమూహ = మేడల సమూహముచే; దీప్త తలము = ప్రకాశించు నేలలు గలదియును; ఫాల స్థలీకృత = నుదుటి ప్రదేశమునందు చేయఁబడిన; ప్రకటిత = తెలియుచున్న; అంజలి - పుట = దొప్పవంటి కైమోడ్పులు కల; పరిచారికా = సేవకురాండ్ర; ఆవళీ = సమూహముచేత; భాసురంబు = ప్రకాశించు నదియు; ద్వార = ద్వారములందు; ఖచిత = చెక్కఁబడిన; రత్న - తోరణ = మణి తోరణములయొక్క; ఉపాంత = సమీపమున; అవలంబి = వ్రేలాడునట్టి; మౌక్తిక = ముత్యాలచే; ఉపలసితము ప్రకాశించు చున్నదియును; ఐన, నగరి = పురము, నానా - విధ = పెక్కురీతులైన; అనూన = అధికమైన; వినుతి = పొగడ్తలచే, లసిత = ప్రకాశించిన; హృద్ + వివేకుఁడు = హృదయ వివేకము గలవాఁడు; అగుచున్; శౌరి = శ్రీకృష్ణుఁడు; చొచ్చెన్ = ప్రవేశించెను.

తా : మదపు టేనుఁగుల చెక్కిళ్లనుండి, మదజలము స్రవించుండఁగా, తుమ్మెదలు ఝంకారములతో మూఁగినవి. గుఱ్ఱముల అధికమైన సకిలింతల ధ్వనులతో చర్మ వాద్య ధ్వనులును కలిసినవి. ప్రశస్తముగా చేయఁబడిన (చెక్కబడిన) పలురీతులైన

దట్టమగు రత్నకాంతులతో నిండిన సౌధములచే ఇండ్ల ముందున్న నేల తళతళ లాడుచున్నది. శ్రీకృష్ణుని కని, నొసళ్లయందు, చేతులను మోడ్చి, పరిచారికల సమూహము నమస్కరించుచున్నది. వాకిళ్ల ద్వారములలో చెక్కఁబడిన మణులయొక్క సరములు, సమీప మందు వ్రేలాడు ముత్యములు, తెల్లని కాంతులను వెదజల్లుచున్నవి. అధికమైన పలువిధములైన స్తుతులు చెలంగు చుండఁగా, ఉల్లాసముతో కూడిన హృదయ వివేకముతో శ్రీకృష్ణుఁడు, పై విధముగా ఒప్పుచున్న నగరమును ప్రవేశించెను.

అలం: ఉదాత్తము.

ఆ.వె. విష్ణుఁ గొలిచి వచ్చు విబుధ గణంబెల్ల
మృగ మయూర గజ తురగ ధవళ ప
తత్రి నివహ దృఢ రథంబులు డిగి విష్ణు
వెనుక నగరిలోనఁ జనిరి యంత. 270

ప్రతి : అంతన్ = తరువాత; విష్ణున్ = శ్రీకృష్ణుని; కొలిచివచ్చు = సేవించుచు వచ్చుచున్న; విబుధ గణంబు+ఎల్లన్ = దేవతల సమూహ మంతయును; మృగ = జింకలు;మయూర = నెమిళ్లు; గజ = ఏనుఁగులు; తురగ = గుఱ్ఱములు; ధవళ =ఆఁబోతులు; పతతి నివహము = పక్షుల సమూహములు; దృఢ = గట్టివైన; రథంబులు = తేరులను; డిగి; విష్ణు వెనుకన్; నగరిలోనన్ చనిరి = నగరములో ప్రవేశించిరి.

తా : పిమ్మట శ్రీకృష్ణుని సేవించు వచ్చు దేవతల బృందములు, తమ తమ వాహనములైన జింకలను, నెమిళ్లను, ఏనుఁగులను, గుఱ్ఱములను, ఎద్దులను, పక్షుల సమూహములను, గట్టివైన తేరులను దిగినవారై, శ్రీకృష్ణుని వెనుక ద్వారకలో ప్రవేశించిరి.

దిక్పాలకులపేర్లు - వారి వాహనములు :

1. ఇంద్రుఁడు - ఏనుఁగు, 2. అగ్ని - గొఱ్ఱె.
3. యముఁడు - మహిషము 4. నిరృతి - గుఱ్ఱము.
5. వరుణుఁడు - మొసలి 6. వాయువు - జింక.
7. కుబేరుఁడు - నరుఁడు 8. ఈశానుఁడు - వృషభము.

పక్షులు వాహనముగా కలవారు :

పతత్రి వాహనుఁడు శ్రీకృష్ణుఁడు. మయూర వాహనుఁడు - కుమార స్వామి, హంస వాహనుఁడు – బ్రహ్మ, చిలుక రౌతు - మన్మథుఁడు.

కం. వసుదేవుని నాహుకునిన్
వెస సాంబుని నుల్మ్కునిని విపృథుని శైనే
యు సభాక్షకు నందకునిని
నసమానబలాఢ్యు లైన యదువుల నెల్లన్ 271

తా : శీఘ్రముగా, వసుదేవుని ఆహుకుని, సాంబుని, ఉల్మ్కిని, విపృథున్ని,శైనేయుని (సాత్యకిని), సభాక్షకుని , నందకుని మొదలగు అసమాన (సాటిలేని) పరాక్రమ వంతులగు యాదవులను అందఱిని. (తరువాతి వచనముతో).

వ. ఆలింగనంబు చేసి వారలతోడ ని ట్లనిరి 'యీతం డసాధ్యుం డైన బాణాసురునిం గరద్వయసమేతుం గావించి ముహూర్తమాత్రంబున ద్వారకానగరంబునకు వచ్చె ననన్య సామాన్యం బైన దైవం బితండ కాఁడే! మీ భాగ్యంబున నితండు యదువంశంబునం బుట్టె' నని బహువిధంబుల నారాయణు వినుతించి దేవత లమరావతి కరిగి రని వైశంపాయనుండు జనమే జయునకుం జెప్పి సకలచరాచర క్షేమంకర క్రియాలంకరణం బగు నీ హరిస్తోత్రంబు తలంపు మని యతని కీర్తనంబు వివరించె నని సూతుండు శౌనకాది మహామునీశ్వరులకుం జెప్పిన. 272

(అందఱిని) కౌగిలించుకొని, దేవతలు వారితో ఇట్లు పలికిరి "శ్రీకృష్ణుఁడు, జయించుటకు సాధ్యముకాని బాణుని రెండు చేతులను మాత్రము మిగిల్చి మిగిలిన వానిని ఖండించి,ముహూర్తకాలములో ద్వారకకు మరలివచ్చెను. ఇతరులకు సాటికాని దేవుఁ డితఁడే కదా! మీ అదృష్టము వలన యదువంశమున జన్మించెను" అని వారెల్లరు బహు ప్రకారంబుల శ్రీకృష్ణుని స్తుతించి, అమరావతికి అరిగిరి.

వైశంపాయనుఁడు జనమేజయునకు ఈ కథను చెప్పి "ఎల్ల జంగమములకును స్థావరములకును, క్షేమమును కలిగించు శ్రేష్ఠమైన కార్యములకు అలంకారమగు శ్రీకృష్ణుని స్తోత్రమును స్మరింపుము" అని అతని పొగడ్తలను వివరించెను. ఇట్లు సూతమహర్షి శౌనకుఁడు మొదలగు మహామునులకు చెప్పఁగా,

## ఆశ్వాసాంత పద్యములు

ఉ. భావుక కారణా భువనభారక దారణ శస్త్రధారణా!
పావన చారణా సుహృదపాయ నివారణ సత్కధారణా!
భావనవినోదకా పరమభక్తక మోదక వైరిభేదకా!
సేవక వారిజాసన విశేషకృపాసన దైత్యశాసనా! 273

తా : శుభములకు హేతువైన వాఁడా! లోకములకు బరువైన వారిని (దుష్టులైనవారిని) చీల్చుటకై శస్త్రములను ధరించిన వాఁడా! పవిత్రులైన వారి చరిత్రలను ప్రసరింపఁ జేయు వాఁడా! మిత్రుల అపాయములను నిర్మూలించు వాఁడా! సత్పురుషులను ధరించు వాఁడా! వివిధ భావములందు (ఆలోచనలందు) వేడుక కలవాఁడా! గొప్ప భక్తులకు సంతసమును ఇచ్చు వాఁడా! శత్రువులను హతము చేయు వాఁడా! సేవకుఁడైన బ్రహ్మకల వాఁడా! అధికమైన కృప కల వాఁడా! దైత్యులను శాసించు వాఁడా! హరిహర నాథా!

కం. కల్పాంత మహిత విలస
చ్ఛిల్ప వి దాభరణ హరణ చిత్ర చరిత్రా!
కల్పిత పన్నగ తల్పా
కల్పానల్ప ప్రకాశ కమనీయయశా! 274

తా : ప్రళయకాలమందు, గొప్పదైనదియును, ప్రకాశించు చున్నదియును అయిన, శిల్పమును ఎఱిఁగి దాని యొక్క రక్షణమును, హరణమును కలిగి మిక్కిలి వింతయైన చరిత్ర కల వాఁడా! ఆదిశేషుని శయ్యగా కల్పించుకొన్న వాఁడా! వేద విధులలో అధికమైన తేజస్సుతో కూడిన ఉన్నత మైన (మనోహరమైన) కీర్తి కల వాఁడా! (లేదా) బ్రహ్మదినమందు (సృష్టికార్యమందు) స్థూల జగత్తుచే అధికమైన ప్రకాశముతో మనోహరమైన కీర్తి కల వాఁడా!

**మాలిని.**

దరవిరహితమూర్తీ! తారగౌ రోరుకీర్తీ!
పరిహృత విబుధార్తీ! భవ్యసంపత్తి పూర్తీ!

యురగశయనభూషా! యోగి సంతోష భాషా!
చరణశరణపోషా! జంతురక్షాభిలాషా! 275

తా : భయములేని ఆకృతి కలవాఁడా! ముత్యముల వలె స్వచ్ఛమైన (తెల్లని) గొప్ప కీర్తి కల వాఁడా! పోగొట్టఁబడిన జ్ఞానుల శోకము కల వాఁడా! శుభ సంపదలను నిండుగా కల వాఁడా! సర్పమును పాన్పుగను, ఆభరణముగను కల వాఁడా! యోగులకు సంతసమును కూర్చు భాషణము కల వాఁడా! పాదములను ఆశ్రయించు వారిని పోషించు వాఁడా! ప్రాణుల రక్షణమందు ఆసక్తి కల వాఁడా! హరి హరనాథా!

అలం : అంత్యాను ప్రాసము.

ఛం : మాలిని - "న న మ మ య" (గణములు) 15 అక్షరములు. యతి స్థానము, 9. ప్రాసనియమమున్నది.

## గద్యము

ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున శ్రీమత్సకల భాషా భూషణ, సాహిత్య రసపోషణ, సంవిధాన చక్రవర్తి సంపూర్ణ కీర్తి, నవీనగుణ సనాథ, నాచన సోమనాథ ప్రణీతంబైన యుత్తర హరివంశంబునందు షష్ఠాశ్వాసము సంపూర్ణము.

అనుబంధము :

# షట్ పంచాశతి దేశములు

ఉత్తర హరివంశమందు పంచమాశ్వాసమున చిత్రరేఖ త్రిదివ పాతాళ భూమండల మందున్న రాజకుమారుల చిత్ర పటములను తెచ్చి ఉషకు చూపినది. ఆ కాంత భూ మండలంబు అవలోకించి, భరత ఖండంబున ఈ క్రింది దేశములను తదీయ పతులను కనుగొనెను. ఆ ప్రదేశ నామములు, వాని వివరములు అక్షర క్రమమున క్రింద సూచింపఁబడినవి. వివరణలో తప్పులున్నచో, తెలియఁజేయవలెనని ప్రార్థన.

కళా ప్రపూర్ణ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి సోదరుఁడు, శ్రీ వేదము వేంకటాచలము (1805-1931) ఆర్యావర్తము ఆసియా మైనరు (నేటి టర్కీ) ప్రాంతమని, భరతవర్షము మెసపాటామియాలోని (నేటి ఇరాక్) యూఫ్రటీసు పరీవాహ ప్రాంతమనిరి. ప్రాచీన సుమేరియన్ భాషలో పెరత్ అనఁగా నీరు నది, అని అర్థము. ఆ శబ్దమే మార్పును పొంది "భరత" అయినదని వారి అభిప్రాయము. కనుక భరత ఖండమున గల దేశముల పేర్లను, విశాల భావముతో గుర్తింపవలెను.

శ్రీ వేదము వేంకటాచలము పౌత్రుఁడు శ్రీ వేదము వేంకటరామన్ ఆపద్యములో నున్న దేశ నామములను అక్షరక్రమములో సిద్ధము చేసి, అవి ఎచ్చట నున్నవో శ్రమించి నాకు తెలియఁజేసిరి. వారి వివరణ ఆధారముగా క్రింది జాబితా వ్రాయఁబడినది.

**తొలిపలుకులు** : శ్రీ వేదము వేంకటరామన్

**ఛప్పన్న దేశములు :**

"ఈ జాబితాలో 56 దేశములు కలవు. వాస్తవముగా 57 ఉన్నవి. సోమన ఒక ద్రవిడ దేశమును చెప్పినాడు అది అనావశ్యకము. 'షట్ పంచాశత్' అను సంస్కృత శబ్దమునకు 'ఛప్పన్' అను అపభ్రంశము బహుదూరవికారము. శ.ర.లోగాని, సూర్య. ని.లో గాని ఈ ప్రసక్తి లేదు".

## ఏబది ఆఱు నాడులు - వివరములు

1. అవంతి : ఉజ్జయినికి పశ్చిమ దేశము.
2. అంగ : ఇప్పటి బీహారు రాష్ట్రములో భగల్‌పూర్ పరిసరములు.
3. ఆంధ్ర : వింధ్య పర్వతములకును కృష్ణానదికి నడుమ గల దేశము శాతవాహనులు పాలించిరి.

4. ఆభీర : ప్రాచీన పారసీక దేశభాగము. (కతిపయ పుట. 66)

5. కరూశ (కరూష) : ఆంగ్లేయుల పాలనలో బీహారులో షాహబాదు ప్రాంతము (నందులాల్ డే)

6. కర్ణాట : పూర్వ మైసూరు రాజ్యము, తమిళనాడులోని కొంతభాగము.

7. కళింగ : నేటి ఒరిస్సాలో దక్షిణభాగము. ఆంధ్రలో ఉత్తరభాగము కొంత.

8. కళింద : యమునానది పుట్టు బాందర పుచ్ఛ పర్వత ప్రాంతము (శ్రీ వేదం వేంకటరామన్)

9. కాంభోజ : కంపూచియా (కాంబోడియా), అఫ్గనిస్తాన్‌లో ఒక ప్రాంతము (శ్రీ వేదం వేంకటరామన్)

10. కాశ :

11. కాశ్మీర : నేటి కాశ్మీరము

12. కిరింత : రాజస్తానులో ఉదయ పూర్ జిల్లాలో భాగము

13. కుంతల : పూర్వ మద్రాసు రాష్ట్రములో బళ్లారి ప్రాంతము

14. కుకుర : మధుర ప్రాంతము కావచ్చును (శ్రీవేదం వేంకటరామన్)

15. కురు : ప్రాచీన కాలములో పారసీకమునకును చీనాకును మధ్యగల భాగము (ఉత్తర కురుభూములు) నేటి హర్యానా.

16. కుళింగ (కుళింద) : నేటి ఢిల్లీకి ఉత్తర ప్రాంతము.

17. కుహ్మక :

18. కేకయ : బియాస్ సట్లెజ్‌నదుల మధ్య దేశము.

19. కేరళ : నేటి కొంకణము, కర్ణాటకములో కొంత

20. కొంకణము : మహారాష్ట్ర తీర ప్రాంతము

21. కోసల : శంభల్‌పూర్ బిలాస్ పూర్ రాయపూర్ గంజాములో కొంతభాగము (ఆచార్య నీలకంఠ శాస్త్రి)

22. గాంధార : కందహార్, ఆఫ్గనిస్తానులో భాగము

23. గౌళ (గౌర) : గౌరదేశమునకు ఉత్తర కోసలమని పేరు. రాజధాని శ్రావస్తి (శ్రీవేదం వేంకటరామన్)

24. ఘూర్జర : గుజరాతులో భాగము.

25. చేర : కోయంబత్తూరు, మలబారు తూర్పు ప్రాంతము తిరువనంతపురము.

26. చోళ : కావేరీనదికి ఉత్తరమున గల తూర్పుతీర ప్రాంతము.

27. టేంకణ : నేటి అనంత పురంజిల్లా తాడిపత్రి ప్రాంతము.

28. త్రిగర్త : పాకిస్తానులో లాహోరు ప్రాంతము.

29. దశార్ణ : ప్రయాగకు పడమటి దేశము.

30. ద్రవిడ : ఉత్తర ఆర్కాటు, దక్షిణ ఆర్కాటు ప్రాంతము.
31. పాంచాల : ఉత్తర ప్రదేశ్‌లో రోహిల్ ఖండ్ పర్వత ప్రదేశములో దక్షిణ భాగము.
32. పాండ్య : మధుర తిరునల్వేలి జిల్లాలు
33. పుండ్ర : ఉత్తర బెంగాలు బీహారు పొలిమేరల భాగము.
34. పుళింద : మధ్య ప్రదేశ్‌లో బుందేల్ ఖండ్ సాగర్ జిల్లాలు
35. బర్బర : సింధునదికి పడమర అఫ్గనిస్తాను వఱకు విస్తరించిన శక హూణుల రాజ్యములు.
36. బహుధాన: నేటి బోధన్ నిజామాబాద్ జిల్లా (బహుధాన్యపురము).
37. బాహ్లిక : పారసీకరాజ్యమున బక్ట్రియా అను రాష్ట్రము.
38. మగధ : బీహారులో పాటలీపుత్ర ప్రాంతము (రాజగర్ పరిసరము).
39. మత్స్య : బైరాట్, వైరాటనియు పేర్లున్నవి. (భారతములో విరటుని రాజ్యము)
40. మాళవ : మధ్య ప్రదేశ్‌లో ఉజ్జయిని పరిసరములు.
41. యవన : ప్రాచీన కాశ్మీరోత్తర భూమి. అఫ్గనిస్తానులో పురుషపురప్రాంతము గ్రీకుల రాజ్యము.
42. లాట : దక్షిణ గుజరాత్. కొందఱు కాన్యకుబ్జము (కనోజ్) హర్షవర్ధనుని రాజధాని ప్రాంతమందురు. (శ్రీ వేదం వేంకటరామన్)
43. వంగ : బంగ్లాదేశ్ (పూర్వ పుండ్ర సమతట, కామరూప తామ్ర లిప్తి, కర్ణ సువర్ణ అనెడి అయిదు రాజ్యములు)
44. వత్స : అలహాబాదునకు పడమటి రాజ్యము. బృహత్ కథలో ఉదయనుని రాజ్యము కౌశంబి రాజధాని.
45. వరాట :
46. వసాతి :
47. విదర్భ : బీరారు బీదరుల ప్రాంతము.
48. విదేహ : బీహారులో పాట్నాకు ఉత్తరము.
49. శూరసేన : మత్స్య దేశమునకు దక్షిణము రాజస్తానులో ఉన్నది.
50. సౌముద్ర సాల్వ : సముద్రముననున్న సౌభ దేశము.
51. సింధు : ప్రాచీన సింధు రాజ్యము
52. సుధేష్ణ :
53. సౌరాష్ట్ర : గుజరాతులో ఒక భాగము
54. సౌవీర : సింధు సట్లెజ్ నదుల మధ్య భాగమని కొందఱు. (శ్రీవేదం వేంకటరామన్)
55. స్సుహ :
56. హూణ : చీనా సరిహద్దులలో ఈశాన్య ప్రాంతము.

**షట్పంచాశతి దేశములు : సంఖ్యావాచక పదకోశము**

సంకలన కర్త-బి. అనంతరావు

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్ విజయవాడ -2

ఈ కోశమందున్న షట్పంచాశతి దేశముల పేర్లలో కానవచ్చు ఈ క్రింది పేర్లు - సోమన పద్యములో లేవు. (పుటలు 644 - 5)

6. కామ రూపము
15. భోటము
17. శబరము
22. మంద్రము
23. సింహళము
25. పారశికము
26. మిధిలము
31. హైహయము
32. తాళవము
35. ప్రాగ్జ్యోతిషము
37. చేజ
39. నేపాళము
40. గాళము
42. కన్యాకుబ్జము
44. ఖురపాణము
45. మహారాష్ట్రము
48. అహిచ్ఛత్రము
49. త్రిలింగము
50. ప్రయాగ
51. కరహాటకము
53. భోకము
56. కాశి